# నా ప్రజల సంక్షిప్త చరిత్ర



**'An Outline History of China'**

*Published by*
**Foreign Languages Publishing House, Peking.**

అనువాదం:
మద్దుకూరి చంద్రశేఖరరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

# పరిచయం

చైనాదేశం భారతదేశంవలెనే అత్యంత ప్రాచీనమైన నాగరికతకు ఆటపట్టు. ప్రపంచంలోకల్లా మొట్టమొదటిసారి చైనాప్రజలే పింగాణీ పరిశ్రమలోను, కాగితం తయారు చేయడంలోనూ, పుస్తకాలను ముద్రించడంలోనూ, తుపాకి మందును తయారు చేయడంలోనూ ప్రావీణ్యం సంపాదించారు. నాలుగువేల సంవత్సరాల చైనా ప్రజల చరిత్రను సంక్షిప్తంగా వ్రాసి, పెకింగ్‌లోని విదేశ భాషాప్రచురణాలయం 1958 లో ప్రకటించింది.

“An Outline History of China” అను ఇంగ్లీషు గ్రంథానికి అనువాదాన్ని తెలుగు పాఠకులకు అందించుతున్నాం. ఇంగ్లీషు పుస్తకానికి చివర చేర్చిన ఇండెక్స్‌ను తెలుగులోకూడ ప్రచురించితే గ్రంథం పెరుగుతుందనీ, ధర పెంచవలసివచ్చి పాఠకులకు ఇబ్బందిగా వుంటుందనీ ఇండెక్సును వదలివేశాం.

ఇంగ్లీషు గ్రంథం చివర అనుబంధంగా యిచ్చిన పాలకవంశాల జాబితాను తెలుగు పుస్తకం ప్రారంభంలోనే యిచ్చాం. దానితోపాటు చైనాదేశంలో వాడుకలోవున్న కాలమానాలను, వాటితో సరితూగే మనం వాడుతున్న కాలమానాలను కూడ యిచ్చాం. పుస్తకం చదువునపుడు పాఠకులకు అవి ఉపయోగించుతాయని ఆశించుతున్నాం.

చైనా భాషలో పేర్లు ఎలా ఉచ్చరించుతారో అనువాదకునికి తెలియదు. అందుచేత కేవలం ఇంగ్లీషుగ్రంథంలోవున్న అక్షరక్రమాన్ని అనుసరించి తెలుగులో వాటిని ఉదహరించడం జరిగింది. కాబట్టి చైనాపేర్ల ఉచ్చారణను సరిగా తెలుగులో వ్యక్తీకరించలేకపోయామని సందేహించుతున్నాం. సరియైన ఉచ్చారణ తెలియనందున ఈ పొరపాటును మన్నించవలెనని పాఠకులకు విజ్ఞప్తి చేస్తున్నాం.

చైనా ప్రజల నాలుగువేల సంవత్సరాల చరిత్ర చాల క్లుప్తంగానే ఈ పుస్తకంలో యివ్వబడింది. ఐనప్పటికీ ప్రజల చరిత్రను సామాన్యపాఠకులకు అర్థమయ్యేలా వ్రాసేపద్ధతికి ఈ గ్రంథం సూచనప్రాయంగా వుందనడంలో సందేహం లేదు. పాఠకులు తెలుగు అనువాదాన్ని ఆదరించుతారని ఆశించుతున్నాం.

విజయవాడ,
3-10-1959.

అభివందనాలతో,
మ. చంద్రశేఖరరావు,
అనువాదకుడు.

# చైనాదేశాన్ని పాలించిన వంశాలు

| వంశం పేర్లు | పరిపాలించిన కాలం |
|---|---|
| హ్సియా | క్రీస్తుకు పూర్వం 21 వ శతాబ్దం ను. 16 వ శతాబ్దం వరకు |
| షాంగ్ | క్రీ.పూ. 16 నుంచి 11 వ శతాబ్దం వర |
| పశ్చిమ చౌ | ,, 11 ,, 771 వరకు |
| తూర్పు చౌ | ,, 770 ,, 221 వరకు |
| పశ్చిమ హాన్ | ,, 206 ,, క్రీస్తుశకం 24 వర |
| మూడు రాజ్యాలు | క్రీ.శ. 220 నుంచి 280 వరకు |
| పశ్చిమ ట్సిన్ | ,, 265 ,, 316 ,, |
| తూర్పు ట్సిన్ | ,, 317 ,, 420 ,, |
| దక్షిణ - ఉత్తర వంశాలు | ,, 420 ,, 479 ,, |
| సూయి | ,, 581 ,, 618 ,, |
| టాంగ్ | ,, 618 ,, 907 ,, |
| ఐదు వంశాలు | ,, 907 ,, 960 ,, |
| ఉత్తర సుంగ్ | ,, 960 ,, 1127 ,, |
| దక్షిణ సుంగ్ | ,, 1127 ,, 1279 ,, |
| యువాన్ (మంగోల్) | ,, 1279 ,, 1368 ,, |
| మింగ్ | ,, 1368 ,, 1644 ,, |
| చింగ్ (మంచూ) | ,, 1644 ,, 1911 ,, |

# చైనాదేశంలో వాడుకలోవున్న కొలమానాలు

## కొలత

లిన్ = 0.3107 మైళ్లు

కిలోమీటర్ = 5 ఫర్లాంగులు షుమారు

మౌ = 0.1647 ఎకరం లేదా ఎకరంలో ఆరో వంతు

## తూకం

జిన్ = 1.12 పౌన్లు

కాటీ = 1. 1 పౌను

# విషయ సూచిక

## Iవ అధ్యాయం

# చరిత్రకు ముందు యుగాలు

## పీకింగ్ మనిషి

ఐదులక్షల సంవత్సరాలకు పూర్వం పీకింగ్ నగరానికి నైరుతిదిశగా వున్న చౌకోతీన్ ప్రాంతంలో ఆదిమతెగకు చెందిన మానవుడు నివసించేవాడు. ఇతనికే జీవశాస్త్రజ్ఞులు పీకింగ్ మనిషని పేరుపెట్టారు. ఆధునిక మానవులకు ప్రాచీనకాలపు పీకింగ్ మనిషికి వున్న తేడా ఏమంటే అతడి కనుబొమలు, గడ్డాము ముందుకు పొడుచుకు వచ్చినట్లుగా వుండేవి: నుదురు ఏటవాలుగా వెనకకు వాలి వుండేది: ఇప్పటి మానవులకున్న మెదడులో ముప్పాతికవంతు మాత్రమే పీకింగ్ మనిషి మెదడు వుండేది.



ఆ కాలంలో చైనా ఉత్తరభాగంలో వాతావరణం ఇప్పటికంటె వెచ్చగాను, తడిగాను వుండేది. దట్టమైన అడవులు విస్తారంగా వుండేవి. పేకింగ్ మనిషికి కోరల పులులు ప్రమాదకరమైన శత్రువులు వుండేవి. పచ్చికబైళ్ళలో అడవి గుర్రాలు, మచ్చల జింకలు, కృష్ణ మృగాలు (Anti lopes) ఖడ్గమృగాలు, ఉన్ని బర్రెలు (Wooly mammoths) విరివిగా వుండేవి. అడవి దున్నలు, దుప్పులు ఏటి ఒడ్డులవద్ద, సరసుల సమీపంలోనూ నివసించు చుండేవి. ఎలుగుబంట్లు, పులులు కొండల్లోను, పర్వత గుహల్లోనూ తిరుగుతూ ఉండేవి.

పేకింగ్ మనిషికి బడితె, చెకుముకిరాయి మాత్రమే ఉపయోగించడం తెలుసు. వాటితో అతడు చుట్టూవున్న ప్రకృతిని జయించడానికి ప్రయత్నించేవాడు. అగ్ని హోత్రుడు అతనికి పరమ మిత్రుడు. అడవుల్లో సంభవించే మంటలనుండి కాలే కొయ్యలను తీసుకువెళ్ళి తాను నివసించే గుహలో వాటిని నిరంతరం కాపాడుతుండే వాడు. ఆహారం కాల్చుకోడానికి, అడవి మృగాలను భీతిగొల్పి పారద్రోలడానికి అగ్ని అతనికి వినియోగించేది.

ఫలమూలాదులను సేకరించడం, వేటాడటం పేకింగ్ మనిషి నిత్యకృత్యాలు. వేసవిలో మచ్చల జింకను వేటాడేవాడు. శీతకాలంలో ఉత్తరదిశ నుండి వచ్చే దుప్పులను వేటాడటం కష్టసాధ్యమయ్యేది. అప్పుడప్పుడు అడవి పశువుల, గుర్రాల మాంసాన్ని కూడ తినేవాడు. కాని అతడుపయోగించే ఆయుధాలు చాల మోటుగా వున్నందున ఆహార సంపాదన పేకింగ్ మనిషికి పెద్ద సమస్యగా వుండేది. ఎల్లప్పుడూ ఆకలి అతడిని వేధించుతుండేది.

తలదాచుకునేందుకు ఇల్లు నిర్మించుకోవడం ఆదిమ మానవులకు తెలియదు. అందుచేత సహజంగా ఏర్పడిన కొండ బొరియల్లో వారు నివసించేవారు. మంచినీళ్ళు దొరికే నదులకు సమీపంలోవున్న గుహల్లోవుంటూ, రాతి పనిముట్లు తయారు చేసుకునేవారు. నీరు తాగడానికి వచ్చిన జంతువులను వేటాడి చంపేవారు.

## గుహావాసులైన మానవులు

ఆ తర్వాత యాభైవేల సంవత్సరాల క్రితం చౌకౌతీన్ ప్రాంతంలో నివసించిన మానవతెగను నూతన గుహావాసులు (Upper Cave Man) అని పిలుస్తాం. అతడు చూపులకు ఆధునిక మానవునివలెనే వుంటాడు. అంతకుముందు నాలుగున్నరలక్ష ఏళ్ళనాటి ప్రాచీనులకంటే మానవాభివృద్ధి క్రమంలో ఇతడెంతో ముందుకుపోయాడు. ఎముకలతో పనిముట్లు చేయడం నేర్చుకున్నాడు. ఆరెలాంటి సాధనంతో తోళ్ళను అతికి కుట్టడం, గుడ్డగా వినియోగించడం నేర్చుకున్నాడు.

పేకింగ్ మనిషివలెనే నూతన గుహావాసికూడ వేటాడటం, ఫల మూలాదులను సేకరించడంపైనే ఆధారపడేవాడు. చేపలు పట్టడంకూడ అతడు నేర్చుకున్నాడు. తనంతతానుగా నిప్పు రాజేయడం అలవరచుకున్నాడు.

పీకింగ్ మనిషి దశనుండి నూతన గృహవాసి దశవరకు వెంపొందిన మానవజాతి చరిత్రను మనం పాతరాతి యుగం అని పిలుస్తాం.

## రంగుకుండలు, నల్లకుండల నాగరికత

ఐదారువేల సంవత్సరాల క్రితమే ప్రాచీన చైనాదేశంలోని ప్రజలు తమ పనిముట్లను చాల మెరుగుపరచుకున్నారు. రాళ్ళను అరగదీసి పదునైన గొడ్డళ్ళు, కత్తులు, సుత్తులు, ఉలులు వగైరా పనిముట్లను రూపొందించుకున్నారు. ఎముకలు, కొమ్ములు, గవ్వలు వగైరాలతో సూదులు, దబ్బనాలు, కొడవళ్ళు, రంపాలు తయారుచేసుకునే వారు. ఈ పనిముట్లలో చాలావాటికి రంధ్రాలుండడంవల్ల వాటికి కర్రపిడులు బిగించడానికి లేదా కర్రకు కట్టడానికి వీలుగా వుండేవి. వీటన్నిటినిబట్టి అప్పటి ప్రజలు పనిముట్లను చేయడంలోనూ, వాటిని వినియోగించడంలోను నైపుణ్యం సంపాదించారని తెలుస్తుంది.

పదునైన రాతి పనిముట్లను చేసుకోగలిగిన ఈ యుగాన్ని మనం కొత్త రాతియుగమని పిలుస్తాము.

అంతకు ముందుగానే కనిపెట్టబడిన విల్లు, అంబులు కొత్త రాతియుగంలో అత్యంత ముఖ్యమైన ఆయుధాలుగా మానవులకు వుపయోగించేవి. దూరాన వున్న జంతువులను, పిట్టలను చంపడానికి విల్లంబులను వినియోగించగలిగినందున మానవునికి వేటాడడం సులభతరమయింది.

ఈ యుగంలో మానవులు కనిపెట్టినమరొక ముఖ్యమైన విషయం కుండలు తయారుచేయడం. పశ్చిమోత్తర చైనాలో లభ్యమయ్యే ఎర్ర బంకమట్టితో అందమైనకుండలు తయారుచేసి, వాటిని చందనం, నలుపు రంగు గీతలతో అలంకరించేవారు. ఆ కాలపు సంస్కృతిని మనం రంగు కుండల నాగరికత అని పిలుస్తుంటాం.

ఉత్తర చైనా మైదానాలలో నివసించే ప్రజలు నల్లని కుండలు తయారు చేసేవారు. ఇవి మరింత సన్నగాను, పలుచగాను, అందంగాను వుండేవి. తయారుచేసిన ప్రజల నైపుణ్యానికి అవి నిదర్శనంగా వుండేవి. ఆ ప్రజల సంస్కృతిని నల్లకుండల నాగరికత అని మనం పిలుస్తుంటాం.

కుండలను తయారుచేయడం కనిపెట్టగలిగినందున కొత్తరాతియుగపు మానవుడు నీళ్ళను, ఆహారాన్ని నిల్వచేసుకోగలిగాడు. అలాగే ఆహారం వండుకోడం నేర్చుకున్నాడు.

చరిత్రకుముందు కాలంలో జంతువులను ప్రాణంతో పట్టుకున్నపుడు వాటిలో కొన్నిటిని తక్షణం చంపి ఆకలి తీర్చుకునేవారు. తక్కిన జంతువులను నిల్వ వుంచి, అవసరమైనపుడు ఉపయోగించుకునేవారు. ప్రాచీనకాలపు చైనా ప్రజలు క్రమంగా తాము పట్టుకున్న జంతువులను మచ్చిక చేయడం నేర్చుకున్నారు. పంది, కుక్క, గొర్రె వగైరా జంతువులను పెంచడం అలాగే ప్రారంభమయింది.

ప్రాచీనకాలపు చైనా ప్రజలు తాము వదలివేసిన విత్తులనుండి మొక్కలు మొలుస్తాయనీ, అవి పెరిగి పెద్దవై తిరిగి అలాంటి గింజలే లభిస్తాయనీ కనిపెట్టారు. కాలక్రమేణ రాతిపనిముట్లతో నేలను తవ్వడం, విత్తనాలు వేయడం, ధాన్యం పండించడం నేర్చుకున్నారు. వ్యవసాయకృషి అలాగే ప్రారంభమయింది.

పశువుల పెంపకం, వ్యవసాయం పెంపొందడంతో మానవులు స్థిర నివాసాలు ఏర్పరచుకోవడం, ఒకే ప్రాంతంలో నివసించడం ప్రారంభించారు. పశ్చిమోత్తర చైనాలోని బంకనేల ప్రాంతంలోనూ, ఉత్తర చైనా మైదానాలలోనూ నదులకు సమీపంలో గ్రామాలను నిర్మించుకుని ప్రజలు నివసించేవారు. మట్టి గోడలతోనూ, రెల్లుగడ్డితోనూ ఇళ్ళు కట్టుకునేవారు. వారి ఇళ్ళు చిన్నవైనా, పెద్దవైనా ఒకేతరహాగా వుండేవి. నారతో నూలు తీయడం, బట్టలు నేయడం వారికి తెలుసు.

## కమ్యూన్

కొత్తరాతి యుగంలో ఉత్తర చైనాలోని ప్రజలు వేర్వేరు కమ్యూన్‌లలో వుండేవారు. అంతకు పూర్వంనుండి కొనసాగుతూన్న సామాజిక వ్యవస్థే ఈ కమ్యూన్

కమ్యూన్‌లోని వారంతా రక్తబంధువులే. భూమి, జంతువులు, పనిముట్లు ఉమ్మడిఆస్తిగా వుండేవి. ఆయుధాలను వినియోగించడం, జాగ్రత్తపరచడం మాత్రం వ్యక్తుల బాధ్యతగా వుండేది. వేటాడడం, చేపలు పట్టడం, జంతువులను పెంచడం. భూమిని దున్నడం, ఇళ్లను కట్టడం వగైరా పనులను కమ్యూన్ సభ్యులంతా సమష్టిగా నిర్వహించేవారు. వారెంతో ఎక్కువగా వుత్పత్తి చేయగలిగేవారు కాదు. అందుచేత సమష్టి శ్రమ ఫలితాన్ని అందరూ కలిసి పంచుకునేవారు. ఒకరు తమ వంతుకంటే ఎక్కువ తీసుకుంటే, ఇంకొకరు పస్తుండవలసి వస్తుందిగాన అంతా న్యాయంగా తీసుకునేవారు. కమ్యూనుకు ఎన్నుకోబడిన నాయకుడు వున్నప్పటికీ ముఖ్యవిషయాలన్నిటినీ కమ్యూన్ సభ్యులంతా వున్న సమావేశాలలో చర్చించి నిర్ణయించేవారు. ఆ రోజుల్లో వర్గాలు లేవు: వ్యక్తులకు స్వంత ఆస్తులు లేవు; ఒండొరులను దోచుకునేందుకు అవకాశం లేదు.

ఇరుగు పొరుగున వున్న జిమ్మాలన్నీ కలిసి ఒక తెగగా ఏర్పడి, తెగ నాయకునిచేత నడుపబడేవి. కొన్ని తెగలు కలిసి సమాఖ్యగా ఏర్పడి పశుగ్రాసానికి వినియోగించే బీళ్ళను, వేటాడే అడవులను కాపాడుకోడానికి, శత్రు తెగల దాడిని ఎదుర్కోడానికి కృషి చేసేవి. తెగ నాయకుని సమాఖ్యనాయకునికూడ ఎన్నుకునేవారు.

## జానపద గాథలు

నాలుగువేల ఏండ్ల క్రితం ఎల్లోనది ప్రాంతంలోని తెగల సమాఖ్య నాయకుడుగా వున్న హువాంగ్ టీని (పసుపు చక్రవర్తి) గురించిన జానపద గాథ ఒకటి ప్రచారంలో వుంది. అతనికాలానికే చాల విషయాలు కనిపెట్టబడ్డాయి. వ్రాయడం,

చదవడం, బంగ్లు, పడవలు తయారుచేయడం, పంటతోటలను వేయడం నేర్చుకున్నారు.

'హువాంగ్ టీ' అనంతరం యావ్, షున్, యూ అనేవారు జానపద గాథల్లో చాల ప్రసిద్ధిచెందారు. వారి అనంతరం వారి ప్రతినిధులు అధికారానికి వచ్చారు. యావ్ పరిపాలించుతుండగా ఎల్లోనది కట్టలు వరదలవల్ల తెగిపోయాయి. సమాఖ్య సమావేశాన్ని పిలచి, వరదప్రవాహాన్ని ఎలా అరికట్టాలో చర్చించారు. 'యూ' తండ్రిగారైన 'కున్'ను వరదను అరికట్టవలసిందిగా కొందరు తెగనాయకులు సూచించారు. చక్రవర్తి కిది యిష్టంలేకపోయినా సమాఖ్య ఆ సూచనను ఆమోదించింది. కున్ వరదప్రవాహాన్ని అరికట్టలేకపోయినందున, చక్రవర్తి, అతడి ప్రతినిధి కున్‌కు మరణశిక్ష విధించారు. తండ్రి స్థానంలో వరదనివారణకు నియమించబడిన 'యూ' పదమూడు సంవత్సరాలు అనేకమంది జనులతో కలసి పనిచేసి వరదప్రవాహాన్ని తిరిగి నదిలోకి మరల్చాడనీ, తద్వారా నది సముద్రంలోకి వెళ్ళిపోయిందనీ జానపద గాథలు తెలుపుతున్నాయి.

'యావ్' మరణానంతరం షున్ పరిపాలకుడయ్యాడు. అతని ప్రతినిధిగా 'యూ' ఎన్నుకోబడ్డాడు. కొంతకాలానికి అతడు సింహాసనాన్ని అధిష్ఠించాడు.

'యూ' పరిపాలించిన రోజుల్లో ప్రజలు తమ పూర్వీకంటె ఎక్కువ ఉత్పత్తి చేసేవారు. జిమ్మా నిర్మాణంలో పెద్ద కుటుంబాల ప్రాముఖ్యత పెరిగింది. అంతవరకు కమ్యూన్ సమిష్టి ఆస్థిగావున్న భూములు, పశు సంపదలోనుంచి ఎక్కువ భాగాన్ని పెద్దకుటుంబాలు తమ స్వంత ఆస్థిగా చేసుకుని, ప్రత్యేకంగా తామే ఉపయోగించుకోవడం, అనుభవించడం ప్రారంభమయింది. ఆ విధంగా కమ్యూన్‌లో ఒండొరులమధ్య అసమానత్వం, భాగ్యవంతులు, పేదలు అనే తారతమ్యం ప్రారంభమయ్యాయి. చాలభాగ్యవంతులు, బలవంతులు అయినకుటుంబాలకు ప్రతినిధి గా 'యూ' చక్రవర్తి తయారయ్యాడు; ప్రజలచేత ఎన్నుకోబడిన చక్రవర్తులలో ఆఖరివాడు యూ చక్రవర్తి. అతని మరణానంతరం అతని కుమారుడు 'చీ' సింహాసనం ఆక్రమించుకున్నాడు. సాంప్రదాయం ప్రకారం ఎన్నుకుంటే చక్రవర్తి కావలసిన 'యీ' కి అన్యాయం చేశాడు. అప్పటినుంచి నాయకుని ఎన్నుకునే పద్ధతిపోయి, వంశ పారంపర్య పద్ధతి వచ్చింది. 'చీ' తో ప్రారంభమైన దశను, 'సియా' వంశ శకమని చరిత్రకారులు పిలుస్తారు.

2వ అధ్యాయం

# షాంగ్ వంశ పరిపాలన

క్రీస్తు పూర్వం 16 వ శతాబ్దంలో సియా వంశపు ఆఖరి పాలకుడైన 'ఛీహా'ను యుద్ధంలో ఓడించి, టాంగ్ తెగ నాయకుడు ఎల్లోనది లోయమధ్య దిగువప్రాంతాలకు అధిపతి కాగలిగాడు. దానితో సియా వంశపాలన అంతమై, షాంగ్ వంశ పాలన ప్రారంభమయింది.

ఎల్లోనది దిగువ ప్రాంతాలను ఆక్రమించిన షాంగ్ తెగ అప్పటి సారవంతమైన భూములను సాగుచేసి ధాన్యం పండించేవారు. పచ్చిక బీళ్ళలో పశుసంపదను మేపి వృద్ధి చేశారు. కాని ఎల్లోనది, దాని శాఖలు పంటభూములకు నీరు అందించి, ప్రజలకు తోడ్పడినప్పటికీ, వరదల ప్రమాదాన్ని ఎదుర్కోవడం ప్రజలకు నిరంతర సమస్యగా వుండేది. వరదల మూలంగా పంట భూములు మునిగిపోవడం, ఇళ్ళు కూలిపోవడం, మనుష్యులు, పశువులు మరణించడం పరిపాటిగా వుండేది.

షాంగ్ రాజ్యం ఏర్పడిన తర్వాత మూడు వందల సంవత్సరాలలో, ఎల్లోనది వరదల ప్రమాదాన్నుంచి తప్పించుకోడానికి షాంగ్ పాలకులు తమ రాజధానిని ఐదు సార్లు మార్చవలసి వచ్చింది. క్రీ. పూ. 14 వ శతాబ్దంలో చివరకు పాన్ కెంగ్ రాజు ప్రస్తుత హోనాన్ రాష్ట్రంలోని 'ఇన్' అనే చోటికి తమ రాజధానిని మార్చాడు. ఇన్ నగరంలో షాంగ్ రాజధాని 276 సంవత్సరాలవరకూ స్థిరంగా వుందంటే వరద సమస్యను పరిష్కరించడంలో షాంగ్ పాలకులు కొంతవరకు కృతకృత్యులయ్యారనే చెప్పవచ్చు.

## ప్రజల జీవితం - ఉత్పత్తి విధానం

షాంగ్ రాజుల కాలంలో ప్రజలకు లోహాలను కరిగించడం తెలుసు. రాగి, తగరం లోహాలను కరిగించడం, మిశ్రమలోహమైన కంచును తయారుచేయడం కనుగొన్నారు. గొడ్డళ్ళు, కత్తులు, పాత్రలు, సూదులు, డాలులు, కవచాలు, బల్లెపు మొనలు, కుండలు వగైరా అనేక వస్తువులను కంచుతో తయారు చేసేవారు.

కాని కంచు చాల ఖరీదైన లోహంగా వున్నందున కంచు సామగ్రి కేవలం పాలకవర్గానికే పరిమితమై వుండేది. రైతులు రాతిపనిముట్లు లేక కొయ్యపనిముట్లతో

సంతృప్తి పడవలసివచ్చేది. భూమిని దున్నడానికి రెండు పళ్ళున్న గొర్రును రైతులు ఉపయోగించేవారు. వరి, గోధుమ, బ్రోసో, జొన్న విత్తనాలను చాళ్లలో నాటేవారు. పొలం చుట్టూ కంద కాలుండేవి. నది నీటిని ఆ కంద కాలలోకి ప్రవహింపజేసి, పొలాల సాగుకు వినియోగించేవారు. రాయి లేక ఎముకలతో చేసిన మొరటు కొడవళ్ళతో పంటచేలను కోసి, మాసూలు చేసేవారు.

షాంగ్ కాలంలో పంటతోటల పెంపకం, పట్టువస్త్రాల నేతకూడ అభివృద్ధి చెందింది. పందులను, కుక్కలను, గుర్రాలను, ఆవులను, గొర్రెలను పెంచడంతో పాటు కోళ్ళ పెంపకంకూడ అలవర్చుకున్నారు. అప్పటికే గుర్రాలను తరిఫీదుచేసి, స్వారి చేయడం నేర్చుకున్నారు. యుద్ధంలో వాడే రథాలకు, రాజులు వినియోగించే బండ్లకు నాలుగు గుర్రాలనుకట్టి తోలేవారు.

ఈ కాలంలో మగవాళ్ళ వేటాడటం కూడ కొనసాగేది. వేటలో చంపబడిన మృగాల చర్మాలను, ఉన్నిని గుడ్డలుగా తయారుచేసుకునేవారు. ఎముకలను పనిముట్లు గానూ, ఆయుధాలుగాను రూపొందించుకునేవారు.

చేతిపరిశ్రమలు అభివృద్ధి చెందాయి. అన్నం నుంచి సారా కాయడం, పట్టు నారనుంచి వస్త్రాలు తయారుచేయడం, జంతు చర్మాలను పదునుచేసి తోలుసామగ్రి చేయడం నేర్చుకున్నారు. రాజధానిలో వున్న పెద్ద కర్మాగారాల్లో కంచుతోనూ, రాళ్ళతోనూ, ఎముకలతోనూ, స్ఫటికంతోనూ (Jade) పాత్రలను, పనిముట్లను నైపుణ్యంగా తయారుచేసేవారు.

## సమాజ వ్యవస్థ, సంస్కృతి

షాంగ్ కాలంలో సమాజం బానిసలు, రైతులు, ప్రభువులుగా విభజింపబడి వుండేది.

ప్రభువులు యుద్ధంలో పట్టుకొచ్చిన సైనికులను బానిసలుగా చేసి, బలవంతాన పనిచేయించేవారు. బానిసల మెడలకు తాళ్ళు కట్టి పొలాలలోను, లేదా రాజధాని లోని కర్మాగారాల్లోను పనిచేయించేవారు. అపుడు కొరడాలు ధరించిన నిగామాన్లు కాపలా వుండేవారు. ముతక ధాన్యం బానిసల తిండికి యిచ్చేవారు. తమ చిత్తం ప్రకారం బానిసలను చంపే అధికారం యజమానులకు వుండేది.

చాల మొరటు పనిముట్లనే వాడగలిగినందున రైతులు తక్కువగానే పండించ గలిగేవారు. అందులో కొంతభాగం ప్రభువులకు చెల్లించవలసివచ్చేది.

బానిసల, రైతుల శ్రమఫలితాన్ని అనుభవించుతూ ప్రభువులు విలాసాలతో ఆడంబరంగా జీవించేవారు.

షాంగ్ రాజులు గొప్ప గొప్ప భవనాలను నిర్మించారు. ఒక్కొక్క రాచ నగరులో విశాలమైన సభామందిరాలు - 180 అడుగుల పొడవు, 30 అడుగుల వెడల్పు

గక్కినవి కూడా వుండేవి. ఆ భవనాల క్రిందిభాగంలో ధాన్యం, సరుకులు వగైరా నిల్వచేసేందుకు పెద్ద పెద్ద గోదాములుండేవి.

రాజు మరణించినపుడు పెద్ద గోరీలో అతనితోపాటు వందలకొలది నగిషీ రాళ్ళు, బంగారం స్ఫటికం (Jade) కంచుతో చేయబడిన వస్తుసామగ్రి సమాధి చేసేవారు. రాజుగారి సమాధిలో వందలకొలది బానిసలను సజీవులుగా కొందరిని, చంపి మరికొందరిని పాతిపెట్టేవారు.

సామాన్య ప్రజలు మాత్రం అత్యంత వెనుకబడిన పరిస్థితులలో జీవితం గడిపేవారు. చిన్న మట్టి గుడిసెలు వారి ఇళ్లు. వారి గోరీలలో వారుపయోగించిన మోటు కుండలు, ఆయుధాలు మాత్రం కన్పించుతాయి.

తమ పూర్వీకులను పూజించేందుకు షాంగ్ రాజులు బ్రహ్మాండమైన క్రతువులు జరిపేవారు. అలాంటి ఒక్కొక్క యాగంలో వందలకొలది పశువులను, గొర్రెలను బలియిచ్చేవారు. తమను రక్షించవలసిందిగా పూర్వీకులను ప్రార్థించేవారు. భవిష్యత్తును చూడగలిగే శక్తిని తమకు ప్రసాదించవలసిందిగా మొక్కేవారు. తాము చేసే పనులన్నీ తమ పూర్వీకుల అభీష్టాన్ని నెరవేర్చేందుకేనని విశ్వసించేవారు. పాలకుల్లోనే గాక పాలితులైన ప్రజాసామాన్యంలోకూడ ఈ విశ్వాసం వేళ్ళూని వున్నందున, ప్రజానీకంపై రాజవంశపు అధికారం మరింత బలంగావుండేది.

షాంగ్ రాజులు తమ సందేశాలను ఎముకలమీద, తాబేలు చిప్పలమీద చెక్కించేవారు. చైనా లిపికి ఈ వ్రాతలే ఆదిమ చిహ్నాలుగా యిప్పటికీ నిలచి వున్నాయి. ఎముకలపై చెక్కిన ఈ ప్రాథమిక రూపాలే తర్వాత అభివృద్ధి చెందిన చైనా లిపికి మూలమని చెప్పవచ్చు.

రోజువారి అవసరాలను తీర్చుకొనేందుకు, వ్యవసాయాన్ని అభివృద్ధిచేసేందుకు జరిగిన కృషి ఫలితంగా షాంగ్ కాలంనాటికే శాస్త్ర విజ్ఞానానికి పునాదులు వేయబడ్డాయి. ఎముకలపై చెక్కిన వ్రాతలను పరిశీలించితే, పదివేలదాకా అంకెలను గుణించడం వారికి తెలుసునని బోధపడుతుంది. చంద్రుని పరిభ్రమణంపై ఆధారపడిన నెలను గుణించడం, పంచాంగం వ్రాయడం వారికి తెలుసు. ప్రతి నెలకు, 30 లేక 29 రోజులనీ, సంవత్సరానికి 12 నెలలనీ, కొలది సంవత్సరాల కొకసారి అధికమాసం వస్తుందనీ వారు అవగతం చేసుకున్నారు. ఇందువల్ల షాంగ్ కాలంలో శాస్త్రీయపద్ధతి, పంచాంగం వ్రాయడంతోపాటు, ఋతువుల గమనాన్ని తెలిసికొని భూమిని ఎపుడు దున్నాలో, ఎపుడు విత్తనాలు వేయాలో అర్థంచేసికోగలిగారు.

3 వ అధ్యాయం

# పశ్చిమ 'చౌ' వంశం

ఉత్తర చైనా మైదానాలకు పడమరగా లోయెస్ (బంకమట్టి) పీఠభూములున్నాయి. చలికాలంలో ఉత్తరాన్నుంచి వీచే గాలిలో కొట్టుకువచ్చిన దుమ్ము క్రమంగా పేరుకోనడంవల్ల ఈ పీఠభూములు ఏర్పడ్డాయి. చింగ్, వీ నదులు ఈ పీఠభూమి గుండా ప్రవహించుతున్నాయి. ఈ నదీ లోయల్లో వ్యవసాయంలో ఆరితేరిన 'చౌ' తెగ ప్రజలు నివసించేవారు. తమ మూలపురుషుడైన 'హౌచీ' ధాన్యాలు, చిక్కుళ్ళు పండించడంలో నేర్పరని ఈ తెగ ప్రజ చెప్పుకుంటారు. అదే పీఠభూముల్లో నివసించే ఆటవిక తెగల దాడుల నుండి తప్పించుకోడానికి వ్యవసాయకులైన 'చౌ' తెగ ప్రజలు ఎప్పటికప్పుడు తమ నివాసాలను మార్చుకోవలసి వచ్చేది. చివరకు వారు ప్రస్తుత షెన్సీ రాష్ట్రంలోని చిషాన్ పర్వతానికి సమీపంలో వున్న చౌయువాన్ మైదానాలలో స్థిరపడిపోయారు. ఇచటి సారవంతమైన భూములను భాగుచేసి, తమలో తాము పంచుకున్నారు. ఇచట వారు కట్టుకున్న భవనాలలో తమ పూర్వీకుల్ని పూజించే నిమిత్తం నిర్మించిన దేవాలయాలు చాల ప్రసిద్ధి కెక్కాయి. తాము నివసించే పట్టణాల చుట్టూ ఆటవిక తెగల దాడులనుండి రక్షించుకోడానికి గోడలు కట్టుకున్నారు.

మైదానాలలో స్థిరనివాస మేర్పరచుకొన్నాక 'చౌ' తెగ ప్రజలు తమ అధికారాల్ని త్వరగా విస్తరింపచేసుకున్నారు.

ఆ కాలంలో షాంగ్ వంశానికి చెందిన వాసిన్ రాజు సింహాసనానికి వచ్చాడు. అతడు చాల క్రూరుడైనందున ప్రజలు అతనిని శనిగాడని పిలిచేవారు. ఎక్కువమంది ఖైదీలను పట్టుకుని, బానిసలుగా పని చేయించుకుని తన భాగ్యాన్ని పెంచుకోవాలనే దురాశతో, హువాయి నదీ లోయల్లో నివసించుతున్న తెగలపైకి తన సైన్యాలను స్వయంగా నడిపించాడు. భీతిగొల్పే ఏనుగుల సైన్యాలు ఈ ప్రజలకు అపార నష్టం కలిగించాయి.

కాని రాజు దుర్మార్గం, అవినీతికర ప్రవర్తన, నిరంతర యుద్ధాల్లో రాజ్యాన్ని నష్టపరచాయి. గోపిడి సంపదను పంచుకోడంలో దేశంలోని సామంత ప్రభువులు

ఒండోరులతో పోరాడసాగారు. రాజు, సామంతులు కలసి ప్రజలపై పన్నుభారాన్ని ఎక్కువచేశారు. దేశమంతా కరువు కాటకాలు అలముకున్నాయి. పరిస్థితులు విపమించి సంక్షోభరూపం ధరించాయి. ఆ కాలపు సామంతప్రభువుల్లో ఒకడైన 'వీట్సీ' దేశపరిస్థితులను చెబుతూ "ఏటిప్రవాహంలో పడి అలలమధ్య చిక్కుకుపోయి మునిగిపోతున్న మనిషిచందంగా రాజ్యపరిస్థితి వుంది" అని వర్ణించాడు.

'షాంగ్' రాజ్యం యిలా సంక్షోభంలో వుండగా పొరుగున నివసించుతున్న చౌ తెగ నాయకుడైన వెన్ రాజు దండయాత్రచేసి, చాలభాగాన్ని జయించాడు. క్రీ. పూ. పదకొండవ శతాబ్దంలో వెన్ రాజు కుమారుడైన 'వూ' రాజు పెద్ద యెత్తున సీన్ రాజుపై దండు వెడలాడు. షాంగ్ రాజధాని సమీపంలో 'ముయా' అనేచోట ఉభయసైన్యాలు ఢీకున్నాయి. షాంగ్ సేనలు చాల పెద్దవైనప్పటికీ అందులో అధిక సంఖ్యాకులైన బానిసలకు యుద్ధంచేయడం యిష్టంలేదు. తమ యజమానులమీద ఎదురుతిరిగి, చౌ సైన్యాలతో కలసిపోయి, షాంగ్ రాజధానిని ఆక్రమించుకున్నారు. ప్రజలచే ఏవగించుకోబడిన 'సిన్' రాజు, తగలబడుతున్న రాచనగరు మంటల్లో దూకి తన దుర్మార్గజీవితాన్ని తుదముట్టించుకున్నాడు. దీనితో షాంగ్ వంశ పరిపాలన ముగిసినది.

యుద్ధంలో జయించిన 'వూ' రాజు హోచింగ్ నగరాన్ని (ప్రస్తుతం షెన్సీ రాష్ట్రంలోని సియాన్ నగరానికి పశ్చిమాన వుండేది) రాజధానిగా చేసుకున్నాడు. ఈ విధంగా "పశ్చిమ చౌ" వంశ పరిపాలన ప్రారంభమయింది.

'వూ' రాజు తన బంధువులందరికీ జమీలు, జాగీరులు పంచుటద్వారా పరిపాలన ఆరంభించాడు. దీని ఫలితంగా చాల సామంత రాజ్యాలు ఏర్పడ్డాయి. వాటిలో చీ, లూ, వీ, టాంగ్ విస్తృతమైనవిగావుండి ప్రస్తుత షాన్‌టంగ్ రాష్ట్రంనుండి హోనాన్‌వరకు పశ్చిమాన షాన్సీ రాష్ట్రంవరకు వ్యాపించివుండేవి. దక్షిణాన యాంగ్‌ట్సీ నది, హాన్ నదీ ప్రాంతాలవరకు చిన్న జాగీర్లుగా విభజించి, వూ చక్రవర్తి తన సామంతులకు పంచాడు.

రాజుగారి కొత్త సామంతులు తమ పదవులను వంశ పారంపర్యంగా అనుభవించేవారు. వారి బిడ్డలు రాచకుటుంబానికి చెందినవారిని వివాహమాడేవారు. రాజరికాన్ని రక్షించడం, రాచబొక్కసానికి ప్రతి యేటా పేష్కష్ చెల్లించడం, అవసరమొచ్చినపుడు పరస్పరం సహాయం చేసుకోవడం సామంతులు తమ విధిగా ఎంచుకొనేవారు.

## సమాజం - ఆర్థికవిధానం

పశ్చిమ 'చౌ' పరిపాలన కాలంనాటికి అంతకు పూర్వంనుంచి సాంప్రదాయంగా కొనసాగిన గ్రామ కమ్యూన్ యింకా వుంది. చైనా భాషలోని చింగ్ అక్షరంవలె కమ్యూన్ భూములను రైతులకు పంచినందున ఈ పద్ధతిని చింగ్‌టీన్

విధానంగాని పిలిచేవారు. కిమ్యూన్ సభ్యులంతా సాంప్రదాయం ప్రకారం ఒండొరులకు సహాయం చేసుకొనేవారు. సాగుచేసుకోడానికి రైతులకు పంచిన భూములను అప్పుడప్పుడు పునర్విభజించుటద్వారా మంచి భూములను వంతులవారీ అందరూ సాగు చేయడానికి అవకాశం లభించేది. గోధుమ తదితర ధాన్యాలను, చిక్కుడు తదితర కాయగూరలను పండించేవారు. పొలాల సరిహద్దులపై చెట్లను, పండ్ల వృక్షాలను నాటేవారు. మగవాళ్లు వేటగాళ్ళుగాకూడ వుండేవారు. పట్టు పురుగులను పెంచడం, బట్టలు నేయడం వగైరా బాధ్యతలను మహిళలు నిర్వహించేవారు. రైతులు ధాన్యం రూపేణ, జంతువుల రూపేణ చెల్లించే పన్నులతో సామంత ప్రభువులు విలాస జీవితం గడుపుతుండేవారు. ప్రభువుల వస్త్రాలు సైతం రైతు స్త్రీలు తయారుచేసినవే.

పశ్చిమ చౌ కాలపు సమాజంలో బానిస వ్యవస్థకూడ వుండేది. రాజు సామంత ప్రభువులు, జాగీర్దారులు పాలకవర్గంగా వుండి ఇతరుల శ్రమ ఫలితాన్ని దోచుకునేవారు. రైతులు, బానిసలు దోచుకోబడేవారు. రాజులకు, సామంత ప్రభువుకు తమ కుమారులకు, సైనికులకు, మంత్రులకు బహుమతిగా భూములను, వాటిపై పనిచేసే బానిసలతోసహా యిచ్చేవారు. ఇలాంటి బహుమతులిచ్చే సంతోష సమయాలలో సామంత ప్రభువులు కంచు పాత్రలపైన, ఫలకాలపైన శాసనాలను చెక్కించేవారు; అలాచెక్కించిన బహుమతి ప్రదాన పత్రాలన్నింటి చివర "అతడు, అంతని వంశీకులు పారంపర్యంగా ఎల్లప్పుడూ అనుభవించుతారు" అని తప్పనిసరిగా వుండేది.

'చౌ' వంశస్తులు నిరంతరం ఆటవికులతో పోరాడవలసి వచ్చేది. ఈ ఆటవిక తెగలలో ఎన్‌యున్, పశ్చిమ జంగ్ అనేవి చాల బలవత్తరమైనవి. క్రీ. పూ. తొమ్మిదవ శతాబ్దం చివరలో ఎన్‌యున్ తెగవారు షాన్సీ రాష్ట్రంపై దాడిచేసి, యుద్ధంలో చౌ సైన్యాలను ఓడించారు. ఎనిమిదవ శతాబ్దారంభంలో పశ్చిమ జంగ్ తెగవారు దాడిచేసి, చౌ రాజధానిని ఆక్రమించుకున్నారు. రాజును చంపారు; అనేక మంది పౌరులను హతమార్చి, రాజధానీ నగరాన్ని ధ్వంసం చేశారు. చౌ రాజ్య పశ్చిమ సరిహద్దులను ఆటవిక తెగలు స్వాధీనం చేసుకున్నాయి. ఓడిపోయిన చౌ వంశీకులలో కొందరు పింగ్ రాజు నాయకత్వాన క్రీ. పూ. 770 సంవత్సరంలో లోయి అనేచోట (ప్రస్తుత హోనాన్ రాష్ట్రంలోని లోయాంగ్‌లో) తమ రాజధానిని నిర్మించుకొని పరిపాలించసాగారు. ఈ కొత్త దశను చరిత్రకారులు 'తూర్పు చౌ' శకమని పిలుస్తారు.

4వ అధ్యాయం

# వసంత - హేమంతాల శకం

క్రీస్తుపూర్వం 770 సంవత్సరం నుంచి 450 వరకు గడచిన కాలాన్ని చైనా చరిత్రలో వసంత - హేమంతాల శకం అని పిలుస్తారు.

'చౌ' వంశ పరిపాలన ఆఖరి దశలోనే ఇనుప నాగళ్ళు, గొడ్డలి ఉపయోగంలోకి వచ్చాయి. రాతితోనో, కంచుతోనో చేసిన పనిముట్లకంటే శక్తివంతమైన లోహముతో, ఇనుముతో తయారుచేసిన సాధనాలను వినియోగించడం నేర్చుకున్నందున పొలాలను లోతుగా దున్నడం, అడవులను ఛేదించి పంటభూములుగా తయారు చేయడం సులభతరమయింది.

ఇనుప పనిముట్లు ఉపయోగించడం, పనిలో నేర్పు సంపాదించిన తరువాత నుంచి భూములను రైతులకు వంతులవారిగా సాగునిమిత్తం యివ్వడం అనే సాంప్రదాయం గతించింది: క్రమంగా రైతులు భూములను వంశపారంపర్యంగా అనుభవించే పద్ధతి అమల్లోకి వచ్చింది. ప్రభువులుకూడ భూమిని తన స్వంతానికి లాక్కోవడం ప్రారంభించారు. ఈవిధంగా భూమి సమిష్టి యాజమాన్యం క్రింద వుండే పద్ధతి క్రమంగా అంతరించిపోయింది.

ఇనుప పనిముట్ల వుపయోగంవల్ల బంజర్లను, అడవులను బాగుచేసి త్వరగా సాగులోకి తేవడం సులభతరం అవడంతో, సాగుభూమిని విస్తరించడంలో ఇరుగు పొరుగు తెగలమధ్య ఘర్షణలు రాసాగాయి. భూమికోరకు తగాదాలు ప్రభుత్వాల మధ్య యుద్ధాలకు దారితీసాయి.

ఆ రోజుల్లో ఎల్లోనది లోయలోనూ, యాంగ్‌ట్సీ నదీ లోయలోనూ సాగు ప్రాంతాలు అనేకం విస్తరించాయి. ఆ ప్రాంతాలలో నివసించుతున్న వ్యవసాయ తెగలను హువా హిసియా అని పిలచేవారు. సాగవుతున్న ప్రాంతాలమధ్య విశాలమైన బీళ్ళు, అడవులు, వుండేవి: వీటిలో పశు పాలకులు, వేటగాళ్ళు అయిన జంగ్, టీ తెగలు నివసించుతుండేవి. వ్యవసాయదారులైన హువా హిసియా తెగల ఆచార వ్యవహారాలూ పశు పాలకులైన జంగ్, టీ తెగల ఆచార వ్యవహారాలూ భిన్నంగా ఉండేవి. ఉదాహరణకు పశుపాలకుల ఆహారం ప్రధానంగా మాంసం, పాలు. ఉభయ

తెగలమధ్య తరచు ఘర్షణలు జరిగేవి. హువా హిసియా తెగవారు జంగ్ టీ వారి భూములను ఆక్రమించేవారు. జంగ్ టీ తెగవారు హువా హిసియాకు చెందిన ధాన్యం, పశువులను, మనుష్యులను ఎత్తుకుపోయేవారు.

క్రీస్తుపూర్వం 7వ శతాబ్ద ప్రారంభంలో చిన్న రాజ్యాలను, తెగలను ? యించుట ద్వారా మా, చీ, ట్సిన్, చిన్ రాజ్యాలు క్రమంగా విస్తరించి బలపడ్డాయి.

యాంగ్‌ట్సీ నదీలోయలోని సారవంతమైన భూములను, సంపదనాన్ని అనుభవించుగా 'మా' రాజ్యం క్రమంగా యాంగ్‌ట్సీ, హాన్ నదీప్రాంతంలోని చిన్న చిన్న రాజ్యాలన్నిటినీ ఒక్కొక్కటే ఆక్రమించి, క్రమంగా బలమైనరాజ్యంగా రూపొందింది. 'చౌ' చక్రవర్తిపరిపాలనను తృణీకరించింది. 'మా' రాజు తన సార్వభౌమత్వాన్ని ప్రకటించుకొని, చక్రవర్తికి యివ్వాల్సిన పన్ను ఎగవేసింది. అంతేగాక 'మా' ప్రభుత్వం తమరాజ్యాన్ని ఉత్తరదిశగా విస్తరించుటద్వారా మధ్య మైదానాల్లోని రాజ్యాలకు ప్రమాదంగా తయారైంది.

తూర్పు సముద్రతీరంలోని చేపలు, ఉప్పు, పట్టు వగైరా సంపద కలిగిన 'చీ' రాజ్యం మరొక బలమైన ప్రభుత్వంగా రూపొందింది. షాన్సీ రాష్ట్రంలోని ఫెన్ నదీలోయలోని "ట్సిన్" రాజ్యం వ్యవసాయాన్ని బాగా అభివృద్ధి చేసుకుని, చుట్టూ వున్న చిన్న రాజ్యాలను తెగలను జయించి, మరొక బలమైన ప్రభుత్వంగా తయారైంది. ప్రస్తుత షెన్సీ రాష్ట్రంలో అప్పుడున్న "చిన్" రాజ్యం కూడ మరొక బలమైన ప్రభుత్వంగా రూపొందుతోంది ఈ నాలుగూ బలమైన రాజ్యాలుగా రూపొందడంతో అధికారంకొరకు వీటిమధ్య తగాదా ప్రారంభమయింది.

## సార్వభౌమత్వం కొరకు రాజ్యాల మధ్య తగాదా

వసంత - హేమంత శకం ప్రారంభంలో 'చీ' రాజు హువాన్ నాయకత్వం సంపాదించాడు.

హువా హిసియా వ్యవసాయ తెగలకు, జంగ్-టీ పశుపాలక తెగలకు మధ్య క్రీస్తు పూర్వం 7వ శతాబ్దం మధ్యలో తీవ్రమైన యుద్ధాలు జరిగాయి. ఎల్లోనది ఉత్తరపు గట్టునవున్న 'షి' హిసింగ్ రాజ్యాలకై 'టీ' తెగ దాడిచేసి అపారనష్టాలను కలిగించింది. ఒకప్పుడు బలంగా వున్న 'వీ' రాజ్యంలో దాడి అనంతరం జనాభా ఐదువేలకు తగ్గిపోయింది. ఉత్తర షాన్‌జంగ్ తెగ దాడిచేసి 'యెన్' రాజ్యాన్ని పూర్తిగా ధ్వంసం చేసింది.

ప్రమాదకరమైన పై ఘటనలతో భీతిచెందిన హువాసియా వ్యవసాయ తెగలకు చెందిన సామంతులంతా 'చీ' రాజైన హువాన్ నాయకత్వం క్రింద సమావేశమయ్యారు. ఉత్తరాది తెగల దాడుల ఎదుర్కోవాలనీ, ధ్వంసం చేయబడిన రాజ్యాలకు సహాయం పంపాలనీ నిర్ణయించారు. ధ్వంసమయిన 'వీ' రాజ్యానికి సహాయంగా పశువులు, గొర్రెలు, పందులు, కుక్కలు, కోళ్లు, వగైరాలను 'చీ' పంపాడు.

'హిసింగ్' నగర కోటలను తిరిగి కట్టించాడు. 'యెన్' రాజ్యంపై దాడిచేసిన జంగ్ తెగను వెనుకకు పారదోలాడు.

క్రీస్తు పూర్వం 656వ సంవత్సరంలో హువాన్-రాజు ఎనిమిది రాజ్యాల సంయుక్త సేనలకు నాయకత్వంవహించి, గుర్రంపై స్వారీచేస్తూ, అత్యాశాపరుడైన 'చూ' రాజ్యపాలకునిపైకి దాడి వెడలాడు. ఎదిరించేసమర్థతలేక 'చూ' రాజు సర్వసేనాని 'చీ' రాజు పెట్టిన షరతులను అంగీకరించాడు. 'చౌ' చక్రవర్తి సార్వభౌమత్వాన్ని గుర్తించాడు: మధ్య మైదానాలపై దాడిచేసి రాజ్య విస్తరణకు ప్రయత్నించనని అంగీకరించాడు. ఐక్య రాజ్యాలతో కలవడానికి ఒప్పుకున్నాడు. అదివరకు 'చూ' రాజు క్రింద సామంతులుగా వున్నవారంతా ఈ ఒడంబడికతో 'చీ' ఆధిపత్యం క్రిందకు వచ్చారు. ఈ విధంగా ముప్పది రాజ్యాలను పైగా కలుపుకొని 'చీ' రాజైన హువాన్ తనరాజ్యాన్ని విస్తరించుకొని బలవత్తరమైనదానినిగా చేసికున్నాడు.

సామంత రాజులందరినీ ఐక్యపరచడంలో హువాన్ కృతకృత్యుడవడానికి కారణం ఏమంటే అతను "చక్రవర్తికి విధేయులుగా వుండి ఆటవికుల దాడులను తిప్పికొడదాం" అనే నినాదాన్ని ప్రచారం చేయడం. అతడు నిర్మించిన ఐక్యరాజ్యాల సమితి తొమ్మిదిసార్లు సమావేశమయింది. వాగుల, నదుల ప్రవాహాన్ని అడ్డగించమనీ, ఆహారధాన్యాల రవాణాను అరికట్టమనీ, "చౌ" చక్రవర్తి సార్వభౌమత్వాన్ని అంగీకరిస్తామనీ, పరస్పరం యుద్ధాలకు దిగమనీ సమితి సభ్యులంతా అంగీకరించారు.

క్రీ. పూ. ఏడవ శతాబ్దం ఆఖరులోను, ఆరవ శతాబ్దం మొదట్లోనూ ట్సిన్-చూ రాజ్యాలమధ్య దీర్ఘకాలం యుద్ధాలు సాగాయి. చుట్టూవున్న మిత్రరాజ్యాలను కూడ వీటిలోకి ఈడ్చాయి.

క్రీ. పూ. ఆరవ శతాబ్దం చివరలో యాంగ్‌ట్సీ నది దిగువ ప్రాంతంలోని 'వూ', 'యెహో' రాజ్యాలు మధ్య మైదానాలపై నాయకత్వంకోరకు పెనుగులాడ సాగాయి. 'వూ' రాజు దాడీవెడలి 'చూ', 'చీ' రాజులను ఓడించాడు. ట్సిన్ రాజు కూడ పోరాడి లాభంలేదని గుర్తించి లొంగిపోయి 'వూ' రాజు పిలచిన సామంతుల సమావేశానికి హాజరయ్యాడు. కాని ఈ కీర్తి యెంతో కాలం 'వూ' రాజుకు దక్కలేదు. అతడు రాజ్యవిస్తరణకు ఇతర ప్రాంతాలపై దాడివెడలిన సమయంలో "యోహో" రాజు దాడిచేసి 'వూ' రాజ్యాన్ని ధ్వంసంచేసి, యాంగ్‌ట్సీ దిగువప్రాంతమంతటిపై అధికారం వహించాడు.

ఈ కాలంలో నిరంతరం కొనసాగిన అంతర్గత యుద్ధాలవలన, పెద్ద రాజ్యాలు చిన్న రాజ్యాలను కాజేయడంవలన 'చౌ' చక్రవర్తి అధికారం పూర్తిగా సన్నగిలింది. చిన్న సామంతుడున్న ప్రతిష్ఠను మించిన అధికారం చక్రవర్తికి లేకుండాపోయింది. ఐక్య సమితిలోని బలమైన రాజ్యాలు చిన్న రాజ్యాలనుండి నజరానా వసూలుచేయ సాగాయి.........బట్టలు, గుర్రాలు, పులి, చిరుతపులి, లేడి చర్మాలు వగైరాలు పన్నుగా వసూలు చేసేవారు.

అప్పటి 'లూ' రాజ్య…
…ైనా మేధావుల్లో ఆయన చాల గొప్పవాడు. …
ఎడతెగని యుద్ధాలకు ఆయన వ్యతిరేకి. ప్రజలపై …
డాన్ని, ఇతర విధాలయిన దోపిడీని కూడ ఆయన వ్యతి…
యెలా నిర్వహించుతావ"ని ఒక సామంత ప్రభు వడిగిన ప్రశ్నకు…
కన్‌ఫ్యూషియస్ "యుద్ధ నిర్వహణను గురించి నేను ఎన్నడూ అధ్యయనం చేయలేదు… అని ఖచ్చితంగా చెప్పివేశాడు. తన శిష్యుడొకడు ప్రజలపై పన్నులు ఎక్కువ చేసి, ప్రభువులకు ధనం చేకూర్చాడని విన్నపుడు కోపంతో కన్‌ఫ్యూషియస్ అలాంటి వాడిని తన శిష్యుడుగా పరిగణించనన్నాడు.

కన్‌ఫ్యూషియస్ వివిధ రాజ్యాలకు యాత్ర వెడలి, తన సిద్ధాంతాలను బోధించాడు. కాని పరిపాలకు లెవ్వరూ ఆయన సలహాలను పాటించలేదు. జన్మస్థలమైన 'లూ'కు తిరిగి వచ్చి, ప్రాచీన గ్రంథాల సంకలనకు పూనుకున్నాడు. చరిత్రగ్రంథం (షాంగ్ షు), వసంతం - హేమంతం గాథలు, కర్మకాండల గ్రంథం, పాటలగ్రంథం వగైరా పేర్లతో ఆయన సేకరించి, ప్రకటించిన పుస్తకాలు యిప్పటికీ వున్నాయి. అతి ప్రాచీన కాలంలో ప్రభుత్వాలు చేసిన ప్రకటనలు, హుకుములు చరిత్ర గ్రంథంలో సంపుటీకరించబడ్డాయి. వసంతం - హేమంతం గాథలలో 'లూ' రాజ్య చరిత్ర వ్రాయబడింది. ప్రాచీన రాజకీయ, సామాజిక జీవితంలో జరిగే కర్మకాండలు, ఉత్సవాలను గురించి వర్ణనలు కర్మకాండల గ్రంథంలో వున్నాయి. పద్యాలు, జానపదగేయాలు పాటల గ్రంథంలో సంపుటీకరించబడ్డాయి. అంతకు ముందు పాలకవర్గ సభ్యులకు మాత్రమే ప్రత్యేకోద్యోగులు చదివి వినిపించే విషయాలను కన్‌ఫ్యూషియస్ సేకరించి, గ్రంథాలుగా ప్రకటించాడు.

ఆ రోజుల్లో చాల పెద్ద సంఖ్యలో - మూడువేలకు పైగా కన్‌ఫ్యూషియస్ శిష్యులుండేవారు. కర్మకాండ, సంగీతం, విలు విద్య, రథ సారథ్యం, గ్రంథ రచన, గణితశాస్త్రం అను ఆరు కళలను గురించి కన్‌ఫ్యూషియస్, తన శిష్యులకు బోధించేవాడు. ఆయన వివిధ రాజ్యాలకు తిరుగుతూంటే ప్రయాణంలో సైతం అనేకమంది శిష్యులకు విద్య గరిపేవాడు. శిష్యులు అడిగే ప్రశ్నలకు, అడిగినవాని స్వభావాన్ని బట్టి సముచితమైన సమాధానాలను కన్‌ఫ్యూషియస్ యిచ్చేవాడు. బోధించడంలో ఆయనకున్న ఓర్పు విస్తృతమైన ఆయన విజ్ఞానం ఫలితంగా శిష్యులందరూ అత్యంత అభిమానంతోనూ, గౌరవంతోనూ కన్‌ఫ్యూషియస్‌ను చూచేవారు.

అత్యంత ప్రాచీన
జరిగేఘటనలను కవులువివరంగా వర్ణించారు.
సేద్యపుపనులు చేయడం, పర్వతాలలో కంద
లరావడం, వసంత ఋతువులో నదీతీరంలో యువతీ
యువకులూ నృత్యంచేయడం, చిత్రించే పాటలు, పీడిత ప్రజల జీవితాన్ని,
క్రోధాన్ని వర్ణించే పాటలు ఈ గ్రంథంలో వున్నాయి.

ఆ రోజుల్లో ప్రజల జీవితాన్ని, ఆలోచనలను, ఆవేశాలను ఈ పాటలు చాల ప్రతిభావంతంగా చిత్రించాయి. అందుచేతనే ప్రజలను అవి ఆకర్షించాయి: రెండు వేల సంవత్సరాలకు పైగా ప్రజల గౌరవ మన్ననలను పొందాయి.

5 వ అధ్యాయం

# రాజ్యాలమధ్య అంతర్యుద్ధాల దశ

క్రీస్తు పూర్వం 475 నుంచి 221 సంవత్సరాలమధ్య గడచిన కాలాన్ని రాజ్యాలమధ్య అంతర్యుద్ధ శకం అని చరిత్రకారులు పిలుస్తారు.

## ఆర్థికాభివృద్ధి

వసంత - హేమంతాల శకంలో జరిగిన యుద్ధాల ఫలితంగా చాల రాజ్యాలు అంతరించిపోయాయి. ముఖ్యరాజ్యాలు ఏడు మాత్రమే మిగిలాయి: చీ, చూ, ఎన్, చిన్, హాన్, చావ్, వీ, అని ఈ రాజ్యాలు పిలువబడేవి. క్రీ. పూ. ఐదవ శతాబ్దం చివరిలో వున్న ట్సిన్ రాజ్యం చీలిపోయినందున ఆఖరి మూడు రాజ్యాలు ఏర్పడ్డాయి. క్రీ. పూ. నాల్గవ శతాబ్దం చివర ఎన్ రాజ్యం చాల ప్రాముఖ్యత వహించింది. ఉత్తర చైనాలోని ఉత్తర మైదానాలనుండి లియోటుంగ్ ద్వీపకల్పంవరకు విస్తరించి వుండేది.

అప్పటికి ఇనుమును ఎక్కువగా ఉపయోగించడం అలవాటయింది. ఇనప పనిముట్లు ఎక్కువగా వినియోగించడంవల్ల పరిశ్రమలు అభివృద్ధి చెందసాగాయి. ప్రతి రాష్ట్రంలోను గనుల త్రవ్వకం ప్రారంభమయింది. ప్రస్తుత హోనాన్ రాష్ట్రంలోని నాన్‌యాంగ్ ప్రాంతంలోనూ, ప్రస్తుత హోపే రాష్ట్రంలోని హాన్‌టాన్‌లోనూ, ప్రస్తుత షాంటుంగ్ రాష్ట్రంలోని లిత్సేలోనూ ఇనుము పోత కార్మాగారాలుండేవి. అందులో కొన్ని కార్మాగారాల్లో కొన్ని వందలమంది కార్మికులు పనిచేసేవారు. లోహపు గనులను త్రవ్వించడంతోపాటు ఇనుప సరుకులను ఫ్యాక్టరీలలో తయారుచేయించి, అమ్మించుటద్వారా ధనవంతులైన యజమానులుండేవారు. బలవంతులైన సామంత ప్రభువులతో పోటీ పడగల వర్తకులుకూడ వుండేవారు.

భూమిని దున్నడానికి, గడ్డిని తవ్వి శుభ్రపరచడానికి, పంటచేలు కో
ఇనుప పనిముట్లు ఉపయోగించేవారు. ఇనుప పనిముట్లు ఉ
ఆకును ఎరువుగా తయారుచేసి పంటచేలకు వాడడం
భూములనుండి రైతులు ఫలసాయాన్ని పొందగలిగారు.

ఇనుప నాగళ్లను, పలుగులను తయారు చేయగలిగినందున పంట కాలువలను త్రవ్వడం, కాలువలను రహదారులుగా వినియోగించడం సాధ్యమయింది. ఉదాహరణకు చిన్ రాజ్యంలో 300 లీ (సుమారు 100 మైళ్లు)* పొడుగున్న ఛంకో కాలువను త్రవ్వి, నలభై లక్షల 'మౌ'ల (సుమారు 6 లక్షల 66 వేల ఎకరాలు) బంజరును సారవంతమైన పంటభూమిగా మార్చగలిగారు. తూర్పున యాంగ్‌ట్సీనదినీ, హువాయ్ నదినీ యూ, స్జి నదులతో కలిపే హాంగ్‌కో కాలువను త్రవ్వి, రవాణాకు వినియోగించారు.

దేశంలోని వివిధ ప్రాంతాల మధ్య వర్తకం బాగా అభివృద్ధి చెందింది. రాజధాని పట్టణాలైన వింట్సే, హాంటాన్, లోయి (ప్రస్తుత హోనాన్ రాష్ట్రంలో వుండేది). సిన్‌యాంగ్ (ప్రస్తుత షెన్సీరాష్ట్రంలో), ఇంగ్ (ప్రస్తుత హోపే) వగైరా క్రమంగా పెద్ద పెద్ద జనాభాగలిగిన నగరాలుగా పెంపొందాయి. ఆ నగరాలచుట్టూ కొన్ని వేల గజాల పొడవుగల గోడలు నిర్మించుకున్నారు. నేర్పరులైన పనివాళ్ళు అనేకరకాలు వస్తువులు తయారుచేసేవారు. నగరంలోని మార్కెట్టులలోకి అనేక రకాల సరుకు అమ్మకానికి వచ్చేది. తూర్పు నుంచి చేపలు, దక్షిణాన్నుంచి ముత్యాలు, ఏనుగు దంతాలు, పశ్చిమాన్నుంచి ఖడ్గ మృగాల చర్మం, ఉత్తరాన్నుంచి మంచి గుర్రాలు అమ్మకానికి వచ్చేవి. 'చీ' ప్రభుత్వానికి రాజధానిగా వున్న 'లింట్సే' నగరం చాల భాగ్యవంతమైనదిగా వుండేది. ఆ నగరానికి పేరే బాటల వెంట సరుకుల బళ్ళు, ప్రయాణీకులు నిరంతరం సాగిపోతుండేవి. లింట్సే నగరం జనాభా 70 వేల దాకా వుండేది. పట్టువస్త్రాల పరిశ్రమ చాల అభివృద్ధి చెందినందున అచట తయారైన సరుకు దేశమంతటా అమ్మబడుతుండేది. "చీ సిల్కు ప్రపంచమంతటా అమ్ముడవుతాయి" అనే సామెత వ్యాప్తిలో వుందంటే లింట్సే నగరంలో తయారైనసరుకు నాణ్యమైనదన్న ప్రఖ్యాతి వుండేదని బోధపడుతుంది.

ఉత్పత్తి పెరుగుదల, వర్తకపు సరుకుల తయారీ ఎక్కువగావడం ఫలితంగా కమ్యూన్ వ్యవస్థ మరింత శిథిలమవసాగింది. మారిన పరిస్థితులలో బలమైన రాజ్యాలలో ప్రభుత్వమే రైతులనుండి ప్రత్యక్ష పన్నులు వసూలుచేయడం, తప్పనిసరిగా శ్రమ చేయించుకోవడం పరిపాటయింది. పశ్చిమానవున్న 'చిన్' రాజ్యం మాత్రం నూతన పరిస్థితులకు అనుగుణ్యమైన రాజకీయ సంస్కరణలను అమలుజరుపకుండా వెనుకబడివుంది. ఆ రాజ్యంలో సామంత ప్రభువులే అప్పటికింకా ప్రభుత్వ యంత్రాంగాన్ని తమ చేతుల్లో వుంచుకొని గ్రామ కమ్యూన్లను నడుపుతూ, రైతుల

---

* దూరాన్ని కొలవడానికి చైనాదేశంలో వాడే కొలమానం 'లీ' దాదాపు 0.3107 మైళ్ళతో (అనగా మూడోవంతుకు లోపు) సమానం. చైనాలో భూమి [illegible] దాదాపు 0.1647 ఎకరాలతో (అనగా ఎకరంలో ఆరోవంతుకు) [illegible]లో ఉపయోగించిన కొలతలు ఆయా పరిపాలన కాలంలో [illegible]టిని ఆధునిక కొలతల్లోకి ఎలా మార్చుతారో ఇంకా

నుండి ధాన్యం శిస్తును వసూలుచేయడం, వెట్టి చేయించుకోవడం ఎక్కువగా ఉండేది. రైతులపై ప్రత్యక్ష పరిపాలన చిన్ ప్రభుత్వానికి లేకపోవడమే ఆ రాజ్య బొక్కసంలో తగినంత డబ్బులేకపోవడానికి; సైన్యం బలహీనమవడానికి కారణమయింది.

పరిస్థితులిలా వుండగా క్రీ. పూ. 359 సంవత్సరంలో చిన్ పరిపాలకుడైన హ్సియో రాజు కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టాడు. మంత్రియైన షాంగ్ యాంగ్‌ను నియమించగా, ఆయన తయారుచేసిన రాజ్యాంగ సంస్కరణల ముసాయిదాలో క్రింది మార్పులు సూచింపబడ్డాయి :

1. సమిష్టి భూమిని వంతులవారీగా రైతులు సాగుచేసుకోవడమనే పాత పద్ధతిని (చింగ్ టియెన్ విధానం) రద్దుచేసి, భూమిని స్వాధీనంలో వుంచుకోడానికి, కొనడానికి, అమ్మడానికి వ్యక్తుల హక్కును గుర్తించాలి. కొత్తభూములను వృద్ధిపరచి సాగుచేయడాన్ని, అధిక పంటలను పండించడాన్ని ప్రోత్సహించాలి. బాగుగా సాగుచేసి పంటలు పండించేవారిని, పట్టువస్త్రాలను బాగా తయారుచేసే వారిని వెట్టిచాకిరి (లేబర్ సర్వీసు) నుండి మినహాయించాలి.

2. ఒక కుటుంబంలో ఇద్దరు లేక ముగ్గురు సోదరులున్నపుడు వారు విడిపోయి వేర్వేరు కాపరం పెట్టుకొని స్వంతంగా పనిచేయాలి; లేనిచో ఆ సమిష్టి కుటుంబానికి అధిక పన్నులు వేయబడుతాయి. ఐదు కుటుంబాలను ఒక 'వూ' (గ్రూపు) గానూ, రెండు 'వూ'లను ఒక "షిహ్" (ముఠా గాను) నిర్ణయించి ఆ ముఠాలోని ఏ వ్యక్తి నేరం చేసినప్పటికీ బాధ్యత ముఠా అంతటిపై వేసే కొత్త పద్ధతిని ప్రవేశపెట్టారు.

3. సైన్యంలో వీరోచిత కార్యాలు చేసేవారికి ప్రభువు హోదాను ఇవ్వాలి. ఒక్కొక్క కార్యం గొప్పతనాన్నిబట్టి పెద్ద హోదాను యివ్వాలి. ప్రభువుల వంశాలకు చెందినవారు యుద్ధంలో వీరులవలె పోరాడలేకపోతే వారి పదవులను రద్దు చేయాలి. ప్రభువుల హోదాను అనుసరించి వారికిచ్చే భూవిమతాలు వుండాలి.

4. 'చిన్' రాజ్యంలోని గ్రామాలన్నింటినీ 31 తాలూకాలుగా విభజించి, ప్రభుత్వంచే నియమించబడిన ఉద్యోగి ప్రత్యక్ష పాలనక్రింద ఒక్కొక్క తాలూకాను (కౌంటీ) వుంచాలి.

క్రీ. పూ. 350 సంవత్సరంలో ఈ కొత్త శాసనాలను ప్రవేశపెట్టినపుడు చిన్ ప్రభుత్వానికి హ్సీన్‌యాంగ్ నగరం రాజధానిగా వుండేది. ఈ శాసనాలు తమ స్వప్రయోజనాలకు విరుద్ధంగా వున్నాయని ప్రభువులంతా ఎదిరించినందున, మంత్రి షాంగ్‌యాంగ్ చాల చిక్కులను ఎదుర్కొవలసి వచ్చింది. ఐనప్పటికీ 'హ్సియో' రాజు వీటిని ఖచ్చితంగా అమలుజరిపి, ఎదురించిన సామంత ప్రభువులందరినీ కఠినంగా శిక్షించాడు.

భూమిని కొనడం, అమ్మడం శాసనరీత్యా అంగీకరించబడినందున భాగ్యవంతుల చేతుల్లో భూమి కేంద్రీకరింపబడటం ప్రారంభమయింది. భూములను రైతులకు కౌలుకిచ్చి, ధాన్యం రూపేణా మక్తాలను వసూలు చేయసాగారు. ఈ విధంగా క్రమంగా భూస్వామ్య దోపిడీ విధానం (ఫ్యూడల్ పద్ధతి) వెంపొందింది.

షాంగ్ యాంగ్ సంస్కరణలు ఫలితంగా వ్యవసాయం వృద్ధిచెందుటతో పాటు, ప్రభుత్వ గిడ్డంగులను ధాన్యంతో నింపేందుకు అవకాశమేర్పడింది. తమ హోదా పెరుగుతుందనే ఉత్సాహంతో సైనికులు యుద్ధరంగంలో ధైర్యంగా పోరాడగలిగారు. ఈ విధంగా 'చిన్' రాజ్యంబలపడి, ముందుకు సాగింది. దానికీ, తూర్పునవున్న ఆరు రాజ్యాలకూ మధ్య సార్వభౌమాధికారంకోసం తీవ్రమైన పోరాటాలు జరిగాయి. చిన్ రాజ్యం యుద్ధచర్యలకుతోడుగా రాజకీయ చాతుర్యాన్నికూడ వినియోగించింది; శత్రురాజ్యాలమధ్య తగాదాలను రెచ్చగొట్టడానికి, వారిమధ్యవున్న ఒడంబడికలను విచ్ఛిన్నం చేయడానికి పూనుకుంది. పొరుగు రాజ్యాలతో పోరాడటానికి దూరప్రాంతరాజ్యాల సహకారం సంపాదించింది. క్రీ. పూ. మూడవ శతాబ్దం అంతమయ్యేనాటికి 'హాన్, వీ' రాజ్యాల సంయుక్త సేనలను ఓడించి, ఆ ప్రభుత్వాల చేతుల్లోంచి పెద్దభాగాలను 'చిన్' ప్రభుత్వం స్వాధీనం చేసుకోగలిగింది. ఆ విధంగా ఇద్దరు ప్రత్యర్థులను ఓడించిన తర్వాత చూ-చీ రాజ్యాల ఐక్యకూటమిని నాశనం చేయడానికి 'చిన్' ప్రభుత్వం పూనుకుంది. 'చూ' రాజ్యసేనలను ఓడించి, రాజధానిని పట్టుకున్నందున రాజు తూర్పుదిశకు పారిపోయాడు.

ఎల్లో నదికి రెండువైపులా తూర్పుదిశగా చిన్ ప్రభుత్వం తన రాజ్యాన్ని విస్తరించుకోసాగింది. క్రీ. పూ 260 సంవత్సరంలో హాన్ నగరమైన షాంగ్‌టాంగ్‌ను స్వాధీనం చేసుకొని చిన్ ప్రభుత్వ సైన్యాలు చావ్ రాజ్యంపైకి దాడి వెడలాయి. ఈ ప్రమాదాన్ని గుర్తించి చావ్ రాజు నాలుగు లక్షల యాభై వేల సైన్యాన్ని సమీకరించి, ప్రసిద్ధసేనాని లియెన్‌పో నాయకత్వాన దక్షిణ సరిహద్దు పట్టణమైన చాంగ్‌పింగ్ రక్షణకు పంపాడు. లియెన్ పో బలమైన కోటల వెనుక రక్షణ తీసుకుంటూ, తన సేనలతో జాగ్రత్తగా సమయంకొరకు వేచివున్నందున దాడి చేస్తున్న చిన్ సేనలకు అంవి కాలేదు. అప్పుడు కుట్రపన్ని, లియెన్ పో సేనానిని ఆపదనుండి తొలగించడానికి ప్రయత్నించి చివరకు సాధించగలిగారు. లియెన్ పో స్థానంలో సేనానిగా నియమించబడిన యువకుడు చావ్‌కో తొందరపడి, నగర కోటల రక్షణను వదలివేసి, శత్రుసేనలను ఢీకొని, పరాజయం పొందాడు. అతడి గొప్ప సైన్యం శత్రువు పన్నిన వుచ్చుల్లో చిక్కుకొంది. చిన్ ప్రభుత్వ సేనలు చుట్టుముట్టి, ఎటూ తప్పించుకొనేందుకు అవకాశం లేకుండా దిగ్బంధనం చేశాయి. ఈలోగా చిన్‌రాజు పదిహేను ఏళ్ళకు మించిన యువకులందరినీ సమీకరించి, తానే ఆధ్వర్యం వహించి అంతిమ యుద్ధంలో తన సేనలను నడిపించాడు. నలబది రోజులుగా చిన్న వలయంలో చిక్కిన చావ్ సైన్యాలు ఉపవాసాలతో బాధలు పడుతూ దిగ్బంధనాన్ని బద్దలు కొట్టేందుకు ప్రయత్నించి విఫలమయ్యాయి. భీకరయుద్ధంలో ఓడిపోయిన చావ్ సైనికులందరు బందీలుగా పట్టుకోబడి, చంపబడ్డారు.

సంకులసమరాలతో కూడిన ఈ దశ ఈ విధంగా గొప్పయుద్ధంతో అంతమయింది. ఆరు నెల్లలో ప్రధాన సైన్యాన్ని చావ్ ప్రభుత్వం కోల్పోయింది:

చిన్ ప్రభుత్వం ఎదురులేని మిలిటరీశక్తిగా పెంపొంది సార్వభౌమత్వాన్ని స్థాపించుకో గలిగింది.

## చిన్ ప్రభుత్వం చైనాదేశాన్ని ఐక్యపరచింది

క్రీ. పూ. 246 సంవత్సరంలో ఇంగ్ చెంగ్ రాజు చిన్ రాజ్య సింహాసనాన్ని అధిష్టించాడు. ఇతడినే ప్రథమ చిన్ చక్రవర్తనీ, లేదా చిన్ షీ హువాంగ్ టీ అనీ చరిత్రకారులు పిలుస్తారు. మిగతా ఆరు రాజ్యాలు కలిపిన దానికంటే విస్తృతమైన ప్రాంతాన్ని ఇంగ్ చెంగ్ చక్రవర్తి పరిపాలించాడు. క్రీ. పూ. 230 తరువాత పదేళ్ళలో తక్కిన రాజ్యాలన్నిటినీ - హాన్, చావ్, వీ, చూ, ఎన్, చీ - ఒక్కొక్కటే ఆక్రమించుకున్నాడు. క్రీ. పూ. 221 సంవత్సరానికి దేశాన్నంతటినీ తన పరిపాలనక్రిందకు తెచ్చి ఐక్యపరచగలిగాడు.

దేశం ఐక్యమవడం సత్ఫలితాలకు దారితీసింది. ప్రభుత్వ మిపుడు నీటివనరులన్నిటిపైనా అధికారం కలిగి, సద్వినియోగం చేసేందుకు అవకాశ మేర్పడింది. ఆటవిక తెగల దాడులను ఎదుర్కొనేందుకు రక్షణచర్యలు తీసికుని, దేశభద్రతను కాపాడే అవకాశ మేర్పడింది. శాంతియుత పరిస్థితులలో ప్రజలు తమ వృత్తులను సాగించి వుత్పత్తిని ఎక్కువ చేసేందుకు అవకాశమేర్పడింది.

6 వ అధ్యాయం

# రాజ్యాల మధ్య అంతర్యుద్ధాల దశలో సంస్కృతి

సార్వభౌమత్వంకొరకు వివిధ రాజ్యాలు పోరాడుతున్న ఈ దశలో చాలమంది గొప్ప మేధావులు ఉద్భవించారు. వారిలో కొందరు తమ రాజకీయాభిప్రాయాలను వ్రాసి గ్రంథస్తంకూడ చేశారు. ఈ దశ ప్రారంభంలో సుంగ్ రాజ్యానికి చెందిన మోట్సీ (మోటు) అనే తత్వవేత్తకు చాలమంది శిష్యులుండేవారు. వారు తమ గురువును చాల గౌరవించేవారు; ఆయన తమకిచ్చిన కర్తవ్యాలను నెరవేర్చడంలో ప్రాణాలు కోల్పోవలసివచ్చినా సరే - జంకేవారు కాదు.

మోట్సీ ఆశయాలకు పునాది విశ్వప్రేమ. మానవులందరు పరస్పరం ద్వేషించుకోరాదనీ, ఒండొరులను ప్రేమించుకోవాలనీ ఆయన బోధించాడు. దురాక్రమణ యుద్ధాలను ఆయన వ్యతిరేకించాడు. కాని దేశ రక్షణకొరకు తీసుకునే చర్యలను ఆయన బలపరచాడు. 'చూ' రాజు సుంగ్ రాజ్యంపైకి దాడి వెడలడానికి సన్నాహాలు చేస్తున్నాడని తెలిసినపుడు ఆయన రాజధానికి వెళ్ళి, దండయాత్ర ప్రయత్నాలను విరమించమని రాజుతో వాదించాడు. కాని అదే సమయంలో మోట్సీ దురాక్రమణనుండి సుంగ్ రాజ్యరక్షణకు తోడ్పడవలసిందిగా తన శిష్యులను మూడు వందలమందిని పంపాడు.

ఆరోజుల్లో ఆకలి, చలి, అధికశ్రమ అనే అత్యంతదారుణమైన పిశాచాలు ప్రజలను పీడించుచున్నాయనీ, రాజులు, ప్రభువులు విలాసాలతో తేలియాడుతున్నారనీ మోట్సీ తన రచనల్లో వర్ణించాడు. భాగ్యవంతుల శవాలతోపాటు విలువైన వస్తువులను పాతిపెట్టే సాంప్రదాయం అర్థరహితమైనదని ఆయన అభిప్రాయపడ్డాడు. ఆయన నిరాడంబరంగానూ, తక్కువ ఖర్చుతోనూ జీవించేవాడు. విలాస జీవితాన్ని, దుబారాఖర్చును సాగించడమంటే ప్రజలను దోచుకోవడమేనని ఆయన తీవ్రంగా నిరసించేవాడు. ఆయన శిష్యులు వ్రాసిన 'మోట్సీ' అనే పుస్తకంలో తమ గురువు అనేక పరిశోధనలు [illegible]న్న శాస్త్రీయ సమాచారం చాలవుంది.

చావో రాజ్యశౌరుడు హ్సున్ ట్సీ అనే పేరుగల గొప్పతత్వవేత్త నగోకరు ఈ కాలంలోనే వుండేవాడు. ఆయన చాలా రాజ్యాలలో సంచారం చేశాడు. కాని ఎక్కువ కాలం 'చీ', చూ రాజ్యాలలో గడిపాడు. ఆయన చాలమందికి శిష్యులకు కన్ ఫ్యూషియస్ పుస్తకాలను బోధించేవాడు. మానవుడు ప్రకృతిని జయించి, ఉపయోగించుకోగలడని అభిప్రాయపడ్డాడు. తోకచుక్కలు రాలడం, సూర్యగ్రహణం ప్రకృతి సహజమైన ఘటనలని కనుగొన్నాడు. ఈ పరిశోధన ప్రపంచప్రకృతిని అర్థం చేసికోడానికి మానవునికి ఎంతో ఉపకరించింది.

హ్సున్ ట్సీ శిష్యుడైన హాన్ ఫీ అనునతడు హాన్ రాజ్యానికి చెందినవాడు. సార్వభౌముని అధికారాలను బలపరచాలనీ, అధికార కేంద్రీకరణ జరగాలనీ హాన్ ఫీ కోరాడు. ప్రభువుల అధికారాలను తొలగించి, వారిస్థానే ఉద్యోగులను నియమించే అధికారం రాజుకు ఉండాలన్నాడు. అర్హులైనవారినే సేనాపతులుగానూ, మంత్రులుగాను పై పదవులకు పంపాలన్నాడు. రాజుగారి శాసనాలు వ్రాతపూర్వకంగా వుండాలనీ, వాటిని ప్రకటించాక రాజ్యంలోనివారంతా పాటించి తీరాలనీ సూచించాడు.

హాన్ ఫీ రచనలను చిన్ రాజ్య పరిపాలకుడైన ఇంగ్ చెంగ్ రాజు గౌరవించి, అందలి రాజకీయాభిప్రాయాలను ఉత్సాహంతో స్వీకరించాడు. హాన్ రాజ్యంపై తన సైన్యాలతో దండయాత్ర చేసినపుడు తత్వవేత్త హాన్ ఫీను తనకు అప్పగించాలని చిన్ రాజు కోరి సాధించాడు. ఐనప్పటికీ దురదృష్టవశాత్తు ఎక్కువ కాలం చిన్ రాజు మన్నలను హాన్ ఫీ పొందలేకపోయాడు. తాను అనుకున్నంత విశ్వాసపాత్రుడు గాదన్న అనుమానంతో చిన్ రాజు అతడిని చంపించాడు. రాజుగారి చేతుల్లో సర్వాధికారాలు కేంద్రీకరించబడి వుండాలని "హాన్ ఫీ" ప్రతిపాదించిన రాజకీయ సిద్ధాంతం, ఒకే సార్వభౌముని క్రింద నైనా దేశాన్నంతటినీ ఐక్యపరచిన రాజకీయ విధానాన్ని ప్రోత్సహించింది.

## సాహిత్యం - విజ్ఞాన శాస్త్రం

ఈ దశలో సాహిత్యం ఉన్నత స్థాయిని అందుకుంది. ఈ కాలపు రచయితలందరిలో మేటి కవీశ్వరుడు చూ యువాన్. చూ రాజ్యవాసియైన ఈ మహాకవికి, చిన్ రాజ్య దండయాత్ర కారణంగా, తాను ప్రేమించిన మాతృభూమి సర్వనాశనం కావడం కనులార చూడవలసిన దురదృష్టం పట్టింది. 'చి' రాజ్యంతో 'చూ' రాజ్యానికి వున్న స్నేహసంబంధాలను త్రెంచుకోవలసిందిగా చిన్ రాజు ప్రతిపాదించాడు. 'చూ' రాజు మంత్రులలో కొందరికి లంచమిచ్చి లోబరుచుకున్నాడు. మహాకవి చూ యువాన్ ఈ పథకాన్ని వ్యతిరేకించి, రానున్న ప్రమాదాలను గురించి 'చూ' రాజును హెచ్చరించాడు. కాని రాజు ఆ సలహాలను తృణీకరించి, మహాకవిని దర్బారునుండి వెళ్ళగొట్టాడు. 'చీ' రాజ్యంతో సంబంధాలను త్రెంచుకోగానే 'చూ' రాజ్యంపైకి చిన్

రాజు దండయాత్ర చేసి, ఓడించాడు. ఈ వార్త వినగానే చూ యువాన్ తన మాతృభూమి ఓడిపోయి నందుకు విచారాన్ని, కోపాన్ని వ్యక్తపరుస్తూ కావ్యాలు వ్రాశాడు. ప్రాచీన చైనా సాహిత్యంలో ఆ రచనలకు నేటికీ అత్యంత ప్రాముఖ్యత వుంది.

చూ యువాన్ మహాకవి తన మాతృభూమిని అమూల్యమైనదిగా యెంచేవాడు. తన దేశంలోని పర్వతాలను, నదులను, అరణ్యాలను, పంట పొలాలను ఆయన ఎంతో ప్రేమించాడు. తన రచనల్లో టింగ్ టుంగ్ సరస్సును గురించి హ్సియాంగ్ నదిని గురించి, పండ్లతోటలను, ఔషధులను గురించి వర్ణించాడు. ఆయన వ్రాసిన మహత్తర కావ్యాలలో ఒకటైన 'లీ సావ్' యిప్పటికీ నిలచివుంది. ఈ కావ్యంలో మహాకవి తన దేశంకొరకు సర్వం త్యజించి తా నెలా నిలబడ్డాడో, కాని పరిపాలకుడు తన్నెలా పారద్రోలాడో వివరించాడు. దేశద్రోహులంటే మహాకవికి పరమఅసహ్యం. 'లీ సావ్' మహాకవి వ్రాసిన ఇతర కావ్యాలు ప్రపంచంలోని ఉత్తమ కవిత్వ భాండాగారానికి చెందతగనవి.

అంతకుముందు అధిగమించడం అసాధ్య మనుకున్న అనేక చిక్కులను మానవుడు ఇనుప పనిముట్లు కనుగొన్నాక పరిష్కరించగలిగాడు. పర్వతాలను, బంజర్లను శుభ్రపరచి సారవంతమైన పంటపొలాలుగా చేయడమే గాక, నదీజలాలను పంటభూములకు మరలించగలిగాడు. పడవల నిర్మాణంద్వారా సముద్రాలపై రవాణాను కూడ సాధించగలిగాడు. ఉత్పత్తిని పెంపొందించడంలో మానవుడు అమూల్యమైన అనుభవాలను గడించుటతోపాటు శాస్త్రీయ విజ్ఞానాన్ని వృద్ధిపరచు కున్నాడు. దేశంలోని ముఖ్య పర్వతపంక్తుల వునికిని, నదీప్రవాహాల గతిని, వివిధ ప్రాంతాల్లో వుత్పత్తిఅయ్యే సరుకులనుగురించి తెలిపే గ్రంథాలు చాలా వ్రాయ బడ్డాయి. వ్యవసాయం అభివృద్ధిచెందటంతో పాటు ఖగోళశాస్త్ర పరిజ్ఞానం పెరిగింది. పంచాంగ రచన చాల మెరుగుపరచబడింది. సూర్యకుటుంబాన్ని గురించి, సూర్యునిచుట్టూ తిరిగే గ్రహాల గమనంగురించి మానవుడు తెలిసికున్నాడు ఋతువుల మార్పిడి నిర్ణీతపద్ధతిలో జరుగుతుందని అర్థం చేసికున్నాడు. వసంతఋతు ఆగమ నాన్ని ఉరుములు కోకిలారవములు తెలుపుతాయని గ్రహించాడు.

ఈ విషయాలన్నిటినీ తెలిసికొని పంచాంగంలో వ్రాసుకొన్నందున, వ్యవ సాయపనులు ఎప్పుడెప్పుడు చేయాలో శాస్త్రీయంగా నిర్ణయించుకోవడం సాధ్య మయింది. వ్యాధులను నివారించడానికి చేసిన కృషి ఫలితంగా వైద్యశాస్త్రవిజ్ఞానం ఎంతో విస్తరించింది. ఆ కాలంలో వ్రాయబడిన గ్రంథం 'పెన్ట్సో' లో అనేక వందల ఓషధులను గురించిన వివరాలున్నాయి. 'సిచింగ్' అనే మరొక గ్రంథంలో మానవశరీరాన్ని గురించి, వ్యాధి నివారణను గురించి చాల వివరాలున్నాయి.

28A



మహాకవి చూ యువాన్



రాజ్యాలమధ్యఅంతర్యుద్ధ దశల[illegible]బొట్టుపెట్టె

28B



రాజ్యాలమధ్య యుద్ధదశలోని రాగిపాత్ర



రాగిపాత్రపై యుద్ధ దృశ్యాలు

7 వ అధ్యాయం

# చిన్ సామ్రాజ్యం

చైనాదేశ ఐక్యతను సాధించిన తరువాత చిన్ ప్రభుత్వాధికారులు షాంగ్ యాంగ్ న్యాయశాస్త్రాన్ని, ఇతర శాసనాలను అన్ని ప్రాంతాలలోను అమలు జరప జరడానికి పూనుకున్నారు. ఇందువల్ల ఫ్యూడల్ (భూస్వామ్య) ఆర్థిక విధానం వెంపొందడానికి అనుకూల పరిస్థితులు ఏర్పడ్డాయి. గ్రామ కమ్యూన్లు రద్దయి, భూమి వ్యక్తుల స్వంత ఆస్తిగా గుర్తించబడింది. చైనాదేశం ఐక్యమై, ఫ్యూడల్ సామ్రాజ్యంగా రూపొందింది.

ఇంగ్ చెంగ్ రాజు ఇపుడిక చిన్ ప్రథమ చక్రవర్తిగా–చిన్ షి హువాంగ్ టీ–ప్రకటించుకున్నాడు. తన వారసులు రెండో చక్రవర్తి, మూడో చక్రవర్తి, ఇలా వరుసగా చిన్ రాజ్యాధినేతలు అవుతారనికూడ శాసించాడు. చక్రవర్తి సర్వాధికారాలు కలిగివుంటాడు. అన్ని ముఖ్య విషయాలపైన నిర్ణయాధికారం చక్రవర్తిదే. అతడి ఆజ్ఞలను ప్రతివారు పాటించితీరాలి. చక్రవర్తి ఎదుట మంత్రులుసైతం అత్యంత గౌరవాన్ని, వినేయతను ప్రదర్శించవలసి వుంటుంది.

కేంద్రీకృతమైన కొత్త ప్రభుత్వంలో ప్రధానమంత్రి, సర్వసేనాని (మార్షల్) ఉన్నత అధికారులు. పరిపాలన సాగించడంలో చక్రవర్తికి ప్రధానమంత్రి సహాయపడాలి. సర్వసేనాని సైనికశాఖ వ్యవహారాలను నిర్వహించుతుంటాడు. వీరినేగాక ఇన్‌స్పెక్టర్లనుకూడ చక్రవర్తి నియమించేవాడు. చక్రవర్తికి సన్నిహితంగా వుండి, ఆయన విశ్వాసాన్ని పొందినవారే ఈ వుద్యోగాలలో ఉండేవారు. అన్ని స్థాయిలలోని అధికారుల పనిని పర్యవేక్షించడమే ఇన్‌స్పెక్టర్ల కర్తవ్యం. సైనికులను, గుర్రాలను సమీకరించడానికి, ధనధాన్యాలను సేకరించడానికి, న్యాయనిర్వహణకు వేర్వేరు అధికారులుండేవారు.

ప్రథమ చక్రవర్తి తన రాజ్యాన్ని 36 రాష్ట్రాలుగా విభజించాడు. ఒక్కొక్క రాష్ట్రాన్ని ఒక గవర్నరు (Prefect) పరిపాలించేవాడు. ప్రతి రాష్ట్రం కొన్ని జిల్లాలుగా విభజింపబడి ప్రతిజిల్లా ఒక్కొక్క మేజిస్ట్రేటు పరిపాలనక్రింద వుండేది. రాష్ట్రాలు, జిల్లాల ప్రజలనుండి పన్నులద్వారా వసూలుచేసే ధన ధాన్యాలనుండి

కొంత భాగాన్ని కేంద్ర ప్రభుత్వ బొక్కసానికి చెల్లించి, మిగదానిని స్థానికావసరాలకు వినియోగించాలి. ప్రభుత్వానికవసరమైన శ్రామికులను, సైనికులను సమకూర్చే బాధ్యతనుకూడ జిల్లా, రాష్ట్ర అధికారులు నిర్వహించాలి. పర్యవేక్షకులుగా నియమించబడిన ఇన్‌స్పెక్టర్లు వివిధ రాష్ట్రాల్లోనూ, జిల్లాల్లోనూ జరుగుతున్న పనిని పరిశీలించి, చక్రవర్తికి రహస్య రిపోర్టులు అందజేసేవారు.

కేంద్ర ప్రభుత్వోద్యోగులపైన, రాష్ట్ర, జిల్లా వుద్యోగులపైన పూర్తి అధికారాన్ని చక్రవర్తి తన చేతుల్లోనే వుంచుకొనేవాడు. కేంద్రంలోనూ, రాష్ట్రాల్లోను ముఖ్యోద్యోగులందరినీ నియమించే హక్కు, తొలగించే హక్కు చక్రవర్తిదే. ఈ విధంగా సర్వాధికారాలు కలిగిన సార్వభౌమత్వం చైనాలో అమలు జరగడం ప్రారంభమయింది.

చిన్ రాజ్యాధినేతలు ఇతర రంగంలో కూడ సంస్కరణలను ప్రవేశపెట్టారు. అప్పటివరకు వేర్వేరు ప్రాంతాలలో వున్న వేర్వేరు లిపులకు బదులు దేశమంతటా వాడేందుకు కొత్త లిపిని తయారు చేయుమని ప్రధాన మంత్రి 'లీ-స్సూ'ను ప్రథమ చక్రవర్తి ఆదేశించాడు. అంతవరకు చిన్ రాజ్యంలో వాడుతున్న లిపిని సంస్కరించి, వ్రాయడానికి అనుకూలంగా వుండే కొత్త లిపిని - హ్సియో చువాన్ - ప్రధానమంత్రి లిస్సూ ప్రవేశపెట్టాడు. ఇది తరువాత మరికొంత సంస్కరించబడి "లీ - షూ" అని పిలువబడే లిపిగా రూపొందింది. ఇది వ్రాయడానికి వీలుగా వుండుటేగాక, ప్రస్తుతం చైనాలో వాడుతున్న అక్షరాలకు సమీపంగా వుండేది. ద్రవ్యానికి, తూకానికి, కొలతలకు స్టాండర్డ్ కొలమానాలను నిర్ణయించి, దేశమంతటా అమలుజరిపారు. దేశైక్యత రాకముందు కొన్ని రాజ్యాలు గుండ్రపు నాణాలను, మరికొన్ని రాజ్యాలు చదరపు నాణాలను వాడేవి. మరికొన్నిచోట్ల కత్తులను, పారలను నాణాలుగా వాడేవారు. చిన్ చక్రవర్తి దేశమంతటా ఒకేరకపు స్టాండర్డ్ నాణాన్ని - గుండ్రంగావుండి, మధ్యను చదరపు రంధ్రంవున్న నాణాన్ని వాడాలని - శాసించాడు. ముఖ్యమైన ఈ సంస్కరణలన్నీ దేశ సమైక్యతకు తోడ్పడి సుస్థిరమొనర్చాయి.

దేశంలో అన్ని ప్రాంతాలపైన తన ప్రభుత్వాధికారాన్ని బలపరచుకోడానికి, వ్యతిరేకతను సమూలంగా తొలగించడానికి ప్రథమ చిన్ చక్రవర్తి సర్వశక్తులు వినియోగించాడు. ప్రజల చేతుల్లోని ఆయుధాలను లాక్కొని, వాటిని రాజధానీ నగరమైన హ్సీనియాంగ్‌లో నాశనం చేయించాడు. పూర్వపు రాజ్యాలమధ్య వున్న గోడలను, ముఖ్య పట్టణాలచుట్టూ వున్న నగరప్రాకారాలను బద్దలు కొట్టించాడు. రాజధానీ నగరంనుంచి అన్ని రాష్ట్రాలకు రోడ్లను నిర్మించి, రహదార్లకు రెండు వైపులా పైన్ వృక్షాలను నాటించాడు.

బండ్ల ఇరుసులకు స్టాండర్డ్ కొలతలను చక్రవర్తి నిర్ణయించాడు. ఇందు మూలంగా వివిధ ప్రాంతాలమధ్య ధాన్యం తదితర సరుకులను రవాణా చేయడం

సులభమయింది. వ్యతిరేకుల చేతుల్లోను, భవిష్యత్తులో శత్రువు కాదగిన వారి చేతుల్లోనూ వున్న ఆయుధాలను చక్రవర్తి నాశనం చేయించాడు. అంతేకాదు; వివిధ రాష్ట్రాలలోవున్న సాంత ప్రభువుల కుటుంబాలన్నిటినీ - భవిష్యత్తులో ప్రమాదంగా పరిణమించేవారందరినీ - దాదాపు లక్షా ఇరవై వేల కుటుంబాలను అరెస్టు చేయించి, షెన్సీ రాష్ట్రానికి వలస పంపాడు. పాత సాంప్రదాయాలను చదువుకున్న వర్గం నిలబెడుతూందనీ, ముఖ్యమైన పండితులంతా ప్యూడల్ తత్వ శాస్త్రాన్ని అభిమానించుతున్నారనీ తెలుసుకొని, చక్రవర్తి ప్రాచీన గ్రంథాలను తగుల బెట్టించాడు. ఇందువల్ల ఎంతో ప్రాచీన సాహిత్యం తరువాత తరాలవారికి అందు బాటులో లేకుండాపోయింది.

## దేశరక్షణ - రాజ్యవిస్తరణ

చిన్ రాజ్యానికి ఇతర ఆరు రాజ్యాలకుమధ్య అంతిమ యుద్ధాలు జరుగుతున్న రోజుల్లో హ్సియుంగ్ ఆటవిక తెగవారు బలపడి, ఆర్డోస్ ప్రాంతాన్ని ఆక్రమించారు. మంగోలియా పీఠ భూముల్లో పశుమందలను మేపుట, వేటాడుటవైన జీవించే ఈ తెగవారు, మైదాన ప్రాంతాలమీద దాడిచేసి పశువులను, మనుష్యులను ఎత్తుకు పోయేవారు. మూడు లక్షల సైన్యంతో జనరల్ మెంగ్‌టీన్‌ను ఉత్తర సరిహద్దును కాపాడటానికి ప్రథమ చిన్ చక్రవర్తి పంపాడు. హ్సియుంగ్ తెగవారిని తరిమి వేయడంలో విజయం సాధించాడు. తరువాత చిన్, చావ్, ఎన్ రాజ్యాల ఉత్తర సరిహద్దు రక్షణ గోడలను కలుపుతూ-ప్రస్తుత కన్సూరాష్ట్రంలోని లిటాటావ్ నుంచి తూర్పున లియావ్ నదివరకు - బ్రహ్మాండమైన గోడను నిర్మించాలని చక్రవర్తి ఆజ్ఞాపించాడు. తత్ఫలితంగా చరిత్ర ప్రసిద్ధమైన గొప్పగోడ - ప్రాచీన చైనా ఇంజినీరింగ్ నిర్మాణ కౌశల్యానికి నిదర్శనంగా ఎంచబడుతున్న - బృహత్ నిర్మాణం రూపొందింది. లక్షలకొలది శ్రామికులు చెమటోడ్చి పనిచేసి, ప్రాణాలర్పించి, ప్రాచీన ప్రపంచంలోని విచిత్రాల్లో ఒకటిగా ఎంచబడుతున్న ఈ గోడను నిర్మించారు. ఉత్తరాన్నుంచి ఆటవిక తెగలదాడులనుండి చిన్ సామ్రాజ్యాన్ని కాపాడటానికి ఈ గోడ వినియోగించింది.

ప్రథమ చక్రవర్తి దక్షిణదేశంవైపికి దృష్టిని మరల్చి ఆగ్నేయ సముద్రతీర ప్రాంతంలోనూ, పెరల్ నది లోయలోను యూహే తెగ ప్రజలను జయించడానికి ఐదు లక్షల సైన్యాన్ని పంపాడు. దక్షిణదేశం అప్పటికింకా చాలవెనుకబడివుంది. అచటి ప్రజలు యింకా రాతిపనిముట్లను వాడుతూ కొంతవ్యవసాయంవైన, కొంత చేపలు పట్టే వృత్తివైన జీవితం గడుపుతుండేవారు. చిన్ సేనలకు వ్యతిరేకంగా వారు వీరో చితంగా పోరాడారు. కొండల్లోనూ, అరణ్యాలలోనూ పొంచివుండి, దాడిసైన్యాలు ఆకలిగొని అలసిపోయి వున్నప్పుడు దెబ్బతీసేవారు. చాల యుద్ధాల అనంతరమే దక్షిణ దేశ ప్రజలైన యూహాలను ఓడించి చిన్ రాజ్యంలో కలుపుకోవడం సాధ్యమయింది.

చిన్ రాజ్య జైళ్ళనుండి ఖైదీలను విడుదలచేసి, కొత్తగా ఆక్రమించిన దక్షిణదేశంలో వారికి పునరావాసం ఏర్పరచారు.దూరంగావున్న హొనాన్ రాష్ట్రాన్నుంచిగుర్రాలను, పశువులను, ఇనుప పనిముట్లను దిగుమతిచేసి, దక్షిణదేశంలోని కొత్తభూములను బాగుచేసి, సాగు ప్రారంభించారు. ఈ విధంగా యాంగిట్సీనదీలోయకు, పెగల్ నదీలోయకు మధ్య ఆర్థిక సంబంధాలు ఏర్పడ్డాయి. ఇనుం సాధనాలను వినియోగించడం నేర్చుకున్నందున యూహ్ ప్రజలు ఆర్థికంగా పురోగమించడానికి అవకాశాలు లభించాయి.

8 వ అధ్యాయం

# చిన్ వంశ పరిపాలనానంతరం రైతుల తిరుగుబాట్లు

## నిరంకుశ విధానం

చిన్ సామ్రాజ్యాన్ని కాపాడటానికి జరిగిన ప్రయత్నాలన్నిటి భారం రైతులపై పడింది. బ్రహ్మాండమైన చైనా గోడను కట్టడానికి, వేలకొలది మైళ్ళ రహదారులను నిర్మించడానికి వినియోగించిన కూలీ జట్టులను, ఉత్తరాన హ్సియుంగ్ తెగలను ఓడించడానికి వెళ్ళి సరిహద్దును కాపాడుతున్న 3 లక్షల సైన్యాన్ని, దక్షిణాన యూహ్ ప్రజలను జయించడానికి వినియోగించిన 5 లక్షల సైన్యాన్ని పోషించడాని కయ్యే ఖర్చులన్నీ రైతాంగంనుండే ప్రభుత్వం పిండి వసూలు చేసింది.

రాజధాని సమీపంలోవున్న 'వీ' నది దక్షిణపు గట్టున చక్రవర్తి కొరకు "ఓఫాంగ్ కుంగ్" అనే పేరుతో గొప్పభవనం నిర్మించబడింది. జీచువాన్, హూపే రాష్ట్రాలనుండి పెద్ద దూలాలను ఆ రాజభవనంకొరకు తెప్పించారు; భవనానికి ముందు భాగంలో రెండతస్థుల మేడవుంది. పై అంతస్థులోవున్న రాజ దర్బారులో పదివేల మంది మనుష్యులు కూర్చునేందుకు స్థలంవుంది. క్రింద అంతస్థు ఎంతయెత్తుగా వుందంటే 50 అడుగుల ధ్వజాన్ని అందులో ప్రతిష్ఠించవచ్చు. రాజభవనంనుంచి చుంగన్ పర్వతాలలో ఉన్నత శిఖరంవరకు రోడ్డువేసి, అచట ముఖద్వారంగా వినియోగించే ఒక దర్వాజాను నిర్మించారు. రెండోవైపునుంచి 'వీ' నదిపైగా రాజధానీ నగరంలోకి మరో రహదారిని నిర్మించారు.

రాజధానికి తూర్పుగా లిషాన్ కొండల్లో ఐదువందల అడుగుల ఎత్తు ఒకటిన్నర మైలు పరిధిగలిగిన పెద్ద సమాధి ఒకటి చక్రవర్తి కొరకు నిర్మింపబడింది. దాని పైకప్పులో ఆకాశంలోవలె నక్షత్రాలను చెక్కించి, క్రింద నేలపై సముద్రాలను, పాదరసం నదులను చిత్రించారు.

ఈ బ్రహ్మాండమైన భవనాలను నిర్మించడానికి 7 లక్షలకు మించిన ఖైదీలచే పనిచేయించారు; ఇందు కవసరమైన సామాన్లను రవాణా చేయడానికి మరెంతో మందిని వినియోగించారు.

చిన్ సామ్రాజ్యంలో శాసనాలు చాల కఠినంగా వుండేవి. చిన్న నేరాలకు సైతం పెద్ద శిక్షలు వేసేవారు. ఒక వ్యక్తి నేరంచేస్తే, అతని కుటుంబమంతటినీ శిక్షించేవారు. అమాయకంగా జరిగిన పొరపాటును సైతం నేరంగా పరిగణించి, కఠినంగా శిక్షించేవారు. అందుచేతనే రాజధానికివెళ్లె రహదార్లపై నేరస్థులుగా పరిగణించబడి శిక్షించబడిన ఖైదీలు ఎల్లప్పుడూ కనిపించుతుండేవారంటే ఆశ్చర్య పడవలసిన అవసరంలేదు.

చిన్ చక్రవర్తుల నిరంకుశత్వంక్రింద ప్రజలు ఘోరమైన బాధలను అనుభవించు తున్నందున ప్రభుత్వాన్ని తీవ్రంగా ద్వేషించేవారు.

## రైతుల తిరుగుబాట్లు

క్రీ. పూ. 209 వ సంవత్సరంలో రెండవ చక్రవర్తి పరిపాలించుతుండగా యుయాంగ్ సరిహద్దు రక్షణకు 900 మంది సైనికులు పంపబడ్డారు. ఆన్‌హ్వాయీ రాష్ట్రంలోని చిహ్సీన్ జిల్లాకు చెందిన టాట్సే గ్రామంవద్ద వుండగా పెద్ద వాన కురిసినందున, రహదారి పాడై ప్రయాణంచేయడం అసాధ్యమైనందున ఆ సైనిక దళం ముందుకు సాగలేక ఆ గ్రామంలో విశ్రాంతి తీసికుంది. ఇందువల్ల గమ్యస్థానం చేరడం ఆలస్యమైపోతుందనే సంగతి స్పష్టపడింది. కాని శాసనం ప్రకారం ఇలా ఆలస్యం చేసినవారికి మరణశిక్ష విధించబడుతుంది. తమకు రానున్న ప్రమాదాన్ని గుర్తించి, చెన్ షెంగ్ అనే పాలేరు, వూ కాంగ్ అనే మరొకని నాయకత్వం క్రింద ఆ సైనికులు తిరుగుబాటు చేశారు. కోపంతో సైన్యాధికారిని చంపేశారు. వెదురు కర్రలను ఆయుధాలుగా తీసికుని, చిన్ సామ్రాజ్యాన్ని కూలద్రోయాలనే నినాదంతో తిరుగుబాటుకు వీరు పిలుపిచ్చారు.

చెన్ షెంగ్, వూ కాంగ్‌ల నాయకత్వాన తిరుగుబాటు చేసిన ఈ సైన్యానికి రైతుల తోడ్పాటు లభించింది. కమతాలను వదలివేసి రైతులు తిరుగుబాటులో చేరారు. చిహ్సీన్ జిల్లాను ఆక్రమించి, చెన్, వూలు తిరుగుబాటు సేనలతో పడమరకు పురోగమించారు. ఒక నెలరోజుల్లోపలే ఈ సైన్యంలోకి వేయిమంది అశ్వికదళం, అనేకవేల కాల్బలం, ఏడువందల రథాలు సమకూరాయి. తరువాత హోనాన్ రాష్ట్రంలోని చెన్‌హ్స్యాన్ జిల్లాను వీరు జయించారు. దానిని స్థావరంగా చేసుకుని పోరాడసాగారు. ఈ తిరుగుబాటువల్ల ఉత్సాహం పొంది, దేశమంతటా రైతులు ఆయుధాలతో తిరగబడ్డారు.

చౌ-వెన్ నాయకత్వాన ఒక తిరుగుబాటుదార్ల సైన్యం హాంకుకాన్ కనుమను దాటింది. కొన్ని లక్షల బలంగల సైన్యంగా వృద్ధిపొంది, రాజధానిపైకి దాడివెళ్ళి

కొలది డజన్ల మైళ్ళ సమీపంలోకి చేరింది ప్రభుత్వ సైన్యాలు ఎక్కువభాగం సరిహద్దు రక్షణకు పంపబడినందున రెండవ చక్రవర్తి క్లిష్టపరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. లిషాన్ కొండల్లో తన తండ్రి సమాధి భవన నిర్మాణంలో పాల్గొంటున్న దురదృష్టవంతులైన ఖైదీలందరినీ చక్రవర్తి విడుదలచేసి, ఆయుధాలిచ్చి, చాంగ్ హాన్ సేనాని నాయకత్వాన యుద్ధానికి పంపాడు. అనుభవజ్ఞుడైన సేనాని క్రింద తనకంటే పెద్ద సైన్యం తలపడినందున, తిరుగుబాటుదార్ల నాయకుడు చౌ వెన్ తన సేనలతో వెనకకు తగ్గాడు. యుద్ధరంగం హోనాన్ రాష్ట్రంలోకి మారింది.

దేశంలో అనేక ప్రాంతాలలో రైతాంగం తమకిచ్చిన మద్దతు ఫలితంగా చెన్-షెంగ్ సైన్యాలు విశాలమైన భూభాగాలను ఆక్రమించాయి. కాని రాజ్యాలు కోల్పోయిన 6 రాజ్యాల సామంత ప్రభువులు దీనిని అవకాశంగా తీసికుని తమ అధికారాన్ని పునరుద్ధరించుకోవాలని ప్రయత్నించారు. తాము ఆక్రమించిన ప్రాంతాలకు స్వతంత్రపాలకులుగా ప్రకటించుకోమని తిరుగుబాటుదార్ల సేనానులకు సలహాలిచ్చారు. దీని ఫలితంగా తిరుగుబాటుదార్ల సైన్యంలో విభేదాలు పొడసూపాయి. విప్లవ నాయకుడు చెన్ షెంగ్ మాత్రం ఒంటరిగా నిరంకుశత్వాన్ని ఎదిరించి పోరాడి, ఓడిపోయాడు. తప్పనిసరై చెన్‌హ్స్యాన్‌కు తిరోగమనం చేస్తుండగా ద్రోహులచే ఖూనీ చేయబడ్డాడు. అతడి సహాధ్యాయి వూ కాంగ్ కూడ అదే గతిని ఎదుర్కోవలసివచ్చింది.

చెన్, వూలు నడిపిన రైతాంగ తిరుగుబాటు ఓడిపోయినా, ఉద్యమం మాత్రం చాలకాలం కొనసాగింది. 'చూ' రాజ్యానికి చెందిన సామంతప్రభువు హ్స్యాయాంగ్ యు నాయకత్వాన ఒక తిరుగుబాటు, కియాంగ్స్యు రాష్ట్రంలోని పీహ్స్యాన్ జిల్లాకు చెందిన చిన్న ఉద్యోగి లియూ పాంగ్ నాయకత్వాన మరొక తిరుగుబాటు బలమైన ఉద్యమాలుగా వృద్ధిచెందాయి. క్రీ.పూ. 207 వ సంవత్సరంలో చాంగ్ హాన్ సేనాని ఆధిపత్యం క్రిందవున్న చక్రవర్తి ముఖ్య సేనలను హ్స్యాయాంగ్ ధ్వంసం చేశాడు. ఒక సంవత్సరం తరువాత లియూ పాంగ్ తన సేనలతో రాజధాని హ్స్యన్‌యాంగ్ నగరాన్ని ఆక్రమించి, చిన్ వంశ చక్రవర్తుల పాలనను తుదముట్టించాడు.

ఈ విధంగా ఆరు బలమైన రాజ్యాలను దిగమ్రింగి, ఉత్తరాన్నుంచి వచ్చిన హ్స్యుంగా దాడులను తిప్పికొట్టి, దక్షిణానవున్న యూహ ప్రజలను జయించి, ఇరువై సంవత్సరాలపాటు దేశాన్నంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందకు తెచ్చుకొని పరిపాలించిన మహాసామ్రాజ్యం తుఫానువలె చెలరేగిన రైతుల నిరంతర తిరుగుబాటుల ఫలితంగా తుడిచిపెట్టుకుపోయింది.

చైనా సింహాసనాధిపత్యం కోసం హ్స్యాయాంగ్ యూ, లియూ పాంగ్‌ల మధ్య ఐదు సంవత్సరాలుగా యుద్ధం జరిగింది. మొదట్లో హ్స్యాయాంగ్ యూ పైకి వచ్చేటట్లు కన్పించాడు. కాని అతడు దోపిడీలు, హింసాకాండ ఎక్కువగా సాగించినందున ప్రజ లతనిని ఏవగించుకొని, క్రమంగా ప్రత్యర్థిని బలపరచసాగారు.

చిన్ ప్రభుత్వం జారీ చేసిన నిరంకుశ శాసనాలను లియూపాంగ్ అధికారంలోకి రాగానే రద్దుచేశాడు. ఖూనీ చేసినవాడికి మరణశిక్షను, గాయపరచినా, దొంగతనం చేసినా ఖైదుశిక్షను విధించుతూ శాసనాలు చేశాడు. చిన్ చక్రవర్తికి రాజవంశీకులకు చెందిన స్వంతభూములన్నిటినీ స్వాధీనం చేసుకొని ప్రజలకు పంచాడు. సైన్యంలో పనిచేస్తున్నవారి కుటుంబాలకు పన్నులను మినహాయించాడు. ప్రజాహితకరమైన ఈ చర్యల ఫలితంగా లియూపాంగ్ సేనలకు అవసరమైన మనుష్యులు, సామగ్రి సమృద్ధిగా సప్లయి అయాయి: తత్కారణంగా హిస్యయాంగ్‌ని ఓడించడంలో కృతకృత్యుడయ్యాడు.

క్రీ. పూ. 202 సంవత్సరంలో రాజ్యాధికారం చేబట్టి, చక్రవర్తి అయ్యాడు. ప్రస్తుతం షెన్సీ రాష్ట్రంలోని సియాన్‌కు పశ్చిమోత్తరంగా వున్న చెంగన్ రాజధానిగా చేసుకుని, హాన్ వంశ పరిపాలనను సంస్థాపించాడు. చరిత్రకారులు దీనిని పశ్చిమ హాన్ సామ్రాజ్యమని, లియూపాంగ్‌ను కా-ట్సూ చక్రవర్తి అని అంటారు.

9 వ అధ్యాయం

# ఆరంభంలో పశ్చిమ హాన్ సమాజం ప్రభుత్వాన్ని బలపరచే చర్యలు

చైనా నూతన పరిపాలకుడు తిరుగుబాటునుంచి అవసరమైన గుణపాఠాలను తీసికోవడంలో విఫలుడవలేదు. చక్రవర్తి హుకుము ననుసరించి లూ చియా అనే మంత్రి, అంతకుముందున్న సామ్రాజ్య పతనానికి కారణాలను పరిశీలించుతూ ఒక నివేదిక తయారుచేశాడు. దాన్లో ఆయనిలా నివేదించాడు : "చిన్ ప్రభుత్వ సైన్యాల బలం ఎక్కువయిన కొలదీ, దాని శత్రువుల సంఖ్యకూడ పెరిగింది. ప్రజలయెడ ప్రభుత్వం అత్యంత కఠినంగా ప్రవర్తించింది; శిక్షలు అతిక్రూరంగా వుండేవి."

పరిపాలన సుస్థిరంగా వుండాలంటే, ప్రజా తిరుగుబాట్లను రాకుండా చేయాలంటే, జనసామాన్యంపై సాగుతున్న దోపిడిని, నిర్బంధ విధానాన్ని తగ్గించాల్సి వుంటుందని నూతన పరిపాలకులు గుర్తించారు. రైతులందరిని తమ కమతాలకు చేరుకోమని ప్రోత్సహించుతూ 'కావ్ ట్సూ చక్రవర్తి' శాసనాలు ప్రకటించాడు. (1) తమ గ్రామాలను వదిలి పారిపోయినవారు తిరిగి వచ్చి, ప్రభుత్వానికి నివేదించుకుంటే, అట్టివారు శిక్షించబడరు. (2) యుద్ధకాలంలో కరువు కాటకాల ఫలితంగా బానిసలుగా అమ్ముడుపోయినవారందరినీ ప్రభుత్వం విముక్తి చేసింది. (3) యుద్ధంలో పోరాడి, ఇళ్ళకు తిరిగి వచ్చిన సైనికులు నిర్బంధపు శ్రమనుంచి 6 నుంచి 12 యేళ్ళ వరకు మినహాయించబడ్డారు.

ఐనప్పటికీ రాజభవనంనుండి వెలువడే హుకుములలో ఎక్కువభాగం భూస్వాములకు, మిలిటరీ ఉద్యోగులకు అనుకూలించేవిధంగా వుండేవి. తమ గ్రామాలకు తిరిగి వచ్చిన కాందిశీకులందరికీ ఇళ్ళు, భూములను పునరుద్ధరించారు. మిలిటరీ ఉద్యోగులకు, వారి కుటుంబాలకు నిర్బంధపు చాకిరీని పూర్తిగా మినహాయించారు. వారికి భూములను, ఇళ్ళను యిచ్చారు. సైనిక కార్యకలాపాల్లో ఎంత ఎక్కువగా పాల్గొంటే అన్ని ఎక్కువ భూములను ముట్టచెప్పారు యుద్ధంలో ప్రత్యేక నైపుణ్యం చూపిన

వారికి మక్తాలు, నజరానాలు, చెల్లించే రైతు కుటుంబాలను అప్పగించారు. తద్వారా భూస్వాముల, సేనానుల మద్దతును నూతన చక్రవర్తి సంపాదించగలిగాడు.

అంతేగాక ప్రభుత్వం భూమిశిస్తును పండిన పంటలో మొదట పదిహేనో వంతుకు, తరువాత ముప్పయ్యోవంతుకు తగ్గించింది. వయోజనులకు సంవత్సరానికి తలకు 120 నాణాలు చొప్పున తలపన్ను విధించింది. శరీర ధారుఢ్యంగల ప్రతి మనిషీ సంవత్సరంలో నెలరోజులపాటు ప్రభుత్వానికి చాకిరీ చేయాలనీ, సరిహద్దు కాపలా మూడురోజులు చేయాలనీ శాసించింది. ఈ చాకిరీనుంచి మినహాయింపు కోరేవారు కొంత డబ్బు చెల్లించాలిసి వుంటుందనే నియమంకూడ వున్నందున భూస్వామ్యవర్గం చాకిరీ నియమాలను తప్పించుకోగలిగేది.

చిన్ పరిపాలనలోవున్న అత్యంత కఠినమైన శాసనాలను, అంగవైకల్యం వగైరా శిక్షలను కొత్త ప్రభుత్వం రద్దుచేసింది. ఇందువల్ల నేరాల సంఖ్య చాలవరకు తగ్గింది. ఒక సంవత్సరంలో పెద్ద నేరాలకు శిక్షింపబడినవారిసంఖ్య కొలది వందలు మాత్రమేవుంది. బ్రహ్మాండమైన భవనాలను నిర్మించే కార్యక్రమం ఆపుచేయడంవల్ల బలవంతపు చాకిరీ చేయించే అవసరం తగ్గి, ప్రజలకు కొంత విశ్రాంతి దొరికింది.

ఈ విధంగా అనుకూల పరిస్థితులు ఏర్పడడంవల్ల, అనవసరపు ఖర్చులు తగ్గించడంవల్ల ఆర్థిక విధానం క్రమంగాపుంజుకొని, అభివృద్ధిచెంద సాగింది.

## ఆర్థికాభివృద్ధి

పశ్చిమ హాన్ పరిపాలనలో ప్రవేశించాక చైనాదేశంలో పెద్దతరహా యుద్ధాలు లేవు; నిర్బంధపు చాకిరీ చాల తక్కువగా వుండేది. అందుచేత మొదటి డెబ్బది సంవత్సరాలలో – వూ టీ చక్రవర్తి పరిపాలనవరకు – గ్రామాలు ఆర్థికంగా బాగు బడ్డాయి. ఇనుముకు, ఇనుప నాగళ్ళకు డిమాండు అదివరకటికంటే చాల ఎక్కువగా పెరిగింది. ఇనుముతో పనిముట్లు తయారుచేసే కర్మాగారాలను పెద్ద వర్తకులు స్థాపించారు. ఒక్కొకదాన్లో వేయిమంది పనిచేసే కర్మాగారాలు కూడ వుండేవి. ఇనుపసామాన్లు అమ్మడం, కొనడం గ్రామాలలోసైతం సర్వసాధారణ మయింది: వ్యవసాయోత్పత్తి క్రమంగా పెరిగింది.

ఐతే యివన్నీ అంతకుముందున్న పరిస్థితులతో పోల్చినపుడు మాత్రమే మెరుగుగా కన్పించుతాయనే సంగతి మరువరాదు. స్వంత భూమి సాగుచేసుకునే రైతు తన కుటుంబ పోషణకు చాలినంత మాత్రమే ఉత్పత్తి చేసుకోగలిగేవాడు. వర్షాలు లేకపోయినా, వరదలొచ్చినా, జబ్బుచేసినా, మరణం సంభవించినా, మరే అసాధారణ పరిస్థితు లేర్పడినా రైతులు అప్పుల పాలయ్యేవారు. సంవత్సరానికి నూటికి 20 లేక 30 నుంచి నూరువరకు దారుణమైన వడ్డీ చెల్లించవలసి వచ్చేది. ఈ విధంగా అప్పులపాలైన రైతులు క్రమంగా స్వంత భూమిని అమ్మివేసికుంటూ చివరకు కౌలుదార్లుగానో, పాలేళ్ళుగానో దిగజారేవారు. కౌలుదారుగావున్న రైతు పండిన

38A



మాసూళ్ల దృశ్యం చెక్కబడిన హాన్ కాలంనాటి రాతిప్రతిమ

పంటలో సగం భూస్వామికి చెల్లించుకోవలసి వచ్చేది. లేదా రైతు తన్నుతాను, తన కుటుంబాన్ని బానిసలుగా అమ్ముకోవలసి వచ్చేది.

ఐనప్పటికీ రైతాంగాన్ని దోచుకునే విధానం తగినంత మోతాదులో కొనసాగినందున పశ్చిమ హాన్ చక్రవర్తుల పరిపాలన ఆర్థికంగా పురోగమించగలిగింది. భూస్వాముల చేతుల్లో చాల భూమి, పశువులు, గుర్రాలు వుండేవి. ప్రభుత్వం సుభిక్షంగా వుండి, బొక్కసంలో ఎక్కువగా సంపద పోగయింది రైతులు ఒకవైపున ఆకలిబాధలతో సతమతమౌతున్నా, రెండోవైపున రాజధాని నగరంలోని ప్రభుత్వ ధాన్యాగారాలు నిండుగానే వుండేవి. పాతధాన్యం యింకా నిల్వవుండగానే పైన కొత్తధాన్యం పోస్తున్నందున ప్రభుత్వ గిడ్డంగులలోని ధాన్యమెంతో పాడయి, దుబారా అవుతుండేది. ప్రభుత్వ బొక్కసంలో ధనరాసులు మూలుగుతుండేవి; సంవత్సరాలతరబడి వాడనందున నాణేలు తుప్పుబట్టేవి.

పశ్చిమ హాన్ పరిపాలనలో ఎల్లోనది వరదలవల్ల పడిన గండ్లను రెండుసార్లు మరమ్మతు చేశారు. రెండోసారి చక్రవర్తి "ఊ-టీ" స్వయంగా గండిపడిన చోటుకు వెళ్ళి, తనతోవచ్చిన వుద్యోగులందరినీ మరమ్మతుపనిలో పాల్గొనాలని ఆజ్ఞాపించాడు. కలపకొరత యేర్పడినపుడు స్వంత ఉద్యానవనంలోని వెదురుపొదలను కొట్టించి, తెప్పించి గండి పూడ్చడానికి వినియోగించాడు. ఈ పెద్ద మరమ్మతు ఫలితంగా తరువాత ఎనభైసంవత్సరాల వరకు ఎల్లోనది దిగువప్రాంతాల్లో వరదల ప్రమాదం తప్పింది.

ఈ పరిపాలనలో సాధించిన మరో విశేషం, కాలువల త్రవ్వకమని చెప్పాలి. రాజధాని ఛాంగను చుట్టుప్రక్కల చాల పంట కాలువలు త్రవ్వారు. అంతర్యుద్ధ దశలో నిర్మించిన "చెంగ్ కూ" కాలువకు దక్షిణంగా "పైకుంగ్" అని పిలిచే కొత్త కాలువను త్రవ్వారు.

చాలా దూరప్రాంతాలు కూడ ఈ దశలో అభివృద్ధి చెందాయి. జనాభా చాల ఎక్కువగా పెరిగింది. "ఎటు చూసినా చుట్టూ వేయి 'లీ'ల వరకూ పొయ్యిలనుంచి పొగ కన్పించుతూనే వుంటుంది" అనే జనవాక్కు ఆ కాలపుదే.

10 వ అ ధ్యా యం

# పశ్చిమ హాన్ సామ్రాజ్యం, హ్స్యియుంగ్ నూ, ఇతర పశ్చిమ ప్రాంతాలు

చిన్ ప్రభుత్వ సేనాని మోంగ్ టీన్‌చే ఓడింపబడిన తరువాత పదేళ్ళకు అంటే క్రీ. పూ. 200 సంవత్సరం నాటికి 'హ్స్యియుంగ్ నూ' తెగ తిరిగి శక్తిసామర్థ్యాలను చేకూర్చుకొని బలపడింది గుర్రపు స్వారీలోనూ, విలువిద్యలోనూ ఈ తెగవారు ఎంతో నేర్పరులు. తనకు అవరోధంగా వున్న సామంతులందరినీ చంపి, సింహాసనం అధిష్టించిన "మోటూ" అనే నాయకుడు ఈ తెగను పరిపాలించుతుండేవాడు. తన ఆధిపత్యం క్రింద వున్న మూడు వేలమంది గుర్రపు సైన్యంతో పొరుగు తెగలపై దాడి చేసి, వారినుండి ఖైదీలను పశువులను "మోటూ" పట్టుకొచ్చేవాడు : లొంగిపోయిన తెగలనుండి విపరీతమైన పరిహారం వసూలు చేసేవాడు. అతడి నాయకత్వాన "హ్స్యియుంగ్ నూ" తెగ సుకల చాంగన్‌కు ఉత్తరంగా వున్న ఆర్డోస్ ప్రాంతాన్ని ఆక్రమించింది.

అప్పట్లో హాన్ పరిపాలకులు "హ్స్యియుంగ్ నూ" సవాలును ఎదుర్కోడానికి సన్నద్ధంగాలేరు. తమ బలహీనత కారణంగా వారు రాజీ విధానాన్ని అనుసరించారు. రాజ కుటుంబానికి చెందిన యువతిని, విపరీతమైన కట్నంతో సహా, మోటూ కు యిచ్చి వివాహం చేశారు. ప్రతి సంవత్సరం పట్టు పీతాంబరాలు, ధాన్యం కొత్త చుట్టానికి కానుకగా పంపేవారు. ఎన్ని చేసినా "హ్స్యియుంగ్ నూ" హాన్‌రాజ్య సరిహద్దులపై దాడిని మాత్రం కొనసాగించుతూనేవుంది. గుర్రపు రౌతులు అహంకారంతో రాజధానికి కనుచూపుమేరలోవున్న గోధుమపంట పొలాలలో విచ్చలవిడిగా స్వారీ చేసేవారు. సహించరాని పరిస్థితులు ఏర్పడ్డాయి. హాన్ పరిపాలకులు పశ్చిమోత్తర ప్రాంతాలలో గుర్రపుశాలలను నిర్మించి తమ గుర్రపు దళాలను తర్ఫీదు చేశారు. సరిహద్దు ప్రాంతాలలో భూములిచ్చి, సాగుచేసుకునేందుకు, సరిహద్దు రక్షణకు సాయపడేందుకు రైతులను ప్రోత్సహించారు.

'ఊ - టూ' చక్రవర్తి పరిపాలించుతున్న రోజుల్లో ఎదురు దెబ్బతీయడానికి పరిస్థితులు పరిపక్వమయ్యాయి. హాన్ సైన్యాలకు - 'హ్స్యుంగ్ నూ' తెగవారికి మధ్య దీర్ఘకాలం భీకరమైన యుద్ధాలు కొనసాగాయి.

## "హ్స్యుంగ్ నూ"తో యుద్ధం

ఈ యుద్ధాలలో ముఖ్యమైనవి మూడు. మొదటిది క్రీ. పూ. 127 వ సంవత్సరంలో జరిగింది. జనరల్ వీ చింగ్ సేనాధిపత్యంక్రింద హాన్ ప్రభుత్వసేనలు ఆర్డోస్ ప్రాంతాన్నుంచి హ్స్యుంగ్ నూ తెగను పారదోలాయి; చాల సంవత్సరాలుగా ఏర్పడిన ప్రమాదాన్నుంచి రాజధానిని విముక్తిచేశాయి. ఈ యుద్ధం ఫలితంగా హ్స్యుంగ్ తెగ బలహీనపడింది; పశుగ్రాసానికి ఉపయోగించే విస్తృత మైదానాలను కోల్పోయింది. రెండో యుద్ధం క్రీ. పూ. 121వ సంవత్సరంలో జరిగింది. అనేకవేల ఆశ్విక దళాలతో జనరల్ హూచూ-పింగ్ కాంసురాష్ట్రి పశ్చిమోత్తర భాగాన్నుంచి 'హ్స్యుంగ్-నూ' తెగను తరిమివేశాడు. దీనిఫలితంగా కాంసురాష్ట్రి సరిహద్దులోని పచ్చిక మైదాలను హ్స్యుంగ్-నూ కోల్పోయింది. మూడో యుద్ధంలో క్రీ. పూ. 119వ సంవత్సరంలో జరిగింది; దీనితో హ్స్యుంగ్-నూ తెగ దాడుల ప్రమాదం పూర్తిగా తొలగిపోయి, కొత్త సామ్రాజ్యం సుస్థిరమయింది. ఈసారి వీ చింగ్, హూచూపింగ్ సేనానుల నాయకత్వంక్రింద లక్ష ఆశ్వికబలాలు, అనేక లక్షల కాల్బలం రెండు దళాలుగా బయలుదేరి, మంగోలియా ఎడారి ఉత్తరానికి హ్స్యుంగ్-నూ తెగను తరిమికొట్టాయి. దీనిఫలితంగా ఆర్డోస్ ప్రాంతానికి పడమరగా వున్న భూములుకూడ హాన్ ప్రభుత్వం స్వాధీనమయ్యాయి.

## పడమర ప్రాంతాలతో సంబంధం

ప్రస్తుత సింకియాంగ్ రాష్ట్రం ఉత్తరాన ఉన్న ఇలీ నది లోయ ప్రాంతంలో ఓర్సీ తెగ ప్రజలు నివశించుతుండేవారు. సింకియాంగ్ రాష్ట్రంలోనే ఉత్తరాన టీన్‌షాన్ పర్వతాలకు దక్షిణాన కున్‌లూన్ పర్వతాలకు మధ్య ఒక లోయ, దాని మధ్య ఎడారి వున్నాయి. రెండు పర్వత పంక్తులకు అంచున వున్న సన్నని లోయ ప్రాంతాలలో అనేక డజన్ల చిన్న రాజ్యాలు వుండేవి. వాటిలో పెద్ద రాజ్యంలో కేవలం పదివేల జనాభా మాత్రం వుండేది. కున్‌లూన్ పర్వతాలకు పామీర్ పీఠ భూమికి పడమరగా తుఖారా, పార్థియా దేశాలుండేవి. టీన్‌షాన్ పర్వతాలకు, పామీర్ పీఠభూమికి పడమరగా పెర్‌ఘనా దేశం వుండేది.

ఈ దేశాలలో సహజ సంపద, ప్రకృతి వనరులు చాలా వున్నాయి; జనాభాలో రైతులు, దేశదిమ్మరులైన పశుపాలకులు కూడ [illegible] ర్ఘనా దేశం మేలుజాతి గుర్రాలకు ప్రసిద్ధిచెందినది. పార్థియా దేశ [illegible] తోనూ, పశ్చిమాసియాతోనూ వ్యాపారం చేస్తూండేవారు.

హ్స్యుంగ్ నూ తెగపై యుద్ధానికి ముందు ఊ టీ చక్రవర్తి తన శత్రువుకు వ్యతిరేకంగా తుఖారా ప్రభుత్వంతో ఒడంబడిక చేసికోవాలనుకున్నాడు. అదే లక్ష్యంతో క్రీ.పూ. 138వ సంవత్సరంలో హాన్ ప్రభుత్వం తన రాయబారిగా చాంగ్ చీన్‌ను తుఖారాకు పంపింది. కాంసు రాష్ట్ర సరిహద్దు దాటుతుండగా రాయబారిని పట్టుకొని హ్స్యుంగ్ నూ జైలులో బంధించింది. పది సంవత్సరాలు జైల్లో బందీగా వుండి, చివరకు తప్పించుకొని, చాంగ్ చీన్ తన గమ్యస్థానం చేరాడు. తుఖారాలో ఒక సంవత్సరం వుండి స్వదేశానికి తిరిగి వచ్చాడు.

బయలుదేరునపుడు వందమంది సహచరులతో వెళ్ళిన చాంగ్ చీన్ రాజధానికి తిరిగి వచ్చేటప్పటికి ఏకైక సహచరునితో చేరుకున్నాడు. తక్కినవారంతా ప్రయాణంలో చనిపోయారు. దోవలో వేటాడి ఆకలి తీర్చుకోవలసి వచ్చినందున రాయబార వర్గం కేవలం తమ శక్తిపైన, చాకచక్యంపైనే బ్రతుకుతెరువుకు ఆధారపడవలసి వచ్చింది.

చాంగ్ చీన్ రాయబారం విఫలమయింది. కాని అతడు పశ్చిమ రాజ్యాల పరిస్థితులను, వ్యవహారాలను అర్థంచేసికుని, చక్రవర్తికి వివరంగా నివేదించాడు. ఈ దూరప్రాంతాలతో వర్తకసంబంధాలను ఏర్పరచుకోడానికి, తన పలుకుబడిని విస్తరింపజేసుకోడానికి అటు రవాణాసౌకర్యాలు ఏర్పరచాలని ఊ-టీ చక్రవర్తి నిర్ణయించాడు.

కాంసురాష్ట్ర సరిహద్దునుండి హ్స్యుంగ్-నూ తెగను తరిమివేసి, తన సైన్యాలు ఆ భాగాన్ని స్వాధీనం చేసుకున్నాక చక్రవర్తి ఆశలు కార్యరూపం ధరించే అవకాశం ఏర్పడింది. క్రీ. పూ. 121 వ సంవత్సరంలో పశ్చిమ రాజ్యాలకు చాంగ్ చీన్ నాయకత్వాన మరల ఒక రాయబారవర్గాన్ని చక్రవర్తి పంపాడు. వీరు వేర్వేరు భాగాలుగా విడిపోయి, ఓర్సీ, ఫెర్ఘనా, తుఖారా, పార్థియా రాజ్యాలకు చేరుకున్నారు. ఈ దేశాలకు, హాన్ సామ్రాజ్యానికి మధ్య వర్తకం క్రమంగా పెరుగసాగింది ప్రతి సంవత్సరం కనీసం ఐదు వర్తకదళాలను పశ్చిమ రాజ్యాలకు హాన్ ప్రభుత్వం పంపుతుండేది. కొన్ని సందర్భాలలో ఒక్కొక్క సంవత్సరం వర్తకదళాలు పదిసార్లుకూడ వెళ్ళుతుండేవి. చక్రవర్తి పంపే ఈ రాయబారవర్గాలలో వందవరకు మనుష్యు లుండేవారు; కొన్నిసార్లు అనేక వందలుకూడ కలసి ప్రయాణం చేసేవారు. పట్టువస్త్రాలు, లోహపు సామాన్లు పశ్చిమరాజ్యాలకు తీసుకువెళ్ళి, గుర్రాలు, స్ఫటికం, ముత్యాలు వగైరా విలాస వస్తువులను పట్టుకొచ్చేవారు.

ఫెర్ఘ[illegible] ర్యే మేలుజాతి గుర్రాలమొదల చక్రవర్తికి విపరీత అభిమాన[illegible] లను యివ్వడానికి ఫెర్ఘనా రాజ్యం అంగీకరించ లేదు[illegible] న్యాన్ని ఫెర్ఘనాను శిక్షించడానికి పంపాడు.

ఈ దాడి సైన్యంలో సగభాగంనుంచి, మూడొంతులదాకా ఆకలి దప్పులతో, అలసటతో దారిలోనే చనిపోయారు ఐనా పర్వతాలను, ఎడారులను దాటి నాలుగువేల మైళ్లు ప్రయాణంచేసి, ఫెర్ఘనా రాజ్యాన్ని జయించారు. గుర్రాలను చక్రవర్తికి కానుకగా పంపారు.

హాన్ సామ్రాజ్యానికి పశ్చిమ ప్రాంతాలతో సంబంధాలు ఏర్పడటంవల్ల ఆసియాఖండంలోని వివిధ జాతుల ప్రజల మధ్య ఆర్థిక, వైజ్ఞానిక సంబంధా లేర్పడ్డానికి అవకాశం కలిగింది. ఈ కాలంలోనే పశ్చిమ ప్రాంతాలనుండి ద్రాక్షపళ్ళు' లవంగాలు వగైరా వస్తువులతోపాటు పశ్చిమ ప్రజల సంగీతం, నృత్యాలు కూడ చైనా దేశానికి పరిచయమయ్యాయి. నూతులను త్రవ్వడం, ఇనుము కరిగించి పోత పోయడం చైనానుండి పశ్చిమ ప్రాంతాల ప్రజలు నేర్చుకున్నారు.

11 వ అధ్యాయం

# లూలిన్, ఎర్రకనుబొమ్మలవారి తిరుగుబాట్లు

ఊ-టీ చక్రవర్తి పరిపాలననాటినుంచి రైతులు తమ భూములను కోల్పోవడం క్రమక్రమంగా ఎక్కువయింది. ఒక సంవత్సరం ఉత్తర చైనా మైదానాల్లోనే 20 లక్షలరైతులు తమభూములనుండి బేదఖలు చేయబడి దేశదిమ్మరులుగా తయారయ్యారు. వరదల సమయంలోనూ, వర్షాలు లేనపుడు వేలకొలది రైతులు కరువు కాటకాలతో చనిపోతే, తీసే దిక్కులేక శవాలు పొలాల్లో పడివుండేవి.

క్రీ. పూ. మొదటి శతాబ్దం చివర హోనాన్, జీచివాన్, షాంటుంగ్ రాష్ట్రాలలో రైతుల తిరుగుబాట్లు వచ్చాయి. రాష్ట్ర, జిల్లా కేంద్రాలపై దాడిచేసి ప్రభుత్వం భవనాలను తిరుగుబాటుదార్లు తగులపెట్టారు. తిరుగుబాటులను అణచివేసి నప్పటికీ ప్రభుత్వం చాలబలహీనపడి, వూగిసలాడే స్థితికివచ్చింది. తుపాను బ్రద్దలయ్యే చిహ్నాలు కన్పించుతున్నాయి. చిన్ వంశ పరిపాలనపై చెన్ షెంగ్ నడిపిన రైతాంగ విప్లవం లాంటిది రాబోతున్నదంటూ జనవాక్యం వ్యాప్తి చెందసాగింది. సంస్కరణ లను ప్రవేశపెట్టడం ద్వారా రాబోవు సంక్షోభాన్ని అరికట్టాలని పాలకవర్గంలో కొందరు ప్రతిపాదించసాగారు.

## వాంగ్ మాంగ్ స్వల్పకాల పరిపాలన

ఈ క్లిష్ట సమయంలో రాజప్రతినిధిగా వున్న వాంగ్ మాంగ్ అధికారాన్ని హస్తగతం చేసుకున్నాడు. క్రీస్తు తరువాత 8 సంవత్సరంలో హాన్ చక్రవర్తిని తొలగించి, తానే చక్రవర్తినని ప్రకటించుకున్నాడు. వాంగ్ మాంగ్ తన పరిపాలనకు హ్సిన్ కొత్త శకమని పేరు పెట్టుకున్నాడు.

యథాప్రకారంగా మార్పు ప్రారంభమయింది. కొత్త శాసనాలు ప్రకటించారు. భూమి అంతా చక్రవర్తిదేననీ. బానిస వ్యాపారాన్ని నిషేధించుతూను క్రొత్త ప్రభుత్వం శాసించింది. శరీరదారుఢ్యంగలవారు ఎనిమిదిమందికంటే తక్కువవున్న కుటుంబం 9 వందల మూల (150 ఎకరాల) కంటె ఎక్కువపంట భూమిని కలిగివుండరాదని ప్రభుత్వం ఆదేశించింది. అంతకుమించిన కమతాలున్నవారి

అదనపు భూమిని అదే తెగలోనివారికి లేదా పొరుగువారికి పంచాలిసి వుంటుంది. భూమిలేని కుటుంబాలు తమకు భూమిని ప్రసాదించమని ప్రభుత్వానికి విజ్ఞాపన చేయవచ్చు. ఈ సంస్కరణలద్వారా భూమి కేంద్రీకరణను అరికట్టవచ్చుననీ, వర్గ వైరుధ్యాలను తగ్గించవచ్చుననీ, నూతన ప్రభుత్వాన్ని బలపర్చుకోవచ్చుననీ వాంగ్ మాంగ్ ఆశించాడు. కాని పెద్ద భూస్వాములు, సామంత ప్రభువులు, ఉన్నతోద్యోగులు వ్యతిరేకించినందున, కొన్ని సంవత్సరాల అనంతరం ఈ శాసనాలను రద్దుచేసుకున్నాడు; కమతాల విస్తీర్ణం ఎప్పటివలె పెరిగి, భూమి కేంద్రీకరణ కొనసాగింది.

వాంగ్ మాంగ్ బానిసవ్యాపారాన్ని నిషేధించి నప్పటికీ, ప్రభుత్వ యాజమాన్యాన ఉన్న బానిస విధానాన్ని రద్దుచేయలేదు. రహస్యంగా నాణాల అచ్చువేసే నేరస్థుల కుటుంబసంతతినీ, వారికి ఇరుగుపొరుగున వున్న మరో ఐదుకుటుంబాలను శిక్షార్హులని శాసించాడు. ఈ విధంగా కొన్ని లక్షలమందిని ప్రభుత్వ బానిసలుగా తయారుచేశాడు.

ఉప్పు, ఇనుము, సారా ఉత్పత్తి ప్రభుత్వ యాజమాన్యం క్రింద జరగాలనీ, నాణాలను ముద్రించే గుత్తాధికారం ప్రభుత్వానికే వుండాలని వాంగ్ మాంగ్ శాసించాడు. ఐదు ప్రధాన నగరాలైన లోయాంగ్, వింట్సే, ఛెంగ్టూ, వాన్ (హోనాన్ రాష్ట్రంలోని ప్రస్తుత నాన్యాంగ్), హన్టాన్లలో ధరలను అదుపులో వుంచేందుకు, తక్కువ వడ్డీకి అప్పులిచ్చేందుకు ప్రభుత్వోద్యోగులను నియమించాడు. ఈ సంస్కరణలలో కొన్ని ప్రజలకు ఉపయోగపడేవే; కాని లంచగొండులైన ఉద్యోగులు ఈ సంస్కరణలను ప్రజలదగ్గరనుండి ధనం పిండడానికి మాత్రమే వినియోగించినందున ప్రజల జీవితం మరింత దుర్భరమయింది.

హ్స్యుంగ్ నూ తెగపైన, సరిహద్దు ప్రాంతాలలోన్న ఇతర తెగలపైన వాంగ్ మాంగ్ సాగించిన యుద్ధాలవల్ల డబ్బు విపరీతంగా ఖర్చయింది. ఈ భారమంతా పన్నుల రూపంలో ప్రజలపైనే పడింది. కొన్ని సందర్భాలలో ప్రభుత్వ పన్నుల రూపేణా ప్రజల ఆస్తిలో సగభాగాన్ని వసూలు చేసేది.

అందుచేత వాంగ్ మాంగ్ దేశంలో అమలు జరిపిన చర్యలకు, విదేశాంగ విధానానికికూడా వ్యతిరేకంగా తీవ్రమైన అసంతృప్తి చెలరేగింది. రైతుల తిరుగుబాట్లు మరల ప్రారంభమయ్యాయి.

వాంగ్ మాంగ్ పరిపాలన ఆఖరి సంవత్సరాలలో వర్షాభావంవల్ల, మిడుతలవల్ల హూపే రాష్ట్రం మధ్యభాగంలోనూ, షాంటుంగ్ రాష్ట్రంలోనూ పంటలు విపరీతంగా దెబ్బతిన్నాయి. కరువుకాటకాలు వ్యాపించిన ప్రాంతాలలో, అదివరకే అమానుష దోపిడికి గురౌతున్న రైతులు, ఇక సహించలేక తిరుగుబాటు చేశారు.

## లూవిన్ తిరుగుబాటు

క్రీస్తు శకం 17 సంవత్సరంలో మధ్యహూపేలో భీకరమైన కరువు వచ్చి, ఆకలితో ప్రజలు మరణించుతున్నారు. వాంగ్ కువాంగ్, వాంగ్ ఫెంగ్ అనేవారి నాయకత్వాన రైతులు లూవిన్ కొండల్లో పోగయి, లూవిన్ సైన్యాన్ని నిర్మించుకున్నారు. భూస్వాముల ఆస్తిపాస్తులపై దాడిచేసి, స్థానిక సేనలను ఓడించి, ఆహార ధాన్యాన్ని, ఆయుధాలను స్వాధీనం చేసుకోవడం ప్రారంభించారు. ఈ సైన్యం క్రమంగా బలపడసాగింది. ప్లేగు జాడ్యం వ్యాపించి చాలమంది మరణించినందున లూవిన్ కొండలను వదలి, ఈ సైన్యం హూపేరాష్ట్ర ఉత్తరభాగానికి వెళ్ళింది. అచట హాన్ రాజవంశానికి చెందిన 'లీయూ హ్సియూ' నాయకత్వాన 8 వేల సైన్యం మరొకటి తిరుగుబాటుదారులతో కలసింది. 'లీయూ హ్సియూ' స్వయంగా భూస్వామి ఐనప్పటికీ, రైతు సైన్యాన్ని ఉపయోగించుకుని ప్రభుత్వాధికారాన్ని పట్టుకోవాలనే వుద్దేశ్యంతో చేరాడు. క్రీ. శ. 23 సంవత్సరంలో రాజవంశీకుడైన 'లియూహ్సివాన్' అనేవానిని హాన్ చక్రవర్తిగా ప్రకటించి, రాజధానియైన చాంగన్ నగరంపైకి లూవిన్ సైన్యం దాడి వెడలింది. కున్యాంగ్ వద్ద జరిగిన యుద్ధంలో కొన్ని లక్షలమంది వాంగ్ మాంగ్ సేనలను చెల్లాచెదురు చేసి, రాజధాని నగరం ముఖద్వారందాకా 'రుకున్నారు. నగరంలోని ప్రజలు తిరుగుబాటు చేసి, వాంగ్ మాంగ్‌ను చంపారు. స్వల్పకాలం రాజ్యాధికారం చలాయించిన హ్సిన్ వంశ పరిపాలన ఈ విధంగా ఆఖరయింది. నగరద్వారాలు తెరచి, విజయధ్వానాలతో వస్తున్న లూవిన్ సైన్యాన్ని ప్రజలు ఆహ్వానించారు

లూవిన్ సైన్యంలో ఐకమత్యం లేదు. భూస్వామ్యవర్గాన్నుంచి వచ్చిన సేనానులు రైతులనుండి వచ్చిన సేనానులను బహిష్కరించాలని ప్రయత్నించసాగారు. ఈ తగాదాలవల్ల ఉభయుల మధ్య ఘర్షణలు ప్రారంభమయ్యాయి.

## ఎర్ర కనుబొమలవారి తిరుగుబాటు

షాంటుంగ్ రాష్ట్రంలో ఫాన్ ఛుగ్ నాయకత్వాన రైతులు తిరుగుబాటు చేశారు. వీరు సమీకరించిన సైన్యం పేదరైతుల సాంప్రదాయమైన ముక్తసరి అలవాట్లను అనుసరించేది. ఆజ్ఞలన్నీ మూజువాణిగా వుండేవి. ఖచ్చితమైన శిక్షణ వుండేది; ఖూనీ చేసినవారికి మరణశిక్షని, దెబ్బకు దెబ్బ శిక్షని వారంతా తమలోతాము అంగీకారానికి వచ్చారు. గుర్తుకోసం వీరంతా తమ కనుబొమలకు ఎర్ర రంగు వేసుకునేవారు. అందుచేత ఎర్ర కనుబొమల సైన్యమని ఈ తిరుగుబాటుదార్లు పిలువబడేవారు. షాంటుంగ్ రాష్ట్రంలోని కొన్ని లక్షల వాంగ్ మాంగ్ సైన్యాలను ధ్వంసంచేసి, ఎర్ర కనుబొమల సైన్యం హోనాన్ రాష్ట్ర హృదయంలోకి చొచ్చుకుని వచ్చింది. అదే సమయానికి రాజధానీ నగరం చాంగన్ లూవిన్ సైన్యం వశమయింది. యుద్ధమంటే

విసుకెత్తి, తమ ఇండ్లకొచ్చి, తమ పొలాలకు తిరిగి పోవాలని ఆందోళన చేస్తున్న రైతులను, సేనాని ఫాన్‌చెంగ్ తమ దిగ్విజయాన్ని పడమర దిశగా కొనసాగించాలని ప్రోత్సహించి ఒప్పించాడు. రాజవంశానికి చెందిన "లియుపెంట్సే" మరొకనిని చక్రవర్తిగా ప్రకటించారు. లూవిన్ సైన్యంలోని రైతు సేనానులు ఆ సమయంలో భూస్వామ్యవర్గ సేనానులతో పోరాడుతున్నారు. రైతు సేనానుల ఆహ్వానంపై ఫాన్‌చెంగ్ తన సైన్యంతో చాంగన్ నగరంలో ప్రవేశించాడు. కాని ఉభయుల సేనానులను భూస్వాముల సైన్యాలు చుట్టిముట్టి, దిగ్బంధనంచేసి ఆకలితో మాడ్చాలని ప్రయత్నించాయి. చివరకు ఫాన్‌చుంగ్ ఎర్రకనుబొమల సైన్యంతో ఛాంగన్ నగరంనుంచి బయటపడి, పశ్చిమ హొనాన్‌లో లియూహ్సియూ సైన్యాల చేతుల్లో ఓడిపోయాడు.

క్రీస్తుశకం 25 వ సంవత్సరంలో లియూహ్సియూ తానే చక్రవర్తినని ప్రకటించుకున్నాడు. లోయాంగ్ నగరాన్ని రాజధానిగా చేసుకున్నాడు. ఈయన్నే చరిత్రకారులు తూర్పుహాన్ వంశానికి చెందిన "కువాంగ్ వూ" చక్రవర్తని పిలుస్తారు. అంతకుముందున్న ప్రభుత్వ పతనానికి కారణమైన రైతాంగ తిరుగుబాటు సేనలను అణచివేసి, రైతుల రక్తాన్ని ప్రవహింపజేసి, దేశాన్ని ఐక్యపరచడానికి పూనుకున్నాడు. లియూహ్సియూ పరిపాలనతో ప్రారంభమైన దశను తూర్పుహాన్ శకమని పిలుస్తుంటారు.

12 వ అధ్యాయం

# తూర్పు హాన్, దాని పొరుగురాజ్యాలు

## హ్స్యుంగ్ నూ

వాంగ్ మాంగ్ పరిపాలన అంతమైన తరువాత, తూర్పు హాన్ పరిపాలనకు ముందు కాలంలో చైనా పశ్చిమ ప్రాంతాలతో సంబంధాలను పూర్తిగా కోల్పోయింది. హ్స్యుంగ్ నూ తెగ తిరిగి ఆ ప్రాంతాలను ఆక్రమించి, చాల రాజ్యాలను జయించింది. హ్స్యుంగు నూ దాసులను ఎదిరించడంలో తమకు సాయపడవలసిందిగా పశ్చిమ రాజ్యాలు తూర్పు హాన్ పరిపాలకులను అర్థించాయి. కాని బలహీనుడైన చక్రవర్తి వారి మొరలను తృణీకరించాడు. మొదటి శతాబ్దం మధ్యలో వర్షాభావం, మిడతల దండువల్ల పంటలు పాడైనందున హ్స్యుంగ్ నూ తెగ చాల చాల నష్టపడింది; కరువు కాటకాలవల్ల జనాభాకు, పశుసంపదకు తీవ్రప్రమాదం వాటిల్లింది. దీనికితోడు చాన్యూ (నాయకత్వ) పదవి కొరకు ప్రభువులమధ్య తగవు వచ్చిన ఫలితంగా మరింత బలహీనపడింది. ఈ తగాదా విస్తరించి, అంతర్యుద్ధ స్వరూపం ధరించింది. చివరకు ఈ రాజ్యం ఉత్తర, దక్షిణప్రాంతాలుగా విడిపోయి, దక్షిణ హ్స్యుంగ్ నూ పోటీ "చాన్యూ"ను ఎన్నుకుంది. ఇంకా బలహీనంగావున్న దక్షిణ హ్స్యుంగ్ నూ తమ విధేయతను హాన్ ప్రభుత్వానికి తెలియజేసి, షెన్సీ, షాన్సీ రాష్ట్రాల ఉత్తరప్రాంతాలలోనికి కదలివచ్చారు.

కొత్తగా పరిపాలనకు వచ్చిన వంశాలు అనుసరించే సాంప్రదాయాల ప్రకారం లియూహ్స్యూ చక్రవర్తి తన పరిపాలనను ప్రజలకు కొన్ని సౌకర్యాలను కలిగించడంతో ప్రారంభించాడు. బానిసలను విముక్తి చేశాడు; నీటి వనరులను సద్వినియోగంచేసే నిర్మాణాలను కట్టించాడు; పాతవాటిని బాగుచేయించాడు. వెట్టి పనిని తగ్గించాడు. ఈ విధంగా నలభై సంవత్సరాలకుపైగా ప్రజలమీద ఉదార వైఖరి అనుసరించడం ఫలితంగా తూర్పుహాన్ ప్రభుత్వం తిరిగి బలపడింది. ఉ హ్స్యుంగ్ నూ పైచర్యలు తీసికుంది. క్రీస్తు అనంతరం 73 సంవత్సరంలో రాజ్య పశ్చిమోత్తరసరిహద్దున జరిగిన యుద్ధంలో హ్స్యుంగ్ నూ ఓడిపో పశ్చిమరాజ్యాల తూర్[illegible]మైన ఈవులూ (ప్రస్తుత హామీ) ప్రాం

నాడింది. 89, 91 సంవత్సరాలలో జరిగిన మరో రెండు యుద్ధాలలో కూడ గెలిచి, తూర్పుహాన్ తన సార్వభౌమాధికారాన్ని స్థిరపరచుకుంది. తరువాత ఉత్తర హ్సియుంగ్ నూ మరింత పశ్చిమోత్తరంగా కదలిపోయింది. నాలుగో శతాబ్దంలో ఈ తెగ తన దృష్టిని మరింత పశ్చిమంగా మరల్చి, యూరపువైపు వెళ్ళింది.

## పాన్ చౌ - పశ్చిమ రాజ్యాలు

రెండు శతాబ్దాలకు పూర్వం 'చాంగ్ చీన్' ప్రారంభించిన పనిని పూర్తిచేయడానికి క్రీస్తుశకం 73 వ సంవత్సరంలో ప్రాచీన చైనా గొప్ప రాజకీయవేత్తలలో ఒకడైన పాన్ చౌ పశ్చిమ రాజ్యాలకు పంపబడ్డాడు. అతని రాయబారవర్గంలో ఒక సహాధ్యాయి, 36 సివిలియన్ వుద్యోగులు మాత్రమే వున్నప్పటికీ, సైనిక రక్షణ లేకపోయినప్పటికీ పాన్ చౌ చెప్పుకోతగిన విజయాలను సాధించాడు. అతడు ముందుగా లాప్ - నార్ రాజ్యం వెళ్ళి, అచట వున్న హ్సియుంగ్ నూ రాయబారిని ఖూనీ చేయించాడు. లాప్‌నార్ రాజ్యానికి, హాన్ సామ్రాజ్యానికి మధ్య రాజకీయ సంబంధాలను పునరుద్ధరించాడు. అతడు ఖోటాన్ రాజ్యంలో వుండగా అచట సర్వాధికారాలు చెలాయించుతున్న హ్సియుంగ్ నూ రాయబారిని ఖోటాన్ రాజు చంపించాడు. పాన్ చౌ నాయకత్వాన ఖోటాన్ సైన్యం కాష్‌గర్ రాజ్యంపై దాడి చేసింది. అచట 'కు చౌ' తెగచే ప్రతిష్టించబడిన రాజును పారదోలి, ఆ స్థానంలో కాష్‌గర్ రాజును సింహాసనాధీశుణ్ణి చేసి ప్రజల హర్షామోదాలను పొందింది.

హ్సియుంగ్ నూపై హాన్ విజయాల అనంతరం పాన్ చౌ తన కార్యక్రమాన్ని తీవ్రతరం చేశాడు. పశ్చిమ రాజ్యాల ప్రయోజనాలను దృష్టిలో వుంచుకుని ప్రవర్తించడంవలన, హ్సియుంగ్ నూ బంధనాలను బద్దలుగొట్టడంలో వారికి తోడ్పడటంవలన పాన్ చౌ వారి విశ్వాసాన్ని సంపాదించగలిగాడు. అతడి విజయానికి కీలకం అందులోనే వుంది. ఈ విధంగా ముప్పదియేళ్ళ కృషి ఫలితంగా యాభై పశ్చిమ రాజ్యాలతో తూర్పు హాన్ ప్రభుత్వానికి సన్నిహిత సంబంధాలను పాన్ చౌ ఏర్పరచగలిగాడు. ఇవిగాక పశ్చిమాసియాలోని రెండు రాజ్యాలు టియోచిహో, పార్థియాలతో కూడా తూర్పు హాన్ ప్రభుత్వంతో సంబంధాలు ఏర్పడ్డాయి.

## చియాంగ్ తెగతోనూ, దక్షిణ తెగలతోనూ సంబంధాలు

కంసూ, చింఘాయ్ రాష్ట్రాల పీఠభూములలో చియాంగ్ అనే పేరుగల సంచారులు నివసించుతుండేవారు. యుద్ధంలో నిపుణులైన ఆ ప్రజలు యుద్ధంలో శౌర్యాన్ని గౌరవంగా యెంచేవారు. పశ్చిమ హాన్‌వంశ పరిపాలన రోజుల్లో హాన్ చియాంగ్ ప్రజలు ఒండొరుల ప్రాంతాలలోకి విస్తరించుటవలను, ఈ

రెండు తెగల ప్రజలు చింఘాయ్, కంసూ, షెన్సీ రాష్ట్రాల కొన్ని జిల్లాలలో ఇరుగు పొరుగున స్థిరపడిపోయారు.

ఐతే హాన్ ఉద్యోగులు, భూస్వాములు అనుసరించిన నిర్బంధ విధానం వలన వారిపై చియాంగ్ ప్రజలలో తీవ్రమైన విద్వేషం ప్రబలింది. క్రీస్తుశకం 107 సంవత్సరంలో ఈ పరిస్థితి క్లిష్టరూపం దాల్చింది. పశ్చిమ ప్రాంతాలలో తూర్పు హాన్ ప్రభుత్వం తరఫున యుద్ధం చేయడానికి నిర్బంధంగా సమీకరించబడిన చియాంగ్ సైనికులు పోరాడ నిరాకరించి పారిపోయినపుడు, హాన్ ఉద్యోగులు వారి యిళ్ళను తగులబెట్టించి ధ్వంసం చేశారు. చియాంగ్ ప్రజలు వెదురు బల్లేలు, డాలులు వగైరా ఆయుధాలతో తిరుగుబాటుచేసి, హాన్ వుద్యోగులను, భూస్వాములను చంపివేశారు. ప్రభుత్వం అచట నివసించుతున్న హాన్ ప్రజలను చియాంగ్ ప్రాంతాలను ఖాళీ చేయమని ఆజ్ఞాపించింది. ఇతర ప్రాంతాలకు తరలిపోతే తమకు జీవనోపాధి వుండదనే భయంతో హాన్ ప్రజలు ప్రభుత్వాజ్ఞలను తిరస్కరించారు. అందుకు శిక్షగా ప్రభుత్వోద్యోగులు హాన్ ప్రజల ఇళ్ళను, నిల్వ ధాన్యాన్ని తగులబెట్టించారు. దాని ఫలితంగా హాన్ ప్రజలు కూడా రెచ్చిపోయి, ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరుగుతున్న తిరుగుబాటులో చేరారు.

ఒక తిరుగుబాటు తరువాత మరొక తిరుగుబాటు చేస్తూ, చియాంగ్ తెగ ప్రజలు అరవై సంవత్సరాలకు పైగా తమనుపీడించుతున్న హాన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడారు. ఈ తిరుగుబాట్లు అణచివేయబడినప్పటికీ, తూర్పు హాన్ ప్రభుత్వం ఎంతో ధనాన్ని, మనుష్యబలాన్ని నష్టపోయింది. దీర్ఘ యుద్ధ ఫలితంగా ప్రభుత్వ ధాన్యాగారం, కోశాగారం ఖాళీ అయాయి. పాలకవర్గం చాల బలహీనపడింది. సామాన్య ప్రజలను దోచుకోవడం, పీడించడం ఎక్కువయింది.

ఆ రోజుల్లో హునాన్, జీచివాన్, యున్నాన్, క్వీచౌ రాష్ట్రాలలో పశుపాలకులైన తెగలు, వ్యవసాయ తెగలు చాల నివసించుతుండేవి. పశ్చిమ హునాన్, క్వీచౌలో నివసించే 'యావ్' ప్రజలపై పన్నులభారం ఎక్కువైనందున, తూర్పు హాన్ ప్రభుత్వంపై నిరంతరం తిరుగుబాటు చేస్తుండేవారు. మూడేళ్ళలో రెండుసార్లు యావ్ ప్రజలు హాన్ సైన్యాలను చావమోదారు. ఐనప్పటికీ యున్నాన్‌లోని నూనదీ, లాన్‌టాంగ్ నదీ లోయల్లోనికి హాన్ ప్రభుత్వం తన రాజ్యాన్ని విస్తరించుకోగలిగింది.

టి యన్ చీహ్ ప్రాంతంలో నివసించుతున్న టి యన్ తెగ ప్రజలు చెరువులు నిర్మించి, భూమిని సాగుచేసేవారు. నూ నదికి లాన్‌ట్సాంగ్ నదికి మధ్య ప్రాంతంలో నివసించే ఐలావ్ ప్రజలు సిల్కువలె వుండే సన్నని వస్త్రాలను గోగునారతో తయారు చేసేవారు. రాగి, ఇనుము, సీసం, తగరం, స్ఫటికం వగైరా లోహాలను వుత్పత్తి చేసేవారు. ఇచటకూడ ఫిర్కా, తాలూకా పరిపాలనను ఏర్పరచి, హాన్ ప్రభుత్వం ఆ ప్రజలతో సంబంధాలు పెట్టుకుంది.

13 వ అధ్యాయం

# తూర్పు హాన్ పరిపాలన అంతం.
# పాలకవర్గంలో తగాదాలు

మొదటి ముగ్గురిని మినహాయించితే తక్కిన తూర్పు హాన్ చక్రవర్తులందరూ మైనర్లుగా వున్నప్పుడే సింహాసనం ఎక్కారు. చక్రవర్తి తరఫు బంధువులు రాజ ప్రతినిధులుగా (రీజెంట్లు) అధికారాన్ని హస్తగతం చేసుకునేవారు. వారి చేతుల్లో నుంచి అధికారం తిరిగి లాక్కోవడానికి చక్రవర్తులు ఖోజ్జాల సాయంతీసుకునేవారు తత్ఫలితంగా తరచుగా పెత్తనం ఖోజ్జాల చేతుల్లో పోయేది.

రీజెంట్లు, ఖోజ్జాలు విపరీతంగా ప్రజలను పీడించుకుతినేవారు. భూములను, ఇళ్ళను కాజేసేవారు. ఉదాహరణకు లియాంగ్ చీ అనే రీజెంటు అనేక వేలమందిని బానిసలుగా చేసుకొని, వారంతా తమంత తామే అమ్ముడుపోయారని సాకులు చెప్పేవాడు. పశ్చిమ హాన్ రాష్ట్రంలో వెయ్యి 'లీ'ల చుట్టుకొలత గల భూఖండాన్ని స్వాధీనం చేసుకుని, విలాసంగా వేటాడేందుకు అందులో జంతువులను, పక్షులను పెంచేవాడు. తరువాత అతడి ఆస్తిని లాక్కున్నప్పుడు దాని విలువ 300 కోట్ల నాణాలనీ, అనగా దేశమంతటి నుండి వసూలయే సంవత్సర పన్నులలో సగం వుంటుందని తేలింది. హసాలాన్ అనే ఒక ముఖ్య ఖోజ్జా తన పలుకుబడిని వినియోగించుకుని 11,800 'మూ'ల సాగుభూమిని, 381 ఇళ్ళను ఒక ఫిర్కాలోనే సంపాదించాడు.

రీజెంట్ల కుటుంబ సభ్యులు, బంధువులు, ఖోజ్జాలు దేశమంతటా ఉద్యోగులుగా నియమించబడి, ప్రజలను నిర్దాక్షిణ్యంగా దోచుకునేవారు. ఉదాహరణకు హసాలాన్ తమ్ముడు జీచువాన్‌లో ఉద్యోగిగావుంటూ బంగారం, వెండి, నగదు, సిల్కు వగైరాలు విపరీతంగా దోచుకున్నాడు. వాటిని మోసుకుపోవడానికి 300 బళ్లు అవసరమయ్యాయి. న్యాయమైన పన్నులకంటే పదిరెట్లవరకు అక్రమ పన్నులు వసూలుచేసేవారు; చెల్లించలేకపోతే తీవ్రంగా బాదేవారు, కొన్నిసార్లు చచ్చేవరకూ హింసించేవారు.

ఈ భారాన్నంతా రైతులే మోయవలసివచ్చేది. భూస్వాములనుంచి విపరీతమైన అధిక వడ్డీలకు తెచ్చిన అప్పులను తీర్చలేక భూములను ఋణదాతలకు అమ్మి, రైతులు వారిక్రింద కౌలుదార్లుగా తయారయ్యేవారు. అనుమతిలేకుండా పొలం వదలి వెళ్ళడం నిషేదించబడినందున పేలకొలదీ కౌలుదార్లు పెద్దభూస్వాముల పొలాలలో నిర్బంధ చాకిరీ చేయవలసివచ్చేది.

పెద్ద జమీందారులకు స్వంత సాయుధ సైన్యాలుండేవి. వారి పొలాలచుట్టూ శీతా కాలం, వసంత కాలంలో కూడ రక్షకభటులు కాపలా వుండి, కరువుతో బాధ పడుతూ అన్నార్తులై వున్న రైతులు ధాన్యాన్ని తీసుకుపోకుండా కాపాడేవారు. జమీందారులకు తమ కమతాలను గురించి, వాటిలో చాకిరి చేసే పాలేళ్ళను గురించి తప్పుడు లెక్కలిచ్చి, ప్రభుత్వ పన్నులను చెల్లించకుండా తప్పించుకునేవారు. ప్రభు త్వోద్యోగుల పరిశీలనను తిరస్కరించేందుకు సైతం సిద్ధపడేవారు.

ప్రభుత్వ పన్నుల భారం, పెద్ద జమీందారుల దోపిడి ఫలితంగా రైతాంగం నానాటికి మరింత దరిద్రకూపంలో దిగబడిపోయేవారు. తిండికొరకు వెతుక్కుంటూ దేశమంతటా తిరిగే మూఠాల సంఖ్య నానాటికీ పెరుగసాగింది. రెండవ శతాబ్దంనుంచి వరుసగా అనేక రైతు తిరుగుబాట్లు వచ్చాయి. కాని అవన్నీ ఒక్కొక్కటిగా అణచి వేయబడ్డాయి.

## పసుపురంగు తలపాగాలవారి తిరుగుబాటు

క్రీస్తు శకం 184 వ సంవత్సరంలో ప్రభుత్వం అత్యంత తీవ్రమైన ప్రమాదాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. పసుపు తలపాగాల రైతు సైన్యాలు పెద్దయెత్తున తిరుగు బాటు చేశారు. అది ప్రభుత్వ పునాదులను కదల్చివేసింది.

పసుపు తలపాగాల సైన్యం నాయకుడైన చాంగ్ చియోవ్ హోపే రాష్ట్రం లోని మూలూ తాలూకా నివాసి. "తైపింగ్ టావ్" అనే మతశాఖ ప్రవర్తకుడుగా ఇతడు తన సిద్ధాంతాలను ప్రచారం చేసుకుంటూ, రోగాలను నయంచేస్తూ, రైతులను సంఘటితం పరచాడు. పది సంవత్సరాల కృషి అనంతరం అతడూ, అతని అనుచరులూ ఎల్లోనదీ, యాంగ్‌ట్సీ నదుల మధ్యప్రాంతంలో కొన్ని లక్షలమంది ప్రజలని బలంగా సంఘటితం పరచారు. దీనిని మొత్తం 36 ఫాంగ్‌లుగా విభజించారు. పెద్ద ఫాంగ్‌లో (శాఖలో) పదివేలమంది సభ్యులుండేవారు; చిన్న ఫాంగ్‌లో 6 లేక 7 వేల సభ్యులుండే వారు. ప్రతిఫాంగ్ ఒక నాయకుని సేనాధిపత్యం క్రింద వుండేది.

చాంగ్ చియోవ్, అతని అనుచరులు 184 వ సంవత్సరం మార్చి 5 వ తేదీన అన్ని ప్రాంతాలలోని రైతులు తిరుగుబాటుచేయాలని నిర్ణయించారు. సమయం దగ్గరకు వచ్చేకొలదీ అనుచరులు తమ కార్యకలాపాలను తీవ్రతరం చేశారు. కాని నిర్ణీతదినం రాకముందే టాంగ్ చౌ అనేవాడు ద్రోహం చేశాడు. తిరుగుబాటు తేదీని, నాయకుల పేర్లను, వారి చిరునామాలను రహస్యంగా ప్రభుత్వానికి తెలియజేశాడు.

రాజధానిలో తిరుగుబాటుదారుల నాయకుడొకరు, వేయిమంది అనుచరులు అరెస్టు చేయబడి, ఖూనీ అయ్యారు. చాంగ్ చియోవ్, ఇతర ముఖ్యులు తప్పించుకు పారిపోయారు.

వెంటనే చాంగ్ చియోవ్ తన ఎత్తుగడలను మార్చుకున్నాడు. వార్తాహరుల ద్వారా స్థానిక సేనానులకు కబుర్లు అందజేశాడు; ఎంతో కాలంనుండి యెదురు చూస్తున్న తిరుగుబాటు ఫిబ్రవరి నెలలోనే ప్రారంభమయింది. ఒక పక్షం రోజుల్లోనే చాంగ్ సైన్యం ఎల్లోనదీ, యాంగ్‌ట్సీ నదీ ప్రాంతాలను స్వాధీనం చేసుకుంది. తిరుగుబాటుదారులంతా పసుపురంగు తలపాగాలను ధరించినందున ఈ సైన్యానికి అదే పేరు వచ్చింది. ప్రతిచోటా నగరాలను పట్టుకొని, ప్రభుత్వాఫీసులను తగులబెట్టి, బందిఖానాలనుండి ఖైదీలను విడుదలచేసేవారు. ప్రభుత్వాధికారులను చంపడమో లేక ప్రాణాలను కాపాడుకునేందుకు పారిపోవడమో చేసేవారు.

ఈ సైన్యంలో ప్రధాన భాగం 'చాంగ్ చియోవ్' సేనాధిపత్యం క్రిందవుండి ఎల్లోనది ఉత్తరపు గట్టును కాపాడుతూండేది. రాజధాని లోయాంగ్ నగరంపైకి శక్తివంతమైన తిరుగుబాటు సేనలు దాడిచేసి, ధైర్యంగా పోరాడాయి; రక్షణ సేనలపై తీవ్రమైన దెబ్బలు తీశాయి. రైతుసైన్యం తాకిడికి గాభరాపడి, ప్రభుత్వం తను చురుకైన సేనలను చాంగ్ చియోవ్‌పైకి పంపింది. జమీందారుల సాయుధ సేనలు ఇతర తిరుగుబాటుదార్లతో తలపడ్డాయి.

ఆగస్టు నెలలో వ్యాధివల్ల చాంగ్ చియోవ్ మరణించాడు. నవంబరు నెలలో పసుపు తల పాగాల సైన్యం ప్రధాన భాగం దెబ్బతినిపోయింది. ఐనప్పటికీ తిరుగుబాటుదార్ల ప్రతిఘటన యింకా బలంగానే వుంది; ఇతర సైన్యాలు పోరాటాన్ని కొనసాగించాయి. హోపే రాష్ట్రంలో తిరుగుబాటుదార్ల సైన్యం పది లక్షల బలగాన్ని సమీకరించింది. కాని, తిరుగుబాటుదార్లకు ఐక్య నాయకత్వం కొరవడింది; మరో ఇరువది సంవత్సరాలపాటు ధైర్యంగా పోరాడిన తరువాత తిరుగుబాటుదార్ల దళాలు పెద్ద జమీందార్ల, ప్రభుత్వ సైన్యాలచేత అణచివేయబడ్డాయి.

పసుపు తలపాగాల తిరుగుబాటు ఓడిపోయినప్పటికీ తూర్పు హాన్ పరిపాలన థిలమవడానికి కారణభూతమయింది.

14 వ అధ్యాయం

# పశ్చిమ, తూర్పు హాన్ వంశాల పరిపాలన కాలంలో సంస్కృతి

రెండు హాన్ వంశాల పరిపాలన కాలంలోనూ దేశమంతా ఒకటిగా వుండటం' సుభిక్షంగా వుండటంవలన చైనా సాంస్కృతికంగా గొప్ప అభ్యుదయాన్ని సాధించింది.

క్రీస్తుపూర్వం 100వ సంవత్సరం నాటికే రాజభవనంలోని పుస్తక భాండారంలో దేశమంతటినుండి సేకరించిన 13 వేల గ్రంథాలుండేవి. రాజధానీ నగరంలో ప్రభుత్వం నడిపే వివిధ కళాశాలల్లో 30 వేల మంది విద్యార్థు లుండేవారు. రాష్ట్రాలలోకూడ ప్రభుత్వ పాఠశాలలుండేవి. ఇవిగాక ఉపాధ్యాయులు స్వయంగా నడిపే విద్యాలయాల్లో - ప్రఖ్యాతి వహించిన వాటిలో వందల, కొన్నిటిలో వేలమంది-విద్యార్థులు చదువుకునేవారు.

సుప్రసిద్ధ చరిత్రకారుడైన షుమా చీన్ ఈ కాలంవాడే. "ఊటి" చక్రవర్తి వద్ద చరిత్రకారుడుగా వున్నందున రాజభవనంలోని పుస్తకభాండాగారాన్ని వినియోగించుకునే అవకాశం అతనికి వుండేది. అచట చాలగంటలు అధ్యయనంచేసి, చారిత్రక విషయాలను సేకరించేవాడు. దానితోపాటు షుమా చీన్ దేశమంతా సంచారంచేసి తాను చూసిన, విన్న విషయాలను వ్రాసేవాడు. ఈ విధంగా ప[...] సంవత్సరాలు కృషిచేసి ఆయన "చారిత్రక సంస్మరణలు" అనే గ్రంథాన్ని రచించాడు.

ఈ గ్రంథంలో 5 లక్షల మాటలకు మించివున్నాయి. ప్రాచీనకాలంలోని హువాంగ్ టీ గాథలు మొదలు రచయిత కాలంవరకు అనగా సుమారు రెండువేల సంవత్సరాల చరిత్ర దీనిలో వుంది. ప్రస్తుత చరిత్రకారులందరి పరిశోధనకు ఆధారంగా' యిప్పటికీ ఈ చారిత్రిక గ్రంథం వినియోగపడుతోంది. షుమా చీన్ యీ గ్రంథంలో పాలకవర్గాల క్రూరత్వాన్ని బట్టబయలు చేశాడు. వారి దుబారాను, దురాశను, ప్రజాపీడనను వివరించాడు. చిన్ వంశకాలంలో రైతు

నాయకుడైన చెన్ షెంగ్‌ను అత్యంత గౌరవంతో రచయిత చిత్రించాడు. హాంగ్ వంశానికి చెందిన టాంగ్ రాజు, చౌ వంశానికి చెందిన ఊ రాజులకు చరిత్రలో ఏ స్థానం వుందో అందుకు ఏమాత్రం తీసిపోని స్థానం రైతునాయకునికి వుందని షుమా చీన్ భావించాడు.

"చారిత్రక సంస్మరణలు" సాహిత్యం దృష్ట్యా కూడ మహత్తరమైన గ్రంథం. చారిత్రక పాత్రలను, ఘటనలను వివరంగా చిత్రించడంలో గ్రంథకర్తకు ఎంతో నైపుణ్యం వుంది.

షుమా చీన్ కృషిని ప్రఖ్యాతి చెందిన పాన్ కుటుంబం కొనసాగించింది. తండ్రియైన పాన్ పియావ్, కొడుకు పాన్ కూ, కుమార్తె పాన్‌చావ్ గ్రంథరచన సాగించి సరిసమానమైన ఖ్యాతిని సంపాదించారు. హాన్ వంశ ఆరంభ చరిత్రను తెలిపే-చీయెన్ హాన్ షూ - గ్రంథాన్ని పాన్ కూ రచించాడు. ఈ గ్రంథాన్ని ఆయన సోదరి పాన్ చావ్ పూర్తిచేసి, చైనా చరిత్రలోకల్లా గొప్ప మహిళా రచయితగా ప్రఖ్యాతి వహించింది.

తూర్పు హాన్‌వంశ పరిపాలన ప్రారంభ కాలంలో నివసించిన వాంగ్‌చుంగ్ గొప్ప తత్వవేత్తగా పేరు పొందాడు. యవ్వనంలోనే స్వరాష్ట్రమైన చెకియాంగ్‌ను ఇతడు వదలివేశాడు. రాజధానీ నగరం లోయాంగ్‌లోని ప్రభుత్వ కళాశాలలో అధ్యయనం చేయాలని వెళ్ళాడు. పుస్తకాలు కొనలేనంత బీదవాడుగా వున్నందున పుస్తకాల విక్రయశాలల్లో వుండి చదువుకున్నాడు. ఈ విధంగా ఎంతో విస్తృతమైన విజ్ఞానాన్ని - భౌతిక శాస్త్రంలోకూడ - సంపాదించాడు. వాస్తవిక జీవితంలోని ఉదాహరణలను చూపించి, ప్రజలలోని మూఢ విశ్వాసాలను తొలగించడానికి అతడు ప్రయత్నించాడు. మానవుడు రక్తమాంసాలతో నిర్మించబడినందున, మరణానంతరం శిథిలమై నశించిపోతాడనీ, జీవం పోయాక చైతన్యం వుండటం సాధ్యం కాదనీ, మానవుడు భూతరూపం దాల్చలేడనీ ఆయన వాదించాడు ఆహారం తిన్నపుడే మానవునికి శక్తివుంటున్నందున, మరణానంతరం ఆహారం తీసికోలేనందున ఎలాంటి ప్రమాదం చేయజాలడని ఆయన నిరూపించాడు. సూర్య చంద్ర గ్రహాలు దేవుళ్ళ లీలలు కావనీ, నియమం ప్రకారం నిర్దిష్ట సమయంలో సంభవించే ప్రకృతిసిద్ధమైన సంఘటనలనీ, ఎపుడు జరుగుతవో ముందుగానే గుణించి తెలిసికోవచ్చుననీ నిరూపించాడు. పిడుగు ఒకరమైన అగ్నివంటిదనీ, అది సోకితే మనిషి మాడి చనిపోతాడనీ, అంతేగాని పాపాత్ములను శిక్షించడానికి భగవంతుని కొరడా కాదనీ ఆయన వాదించాడు.

వాంగ్‌చుంగ్ భావాలన్నిటినీ లున్‌హెంగ్ "సమదృష్టితో చేసిన సమీక్షలు" అనే గ్రంథం వ్రాశాడు. కాని ఈ భావాలు పాలకవర్గానికి రుచించనందున అతని గ్రంథ ప్రచురణను చాలకాలంవరకు ఆపుజేశారు.

## సాహిత్యం - సైన్సు

పశ్చిమ హాన్ వంశ చక్రవర్తి "ఊటీ" పరిపాలనా కాలంలో జానపద గేయాలను సేకరించడానికి ప్రత్యేకంగా సంగీతశాఖ నొకదానిని ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఆ రోజుల్లో జనసామాన్యం సాహిత్యసృష్టి, కవుల రచన జానపదగేయాల రూపంలోనే వ్యక్తమయ్యేది.

"పసులకాపరి - నూలువడికే కన్య" అను ప్రఖ్యాతివహించిన జానపద గాథపై ఆధారపడి వ్రాయబడిన ఒక గేయం ప్రజలలో విస్తారంగా ప్రచారమయింది. ఫ్యూడల్ సామాజిక నిర్బంధాలవల్ల పిన్నవయస్కు అయిన స్త్రీ జీవితం యెలా బాధాకరంగా వుండేదో, స్వేచ్ఛాయుతమైన, సుఖప్రదమైన జీవితంకొరకు యువతు లెలా పరితపించేవారో ఆ గేయం వర్ణించింది.

"ఆగ్నేయ దిశగా నెమలియాత్ర" అను మరొక జానపద గేయాన్ని కూడ ప్రజలు విశేషంగా పాడేవారు. 1500 మాటలతో పొదుగైన ఈ గేయంలో తూర్పు హాన్ దంపతుల విషాద గాథ వర్ణించబడింది. జమీందారీ కుటుంబంలోని మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా పోరాడిన చియా చుంగ్ - చింగ్ అను యువకుడు అతని భార్య కథను వివరించుతుంది. వివాహం విషయంలో యువతీ యువకులకు స్వాతంత్ర్యం వుండాలనే ప్రజావాంఛ తెలుపుతూ గేయం పూర్తవుతుంది.

## కాగితం తయారీ

హాన్ వంశ పరిపాలనా కాలంలో చదువుకునేవారి సంఖ్య పెరుగుటవల్ల, చౌకగానూ, తేలికగానూ వ్రాసేందుకు అనుకూలంగానూ వుండే పదార్థం అవసర మయింది. అప్పటివరకు వ్రాసేందుకు వాసమును సిల్కును ఎంతో ప్రయాసతో వినియోగించేవారు. క్రీస్తు శకం 105 వ సంవత్సరంలో తూర్పు హాన్ వంశ ఉద్యోగు లలో ఒకడైన 'సాయి లూన్' చెట్టుబెరడును, నారను, గుడ్డపీలికలను, పాతవలలను ఉపయోగించి కాగితం తయారు చేయడంలో కృతకృత్యుడయ్యాడు. కనిపెట్టిన పరిశో ధకుని గౌరవార్థం ఈ పదార్థాన్ని మార్క్విస్ సాయి కాగితం అని పిలిచేవారు. కాగితం వినియోగించడం క్రమంగా విస్తరించి, సర్వసాధారణమయింది. కాగితం కనిపెట్టడంవల్ల చైనాలో సంస్కృతి పెంపొందడానికి ఎంతో అవకాశ మేర్పడింది. కొలది శతాబ్దాలలో కాగితం తయారుచేసే చైనావారి కళ భారత దేశానికి, అరబ్ దేశాలకూ వ్యాపించింది. తద్వారా ఉత్తరాఫ్రికాకు అచటినుండి యూరపు ఖండానికి విస్తరించింది.

క్రీ.శ. 132 వ సంవత్సరంలో ఖగోళశాస్త్రం, పంచాంగ రచన, గణితశాస్త్రం తెలిసిన చాంగ్ హెంగ్ అనే శాస్త్రకారుడు ప్రపంచంలోకల్లా మొట్టమొదటి భూకంప పరిశోధన కొలమానం (సీస్మోగ్రాఫ్ యంత్రాన్ని) తయారుచేశాడు. కుంభం



క్రీ. శ. 132 సం॥లో చాంగ్ హెంగ్ అనే శాస్త్రకారుడు పెట్టిన
భూకంప పరిశోధన కొలమానం



చాంగ్ హెంగ్ (క్రీ. శ. 78–139)



చాంగ్ చుంగ్ చింగ్ (క్రీ.శ. 152–219)

వలేవున్న యిది రాగితో తయారుచేయబడింది. మధ్యవున్న ఇరుసునుండి ఎనిమిది గొట్టాలు ఎనిమిది వైపులకు నోళ్లు తెరచుకున్న ఎనిమిది రక్కసితలలతో కలుపుతాయి. వాటికి సూటిగా దిగువను నోరు తెరచుకున్న కప్పలు కూచునివుంటాయి. భూమి కంపించినపుడు ఆ దిక్కునవున్న రక్కసి పళ్ళమధ్యవున్న గుండ్రని గోళీ జారి సూటిగా దిగువనువున్న కప్పనోట్లో పడుతుంది.

తూర్పు హాన్ వంశ పరిపాలన ఆఖరి సంవత్సరాలలో గొప్పవారైన ప్రాచీన చైనా డాక్టర్లలో ఒకడైన చుంగ్ చింగ్ (152 - 219) నివసించేవాడు. ఆయన రెండు గొప్ప గ్రంథాలను - షాంగ్ హాన్ లూన్ (జ్వరాల చికిత్స), చిన్ కుయీ యోవ్ లీహ్ (బంగారుపురం మందులు) - వ్రాశాడు. అప్పటికి రోగ చికిత్స విషయంలో వున్న అనుభవాలన్నిటినీ ఈ గ్రంథాలలో క్రోడీకరించినందున అనేక జబ్బులను, వ్యాధులను నివారించడంలో ఎంతో తోడ్పడ్డాయి. వైద్య పరిశోధనలో నిమగ్నులయినవారికి యిప్పటికీ ఈ గ్రంథాలు ఎంతో విలువైన విషయాలను అందజేస్తాయి.

15 వ అధ్యాయం

# మూడు రాజ్యాలు

తూర్పు హాన్ సైన్యాలు రైతుల తిరుగుబాట్లను అణచివేయడంలో నిమగ్నమై వుండగా తరవకాశాన్ని వినియోగించుకుని రాష్ట్రాలలోని, ప్రాంతాలలోని అధికారులు తమ స్వంతసేనలను బలపరచుకున్నారు. క్రమంగా శక్తివంతమైన సైనిక ప్రభువులుగా తయారై తమ అధీనంలోని ప్రాంతానికంలటికీ తామే సర్వాధికారుల మని చెప్పుకుంటూ, చక్రవర్తి ఉత్తరువులను నిర్లక్ష్యంచేయ సాగారు. ఒక్కొక ప్రాంతం తమదంటూ వేర్వేరు ప్రభువులమధ్య నిరంతరం యుద్ధాలు కొనసాగేః తత్ఫలితంగా వేలకొలదీ ప్రజలు చనిపోవడం, వ్యవసాయోత్పత్తి ఘోరంగా దెబ్బ తినడం జరిగేది. 'టుంగ్ చూ' అనే సైనికప్రభు వొకడు చక్రవర్తిని కీలుబొమ్మగా చేసుకున్నాడు. రాజధాని లోయాంగ్ నగరంలోని భవనాలన్నిటినీ, చుట్టూ 100 లీల (సుమారు 30 మైళ్ళ) పరిధిలోనివాటి నన్నిటినీ నిప్పంటించి ధ్వంసం చేశాడు. అతడి గుర్రపుసైన్యం లోయాంగ్ నగర పౌరులందరినీ బలవంతాన చాంగన్ వైపుకు తోలుకుపోయారు; దారిలో చాలమంది ఆకలికి, అలసటకు బలియై మరణించారు. టుంగ్ చో మరణానంతరం ట్సావ్ ట్సావ్ అనే సైనిక ప్రభువు అధికారానికి వచ్చాడు; హువాయి నదికి ఉత్తరానవున్న ఐదు తాలూకాలపై దాడిచేసి అనేక వేలమందిని చంపాడు. ప్రవాహాన్ని బంద్‌చేసేటంత ఎక్కువగా శవాలను నదిలో పడవేశారు. షాన్‌టుంగ్ రాష్ట్రంలో సైనిక ప్రభువులమధ్య రెండు సంవత్సరాల నిరంతరయుద్ధాల తర్వాత ప్రజానీకం దగ్గరవున్న ధాన్యమంతా దోచుకుపోయినందున ఎవరూ పొలాల్లో పనిచేయడానికి ఉత్సుకత చూపలేదు.

తిరుగుబాటుదార్ల సేనలతో పోరాడేందుకు పెద్ద జమీందారులు అనేకమందిని తమ స్వంత సేనలలోకి సమీకరించారు. వారిచే రక్షింపబడుతున్న ప్రాంతాలలో నివశించుతున్న స్వతంత్ర రైతులు తమకు రక్షణ యిచ్చినందుకుగాను జమీందారు సైన్యానికి తోడ్పడుటతో పాటు, తాను పండించిన పంటలో కొంతభాగం పన్నులరూపంలో జమీందారుకు చెల్లించాలి. సైనిక ప్రభువుల మధ్య యుద్ధాలవల్ల జమీందార్ల భద్రతకూడా దెబ్బతినే ప్రమాద

మున్నందున, జమీందార్లు తమ సైనికులతోనూ, రైతులతోనూ ఏదో ఒక పక్షాన చేరి సర్వస్వం ఒడ్డేవారు.

నిరంతర యుద్ధాల ఫలితంగా ఈ కాలంలో పొలాల్లో పనిచేసేందుకు మానవ బలగం చాలక పొలాలు బీళ్లుగా పడివుండేవి. ప్రతిచోటు సైన్యాలకు తిండికొరత ఏర్పడేది. హోపే రాష్ట్రంలో సైనికులు మల్బరీ ఆకు తిని బతకాలిసివచ్చింది. హూయి నదికి దక్షిణవైపున కేవలం నత్తలు, ముత్యపు చిప్పలు మాత్రమే ఆహార మయ్యాయి. ఈ పరిస్థితినుండి బయటపడటానికి ట్సావ్ ట్సావ్ ఎల్లోనది ప్రాంతంలో టున్‌టియన్ పద్ధతిని ప్రవేశపెట్టాడు. సైనికోద్యోగుల క్రిందవున్న నిరాధారులైన రైతులను సమీకరించి భూమిని సాగుచేయించే విధానం అమలుజరిపారు. పోరాటం లేని సమయాల్లో సైనిక వలసల విధానంక్రింద సైనికులకు పంటలు పండించేందుకు అవకాశమిచ్చారు. నాగలిదున్నే ఎద్దులు ప్రభుత్వానివైతే పంటలో 100కి 60 వంతులు సాగుదార్లు ప్రభుత్వానికి పన్నుగా చెల్లించాలి. ఎద్దులు స్వంతమైతే పండిన పంటలో సగం ప్రభుత్వానికిచెల్లించాలి. ఒకవేళ గ్రామాన్ని వదలి సాగుదారు పారిపోతే అతని భార్యా పిల్లలను శిక్షించేవారు.

శిథిలమైన ప్రభుత్వ ఆర్థిక విధానం ట్సావ్ ట్సావ్ పద్ధతులవల్ల తిరిగి పుంజుకుంది. ఎల్లో నదీ ప్రాంతాలన్నిటినీ ఐక్యపరచడానికి అవసరమైన బలాన్ని అతడు క్రమంగా సంపాదించాడు. ఇది నెరవేర్చాక క్రీస్తు శకం 208వ సంవత్సరంలో కొన్ని లక్షల సైన్యాన్ని సమకూర్చుకుని, తక్కిన చైనాను జయించే వుద్దేశ్యంతో దక్షిణానికి దాడి వెడలాడు. ఐతే అతడి భ్రమలు పటాపంచలయ్యాయి. ఏమంటే మధ్య దిగువ యాంగ్‌ట్సీ ప్రాంతాల సైనిక ప్రభువైన సన్ చువాన్, మధ్య హాన్ నదీ ప్రాంతాలను పాలించుతున్న హాన్ రాజవంశానికి చెందిన లియూ-పీల సంయుక్త సైన్యాలు హోపే రాష్ట్రంలోని చిఫీ వద్ద జరిగిన యుద్ధంలో ట్సావ్ సైన్యాలను తరిమివేశాయి. ఈ యుద్ధంలో జయించిన ఫలితంగా ప్రస్తుత జిచువాన్ రాష్ట్రమంతా షెన్సీ హోపె రాష్ట్రాల్లోని భాగాలు లియూ-పీ స్వాధీనమయ్యాయి. ఇపుడిక మూడు రాజ్యాలు రూపొందసాగాయి.

ట్సావ్ ట్సావ్ కొడుకైన ట్సావ్ పీ 220వ సంవత్సరంలో తూర్పు హాన్ కీలుబొమ్మ చక్రవర్తిని తొలగించి, లోయాంగ్ రాజధానిగా "వీ" అనే పేరుతో కొత్త ప్రభుత్వాన్ని ఏర్పరచి, తనను చక్రవర్తిగా ప్రకటించుకున్నాడు.

మరుసటి సంవత్సరం లియూ-పీ తాను హాన్ చక్రవర్తినని ప్రకటించుకున్నాడు. ఐతే చరిత్రకారులు ఇతడి రాజ్యాన్ని 'షూ' అని పిలుస్తారు. లియూ-పీ ప్రధాన మంత్రియైన చూక్ లియాంగ్ చైనాదేశ చరిత్రలో ప్రఖ్యాతి వహించిన రాజకీయవేత్తలలో ఒకరు. ప్రజలను శాంతియుతంగా జీవించనివ్వాలనీ శాసించుతూ వుద్యోగులను అదుపులో వుంచాడు. చూక్ లియాంగ్ మరణించినపుడు రాజ్యంలోని

అన్ని జాతుల ప్రజలు ఎంతో విచారపడ్డారు. షూ వంశంవున్న స్వల్పకాలంలో హాన్ జాతి ప్రజలు, ఇతరజాతుల ప్రజలు కలసి పశ్చిమ జిచువాన్, ఉత్తర యున్నాన్ రాష్ట్రాలకు విస్తరించారు.

క్రీస్తు శకం 222వ సంవత్సరంలో సన్ చువాన్ తనను తానే చక్రవర్తిగా ప్రకటించుకొని, చీన్ యేహ్‌ను (ప్రస్తుత నాంకింగ్‌ను) రాజధానిగా 'ఉ' వంశ ప్రభుత్వాన్ని స్థాపించాడు. 230వ సంవత్సరంలో ఉ ప్రభుత్వ వీవెన్, చూకఛీ అనేవారి సేనాధిపత్యంక్రింది పదివేల సైన్యాన్ని తాయివాన్ దీవికి పంపింది. చైనా చరిత్రలో ఈ దీవితో ప్రథమ సంబంధం యిదే. అప్పటినుంచీ తాయివాన్ వాసులకు, దక్షిణ కోస్తాప్రజలకు సన్నిహిత సంబంధాలు ప్రారంభమయ్యాయి.

## 16వ అధ్యాయం

# పశ్చిమ ట్సిన్

'వీ' వంశ పతనావస్థ సమీపించేనాటికి పౌర మిలిటరీ వ్యవహారాలు 'స్సుమా ఈ' అనే ఉన్నతోద్యోగికి హస్తగతమయ్యాయి. క్రీ. శ. 263 లో షూ వంశాన్ని వీ చక్రవర్తి ఓడించిన తరువాత స్సుమా మనుమడైన స్సుమా యెన్ నామమాత్ర అధికారం కలిగిన వీ చక్రవర్తిని పదభ్రష్టునిచేశాడు. 265 లో ట్సిన్ వంశ ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించాడు. దీనినే పశ్చిమ ట్సిన్ అని సర్వసాధారణంగా అంటారు. ఊ వంశ రాజధానిని స్వాధీనం చేసుకోవడం, చక్రవర్తి లొంగిపోవడంతో 280 లో చైనా ఐక్యత మరల పునరుద్ధరించబడింది.

షూ రాజ్యాన్ని జయించిన తర్వాత వీ వంశ పరిపాలకులు, పౌర వలసలపై సైనిక కంట్రోలును రద్దుచేశారు. వలసలలోని జనాభాను తక్కినప్రజ లందరితో పాటు ఫిర్కా, తాలూకా రిజిస్టర్లలో చేర్చారు; రెవిన్యూ అధికారులు, మాజిస్ట్రేటులే పరిపాలించేవారు.

ఊ రాజ్యాన్ని ఓడించి, స్వాధీనం చేసుకొన్నాక ట్సిన్ వంశ ప్రభుత్వం ఈ విధంగా శాసించింది :

(1) ప్రతి మగవానికి 70 మౌల సాగుభూమి, ప్రతి స్త్రీకి 30 మౌల భూమి కలిగివుండే హక్కు వుంటుంది. ప్రథమ తరగతి ఉద్యోగి మొదలు 9వ తరగతి ఉద్యోగి వరకు 5 వేల మౌల భూమినుంచి వెయ్యి మౌల భూమి కలిగివుండవచ్చు. ఉద్యోగులు వారివారి హోదాలను అనుసరించి తమ భూములను సాగుచేసేందుకు ఎంతమంది కౌలుదార్లను పెట్టుకోవచ్చునో నిర్దేశిస్తారు.

(2) ప్రభుత్వ భూమిని పురుషులకు తలఒకటికి 30 మౌలు, స్త్రీలకు 20 మౌలు యిస్తారు. ప్రభుత్వ భూమిని తప్పనిసరిగా దున్ని సాగుచేసి, ప్రభుత్వానికి కౌలు చెల్లించాలి.

(3) ప్రతి కుటుంబం సంవత్సరానికి పట్టునూలు 3 బోల్టులు, ప్రత్తి 3 కేటీలు ప్రభుత్వానికి చెల్లించాలి.

(4) ఉద్యోగులు, వారి కుటుంబాలు తమ కమతాలపై ప్రభుత్వానికి మక్తా చెల్లించనవసరం లేదు. వెట్టిచాకిరీ చేయనవసరంలేదు.

పశ్చిమ ట్సిన్ పరిపాలనలో రైతులు దారుణంగా దోచుకోబడేవారు. జన సామాన్యం బ్రతుకుతెరువుకొరకు తీవ్రంగా పోరాడవలసివచ్చేది. ఉద్యోగులకు, భూస్వాములకు ప్రభుత్వం అనుమతించిన వారికంటే కౌలుదార్ల సంఖ్య క్రమంగా చాల పెరిగింది.

## పాలకవర్గంలో అవినీతి

పశ్చిమ ట్సిన్ ప్రభుత్వం నిరంకుశోద్యోగులపై ఆధారపడివుండేది. రాజకీయ జీవితంలో అవినీతి మితిమీరివుండేది. మొదటి చక్రవర్తి స్సుమాయెన్ రహస్యంగా ఉద్యోగ పదవులను అమ్మి, ఆ సొమ్మును స్వంత ఖజనాలో దాచుకునేవాడు. దాదాపు ఉన్నతోద్యోగులందరూ అవినీతిపరులే: మంచి పేరున్నవారు సైతం ప్రభుత్వ భూములను స్వంత కమతాల్లో కలుపుకునేవారు.

ఆనాటి రచయిత ఒకడు "ధన మహిమ-దాని పరిశీలన" అనే పేరుతో డబ్బు కొరకు వేటాడేవారిని అపహాస్యం చేస్తూ పుస్తకం వ్రాశాడు. సామ్రాజ్యంలో అన్నిటికంటే అత్యంత శక్తివంతమైనది ధనమని వర్ణించాడు. కీర్తిని, పదవిని డబ్బుతో కొనవచ్చు. పుస్తకం చదవడ మంటేనే మనిషి అలసిపోతాడు; చర్చ వాదన అంటే నిద్రపోతాడు. కాని డబ్బుపేరు చెబితే చాలు మేల్కొంటాడు, ఉద్రేకపడతాడు. డబ్బుంటే నేరస్థులైనా తప్పించుకోవచ్చు; కాసులేనివాళ్లు అమాయకులైనా మరణ శిక్షవిధించబడుతుంది. పెద్ద వుద్యోగులంతా ధనదేవత దాసులనీ, ధనమంటే వారికున్న మమతకు అంతులేదనీ ఆ రచయిత వర్ణించాడు.

అంతకుముందు "ఊ" వంశ రాజ్యంలోనూ, "షూ" వంశ రాజ్యంలోనూ భూస్వాములుగా వున్నవారు కొత్త ప్రభుత్వం యెడల వ్యతిరేకతను ప్రదర్శించి, చక్రవర్తి హుకుములను పాలించకుండా తృణీకరించగలవారు. అందుచేత రాజ కుటుంబానికిచెందిన సైనికాధికారులను తమ సేనలతో పాటు ముఖ్య కేంద్రాలను రక్షించే నిమిత్తం దేశంలోని అన్నిభాగాలకు పంపబడ్డారు. ఐనప్పటికీ స్వల్పకాలంలోనే రాజకుటుంబీకులైన ఈ సైనికప్రభువుల మధ్య సింహాసనంకొరకు పోరాటం ప్రారంభమయింది. రాజధానీ నగరమైన లోయాంగ్ ప్రధాన సైనిక లక్ష్యమయింది. ఈ యుద్ధాలు ఎంత భీకరరూపం ధరించాయంటే ఒక్కొక్క దాంట్లోనే అనేక వేల మంది ఆహుతి అయ్యారు. లోయాంగ్‌లో జరిగిన అలాంటి యుద్ధాన్ని వర్ణించుతూ వర్షపాతంవలె బాణాలు కురిసాయనీ, తగులబడుతున్న భవనాల మంటలు ఆకాశ మెత్తున లేచాయనీ ఒక రచయిత వ్రాశాడు. ఈ యుద్ధాలవల్ల ప్రభుత్వం చాల బలహీనపడింది.

## ఐదు తెగల వలస

తూర్పు హాన్ వంశ పరిపాలన రోజులనుండి పశ్చిమోత్తర ప్రాంతాల్లో నివసించే పశుపాలక తెగలు చైనా గోడను దాటి, తామెకప్పుడు నివసించిన మైదాన

ప్రాంతాల్లోకి చొచ్చుకురావడం ప్రారంభించాయి. హ్స్యియుంగ్ నూ తెగ దక్షిణ షాన్సీ రాష్ట్రంలోనికి పెద్దయెత్తున వలసవచ్చారు. అచట వారు ఐదు గ్రూపులుగా సంఘటితమై, ఒక్కొక్క గ్రూపు తమ నాయకుని ఎన్నుకుంది. వ్యవసాయ వృత్తిని అవలంబించారు. పూర్వంవలె పశ్చిమ ట్సిన్ ప్రభుత్వానికి హ్స్యియుంగ్ నూ తెగలను పారద్రోలగల బలంలేదు. అందుచేత వారి చర్యలను జాగ్రత్తగా కనిపెట్టేందుకు హాన్ వుద్యోగులను పంపడం మాత్రం జరిగింది.

మధ్య ఆసియానుండి వచ్చిన 'ఖీహ్' తెగ ప్రజలు షాన్సీ రాష్ట్రంలోని ఆగ్నేయ ప్రాంతాలలో స్థిరనివాస మేర్పరచుకున్నారు. వీరికి హ్స్యియుంగ్ నూ ప్రభువులు నాయకత్వం వహించారు.

శతాబ్దాల క్రితం చైనా సామ్రాజ్య సైన్యాలు ఉత్తర ప్రాంతాలనుండి హ్స్యియుంగ్ నూ తెగను పడమర దిశకు తరిమివేసినపుడు, చైనా ఈశాన్య ప్రాంతాలలో నివసించే హ్స్యియెన్ పీ తెగ ప్రజలు క్రమంగా పాత హ్స్యియుంగ్ నూ ప్రాంతాలకు కదలివచ్చారు. క్రీస్తు అనంతరం రెండవ శతాబ్దంనాటికి లియోనదికి, కన్సూ రాష్ట్రానికి మధ్యవున్న విస్తృత ప్రాంతమంతటినీ వారు ఆక్రమించారు. చైనా గోడను కూడ దాటి లోనికి విస్తరించారు.

ఆదిలో టీ తెగ కన్సూరాష్ట్రం ఆగ్నేయ దిశలో నివసించే వారిపుడు షెన్సీ రాష్ట్రంలోకి, కన్సూరాష్ట్ర తూర్పు ప్రాంతాలలోకి విస్తరించారు. ఈ ప్రజలకు వ్యవసాయం చేయడం, బట్టలు నేయడం, పశుపాలన, గుర్రాలను పందులను పెంచడం కూడ తెలును.

షెన్సీ రాష్ట్రంలోనూ, కన్సూరాష్ట్ర తూర్పు ప్రాంతాలలోనూ హాన్ ప్రజలతో పాటు చియాంగ్ ప్రజలు ఇరుగు పొరుగున నివసించేవారు.

ఆ కాలంలో హ్స్యియుంగ్ నూ, ఖీహ్, హ్స్యియెన్ పీ, టీ, చియాంగ్ తెగల ప్రజలను ఐదు హూ లని పిలచేవారు. వారు హాన్ భూస్వాములకు, ఉద్యోగులకు కౌలుదార్లయ్యారు; దోపిడిగాళ్ళు తరచుగా వారినిపట్టుకొని బానిసలుగా అమ్మేవారు.

అధికారం కొరకు సైనిక ప్రభువులు జరిపే మారణ యుద్ధాలలో ఈ ఐదు తెగల ప్రజల్ని వినియోగించుకునేవారు. స్సుమా ఇంగ్ సైనిక ప్రభువుకు మద్దతుగా వున్న హ్స్యియుంగ్ నూ ప్రభువులలో లియువాన్ అనే సేనాని వుండేవాడు. సైన్యంలోకి హ్స్యియుంగ్ నూ సిపాయిలను చేర్చుకోవడానికి షాన్సీ రాష్ట్రంలోకి వెళ్ళిన లియువాన్ 304 వ సంవత్సరంలో తిరుగుబాటు లేవదీశాడు. కొలది సంవత్సరాల యుద్ధానంతరం అతడి సైన్యాలు ఎల్లోనదిని దాటి, 311 వ సంవత్సరంలో లోయాంగ్ ...న్ని ఆక్రమించాయి. చక్రవర్తిని ఖైదీగా పట్టుకున్నాయి. పశ్చిమ ట్సిన్ ...ాక చక్రవర్తిని చాంగన్ నగరంలో సింహాసన మెక్కించింది. కాని ...రం కూడ తిరుగుబాటుదారుల వశమైంది. పశ్చిమ ట్సిన్ ఆఖరు చక్ర...ంగ్ నూ సేనలకు లొంగిపోయాడు.

17 వ అధ్యాయం

# తూర్పు ట్సీన్, 16 రాజ్యాల శకం

పశ్చిమ ట్సీన్ వంశం అంతమొందడానికి దారితీసిన గందరగోళ పరిస్థితుల రోజుల్లో ఎల్లోనది ప్రాంత హ్యూ తెగకు చెందిన సామంత ప్రభువులు పరస్పరం నాశనం చేసుకునే యుద్ధాలలో నిమగ్నులయ్యారు. అంతకుముందున్న రాజ్య శిథిలాలపై 130 సంవత్సరాలలో ఒక రాజ్యం తరువాత మరొక రాజ్యం స్థాపించ బడింది. ఈ దశను 16 రాజ్యాల శకమని పిలుస్తారు.

ఈ రాజ్యాలలో కొన్ని పశుపాలక రాజ్యాలు; కొన్ని వ్యావసాయిక రాజ్యాలు. మరికొన్ని పశుపాలన, వ్యవసాయం రెండూ వున్న రాజ్యాలు. స్థానిక తెగలు పశుపాలనను, హాన్ ప్రజలు వ్యవసాయాన్ని సాగించే రాజ్యాలుగా వుండేవి. కాని పాలకవర్గాలు సాగించిన నిరంతర యుద్ధాల ఫలితంగా పొలాలు, ఇళ్ళు ధ్వంసమైపోయినందున, దోపిళ్ళు, ఖూనీలు, నిర్బంధ విధానం నిత్యకృత్యమైపోయి నందున, హాన్ తెగవారైనా, ఇతరులైనా ప్రజలంతా నానా అవస్థలు పడుతుండే వారు. భీషణ యుద్ధాలకు భీతిచెందిన ప్రజలు హువాయ్‌నదీ ప్రాంతంనుంచి పారి పోయారు. క్రూరమైన నిర్బంధవిధానాన్ని సహించలేక రెచ్చిపోయిన సామాన్య ప్రజలు ప్రతిచోటా కోపంతో ప్రతిఘటించసాగారు.

ఉత్తర దిశకు పారిపోతున్న పెద్ద భూస్వాములు యాంగ్‌ట్సీ నదిని దాటి ఆప్రాంతంలో తమ అధికారాన్ని స్థాపించుకోవాలని ప్రయత్నించారు. 317వ సంవత్సరంలో స్థానిక భూస్వాములతో కలసి చక్రవర్తి కుటుంబ సభ్యుడు, ఛీన్‌యీ ప్రా రక్షకుడు అయిన 'స్సమా జుయి'ని బలపరచి, తూర్పు ట్సీన్ వంశ పరిపాలనను స్థాపించారు.

## ట్సూ టీ దండయాత్ర

మరల ఒకసారి గద్దె ఎక్కిన తరువాత, విశాల ప్రాంతంపై రాజ్యాధి అనుభవించుతూ, ఉత్తర చైనాను హ్యూ పరిపాలననుండి విముక్తి ఆశయాన్ని భూస్వాములు వదులుకున్నారు. కాని ఎల్లోనదీ ప్రా మాతృభూముల్లోకి [illegible]లనే ఆశను కొందరు విడనాడలేదు.

'హూన్యా' పరిపాలకులను కూలదోసేందుకు తమ మిత్రులు- ... చేతులు కలపాలనే ఆత్రుతవున్న సాధారణ కాందిశీకులంతా వారిని బలపరిచారు.

ఈ కలలకు అనుగుణ్యమైన కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టినవాడు ట్సూటీ. రాజధానిలోని కేంద్ర సైనిక కార్యాలయంలో వుద్యోగి ఐన ట్సూటీ, పశ్చిమ ట్సిన్ రాజ్యం ఆఖరి సంవత్సరాలలో తన బంధువులతోనూ, అదే గ్రామానికి చెందిన కొన్ని వందల కుటుంబాలతోనూ దక్షిణానికి పారిపోయి వచ్చాడు. 313 వ సంవత్సరంలో ఉత్తరదేశ దండయాత్రను కోరుతూ ట్సూటీ ఒక విజ్ఞానపత్రాన్ని "స్సుమా జుయీ" (తూర్పు ట్సిన్ చక్రవర్తి) కి అందజేశాడు. దానికి ఎలాంటి ప్రోత్సాహం దొరకలేదు గాని కొలది బండారాలను మాత్రం చక్రవర్తి ప్రసాదించాడు. ఐనప్పటికీ ట్సూటీ నిరుత్సాహం పొందలేదు. చక్రవర్తి దగ్గరనుండి ఆయుధాలు, సైన్యం సంపాదించడంలో విఫలమైనప్పటికీ, ప్రజల తోడ్పాటు తనకు వుంటుందనే విశ్వాసంతో ట్సూటీ ఉత్తర దండయాత్రను ధైర్యంతో ప్రారంభించాడు. యాంగ్ ట్సీ నదిని దాటుతూ ఉత్తర ప్రాంతాలను జయించనిదే తిరిగి రామని అతడూ, అతని సైనికులూ శపథం చేశారు. ప్రతిచోటా అతని సైన్యాలను ప్రజలు ఆహ్వానించారు. హూవాయ్ నదిని సమీపించాక ప్రజల సాయుధదళాలను సంఘటితపరచి, ఆయుధోత్పత్తికి అతడు ఏర్పాటులు చేసుకున్నాడు. ప్రజలు తమంతట తామే ధాన్యాన్ని అతడి సైన్యానికి అందచేయుటతోపాటు శత్రువును గురించిన భోగట్టాను తెలియజేశాడు. ఎనిమిది సంవత్సరాల పోరాటంలో 'షీహ్' సైన్యాలపై అనేక విజయాలు పొంది, ఎల్లోనది దక్షిణ గట్టువరకు వున్న ప్రాంతంలో అత్యధిక భాగాన్ని స్వాధీనం చేసుకుని, నదిని రక్షణ ప్రాకారంగా కట్టుదిట్టపరచుకున్నాడు. జయించిన ప్రాంతాలలో ఉత్పత్తిని పెంచడానికి అవసరమైన చర్యలను ట్సూటీ తీసుకున్నాడు. మార్గదర్శకంగా వుండేందుకు అతని కొడుకులు అడవులను కొట్టడంలోనూ, భూమిని దున్నడంలోనూ స్వయంగా పాల్గొన్నారు.

ట్సూటీ పలుకుబడి తమ అధికారానికి ప్రమాదంగా ఎంచి తూర్పుట్సిన్ పరిపాలకులు అతడి కృషిని పరిమితం చేసేందుకు, అతనిపై నిఘా వుండేందుకు వేగుల వాళ్ళను పంపారు. ఈ అన్యాయం గమనించి, కోపంతో ట్సూటీ త్వరలో మరణించాడు. హూన్యా పాలకులు ఈ అవకాశాన్ని వినియోగించుకుని, పోగొట్టుకున్న ప్రాంతంపై తిరిగి తమ అధికారాన్ని త్వరలోనే పునరుద్ధరించుకో గలిగారు.

## ఎల్లోనదీ ప్రాంతంలో హూన్యా పరిపాలకులు

నాలుగో శతాబ్ద ప్రారంభంలో (319) షీహ్‌యుంగ్ నూ తెగ ప్రభువైన నగరా యావ్ షాన్సీలో ప్రథమ చావ్ రాజ్యాన్ని స్థాపించాడు. ఈ రాజ్య వంశం మరో షీహ్ లీ పలుకుబడి యుద్ధాలవల్ల బాగా పెరిగింది. ఎల్లోనది ప్రాంతంపై 316 లో ఆ సంపాదించి, 329 లో ప్రభుత్వాన్ని కూలదోసి, మరో చావ్ రాజ్యాన్ని వర్తి కూడ షీహ్‌య...

తమ పరిపాలనను బలపరచుకొనేందుకు హూ్యా పాలకులు ప్రత్యేక శ్రద్ధతో హాన్ భూస్వాములను పరిగణించారు. నియమం ప్రకారం ప్రభుత్వానికి చేయవలసిన శ్రమనుండి మినహాయించి, వుద్యోగులుగా నియమించారు. ఈ విధంగా హాన్ భూస్వాముల తోడ్పాటును ప్రభుత్వం పొందగలిగింది.

351 లో చావ్ రాజ్య పతనానంతరం షెన్సీ రాష్ట్రంలో టీ తెగ ప్రాథమిక చిన్ రాజ్యాన్ని స్థాపించింది.

## ఫీ నది యుద్ధం

ఎల్లోనది దిగువ ప్రాంతంలో హ్సియెన్ పీ ప్రజలలో భాగమైన మూజంగ్ తెగ ఏర్పరచుకున్న ప్రాథమిక యెన్ రాజ్యాన్ని జయించి, ప్రాథమిక చిన్ పరిపాలకుడైన ఫూచీన్ తన రాజ్యంలో కలుపుకున్నాడు. యాంగ్‌ట్సీ నది ఎగువ ప్రాంతాల్లోని తూర్పు ట్సిన్ భూములను తరువాత ఆక్రమించుకున్నాడు. పశ్చిమోత్తరంగా వున్న చాలా రాజ్యాలను బెదిరించి, పన్ను చెల్లించే సామంతులుగా చేసుకున్నాడు. ఇతర హూ్యా పాలకులకంటే ఫూచీన్ వ్యవసాయం యెడల ఎక్కువ శ్రద్ధ వహించాడు. హాన్ జాతి వారి రాజకీయ విధానాన్ని అమలు జరిపాడు: చైనా దేశమంతటినీ జయించాలని ఆశించాడు. తూర్పు ట్సిన్ రాజ్యాన్ని ఆక్రమించుకునేందుకు సన్నాహాలు చేశాడు. అతడి సేనలు తూర్పు ట్సిన్ సరిహద్దుపై నిరంతరం దాడులు సాగించాయి. రాబోవు దండయాత్రను తట్టుకునేందుకు తూర్పు ట్సిన్ రాజ్యం ఎల్లోనది దిగువ ప్రాంతాల రక్షణ ఏర్పాట్లను బలపరచుకుంది. సరిహద్దునే జనరల్ హ్సియెహ్ సేనాధిపత్యం క్రింద ఆరోగ్యవంతులు బలవంతులైన రైతులనుండి సమీకరించబడిన సైన్యాలను వుంచింది.

383 వ సంవత్సరంలో అనుకున్నట్లుగానే దండయాత్ర ప్రారంభమయింది. హాన్, హ్సియెన్ పీ, చియాంగ్ ప్రజలనుండి ప్రధానంగా సమీకరించబడిన 9 లక్షల సేనతో ఫూ చీన్ బయలుదేరాడు. ప్రభుత్వానికి సుస్థిరమైన పునాదులు యింకా ఏర్పడనప్పటికీ, చాలమంది ప్రభువులు ఈ యుద్ధాన్ని వ్యతిరేకించినప్పటికీ, ఫూచీన్ తన సేనలు శత్రుసేనలకు పదిరెట్లు వున్నాయనే ధీమాతో, విజయం సాధించుతాననే విశ్వాసంతో బయలుదేరాడు.

అన్‌హ్వియీ రాష్ట్రంలో ఫీ నది గట్లపై రెండు సేనలూ ఢీకొన్నాయి. హ్సియెహ్ హ్సువాన్ నాయకత్వాన వున్న ట్సిన్ రాజ్య సేనలు నదిని దాటే ప్రయత్నంలో వున్నాయని ఫూచీన్ గమనించాడు. ట్సిన్ సేనలపై ఆకస్మిక దెబ్బ తీసి, ధ్వంసం చేయాలనే ప్రయత్నంలో ఒక యెత్తుగడగా తన సేనలను వెనుకకు తగ్గమని ఫూచీన్ ఆజ్ఞాపించాడు. తిరోగమనం సాగుతున్న సమయంలో ఫ్యూచీన్ క్రింది వుద్యోగి హాన్ జాతివాడైన 'చూహ్సూ' – తన యజమాని పతనం కొరకు అదివరకే ట్సిన్ సైన్యంతో లాలూచీ పడి – చిన్ సేనలు ఓడిపోయాయనే వదంతులు

వ్యాప్తి చేశాడు. చిన్ సైన్యంలో అధిక సంఖ్యాకులుగా వున్న హాన్ ప్రజలు - నిర్బంధంగా సైన్యంలో చేర్చుకోబడినవారు-గందరగోళంలో పడ్డారు. తత్ఫలితంగా ఫ్యూచిన్ ఎత్తుగడగా ప్రారంభించిన తిరోగమనం సర్వనాశనానికి కారణమయింది. ట్సిన్ సైన్యాలు దాడిచేసి సులభంగానే విజయం సాధించాయి. లోయాంగ్ నగరానికి తిరిగి వెళ్లాక ఫ్యూచీన్, ఒకప్పుడు గొప్ప సైన్యంలోని మిగిలిన భాగాలను, ఒకచోట సమీకరించుకుంటే కేవలం లక్షమంది మాత్రం దక్కారు. షాంటుంగ్, హోనాన్ రాష్ట్రాలలో హెచ్చు భాగాన్ని ట్సిన్ సైన్యం పునరాక్రమించుకుంది. యాంగ్‌ట్సీ నది దక్షిణ ప్రాంతప్రజల స్వాతంత్ర్యాన్ని హ్యూ తెగ దండయాత్రి నుండి ఫీయీ నది యుద్ధం కాపాడింది. హాన్ జాతి రాజకీయ అధికారం రక్షించబడింది.

వినాశకరమైన అపజయం లేదా తిరోగమనం తరువాత, సైన్యం పూర్తిగా ధ్వంసమైనందున చిన్ రాజ్యాధికారం బలహీన పడిపోయింది. హ్సియెన్ పీ, చియాంగ్ తెగల ప్రజలు మరల తమ స్వతంత్ర రాజ్యాలను ఏర్పరచుకున్నారు. హ్సియెన్ పీ తెగ ఎల్లోనది దిగువ ప్రాంతాన్ని, లియోనదీ ప్రాంతాన్ని ఆక్రమించుకుని రెండు రాజ్యాలుగా చీలిపోయింది. వీటిలో పశ్చిమ ఎన్ రాజ్యాన్ని, రెండవ ఎన్ రాజ్యాన్ని తర్వాత ఓడించి స్వాధీనం చేసికుంది. చియంగ్ ప్రజల్లో భాగమైన యావో శాఖ షెన్సీరాష్ట్రాన్ని, తూర్పు కన్సూను ఆక్రమించి రెండవ చిన్ రాజ్యాన్ని స్థాపించింది. కన్సూ, చింఘాయ్ ఉత్తర షెన్సీ రాష్ట్రాలలో చాల రాజ్యాలు ఏర్పడి, నిరంతరం పరస్పరం యుద్ధాలు కొనసాగించుతూ వుండేవి.

హ్యూ దండయాత్రలనుండి సురక్షితంగా వున్నందున ఇపుడు వ్యవసాయం వ్యాప్తిచెంది, వుత్పత్తి పెరుగసాగింది. ఐనప్పటికీ తూర్పు ట్సిన్ ప్రభుత్వం రైతులను తీవ్రంగా దోచుకుంటున్నందున, దానిపై అసంతృప్తి పెరిగింది. 399 వ సంవత్సరంలో సన్ ఎన్ నాయకత్వాన తూర్పు చెకియాంగ్ రాష్ట్రంలో రైతులు తిరుగుబాటు చేశారు. రాజధాని చీయిన్ కాంగ్ (నాంకింగ్) దగ్గరనుండి పైహూ సరస్సు ప్రాంతంవరకూ అనేక తిరుగుబాట్లు జరిగాయి. రైతుసైన్యం పది రోజుల్లో కొన్ని లక్షలవరకు పెరిగింది; నాలుగు సంవత్సరాలవరకు పోరాటం కొనసాగింది.

రైతుల తిరుగుబాటులను అణచుటతోపాటు తూర్పు ట్సిన్ ప్రభుత్వ సేనాని ల్యూ యూ తన సేనలను సమీకరించుకొని దక్షిణ ఎన్ తెగవారి ఉత్తర రాజ్యాలను, రెండవ చిన్ రాజ్యాన్ని కూడ ధ్వంసంచేశాడు. తూర్పు ట్సిన్ రాజ్య సైన్యాలు మరల ఎల్లోనది ప్రాంతంలో కన్పించసాగాయి. శక్తివంతుడైన జనరల్ ల్యూ యూ చివరకు 420 వ సంవత్సరంలో తానే స్వయంగా సింహాసనాన్ని ఆక్రమించి, సుంగ్ వంశ పరిపాలనను ప్రతిష్టించాడు.

## 18 వ అధ్యాయం

# దక్షిణ వంశాలు

తూర్పు ట్సిన్ రాజ్యం అంతమయ్యాక సరిహద్దు రక్షణ నిమిత్తం ముఖ్యమైన పట్టణాలలో సైన్యాన్ని కేంద్రీకరించడం దక్షిణ చైనా ప్రభుత్వానికి అలవాటుగా వుండేది. ఈ సైన్యాలకు రాజవంశీయులో సామాన్యుల నుండి వచ్చిన సేనాధిపతులో ఆధిపత్యం వహించేవారు. వీరు సర్వసాధారణంగా సివిల్ పరిపాలనలో అనుభవం కలిగిన ఉన్నతోద్యోగులుగా కూడ వుండేవారు. వీరిలో శక్తిమంతులు సింహాసనాన్ని తామే జయించాలని ఆశపడేవారు. అందుచేత వీరికీ, చక్రవర్తులకూ మధ్య తరుచుగా యుద్ధాలు జరిగేవి. తనకు పోటీగా తయారైన వారిని చంపించి వేయడానికి చక్రవర్తి ప్రయత్నించేవాడు. చక్రవర్తిని సింహాసనం నుంచి తొలగించడంలో రాజవంశీయుడైన సేనాని కృతకృత్యుడయితే వెంటనే తానే చక్రవర్తినని ప్రకటించుకునేవాడు. విజయం సాధించిన సేనాని ఒకవేళ సామాన్య వంశీయుడైతే రాజ్యం పేరును మార్చి, కొత్త వంశానికి మూల పురుషుడయ్యేవాడు. ఈ విధంగా ల్యూయు అధికారం హస్తగతం చేసికున్నాక దక్షిణ చైనాలో వరుసగా నాలుగు వంశాల పరిపాలన కొనసాగింది: సుంగ్ వంశం (420 నుంచి 479 వరకు), చీవంశం (479 నుంచి 502 వరకు), లియాంగ్ వంశం (502 - 557), చెన్ వంశం (557 నుంచి 589 వరకు) వీటిని దక్షిణ వంశాలని పిలుస్తారు. ఈ వంశాలకు చెందిన చక్రవర్తులు మొత్తం 170 సంవత్సరాలు, చెకియంగ్‌ను రాజధానిగా చేసుకుని పరిపాలించారు.

## కొత్తగా వచ్చిన నివాసులు

ఎల్లోనది ప్రాంత భూములతో పోల్చితే యాంగ్‌ట్సీ నదికి దక్షిణ ప్రాంతం వెనుకబడి వుండేది. కాని పశ్చిమ ట్సిన్ రాజ్యం ఆఖరి రోజుల్లో హ్యూ పరిపాలన నుండి పారిపోయిన కాందిశీకులు యిచటికి వలస వచ్చినందున వ్యవసాయాభివృద్ధికి దోహదం జరిగింది. తూర్పు ట్సిన్, దక్షిణ వంశాల పరిపాలనకాలంలో కూడ ఎల్లో నది మధ్య, దిగువ ప్రాంతాలనుండి ఎక్కువమంది కాందిశీకులు దక్షిణ కియాంగ్సు, చెకియాంగ్ రాష్ట్రాలకు వలసవచ్చారు. ఈ ప్రాంతాలు వసంత, ఆకురాలు కాలాల నుండి నివాసయోగ్య మయ్యాయి. స్థానిక ప్రజలతో కలసి కాందిశీకులు సముద్ర తీరంలో అలలు రాకుండా అడ్డుకట్టలు కట్టారు; నదులపైనా, సరస్సులపైనా నీటి పారుదల ప్రాజెక్టులను నిర్మించారు. పొదలను, అడవిని కొట్టి భూమిని వ్యవసాయాభి

వృద్ధికి వినియోగించారు. చెకియాంగ్ తూర్పు ప్రాంతంలో కుయాచీ జిల్లాలో కోట్ల కొలది మౌల సారవంతమైన భూమి బాగుచేయబడింది. షాన్ యింగ్ తాలూకాలో 30 వేల కుటుంబాలు కొత్తగా నివాస మేర్పరచుకున్నాయి.

ఇతర కాందిశీకులు హాన్ నది వెంటనే దిగువకు వెళ్ళి హూపే రాష్ట్రం మధ్య, దక్షిణ ప్రాంతాలలో నివాసమేర్పరచుకున్నారు. ఒకప్పుడు చౌ రాజ్య కాలంలో (వసంతం, ఆకురాలు కాలాల దశలో) ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ అభివృద్ధి చెందివున్న మధ్య ప్రాంతం తిరిగి ముందంజవేసి యాంగ్‌ట్సీనదికి దక్షిణాన రెండవ భాగ్యవంతమైన భూమిగా తయారయింది.

కియాంగ్సీ, హునాన్, ఫూకీన్, క్వాంగ్‌టంగ్ రాష్ట్రాల అభివృద్ధి నిదానంగా సాగింది. కాని దక్షిణవంశాల పరిపాలనదశ పూర్తయ్యే నాటికి కొండ ప్రజలకు మైదాన ప్రజలకు ఇతర ప్రపంచంతో సంబంధాలు ఎక్కువై, క్రమంగా ఆర్థిక విధానం బాగుపడింది. సామాన్యప్రజలు బాగుచేసిన భూమిలో హెచ్చుభాగం భూస్వాముల హస్తగత మయింది. అడవులు, సరస్సులు కూడ తమవేనంటూ భూస్వాములు, కట్టెలు కొట్టేవారి నుండి చేపలు పట్టేవారి నుండి పన్ను వసూలు చేసేవారు. దక్షిణ కియాంగ్సీ, చెకియాంగ్ రాష్ట్రాలలో పెద్దభూస్వాములు మరింత ఎక్కువగా కేంద్రీకరించబడి వుండేవారు. కొందరికి 10 లక్షలమౌల భూమి, అనేక తాలూకాల్లో ఆస్తి వుండేది. ఉదాహరణకు కుంగ్ లింగ్-ఫ్రూ అనే భూస్వామి చుట్టుకొలత 30 లీలు వుండేది; ఇందులో 26,500 మౌల సాగుభూమి, రెండు కొండలు, 9 పండ్లతోటలు వుండేవి.

సుంగ్ వంశ పరిపాలనలో ప్రఖ్యాతివహించిన కవి భాగ్యవంతుడైన భూస్వామి అయిన హ్సీయెహ్ లింగ్-యున్ తన ఎస్టేటును యిలా వర్ణించాడు. ఉత్తరాన, దక్షిణాన కొండ మధ్య అంతా వరిచేలు, పంటకాలువ గట్లమీద ఖర్జూరపు చెట్లు బారులుతీరి వున్నాయి. మెరక భూముల్లో జొన్న, చిక్కుడు, గోధుమ, గోగునార, ఈతచెట్లు వున్నాయి. అతడి పొలాల్లో వెదురు పొదలు, నారగాయల తోటలు, పండ్లతోటలు వున్నాయి. ఉత్తమజాతి పండ్లతోటలను పెంచడానికి ప్రత్యేక భూములు కేటాయించబడ్డాయి.

## ఉద్యోగస్థుల వర్గం పతనావస్థ

తూర్పు ట్సిన్, దక్షిణ వంశాల పరిపాలనాకాలంలో భాగ్యవంతులైన భూస్వాములు కొందరు చక్రవర్తులవద్ద వంశ పారంపర్య వుద్యోగులుగా వుండేవారు. అందుచేత కాలక్రమేణ వీరొక వుద్యోగస్థుల కులంగా తయారయ్యారు షీటాన్స అనే పేరు పెట్టుకొని వీరు తమ గ్రూపుకు బయట కుటుంబాలవారితో వివాహాది సంబంధాలు చేసుకునేవారు కాదు. తమ కులానికి చెందినవారైతే ప్రభుత్వంలో ఎక్కువ అధికారమున్నప్పటికీ వీరు గుర్తించేవారు కాదు; ప్రత్యేక ఉద్యోగ పదవులు కొన్ని ఈ స్వప్రయోజనపరుల ముఠాకు కేటాయించబడేవి. ఆదివరకే వీరి అధీనంలో

వున్న పెద్ద కమతాలు, కపతగాళ్లతోపాటు చాలమంది కౌలుదార్లను వీరి ఆస్తికి ప్రభుత్వం జోడించేది.

ఈ కులానికి చెందినవారిలో చాలమంది పేరుకు మాత్రమే వుద్యోగులు. ఉదాహరణకు వాంగ్ హ్యూచీ అనేవాడు గుర్రపు యజమాని హోదాతో పిలువబడేవాడంటే పరాన్నభుక్తిత్వం ఎంతగా పెంపొందినదో తెలియజేస్తుంది. ఉన్నతోద్యోగి వాంగ్‌ను ఏ బాధ్యతను నిర్వర్తించుచున్నావని ప్రశ్నించితే తాను గుర్రపు యజమాని బాధ్యతను బహుశః నిర్వహించుచుంటానని వాంగ్ జవాబు ఇచ్చాడట. ఏమంటే తానుండేచోట గుర్రాలపై వచ్చేవారిని ఎక్కువగా చూచేవాడట. ఐతే ఎన్ని గుర్రాలకు బాధ్యత వహించుచున్నావని ప్రశ్నించగా గుర్రాన్ని గురించి వాస్తవంగా తనకేమీ తెలియనందున ఎన్ని వున్నాయో చెప్పలేనని వాంగ్ సమాధానమిచ్చాడట. ఎన్ని గుర్రాలు ఈమధ్య చనిపోయాయని ప్రశ్నించగా బ్రతికున్నవాటి పరిస్థితే తనకు తెలియనందున చచ్చినవాటిని గురించి చెబుతానని అనుకోవడం న్యాయం కాదన్నాడట. ఆరోజుల్లో భాగ్యవంతులు ఇలాంటి సోమరి జీవితం ఉన్నతమైనదని ఎంచేవారు.

ఈ భాగ్యవంతులవర్గం ఎంత పతనావస్థలో వుందో తెలిసికోవడం ప్రయోజనకరంగా వుంటుంది. వారిని వర్ణించితేచాలు, వారెంత వూబిలో దిగబడి వున్నారో బోధపడుతుంది. పొడుగాటి టోపీలను, వెడల్పుగానూ వదులుగాను వున్న దుస్తులను ధరించేవారు. వాటిపై సువాసన ద్రవ్యాలను వెదజల్లేవారు. ముఖాలను నున్నగా గొరిగించి, మర్దన చేయించి, పౌడర్ పట్టించేవారు. పొడుగాటి రథాలలో సవారి చేసేవారు. కూర్చున్నప్పుడు అలంకరించిన మెత్తలపై చేతులను ఆనించేవారు. నడచేటప్పుడు సేవకులపై ఆధారపడేవారు. వ్యవసాయం గురించి కించిత్తుకూడ వారికి తెలియదు. పొలాలలో కష్టపడి పనిచేస్తున్న ప్రజలను వారిలో చాలమంది చూసి ఎరుగరు. ఏమంటే వారు తమ కాలాన్నంతా రాజధానీనగరం చెయిన్‌కాంగ్ నగరంలోనే గడిపేవారు. లియాంగ్ వంశం ఆఖరిదశలో సైనిక ప్రభువులైన హౌచింగ్ సేనలు రాజధాని చెయిన్‌కాంగ్ నగరాన్ని చుట్టుముట్టినపుడు పరాన్నభుక్కులైన ఈ ఉద్యోగులకు గుర్రాలను యెక్కి నగరం నుండి పారిపోయేందుకు సైతం ధైర్యం లేకపోయింది. నగరంలోనే వుండి ఉపవాసాల పాలయ్యారు. రాజధాని శత్రువు చేతుల్లో పడిపోయే సమయానికి తమకున్న చక్కని దుస్తులను ధరించి, తమకున్న బంగారాన్ని స్ఫటికాలను ప్రోగుచేసి మృత్యువుకొరకు ఎదురుచూస్తూ పక్కలపై పడున్నారంటే ఎంత పతనావస్థలో వుద్యోగులకులం వుందో ద్యోతకమవుతుంది.

నిరంతర యుద్ధాలు, ఆంతరంగిక అవినీతి ఫలితంగా దక్షిణరాజ్యాల బలం క్రమంగా సన్నగిలింది. హువాయ్‌నదీ, హూపే, జీచివాన్ రాష్ట్రాలు ఉత్తరవంశాల అధీనమయ్యాయి. చెన్ వంశం అధికారంలోకి వచ్చేటప్పటికి యాంగిట్సీనది దక్షిణ ప్రాంతాన్ని మాత్రమే తన రాజ్యానికి కలుపుకోవలసి వచ్చింది.

19 వ అధ్యాయం

# ఉత్తర వంశాలు

క్రీస్తు శకం 386 నుంచి 534 వరకు పరిపాలించిన ఉత్తర వీ, 534 నుంచి 550 వరకూ పాలించిన తూర్పు వీ, 535నుండి 557 వరకు పాలించిన పశ్చిమ వీ, 550 నుంచి 577 వరకు పాలించిన ఉత్తర చీ 577 నుంచి 581 వరకు పాలించిన ఉత్తర చౌ ఉత్తర వంశాలని పిలువబడుతున్నాయి.

హ్సియన్‌పీ ప్రజలలో ఒక శాఖవారైన టోపా తెగ పశు పాలకులుగా తిరుగుతూ ఇన్నర్ మంగోలియాలో నివశించేవారు. ఫీనది యుద్ధం తరువాత ఈ తెగవారు షాన్సీ రాష్ట్రం ఉత్తర ప్రాంతంలోకి చొచ్చుకువచ్చి ఉత్తర వీ రాజ్యాన్ని స్థాపించారు. తరువాత హోపే రాష్ట్రాన్ని ఆక్రమించి స్థానిక రైతు జనాభాను — షాన్సీ రాష్ట్రంలో టాటుంగ్ సమీపంలో నిర్మించిన — రాజధాని పిన్‌గ్జెంగ్‌కు రమ్మని ఆజ్ఞాపించారు. అచట భూమిని, పశువులను యిచ్చి బాగా పన్నులు విధించారు. ఐదో శతాబ్ద ప్రారంభంలో లియోవ్ నదికి ఆనుకునివున్న వుత్తర షెన్సీ, వుత్తర ఎన్ ప్రాంతాల నుండి హ్సియా తెగను తరిమివేసింది. ప్రస్తుత కన్సూ రాష్ట్రంలోని ఉత్తర లియాంగ్ ప్రాంతాన్ని ఆక్రమించి, 439 నాటికి ఉత్తర చైనా నంతటినీ ఐక్యపరచింది.

ఎల్లోనది దిగువ ప్రాంతంలో నివసించే హ్సియెన్‌పీ ప్రజల శాఖయైన మూజుంగ్ తెగవారు కన్సూ, షెన్సీ రాష్ట్రాలలో నివసించే టీ, చియాంగ్ తెగలూ యీ కాలానికి హాన్ ప్రజల వలెనే వ్యవసాయదారు లయ్యారు. హాన్ తదితర ప్రజలు యిలా ఆర్థికంగా కలసిపోవడంవల్ల ఉత్తర చైనాలో స్థాపితమైన ఐక్యతకు గట్టి పునాది ఏర్పడింది.

ఉత్తర వీ రాజ్యస్థాపన నాటికి టోపా తెగ చిన్నదైనందున, పెద్దవి కాని తన సాయుధ సైన్యాలను విశాలమైన ఎల్లో నదీ ప్రాంతాన్నంతటినీ అదుపులో వుంచేందుకు రాజధాని పింగ్‌చెంగ్‌లో కేంద్రీకరించింది. పశు పాలక తెగ ఐన ఉత్తర వీ ప్రభుత్వ కార్యకలాపాలను సాగించడానికి హాన్ భూస్వాములను వినియోగించింది. పాలక వంశస్థులు కూడ క్రమంగా హాన్ సంస్కృతిని అలవరచుకున్నారు.

ఉత్తర చైనాను ఐక్యపరచడంలో ఉత్తర వీ పరిపాలన జయప్రదమైనందున ఎడతెగని యుద్ధాలు తగ్గాయి. వ్యవసాయాన్ని పునరుద్ధరించడానికి అవకాశం కలిగింది.

485 వ సంవత్సరంలో హ్సియావో వెన్ చక్రవర్తి వ్యక్తుల సంఖ్య శ్రమశక్తిని అనుసరించి ప్రభుత్వ భూములను పంచే ఒక భూస్వామ్య విధానాన్ని ప్రకటించాడు. రైతు ముసలివాడై పని చేయలేకపోయినా, చనిపోయినా అతడు సాగుచేసిన భూములు తిరిగి ప్రభుత్వాధీనమయ్యేవి. మల్బరీ మొక్కలను (పట్టు పురుగులు తినే ఆకుల నిచ్చేవి) పెంచేందుకు వినియోగించిన భూములు మాత్రం వంశ పారంపర్యంగా రైతు ఆధీనంలోనే వుంటాయి. ఎక్కువ బానిసలు, దుక్కి పశువులు కలిగివున్న భూస్వాములకు ఈ విధానంవల్ల ఎక్కువ భూమి లభ్యమయింది.

రైతులు పన్నును ధాన్యం రూపంలోనూ, లెవీలను పట్టువస్త్రాలు లేదా దూది వస్త్రాల రూపంలోనూ ప్రభుత్వానికి చెల్లించేవారు. రాచ భవనాలను, గోడలను నిర్మించేందుకు, నీటి వనరులను బాగుచేసేందుకు పరిహారం లేకుండా రైతులు నిర్బంధ చాకిరీ చేయవలసి వచ్చేది.

ఉత్తర వీ రాజధాని నగరమైన పింగ్ చెంగ్ ఉత్తరచైనా సరిహద్దున వుండేది. పెద్ద జనాభాకు ఉద్యోగులకు, అవసరమైన ధాన్యం అందజేసేందుకు నావికా మార్గం రాజధానికి లేకుండేది. ఈ కారణంవల్ల హ్సియావో వెన్ చక్రవర్తి రాజధానిని ఉత్తరచైనా నడిగడ్డలోవున్న సాంస్కృతిక జీవితానికి గొప్పకేంద్రమైన లోయాంగ్ నగరానికి మార్చాడు. కొత్త రాజధానికి అనుకూలమైన భూమార్గాలు, జలదార్లు వుండేవి. హాన్ సంస్కృతిని, ప్రభుత్వ విధానాన్ని అవలంబించడానికి, దేశ పరిపాలన సాగించడానికి లోయాంగ్ నగరం రాజధాని కావడంవల్ల ఎక్కువ అవకాశాలు ఏర్పడ్డాయి. హ్సియెన్ పీ తెగ ప్రభువులందరినీ హాన్ ఇంటిపేర్లు పెట్టుకోమనీ, హాన్ భాషను మాట్లాడమనీ, హాన్ దుస్తులను ధరించమనీ చక్రవర్తి ఆజ్ఞాపించాడు. రాజభవనంలో హ్సియెన్‌పీ భాషను మాట్లాడటం, ఆ దుస్తులను ధరించడం తప్పుగా ఎంచబడింది. హ్సియెన్ పీ ప్రభువుల సంతానానికి హాన్ జమీందార్ల బిడ్డలతో వివాహాలు చేసుకోవడం ప్రోత్సహించబడింది.

చక్రవర్తి హ్సియావో వెన్ సంస్కరణల పర్యవసానంగా హ్సియెన్‌పీ ప్రభువులకు హాన్ జమీందారులతో సంబంధాలు మరింత సన్నిహితమయ్యాయి. దక్షిణ వంశాల షీట్సూ విధానం (వంశ పారంపర్యంగా ఉద్యోగ పదవులను చెలాయించే పద్ధతిని) అవలంబించి, ఉద్యోగుల కులంవారినే వివిధ పదవులకు నియమించాడు. హ్సియెన్‌పీ ప్రభువులను ఉన్నతోద్యోగాలలో నియమించి, వంశ పారంపర్యంగా వారా పదవులలో వుండాలని నిర్ణయించబడింది.

రైతులను దోపిడి చేయడం, విలాసప్రియులు, దుబారా ఖర్చుదార్లయిన ఉద్యోగవర్గం చేతుల్లోకి ధనం ప్రవహించడం యథాప్రకారం సాగిపోయింది. తమ

భాగ్యాన్ని ప్రదర్శించడంలో ప్రభువులు ఒండొరులతో పోటీపడేవారు. ఉద్యాన వనాల్లో అనేక అంతస్థులున్న విలాస గృహాలను నిర్మించుకున్నారు.

యువాన్ షెన్ అనే ఒక ప్రభువు గుర్రపుసాలలో దానావేసేందుకు వెండి తొట్లను, గుర్రపు కళ్ళాలకు బంగారాన్ని ఉపయోగించాడంటే ప్రభువుల ఆడంబరానికి అదొక ఉదాహరణగా తీసికోవచ్చు. అతడిచ్చే విందులలో అతిథులు స్ఫటిక పాత్రలలో ద్రాక్ష సారా తాగేవారు. అతడి భాగ్యాన్నంతటినీ అతిథులకు ప్రదర్శించుకునేవాడు. వీటిలో వంద బంగారు పళ్ళాలు, వెండి కూజాలు వుండేవి. దేశం అన్నివైపుల నుండి సేకరించిన అసంఖ్యాకమైన సిల్కులు, అనేక ఇతర వస్తువులు వున్న భాండాగారాలను అతిథులకు చూపించేవాడు.

## ఉత్తర ప్రాంతంలో తిరుగుబాట్లు

ఉత్తర సరిహద్దుకు ఆవలవున్న జోజాన్ తెగవారి దాడుల నుండి రక్షించుకోడానికి, పించెంగ్ నగరానికి ఉత్తరంగా సరిహద్దునే సైనిక కేంద్రంతో సహా అనేక పట్టణాలను నిర్మించారు. ఈ కేంద్రాలలోని సేనానులు పచ్చి దురాశాపరులుగా ప్రఖ్యాతిచెందారు. మంచి భూములన్నిటినీ ఆక్రమించి, తమ సైనికులను, రైతులను పాలేళ్లగానూ, కట్టెలు కొట్టేవాళ్ళగానూ, కమ్మరివాళ్లుగానూ బలవంతంగా ఈ సేనానులు వినియోగించుకునేవారు. ఈ దోపిడితో తృప్తిచెందక, వాళ్లకివ్వాలసిన జీతభత్యాల్లో కూడ మోసం చేసేవారు. క్రీ. శ. 523వ సంవత్సరంలో సైనికులు తిరుగబడి, సేనానులను చంపివేశారు. వీన్ ప్రజల్లోనూ, హూ ప్రజల్లోనూ వున్న ద్వేషాగ్ని రగుల్కొడానికి ఈ తిరుగుబాటు దోహదం చేసింది. హోపేరాష్ట్రమంతటా వ్యాపించిన రైతు విప్లవ సైన్యాలు ఉత్తర వీ ప్రభుత్వం పంపిన సైన్యాలను వరుసగా ఓడించివేశాయి.

హోపే రైతుల తిరుగుబాటుకు నాయకత్వం వహించిన కె జంగ్ ఆధ్వర్యాన పది లక్షల విప్లవసేన సమీకృతమయింది. ఉత్తర వీ ప్రభుత్వ సేనలను ఓడించి, సేనాని యువాన్ యువాన్‌ను చంపిన తరువాత కె జంగ్ హోపే హోనాన్ రాష్ట్రాలలో విశాల ప్రాంతాలను స్వాధీనం చేసుకున్నాడు. దుష్టప్రభుత్వాన్ని ధ్వంసంచేసే దృష్టితో రాజధానీ నగరం లోయాంగ్ వైపు కె జంగ్ తన సేనలను మరల్చాడు.

షాంటుంగ్, షాన్సీ రాష్ట్రాలలో కూడ తిరుగుబాట్లు జరిగాయి.

చివరకు తిరుగుబాటుదార్లు ఓడిపోయినప్పటికీ వారి చర్యల ఫలితంగా ఉత్తర వీ ప్రభుత్వం శిథిలమవడం ప్రారంభమయింది.

చక్రవర్తి సేనలు కె జంగ్ సైన్యంతో పోరాడుతున్న సమయంలో పింగ్‌చెంగ్ సమీపంలోని ఒక తెగ నాయకుడైన ఎర్‌చూ జంగ్ తిరుగుబాటు చేశాడు. తన సేనలతో దక్షిణంగా లోయాంగ్ నగరంపై దాడిచేసి చాలమంది ప్రభువులను, ఉద్యోగులను చంపి, అధికారం హస్తగతం చేసుకున్నాడు. తరువాత కె జంగ్‌తో

షేకోని అతడిని ఓడించాడు. ఎర్‌మూ జంగ్ మరణానంతరం అతడి సేనానులలో ఒకడైన కౌహువాన్ అధికారానికొచ్చాడు. ఉత్తర వీ చక్రవర్తి చాంగన్ నగరానికి పారిపోయి, అచట పశ్చిమ వీ ప్రభుత్వాన్ని స్థాపించాడు. రాజవంశానికి చెందిన మరొక సభ్యుని చక్రవర్తిగా ప్రకటించి, కౌహువాన్ తనరాజధానిని హోనాన్ రాష్ట్రంలోని యేహో నగరానికి మార్చి, తూర్పు వీ ప్రభుత్వాన్ని స్థాపించాడు. ఉత్తరవీ ఈవిధంగా రెండు రాజ్యాలుగా క్రీ. శ. 534 సంవత్సరంలో విడిపోయింది.

ఎల్లోనది దిగువ ప్రాంతాలను తూర్పు వీ ప్రభుత్వ ఆక్రమణలోనూ, షెన్సీ కన్సూ రాష్ట్రాలు పశ్చిమ వీ ప్రభుత్వ ఆక్రమణలోనూ వుండేవి.

కౌ-హువాన్ మరణానంతరం అతని కుమారుడు కీలుబొమ్మ చక్రవర్తిని తొలగించి, తానే సింహాసనాన్ని ఆక్రమించాడు. ఇతడు స్థాపించిన చీ ప్రభుత్వాన్ని చరిత్రకారులు ఉత్తర వీ అని పిలుస్తారు. పశ్చిమ వీ రాజ్యంలో హ్సియెన్‌పీ ప్రజలకు చెందిన యూవెన్‌తాయ్ ప్రభుత్వాన్ని నడిపేవాడు. కాని అతడి మరణానంతరం అతని కొడుకు, చక్రవర్తిని తొలగించి, చౌ రాజ్యాన్ని స్థాపించాడు. చరిత్రకారులు దీనిని ఉత్తర చౌ అని పిలుస్తారు. వ్యవసాయం యెడల ప్రత్యేక శ్రద్ధను ఈ ప్రభుత్వం చూపింది. మంచి పంటలను పండించిన వారికి బహుమతులివ్వడం స్థానికోద్యోగుల ముఖ్య కర్తవ్యాలలో ఒకటిగా ప్రభుత్వం పరిగణించేది. పన్నుల నుండి ప్రభుత్వానికి వెట్టి చాకిరీ నుండి మినహాయించిన రైతు కుటుంబాల నుండి, సైనికులను సమీకరించే విధానాన్ని ప్రభుత్వం అవలంబించింది. ఆరు కుటుంబాలు కలసి ఒక సైనికుణ్ణి అతడి కవసరమైన ఆయుధాలను, దుస్తులను, ఆహారాన్ని, వాహనాలను సమకూర్చ వలసివుంటుంది. కొలది దశాబ్దాలుగా కన్సూ, షెన్సీ రాష్ట్రాలు కొంతవరకు శాంతిగా వున్నందున ఉత్తర చౌ ప్రభుత్వం ఆర్థిక స్తోమతు, సైనికశక్తి పెరిగింది.

## సూయ్ రాజ్యం క్రింద చైనా ఐక్యత

క్రీ. శ. 577 లో ఉత్తర చీ రాజ్యాన్ని ఉత్తర చౌ ప్రభుత్వం ఆక్రమించుకుంది. చౌ చక్రవర్తిని తొలగించి, అతని చుట్టమైన యాంగ్‌చీన్ తానే చక్రవర్తినని ప్రకటించుకున్నాడు. సూయ్ వంశానికి మూలపురుషుడైన ఇతడిని 'వెన్‌టి' చక్రవర్తి అని చరిత్రకారులు పిలుస్తున్నారు.

చక్రవర్తి యాంగ్ చీన్ అధికారంలోకి రాగానే మొదటి ప్రజామోదకరమైన చర్యగా నిర్బంధ సైనికసేవ షరతులను, పన్నులను తగ్గించాడు. అదివరకు యువకులు 18 సంవత్సరాలకే సైన్యంలో చేరి, సంవత్సరానికి నెల రోజులు సర్వీసు చేయవలసి వుండేది; ఇప్పుడు 21 సంవత్సరాలకు చేరి, యేడాదికి 20 రోజులు సర్వీసు చేయాలి. అదివరకు భార్యాభర్త సంవత్సరానికి 300 షెంగ్‌ల ధాన్యం, * 40 చీల సిల్కు-

* 1 చీ = 1.0936 అడుగు.

ప్రభుత్వానికి చెల్లించవలసి వుండగా ఇపుడు 300 షెంగ్‌ల ధాన్యం, 20 చిల సిల్కు చెల్లించితే సరిపోతుంది.

దేశమంతటా జనాభా లెక్కలు తీసుకోవాలని కొత్త చక్రవర్తి ఆజ్ఞాపించాడు. పెద్ద జమీందారులు తమ క్రింద వున్న జనాభాలో 16 లక్షల మందిని గురించి ప్రభుత్వానికి తెలుపకుండా దాచారని జనాభా లెక్కలవల్ల తేలింది. వీరందరినీ జమీందార్ల ఆధీనంనుండి తొలగించి, పన్నులను చాకిరీని సూటిగా ప్రభుత్వానికే చెల్లించాలని చక్రవర్తి నిర్ణయించాడు. యాంగ్ చీన్ ప్రవేశపెట్టిన సంస్కరణల ఫలితంగా రాజధానికి సప్లయిల మొత్తం క్రమంగా పెరుగసాగింది. దేశంపై ప్రభుత్వాధికారం బలపడింది.

ఐనప్పటికీ దక్షిణ చైనా మరో వంశ పరిపాలన క్రింద వున్నందున చైనా యింకా ఐక్యమవలేదు. దేశం విభజింపబడివున్నందున, నిరంతర యుద్ధ ప్రమాదాల వల్ల విపరీత నష్టాలు సంభవించడం పరిపాటయింది. ఉత్తర, దక్షిణ చైనాల మధ్య వర్తకం తరచుగా స్తంభించిపోయేది.

క్రీ. శ. 589 లో చెన్ రాజ్యంపై సూయ్ ప్రభుత్వం పెద్ద దాడి ప్రారంభించింది. యాంగీ నదిని దాటి, చియిన్ కాంగ్ రాజధానిని ఆక్రమించుకుంది. తూర్పు ట్సిన్ వంశంతో ప్రారంభమైన దేశ విభజన, 270 సంవత్సరాల అనంతరం చెన్ రాజ్య పతనంతో ఈ విధంగా అంతమయి, చైనా దేశం ఏకమయింది.

20 వ అధ్యాయం

# మూడు రాజ్యాలనుంచి దక్షిణవంశాల వరకు సంస్కృతి

## విజ్ఞానశాస్త్రం - సాంకేతిక నిపుణత

ఆ కాలంలో చైనా గొప్ప విజ్ఞాన శాస్త్రజ్ఞులలో ఒకరు ట్సూ చూంగ్-చీ (క్రీ. శ. 429-500). గణితశాస్త్రం, ఖగోళశాస్త్రం, పంచాంగ రచన, నిర్మాణ కౌశల్యం గురించి ఆయన అధ్యయనం చేశారు. సూర్యుని నీడను కొలవడంలో గొప్ప ప్రజ్ఞను సాధించారు. π అనగా 3.1415926 తో సమానమని* ఆయన చేసిన నిర్ధారణ ప్రపంచంలో అప్పటికి కనుగొన్న పరిశోధన లన్నింటికంటే వాస్తవానికి దగ్గరగావుంది.

ఉత్తర వీ రాజ్యానికి చెందిన బియజ్జే హ్సియా అనే శాస్త్రజ్ఞుడు చిన్ మిన్ యావ్ షూ అనే గ్రంథాన్ని (వ్యవసాయం, పశుపోషణకు గైడు) రచించాడు. ఆ రోజుల్లో వివిధ జాతుల ప్రజలు వ్యవసాయంలో సంపాదించిన అనుభవాలను ఈ పుస్తకంలో రచయిత సంక్షిప్తపరచాడు. ఎన్నో ప్రాచీన గ్రంథాలను అధ్యయనం చేసి, ముసలి రైతుల అనుభవాలను తెలిసికొని, తాను స్వయంగా వ్యవసాయం చేసి, రచయిత అమూల్యమైన ఈ గ్రంథాన్ని వ్రాశాడు.

దున్నడం, సరైన విత్తనాలను ఎంచుకోవడం, తెగుళ్ళ నివారణను గురించి ఆచరణయోగ్యమైన, ప్రయోజనకరమైన పద్ధతులను ఈ పుస్తకం తెలుపుతుంది. జామ, పియర్ పండ్ల వృక్షాలకు వచ్చే తెగుళ్ళ నివారణను గురించి కూడ తెలుపడం ఆ కాలానికి గొప్ప విశేషంగానే ఎంచవచ్చు. పశుపోషణయెడల శ్రద్ధ చూపడమే గాక, జంతువుల కొచ్చే వ్యాధుల నివారణ పద్ధతులను కూడ ఈ పుస్తకం తెలుపుతుంది. గుర్రం వివిధ అవయవాలను గురించిన వర్ణనలూ, వాటి లక్షణాలనుబట్టి జంతువుయొక్క మంచి చెడ్డలను తెలుపుతూ చాలా పుటలు వున్నాయి.

---

* చక్రం మధ్య కొలతను 22/7 తో హెచ్చించితే చుట్టుకొలత ఎంతో తెలుస్తుంది. 22/7 అనగా 3.142857 ను π (పై) అని పిలుస్తారు.



ట్సు చూంగ్ - చి (429-500)

76B



షాన్సీరాష్ట్రంలోని యుంకాంగ్ గుహలలోని బౌద్ధవిగ్రహాలు

# బౌద్ధమత వ్యాప్తి

తూర్పు హాన్ వంశ పరిపాలనలో మొదటిసారి చైనాలో బౌద్ధ మఠాలు ఏర్పడ్డాయి. కాని, పశ్చిమ ట్సిన్ వంశపరిపాలన తరువాతనే బౌద్ధమతం వ్యాపించడం ప్రారంభమయింది. దక్షిణ వంశాల కాలంలో బాగా అభివృద్ధి చెందింది. ఉత్తర వంశాల పరిపాలనా కాలంలో బౌద్ధమత ప్రాబల్యం అత్యున్నత స్థాయిలో వుంది. దేశమంతటా 30 వేల మఠాలు, 20 లక్షల సన్యాసులు, సన్యాసినులు వుండేవారని బౌద్ధులు చెప్తుంటారు.

బౌద్ధమత ప్రచారంవలన, ఎక్కువ బౌద్ధ గ్రంథాలను అనువదించడంవలన చైనా సంస్కృతిపై వాటి ప్రభావం చాలపడింది. ప్రాచీన భారతదేశ సంస్కృతిని గురించి, ప్రకృతిని మానవ జీవితాన్ని గురించి, భారతదేశ చారిత్రక విషయాలను గురించి బౌద్ధగ్రంథాలు తెలుపుతాయి. కథలు, గాథలు, దీర్ఘమైన కావ్యాలు, గేయాలు వగైరా చక్కని సాహిత్య గ్రంథాలు కూడ వాటిలో వున్నాయి. చైనా విజ్ఞాన శాస్త్రం, తత్వశాస్త్రం, సాహిత్యం అభివృద్ధి చెందడానికి బౌద్ధగ్రంథాలు గొప్ప ప్రోత్సాహాన్ని కలుగజేశాయి. చైనా కళల రూపురేఖలు తీర్చి దిద్దుకోవడంలోనూ, విశిష్ట లక్షణాలను రూపొందించుకోవడంలోనూ భారతీయ శిల్పం, చిత్రకళల ప్రభావం ఎంతో ఉపయోగపడింది.

ఆ కాలంలో యిద్దరు బౌద్ధ అనువాదకులు ప్రఖ్యాతిచెందారు. పూజ్యులైన టావ్-అన్ 312 - 385 సంవత్సరాల మధ్య జీవించాడు. భారతీయ సన్యాసి కుమార జీవుడు (343-413) చాల సంవత్సరాలు చైనాలో వుండి 300 సంవత్సరాలకు మించిన బౌద్ధగ్రంథాలను అనువదించాడు.

క్రీ. శ 399 లో ఫా-హ్సియేన్ అనే ప్రసిద్ధ సన్యాసి కొందరు సహాధ్యాయులతో సహా చాంగన్ నగరాన్నుంచి భారతదేశానికి బయలుదేరి వెళ్ళాడు. దారిలో తారిమ్ మైదానాన్ని దాటి, పామీర్ పీఠభూములను అధిగమించాడు. ఫా-హ్సియేన్ భారతదేశంలో మూడేళ్ళు అధ్యయనం చేసి, భారత భాషను నేర్చుకున్నాడు. బౌద్ధ గ్రంథాలకు స్వయంగా ప్రతులను (కాపీ) వ్రాసుకున్నాడు. భారతదేశాన్నుంచి సింహళానికి వెళ్ళి, అచట మరో రెండేళ్ళు బౌద్ధమతాన్ని అధ్యయనం చేశాడు. పది సంవత్సరాల సంచారంలో ముప్పది దేశాలకు పైగా తిరిగి, సముద్రమార్గాన చైనాకు తిరిగివచ్చాడు. తాను సేకరించిన అనేక బౌద్ధమత గ్రంథాలను తనతోపాటు తెచ్చాడు.

చైనా తిరిగి వచ్చాక ఫా - హ్సియేన్ తన సంచారంలో తెలుసుకున్న విషయాలను తెలుపుతూ "బౌద్ధ దేశాల రికార్డు" అనే గ్రంథాన్ని వ్రాశాడు. పదిహేను వందల యేళ్ళనాటి ప్రాచీన భారతదేశ పరిస్థితులను అధ్యయనం చేయడానికి ఎంతో విలువైన సమాచారాన్ని పై గ్రంథం తెలుపుతుంది.

ఆరో శతాబ్దం మొదటి భాగంలో ఉత్తర, దక్షిణ చైనా అన్ని ప్రాంతాలలోనూ దేవాలయాలు, గాలిగోపురాలు నిర్మించబడ్డాయి; బౌద్ధ విగ్రహాలు రాతిలో శిల్పులచేత చెక్కబడ్డాయి. లోహాలతో ఫోత పోయబడ్డాయి. ఆ కాలపు ప్రజలు కళారంగంలో సాధించిన గొప్పతనానికి చిహ్నంగా ఈ కళారూపాలు నిలిచివున్నాయి.

ఉత్తర వీ రాజ్యంలో (షాన్సీ రాష్ట్రం టాటుంగ్ సమీపాన) వున్న యున్‌కాంగ్ కొండలలోని అనేక విగ్రహాలను చెక్కడానికి, దేవాలయాలను పూర్తి చేయడానికి వంద సంవత్సరాలకు పైగా తీసికొనివుంటుంది. రాతిలో మలచబడిన బౌద్ధ విగ్రహ మొకటి పూర్తి రూపంలో యిప్పటికీ వుంది. అది 50 అడుగుల ఎత్తుగానూ, 70 అడుగుల వెడల్పుగానూ, 50 అడుగుల మందంగానూ వున్న గొప్ప విగ్రహం. 50 అడుగుల వెడల్పున్న పీఠంపై కూర్చున్న విగ్రహం చుట్టూ నాలుగు చిన్న బౌద్ధ విగ్రహాలు వుంటాయి. పీఠము, గోడలపైన చక్కని శిల్పాలు చెక్కబడివున్నాయి.

ఈ గుహ ప్రక్కనే వున్న మూడు గుహాల నిర్మాణం వేరుగావుంది. ఒకదాన్లో శాక్యముని రాత్రివేళ ఇల్లు విడిచి గుర్రంపై వెళ్ళిపోయి సన్యాసియైన గాథ చెక్కబడివుంది. డెక్కల ధ్వని వినిపించి, ఇంట్లోవారు మేల్కొనకుండా నలుగురు దేవతలు గుర్రపు కాళ్ళను మోస్తున్నట్లుగా శిల్పి చెక్కాడు. గోడలపై మలచబడిన శిల్పాలన్నిటిలోనూ ఎగురుతున్న దేవకన్యలు నృత్యాలు చేస్తున్నట్లుగా చెక్కారు. ఈ శిల్పాలు ఎంతో సున్నితంగా చక్కని కదలికలను చూపుతుంటాయి. దుస్తులను రమణీయంగా చెక్కారు.

21 వ అధ్యాయం

# సూయ్ వంశం, యాంగ్‌టీ చక్రవర్తి నిరంకుశ పాలన

సూయ్ వంశ మూలపురుషుడు చైనా ఐక్యతను సాధించడంతో దీర్ఘ కాల యుద్ధం అంతమయింది. జనాభా త్వరితగతిని పెరిగి, ఏడవ శతాబ్దం నాటికి 90 లక్షల కుటుంబాలకు వృద్ధయింది. ప్రభుత్వం అపారధనం ఆర్జించింది. ప్రభుత్వ ధాన్యాగారాలు కోట్లకొలది పికుల్స (1 పికుల్–133⅓ పౌనుల బరువు) ధాన్యంతో నిండుగా వుండేవి. చాంగన్, లోయాంగ్, తాయియువాగ్ నగరాల్లోని ప్రభుత్వ గిడ్డంగులలో కోట్లకొలదీ సిల్కు–తాన్లు, బట్టలతాన్లు నిల్వ వుండేవి.

చక్రవర్తి వెన్‌టీ కుమారుడైన యాంగ్ టీ చక్రవర్తి దేశ సంపదను వినియోగించి, బ్రహ్మాండమైన ప్రాజెక్టులను నిర్మించేందుకు ప్రజలచేత నిర్బంధంగా చాకిరీ చేయించాడు.

లోయాంగ్ నగరాన్ని పునర్నిర్మించేందుకు అనేకమంది దృఢకాయులైన మనుష్యులు సమీకరించబడ్డారు. రాజభవనాల నిర్మాణానికి అవసరమైన కలపను యాంగ్‌ట్సీ నదికి దక్షిణ ప్రాంతాలనుండి రవాణా చేయవలసివచ్చింది. ఇందుకు వినియోగించిన శ్రామికులలో దాదాపు సగంమంది మరణించారు. లోయాంగ్ నగరం చుట్టుపట్ల రహదార్లపై శవాలతో నిండిన బళ్ళు అనేకం కన్పించాయి.

బ్రహ్మాండమైన కాలువను (గ్రాండ్ కెనాల్) తవ్వేందుకు చక్రవర్తి హుకుం జారీ అయింది. ఉత్తరాన ప్రస్తుత హోపే రాష్ట్రంలోని ఛోంచున్ నుంచి దక్షిణాన యాంగ్ చౌ వరకు, ఇంకా యాంగ్‌ట్సీ నదికి దక్షిణావున్న హంగ్ చౌ వరకువున్న ఈ కాలువకు మధ్య కేంద్రంలో లోయాంగ్ నగరం వుంటుంది. ఎల్లోనదిని, హువాయ్ నదితోనూ, యాంగ్‌ట్సీ నదితోనూ కలిపే ఈ కాలువ ఉత్తర – దక్షిణాలను కలిపే గొప్ప నావికామార్గంగా ఉపయోగపడింది. ఈ కాలువ త్రవ్వకంలో 20 లక్షలకు మించిన జనం పాల్గొన్నారు. మగవాళ్ళు అవసరమైనంత సంఖ్యలో దొరకనపుడు స్త్రీలను కూడ సమీకరించారు.

యాంగ్ చౌ వరకు యీ కాలువ త్రవ్వకం పూర్తయ్యాక చక్రవర్తి యాంగ్ టీ గొప్ప ఓడలో వేలకొలదీ పడవలు చుట్టూ కాపలావుండగా విలాస యాత్రచేశాడు. ఈ పడవు లన్నిటినీ లాగడానికి 80 వేలకు పైగా శ్రామికులను వినియోగించారు. విలాసయాత్ర వెళ్ళిన చోట్లల్లా కాలువ ఒడ్డునేవున్న ఆ ప్రాంత ప్రజలు ఆహారం అందజేయాలని హుకుం వెళ్ళింది. మిగిలిన పదార్థాలు పారవేసేవారు.

లి కుంగ్ అనే రాజభవనాన్ని నిర్మించేందుకు, బ్రహ్మాండమైన చైనా గోడను (గ్రేట్ వాల్) బాగు చేసేందుకు, పర్వతాలపైగా రహదార్లు నిర్మించేందుకు చక్రవర్తి యాంగ్ టీ లక్షలకొలదీ కార్మికులను పంపాడు.

చక్రవర్తి విపరీతఖర్చులు చేయడంవల్ల ప్రభుత్వ ఖజానా ఖాళీ అయింది. అందుచేత పది సంవత్సరాల పన్నులను ముందుగానే చెల్లించాలని ప్రజలను ఆజ్ఞాపించాడు.

## కొరియాతో యుద్ధం

ఇరుగు పొరుగు రాజ్యాలతో వరుసగా అనేక యుద్ధాలను చక్రవర్తి రెచ్చగొట్టాడు. కొరియాపై దాడి అన్నిటిలోకి పెద్దది.

611 లో కొరియాపై దాడికి సన్నాహాలు చేశాడు. నిర్బంధ సైనిక సమీకరణ, సంబారాల సేకరణ, రథాల, యుద్ధనావల నిర్మాణం తీవ్రతరం చేయబడ్డాయి. నిర్బంధంగా సమీకరించబడిన లక్షలాది శ్రామికులు వారి పశువులతో వారి బళ్ళపైన సంబారాలను, ఆయుధాలను సరిహద్దు ప్రాంతాలకు చేరవేయాలని హుకుం జారీఅయింది. వీరిలో చాలమంది మరణించినందున రహదార్ల వెంట శవాలు వెదజల్లబడినట్లుగా పడివుండేవి. నావలను నిర్మించేవారిచేత రాత్రింబవళ్ళు బలవంతాన పని చేయించినందున ప్రతి పదిమందిలో నలుగురు శక్తి వుడిగిపోయి మరణించారు. శ్రామికుల కొరత, దుక్కి పశువుల కొరత ఏర్పడినందున విశాలమైన ప్రాంతాలు బంజరు భూములుగా వృధా అయాయి.

మరుసటి సంవత్సరం యాంగ్ టీ చక్రవర్తి 11 లక్షల 30 వేల సేనతో ఛోచున్ నుంచి కొరియాపైకి దాడివెళ్లాడు. ఈ సైన్యాన్ని చేరవేయడానికి 20 లక్షల శ్రామికులు అవసరమయ్యారు. షాంటుంగ్ రాష్ట్రంలోని టుంగ్ లాయ్ నుంచి మరో సైన్యం సముద్రమార్గాన బయలుదేరింది. ప్యోంగ్ యాంగ్ నగర సమీపంలో కొరియా ప్రజలు వీరోచితంగా పోరాడారు. సూయ్ సైనికులు ఈ దాడికి వ్యతిరేకులైనందున పారిపోయారు. దాడి పూర్తిగా విఫలమయింది. సంబారాలు, ఆయుధాలు పెద్ద మొత్తంలో నష్టమయ్యాయి.

చక్రవర్తి యాంగ్ టీ మరో రెండుసార్లు కొరియాపై దాడిచేసినా జయించలేకపోయాడు.

# సూయ్ అంత్యదశలో రైతుల తిరుగుబాట్లు

అమానుషమైన దోపిడీ, నిర్బంధ విధానం, క్రూరత్వం వీటి పర్యవసానంగా రైతులు తిరుగుబాటు చేశారు. కొరియా యుద్ధాలలో సప్లయి కేంద్రాలుగా వున్న షాంటుంగ్, హోపే రాష్ట్రాలలోని రైతులు వెట్టిచాకిరి చేయడంలోనూ, నిర్బంధ సైనికులుగానూ ఎక్కువ భారం మోశారు. అందుచేత వారే మొదట తిరుగబడ్డారు.

కొరియాపై దాడికి చక్రవర్తి యాంగ్ టీ సన్నాహం చేస్తున్న సమయంలో షాంటుంగ్ రాష్ట్రం చాంగ్‌పై పర్వతాలలో రైతుల తిరుగుబాటుకు వాంగ్ పో నాయకత్వం వహించి నడిపాడు. రైతులను వుత్సాహపరుస్తూ, "లియోటుంగ్‌కు వెళ్ళబోకండి! కాందిశీకులుగా చావబోకండి" అని వ్రాశాడు. అతని జెండాక్రింద రైతులు ప్రోగయ్యారు. ఈ లోగా షాంటుంగ్, హోపే రాష్ట్రాల సరిహద్దు ప్రాంతాలలో మరిన్ని తిరుగుబాటు దళాలు ప్రత్యక్షమయ్యాయి.

తిరుగుబాటుదార్లు త్వరలోనే గొప్పశక్తిగా తయారయ్యారు. విస్తృతమైన ప్రాంతం వారి స్వాధీనమయింది. పదివేలనుంచి లక్షమంది బలం కలిగిన 80 రైతు సైన్యాలు ఎల్లోనది లోయలోను, యాంగ్‌ట్సీ లోయలోను విస్తృత ప్రాంతంలో వ్యాపించి, అనేక ఫిర్కా, తాలూకా పట్టణాలను పట్టుకున్నాయి.

రైతు సేనలు వీరోచితంగా పోరాడి, సూయ్ సైన్యాలపై తీవ్రమైన దెబ్బలు కొట్టాయి. ప్రారంభంలో రైతుసేనలు వేర్వేరుగా పోరాడినందున కొన్ని అపజయాలు పొందాయి. కాని తరువాత తిరుగుబాటుదార్లు తమ సైనికశక్తిని పునర్నిర్మించుకుని, కొన్ని బలోపేతమైన సైన్యాలను తయారుచేసుకున్నారు.

హోనాన్‌లో తిరుగుబాటుదార్లను సమీకృతమొనర్చి వా కాంగ్ సైన్యం గొప్ప శక్తిగా తయారయింది. లోయాంగ్ సమీపంలోవున్న బ్రహ్మాండమైన ప్రభుత్వ ధాన్యాగారాన్ని స్వాధీనం చేసుకుని, అన్నాతురులైన ప్రజలకు ధాన్యం పంచి, వారి తోడ్పాటును సంపాదించింది. విప్లవకారుల సంఖ్య పది లక్షలవరకు పెరిగింది. హోనాన్ రాష్ట్రంలో అధికప్రాంతాన్ని ఆక్రమించింది. ఉత్తరప్రాంతంలోని రైతు విప్లకారులకు లీమీ నాయకత్వం వహించాడు.

లోయాంగ్ (రాజధాని) నగరాన్ని పట్టుకునేందుకు జరిగిన పోరాటాలలో వా కాంగ్ విప్లవసైన్యం అనేక లక్షల బలమున్న సూయి సేనలతో తలపడి, అనేకసార్లు ఓడించింది. అనేకమంది సూయి సేనానులు మరణించడం, లొంగిపోవడం జరిగింది. సూయి సైన్యం బలహీనపడింది.

టౌ-చీన్-టేహ్ నాయకత్వాన మరో విప్లవదళం షాంటుంగ్‌నుండి హోపేకు వెళ్ళి త్వరలోనే పెద్దశక్తిగా తయారయింది. సూయి సైన్యాన్ని ఛోచున్ వద్ద నిలవేసి దక్షిణానికి వెళ్ళకుండా ఆపుజేసింది. తద్వారా లోయాంగ్ నగరం శివార్లలో సూయి సైన్యంతో వా కాంగ్ విప్లవసేన తలపడి దెబ్బతీయడానికి అవకాశ

మిచ్చింది. హువాయ్ నదికి దక్షిణాన మూడవ విప్లవదళం టూ-ఫీ-నీ నాయకత్వం క్రింద యాంగ్ చౌ వద్ద సూయీ సైన్యాన్ని నాశనం చేసింది.

ఈ విధంగా రైతు విప్లవ సేనలు సమిష్టిగా అన్నివైపులనుండి దెబ్బతీసినందున సూయీ ప్రభుత్వం పునాదులు పూగిసలాడసాగాయి.

ఈ పరిస్థితులను వినియోగించుకొని స్థానికోద్యోగులు, భూస్వాములు తమ స్వంత సేనలను నిర్మించుకొని సూయీ ప్రభుత్వాధికారాన్ని ధిక్కరించసాగారు.

క్రీ. శ. 617 లో తైవాన్‌లోవున్న సూయీ సైన్య ఉన్నతాధికారి లీ యువాన్ లక్ష సేనను సమీకరించుకొని, ఎల్లోనది దాటి చాంగన్ నగరాన్ని పట్టుకున్నాడు. మరుసటి సంవత్సరం యాంగ్ చౌ నగరంలో స్థానికాధికారి ఒకడు చక్రవర్తి యాంగ్‌టీని చంపివేశాడు. తరువాత లీ యువాన్ సింహాసనం ఆక్రమించి తన రాజ్యానికి టాంగ్ వంశ రాజ్యమని పేరుపెట్టాడు. ఇతడిని చరిత్రకారులు కావ్‌ట్సూ చక్రవర్తని పిలుస్తారు. తన కొడుకు లీ-షీ-మిన్ సహాయంతో లీ యువాన్ క్రమంగా విప్లవ రైతు సేనలను అణచివేశాడు. బృహత్తరమైన టాంగ్ సామ్రాజ్యాన్ని స్థాపించాడు. అతని కొడుకుకూడ గొప్ప ప్రజ్ఞావంతుడైన పరిపాలకుడనని తరువాత నిరూపించుకున్నాడు.

22 వ అధ్యాయం

# టాంగ్ వంశపు మొదటి పాలకులు

సూయ్ వంశాన్ని త్వరగా కూలద్రోసింది రైతు తిరుగుబాటులన్న సత్యాన్ని టాంగ్ వంశపు మొదటి పాలకులు గుర్తించారు. రైతులతో రాజీగా వారు తమ పరిపాలనను ప్రారంభించారు. తండ్రి అనంతరం సింహాసనం అధిష్టించిన లీ షి మిన్ ఇతనిని చరిత్రకారులు తాయ్‌ట్సుంగ్ చక్రవర్తని పిలుస్తారు. తన మంత్రులతో సూయ్ వంశ పతనానికి కారణాలను గురించి చర్చించేవాడు. ఒకసారి రైతులు తిరగబడితే వారికెంత దెబ్బతీయగల శక్తి వుంటుందో చక్రవర్తి గమనించాడు.

"పరిపాలకుడు పడవలాంటివాడు; ప్రజలు నీళ్ళవంటివారు. పడవను నీళ్ళు తేలలాడునట్లు చేయగలిగినట్లుగానే ముంచివేయనూవచ్చు" అని తమ చర్చలలో వారనుకునేవారు. తన పరిపాలనను బలపరచుకోవాలంటే ప్రజలను దోచుకోవడంలోనూ, అణచి వేయడంలోనూ పరిపాలకుడు అతిగా వ్యవహరించరాదు : అంతేగాక కొన్ని విషయాలలో ప్రజలతో రాజీపడవలసి వుంటుంది.

చక్రవర్తి తాయ్ ట్సుంగ్ ఒకసారి యిలా అన్నాడు; "రాజభవనం నిర్మించాలని చక్రవర్తి అభిలషించుతాడు. కాని ప్రజలు దానికి యిష్టపడరు. మనుష్యులతో వూడిగం చేయించుకోవాలని చక్రవర్తి ఆతురతపడతాడు. కాని వెట్టిచాకిరీ అంటే ప్రజలు ఏవగించుకుంటారు. ప్రజలచేత మితిమీరిన వూడిగం చేయించడం ప్రమాదకరం" ఆయన యింకా యిలా అన్నాడు; "ప్రజలనుండి అధిక పన్నులను వసూలుచేసే చక్రవర్తి తన మాంసాన్ని తానే తిన్నవాడౌతాడు. మాంసం ఐపోయాక మనిషి మరణించుతాడు."

## భూమి పంపకం

టాంగ్ వంశ మొదటి పాలకులు రైతులతో చేసుకున్న ముఖ్యమైన రాజీలకు చిహ్నంగా భూమిని సమానంగా పంచే విధానం, ట్సూయంగ్ విధానం అమల్లోకి వచ్చాయి. కేవలం అలాంటి పద్ధతివల్లనే ఉత్పత్తి / తిరిగి యధాస్థితికి వృద్ధిచేయడం సాధ్యమవుతుంది.

అంతర్యుద్ధకాలంలో పడావుగా పడివున్న భూమిని రైతులకు పంచడం జరిగింది. భూమిని సమానంగాపంచే చట్టం ప్రకారం భూమి ఎక్కువ జనాభా తక్కువవున్న 'విశాల' గ్రామంలో 18 సంవత్సరాలున్న వయోజనులు ఒక్కొక్కరికి 100 మౌల భూమి పంచబడింది. ఇందులో యంగ్ యే టీన్ అని పిలువబడే 20 మౌల భూమి అతడి స్వంతభూమిగా వుంటుంది; కౌ ఫెన్ టీన్ అని పిలువబడే తక్కిన 80 మౌల భూమి అతడి మరణానంతరం తిరిగి ప్రభుత్వానికి చెందుతుంది. భూమి తక్కువ జనాభా ఎక్కువ వున్న 'సన్న' గ్రామంలో 18 ఏళ్లొచ్చిన ప్రతి వయోజనునికి కౌ ఫెన్ టీన్ 40 మౌలు మాత్రమే కేటాయించబడింది. యంగ్ యే టీన్ అని పిలువబడే స్వంతభూమిని అమ్ముకునే హక్కుకూడ రైతు కీయబడింది.

భూస్వాముల స్వప్రయోజనాలతో ఎలాంటి జోక్యాన్ని కొత్త పరిపాలకుడు కల్గింపకోలేదు. ప్రభువులు, ఉద్యోగులు వారి హోదాను అనుసరించి ఎక్కువ భూమిని కలిగించి వుండవచ్చు. అంతేగాక వారికి బహుమానాల పేరుతో 'పెద్ద భూఖండాలను చక్రవర్తి మంజూరుచేశాడు.

ట్సూయంగ్ టియోవ్ విధానం (పన్నుల పద్ధతి) ప్రకారం ఒక్కొక వయోజనుడు సంవత్సరానికి రెండు పికుల్సు ధాన్యం పన్నుగా (ట్సూ) చెల్లించాలి; 20 అడుగుల సిల్కు, 20 రోజుల చాకిరీ రూపంలో టియోవ్‌ను తీర్చుకోవాలి. చాకిరీ చేసేందుకు ఇష్టంలేనివారు ఎగవేసిన ప్రతిరోజుకు 3 అడుగుల సిల్కును అదనంగా యిచ్చుకోవాలి. ఈ పద్ధతినే 'యోవ్' అని పిలుస్తారు. ప్రకృతిసిద్ధమైన ప్రమాదాలు వచ్చినపుడు పన్ను వసూళ్ళను ఆపుచేయడం, లేక రెమిషన్ యివ్వడం జరిగేది.

టాంగ్ పరిపాలన మొదటి దశలో పై విధంగా రైతులకు భూమిని పంచారు. నిర్ణయించిన రేటుప్రకారం పన్నులను, పన్నులను, వసూలు చేసేవారు. మాసూలు సమయాల్లో రైతులనుండి చాకిరీ కోరకుండా ప్రభుత్వం జాగ్రత్త వహించేది. ఈ విధంగా వ్యవసాయోత్పత్తి పునరుద్ధరించబడింది.

ఒక శతాబ్దంలో అనేక పంట కాలువలను రైతులు త్రవ్వారు: పశు సంపదను వృద్ధి చేసుకున్నారు. మిడుతలదండును ఎదుర్కొనేందుకు ఉద్యమాన్ని ప్రారంభించి ఆ బాధ్యాన్ని తుడిచివేశారు. ధాన్యం, బట్టల ఉత్పత్తి పెరిగి, ప్రభుత్వం భాగ్యవంతంగా తయారైంది.

## చేతిపరిశ్రమలు - వర్తకం

టాంగ్ పరిపాలనలో చేతి పరిశ్రమలు, వర్తకం బాగా అభివృద్ధి చెందాయి. చాలా నగరాలు విస్తరించి, వర్తక వ్యాపారాలు అభివృద్ధి చెందాయి. ధాన్యోత్పత్తి బాగుపడింది.

నగరాలలో రెండు రకాలైన దుకాణాలుండేవి. ఒకేరకమైన దుకాణాల్లో రైతులనుండి, చేతివృత్తులవారినుండి, టోకువర్తకులనుండి కొన్న వస్తువులను అమ్మే

వారు. రెండో రకం దుకాణాల్లో యజమాని అతని కుటుంబం తయారుచేసిన వస్తువులను అమ్మేవారు. చేతివృత్తి కర్మాగారం యజమానిగా వున్న నిపుణుడు (మేస్త్రీ) తన కుటుంబంవారిచేతనూ, వృత్తి నేర్చుకునే కుర్రాళ్ళచేతనూ వస్తువులు తయారు చేయించేవాడు. అంతకంటే పెద్ద చేతిపరిశ్రమల కర్మాగారాల్లో పనివాళ్ళను కూడ వినియోగించేవారు. పనివాళ్ళు, నేర్చుకునే కుర్రాళ్ళు తమ యజమానితో పాటు నివసించేవారు.

ఒకేరకమైన వ్యాపారం చేసే దుకాణాలన్నీ - సాధారణంగా - ఒకేబజారులో కేంద్రీకరించబడి, గిల్డుగా (వృత్తి సంఘంగా) వుండేవి. ఒక పెద్ద నగరంలో అలాంటి గిల్డులు చాలా వుండవచ్చు. ఉదాహరణకు చాంగన్ నగరం తూర్పు, పడమర మార్కెట్లలో అలాంటివి 220 గిల్డులు వుండేవి. లో యాంగ్ నగరంలో 120 గిల్డులు వుండేవి. ప్రతి గిల్డులోనూ మేస్త్రీ తన వ్యాపారాన్ని గురించి ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపేవాడు.

టాంగ్ వంశ పాలనలో చేతిపరిశ్రమ తగినంతగా అభివృద్ధి చెందింది. జేచువాన్ రాష్ట్రంలోనూ, ఎల్లోనది దిగువ ప్రాంతాల్లోనూ అనేక నగరాలు ప్రత్యేక ?ద్ధకాలు గల వస్త్రాలను తయారుచేయడంలో ప్రసిద్ధి చెందాయి. పట్టు పరిశ్రమకు ?ంద్రమైన టింగ్ చౌ నగరంలో 500 మగ్గాలున్న కర్మాగారం వుండేది. దానిలో తయారైన పట్టువస్త్రాలలో ఎక్కువ భాగం చక్రవర్తి కుటుంబానికి నజరానాగా అర్పించేవారు. చైనా ప్రజలు కనిపెట్టిన ముఖ్య పరిశోధనల్లో ఒకటైన పింగాణీ వస్తువుల వాడకాన్ని క్రమంగా ప్రజలు ఎక్కువ అభిమానించసాగారు. గొప్ప నైపుణ్యంతో తయారుచేసిన పింగాణీ వస్తువు స్ఫటికంతో తయారుచేసిన వస్తువంత స్వచ్ఛంగా వున్నందున, దానిని "నకిలీ స్ఫటికము"ని పిలిచేవారు. యాంగ్ చౌ నగరంలో తయారుచేసే కంచు అద్దాలు, చెంగ్టూలో తయారయ్యే బంగారం, వెండి సామగ్రి, హ్సియాంగ్ యాంగ్‌లో తయారయ్యే లక్క సామగ్రి దేశవ్యాపితంగా ప్రసిద్ధి చెందాయి.

ఉత్తర నగరాలను కలిపే తపాలా మార్గాలు, నిర్ణీత దూరాలకు తపాల స్టేషన్లు వుండేవి. వీటి ప్రక్కనే సత్రవులను నిర్మించి, ప్రయాణీకులకు అన్న పానీయాలను, అద్దె గాడిదలను సప్లయిచేసేవారు. దక్షిణాన నావికాయానం ద్వారా ఎక్కువగా రవాణా జరిగేది. సామాన్లు వేసుకున్న ఓడలు ప్రయాణంచేసే నదుల ప్రక్కనే నగరాలు పెరిగాయి. పెద్ద నగరాల ఓడరేవుల్లో అసంఖ్యాకమైన నావలు నిలచివుండేవి. హోటళ్ళలో వర్తకులు తమ సామగ్రిని నిలువచేసుకుని, వ్యాపారం సాగించేవారు.

అప్పుడప్పుడు బీడు ప్రాంతాలనుండి పశుపాలకతెగలు ఉన్ని, తోళ్ళను గుర్రాలపైన, ఒంటెలపైన వేసుకుని సరిహద్దు పట్టణాలకు వచ్చేవారు. పడమర ప్రాంతాలనుండి, మధ్య ఆసియానుండి బయలుదేరిన వర్తకబృందాలను దాటి స్ఫటిక

సామగ్రిని, తివాసీలను తెచ్చి, పెద్ద నగరాలలో అమ్మకం చేసేవారు. పర్షియా, అరేబియాలనుండి సువాసన ద్రవ్యాలు, మందులు, మణులు, ముత్యాలతో ఓడలు చైనా దక్షిణ ప్రాంత రేవులకు వచ్చేవి. కొరియానుండి వర్తకపు ఓడలు షాంఘై రేవుకు, ఎల్లో సముద్ర రేవులకు వచ్చేవి. ఆసియా వివిధ ప్రాంతాలనుంచి వచ్చిన వర్తకులు పట్టువస్త్రాలు, కంచు అద్దాలు, పింగాణీ సామగ్రి, ఇనుప వస్తువులు, తేయాకు వగైరా ఖరీదుచేసి తమ ప్రాంతాలకు తీసుకువెళ్ళేవారు. సముద్రయానానికి ఉపయోగించే టాంగ్ ప్రభుత్వ ఓడలు 200 అడుగుల పొడుగూ, బలంగానూ, సురక్షితంగానూ వుండేవి. టాంగ్ వర్తకులు తమ ఓడలతో భారతదేశం, పర్షియా, అరేబియా, దక్షిణ సముద్ర దీవులకు వెళ్ళి వర్తక వ్యాపారాలు సాగించేవారు.

వర్తక వ్యాపారాలు పెరిగేకొలదీ డబ్బు అవసరం ఎక్కువయింది. ఎనిమిదవ శతాబ్దం మధ్యలో టాంగ్ ప్రభుత్వం 3,20,000 దండలకు మించిన నాణాలను ముద్రించింది. ఇందుకు వేయి టన్నులకంటే ఎక్కువ రాగి అవసరమయింది.

## టాంగ్ నగరాలు

టాంగ్ వంశ పరిపాలనలో పెద్ద నగరాలన్నీ రహదార్ల (నావికామార్గం, భూమార్గం) పైనే నిర్మించబడ్డాయి. రాజధానియైన చాంగన్ నగరంనుంచి కంసూ, చీచివాన్, హోపీ, షాంటుంగ్, హూపే రాష్ట్రాలకు రహదారు వ్యాపించి వుండేవి. తూర్పు రాజధానియైన లోయాంగ్ నగరం గ్రాండ్ కెనాల్‌కు మధ్యలో వుండేది. గ్రాండ్ కెనాల్ యాంగ్‌ట్సీ నదితో కలిసేచోటవున్న యాంగ్ చౌ నగరానికి దక్షిణ ప్రాంతాలనుండి వచ్చే సరుకులన్నీ చేరి, అచటినుండి పంపకమయ్యేవి. నాన్‌చావ్ (ప్రస్తుత యున్నాన్)తోనూ, టిబెట్‌తోనూ నిరంతరం వ్యాపారం సాగించే కేంద్రంగా చెంగ్టూ నగరం వుండేది. క్వాంగ్ చౌ (ప్రస్తుత కాంటన్) అప్పటికే అన్నిటికంటే పెద్ద ఓడరేవుగా వుండేది.

23 వ అధ్యాయం

# టాంగ్ సామ్రాజ్య మహోన్నతదశ

## టాంగ్ సామ్రాజ్యం నిర్వహించిన యుద్ధం

ఆల్టాయ్ పర్వతాలలో నివసించే తురుష్కులు పశుపాలకులు. ఆరవ శతాబ్దం మధ్యకాలానికి మరొక పశుపాలక తెగఐన జౌ జాన్ ప్రజలను ధ్వంసంచేసి తురుష్కులు ఖింగన్ కొండలనుంచి కాస్పియన్ సముద్రంవరకున్న విస్తృత ప్రాంతాన్నంతటినీ స్వాధీనం చేసికున్నారు. తదనంతరం వారు చైనా గోడను దాటివచ్చి, కొన్ని ప్రాంతాలను దోచుకుపోయేవారు. సూయ్ వంశ పరిపాలన నాటికి వాళ్ళు తూర్పు తురుష్కులు, పశ్చిమ తురుష్కులు అని రెండుగా చీలిపోయ్యారు.

టాంగ్ పాలన మొదటిరోజుల్లో టాంగ్ సామ్రాజ్యంపై పోరాడుతున్న ఇతర తెగలకు మద్దతు యిచ్చి, తూర్పు తురుష్కులు టాంగ్ రాజ్య ఐక్యతను అడ్డుకోడానికి ప్రయత్నించారు. టాంగ్ రాజ్య సరిహద్దులపై తరచుగా దాడులు చేస్తూ, పొలాలను ధ్వంసంచేస్తూ, ప్రజలను కొందరిని చంపుతూ మరికొందరిని ఎత్తుకుపోతూ వుండేవారు; టాంగ్ రాజ్యం ఏకమయ్యాక కూడా తురుష్కుల దండయాత్రలు ఎక్కువయ్యాయి. ఒకసారి లక్షమంది తురుష్క అశ్వికదళం, వారి ఖాన్ నాయకత్వాన చాంగన్ సమీపంలో వున్న వీ నది ఉత్తర గట్టువరకూ దాడివచ్చారు.

తురుష్కులతో యుద్ధానికి తాయ్‌ట్సుంగ్ చక్రవర్తి స్వయంగా సైనికుల్ని తర్ఫీదు చేయడానికి పూనుకున్నాడు. తురుష్కులను గురించిన సమాచారాన్ని సేకరించి దానిని బాగా పరిశీలించి, వారిని శిక్షించేందుకు తగిన సమయం కొరకు వేచి వున్నాడు.

తూర్పు తురుష్కుల నాయకుడైన ఖాన్ తన ప్రజలను క్రూర శాసనాలతో వేధించుతుండేవాడు. జయించిన తెగలనుండి విపరీతమైన పన్నులను గుంజడంవల్ల వారు ప్రతిఘటించసాగారు. ఆంతరంగిక తగాదా ప్రారంభమై కొందరు తురుష్క ప్రభువులు తాము టాంగ్ రాజ్యానికి విధేయులమై వుంటామని ప్రకటించారు. తూర్పు తురుష్కుల పెత్తనాన్ని వదల్చుకునేందుకు కొన్ని తెగలు కూడా టాంగ్ ప్రభుత్వ పక్షాన చేరాయి. ఆ సమయంలో టాంగ్ ప్రభుత్వం దెబ్బతీసింది.

630 వ సంవత్సరంలో టాంగ్ సైన్యం ఇన్ షాన్ పర్వతాలవరకుచొచ్చుకువెళ్ళి తను అశ్వికదళంతో అచటినుండి ఆకస్మికంగా ఖాన్ రాజధానిపై దాడిచేసింది. తురుష్కులు ఓడిపోయారు.

యుద్ధం ముగిసేటప్పటికి ఎడారికి దక్షిణానవున్న ప్రాంతమంతా టాంగ్ ప్రభుత్వ స్వాధీనమయింది. తూర్పు తురుష్కుల గుప్పెటనుండి విముక్తి చెందిన తెగలన్నీ తాయ్‌ట్సుంగ్ చక్రవర్తిని "స్వర్గాధిపుడైన ఖాన్" అని కీర్తించాయి. అదివరకు తూర్పు తురుష్కులచే ఖైదీలుగా పట్టుకుపోబడిన టాంగ్ పౌరులు 80 వేలకు పైగా విముక్తులై మాతృభూమికి తిరిగివచ్చారు.

సింకియాంగ్‌లోని ఇలీ నదికి ఇరువైపులా తూర్పు - పడమర గట్టులున్న ప్రాంతాలను పశ్చిమ తురుష్కులకు చెందిన ఇద్దరు ఖానులు పరిపాలించుతుండేవారు. తమకు సామంతులుగావున్న రాజ్యాలనుండి భారమైన పన్నులను గుంజుతూ, తమలోతాము పోరాడుతూ ఇతరుల భూమిని ఆక్రమించడం, జనాన్ని ఎత్తుకు పోవడం వీరి నిత్యకృత్యాలు. వారి నిర్బంధ విధానంక్రింద ప్రజలు మూలుగు తుండేవారు.

తాయ్ ట్సుంగ్ చక్రవర్తి, తర్వాత అతని కొడుకూ కావ్ ట్సుంగ్ చక్రవర్తి పశ్చిమ తురుష్కులపై వరుసగా తీవ్రమైన దెబ్బలుకొట్టి, పశ్చిమ ప్రాంతంలో ఎక్కువ భాగాన్ని స్వాధీనం చేసుకున్నారు.

కొరియా ద్వీపకల్పంలో కోకులీ, సిల్లా, పాయిచ్‌కే అనే మూడు రాజ్యాలుండేవి. కావ్ ట్సుంగ్ సింహాసనంపై వున్న రోజుల్లో పాయిచ్‌కే, కోకులి రాజ్యాలు కలసి సిల్లా రాజ్యంపై దాడిచేశాయి. సిల్లారాజు టాంగ్ ప్రభుత్వ సాయం అర్థించాడు. పర్యవసానంగా కావ్ ట్సుంగ్ చక్రవర్తి సముద్రమార్గాన లక్ష సేనను పంపి, సిల్లా సేనల తోడ్పాటుతో పాయిచ్‌కే సేనలను ఓడించాడు. తరువాత సిల్లాపై దాడికి పాయిచ్‌కే జపాను సహాయం కోరాడు. పాయ్‌కియాంగ్ నది ముఖద్వారంలో భీకరమైన సముద్రయుద్ధం జరిగి, టాంగ్ సేనలు 400 జపాన్ యుద్ధనావలను తగులబెట్టినందున జపాను ఘోరపరాజయం పొందింది. చాలా కాలంవరకు కొరియా ద్వీపకల్పంపై దాడికి తిరిగి ప్రయత్నాలుచేసే శక్తి జపానుకులేదు.

## ఆసియా ఖండానికి ఆర్థిక వైజ్ఞానిక కేంద్రం

చాలాకాలంగా ఆసియా ఖండంలోని ఇతరదేశాల ప్రజలతో చైనా దేశానికి సన్నిహితసంబంధం వుండేది. చాంగన్ నగరంలో చైనావారికున్న రాజకీయ హక్కులను ఇతర ఆసియా దేశాలనుంచి వచ్చిన ప్రేక్షకులు కూడ అనుభవించేవారు. వారి సంప్రదాయాలు, అలవాట్లు, మత విశ్వాసాలు గౌరవించబడేవి.

ఆ కాలంలో టాంగ్ సామ్రాజ్యం ప్రపంచమంతటిలోకి గొప్ప బలమైనదిగానూ, ఆర్థికంగా, సాంస్కృతికంగా అభివృద్ధి చెందినదిగానూ వుండేది. రాజధానీ



హు యన్ - ట్సాంగ్ (604-664)

నగరం చాంగన్ అన్ని దేశాల ప్రజలున్న గొప్ప నగరంగా వృద్ధి చెందింది. ఆసియా ఖండంలోని వివిధ జాతుల ప్రజలమధ్య ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలను పెంపొందించే కేంద్రంగా రూపొందింది.

పశ్చిమ ప్రాంతాలనుంచి, మధ్య ఆసియానుంచి, పర్షియా, అరేబియా దేశాలనుంచి వర్తకులు చైనా దేశంతో వ్యాపారం చేయడానికి వచ్చేవారు. అలాంటి వారిలో కొందరు తిరిగి వెళ్ళిపోయేవారు. కాని మరికొందరు ఇచటనే స్థిరపడేవారు. పట్టువస్త్రాలు, నగలవ్యాపారం చేస్తూ భాగ్యవంతులైన కొందరు వడ్డీ వ్యాపారం కూడ చేసేవారు. మరికొందరు చిన్న దుకాణాలలో పండ్లసారాను, రొట్టెలను అమ్ముతుండేవారు.

విదేశాలనుండి వచ్చినవారిలో కొందరు విజ్ఞాన శాస్త్రజ్ఞులు, కళాకారులు వుండేవారు. భారతదేశాన్నుంచి, మధ్య ఆసియా పశ్చిమ ప్రాంతాలనుంచి వచ్చిన కళాకారులు ఉత్తమ సంగీతాన్ని, నృత్యాలను చైనావారికి పరిచయం చేశారు.

చాంగన్ నగరంలోని ప్రభుత్వ విశ్వవిద్యాలయంలో చైనా విద్యార్థులు, ఆసియా ఖండంలోని వివిధ ప్రాంతాలనుంచి వచ్చిన విద్యార్థులు కలసి అధ్యయనం చేసేవారు. విదేశాలనుంచి వచ్చిన విద్యార్థులు టాంగ్ సంస్కృతిని గురించి ప్రచారం చేయడంలో ప్రముఖపాత్ర వహించారు.

ఆసియాలోని వివిధ ప్రజలు వేర్వేరు మత విశ్వాసాలను కలిగివుండేవారు. జరోష్ట్రియన్లు, నెస్టోరియన్లు, మనీచియన్లు తమ చర్చిలను, దేవాలయాలను చాంగన్‌లో నిర్మించుకున్నారు.

ఇతరదేశాలనుంచి వచ్చిన ఆసియావాసులు చైనావారితో కలసిమెలిసి వుండేవారు. చాంగన్ నగర వీధుల్లో చైనావారు, తార్తారులు తమ తమ జాతీయ దుస్తులతో భుజాలు రాసుకుంటూ తిరిగేవారు. కొందరు విదేశీయులు చాలాకాలం చైనాలో నివసించి, ప్రఖ్యాత రచయితలుగా అభివృద్ధి చెంది హాన్ భాషలో చాలా గేయాలను, వ్యాసాలను వ్రాశారు. అవి యిప్పటికీ భద్రంగా వున్నాయి.

దీర్ఘకాల చరిత్రను కలిగి, అప్పటికే నాగరికతలో అభివృద్ధి చెందిన భారతదేశాన్నుంచి చాలా విషయాలను టాంగ్ ప్రజలు నేర్చుకున్నారు. చక్రవర్తి తాయ్ ట్సుంగ్ పరిపాలనకాలంలో ఉత్తర భారతదేశానికి వెళ్ళిన రాయబారి చెరకునుండి పంచదారను తయారుచేసే విధానాన్ని నేర్చుకున్నాడు. భారతదేశానికి యాత్రికుడుగా వెళ్ళిన హుయాన్ ట్సియాంగ్ అనే బౌద్ధ సన్యాసి అచట పది సంవత్సరాలువుండి బౌద్ధమత గ్రంథాలను అధ్యయనం చేశాడు. 600 బౌద్ధగ్రంథాలతో చాంగన్ నగరానికి తిరిగివచ్చి, వాటిని 20 సంవత్సరాలలో అనువదించాడు. 1300 సంపుటాలకు పైగా వున్న అతడి అనువాదాలు బౌద్ధమతాన్ని, భారత సంస్కృతిని గురించి పరిశోధనచేయడానికి ఎంతో విలువైన సమాచారాన్ని అందచేశాయి. భారతదేశంలోని మూల గ్రంథాలు ఎపుడో నాశనమై పోయినందున

హుయాన్ ట్సాయాంగ్ అనువాదాలకు చాల ప్రాముఖ్యత వుంది. తన యాత్రను గురించి "పశ్చిమ యాత్రల చరిత్ర" అనే పేరుతో మరొక గ్రంథాన్ని కూడా ఆయన వ్రాశాను. దాన్లో దారిలో తాను అధిగమించిన పర్వతాలు, నదులను గురించి వ్రాశాడు. తాను వెళ్ళిన దేశాలనుగురించి ముఖ్యంగా భారతదేశంలోని ప్రజలను గురించి, వారి ఆచార వ్యవహారాలు, మత విశ్వాసాలను గురించి, గాథలను గురించి, స్థానికంగా తయారయ్యే వస్తువులను గురించి ఆయన వర్ణించారు.

జపాను విద్యార్థులు సముద్ర ప్రయాణంలోని చిక్కులను అధిగమించి చైనాలో అధ్యయనం చేసేందుకు వచ్చేవారు. అభివృద్ధి చెందిన టాంగ్ నాగరికత ప్రభావం యీ విద్యార్థులద్వారా జపాన్ సంస్కృతిపైన పడింది.

టాంగ్ శకంలో కొరియా ద్వీపకల్పాన్ని ఐక్యపరచిన సిల్లా ప్రభుత్వానికి టాంగ్ ప్రభుత్వంతో తరచుగా సంబంధా లుండేవి. సిల్లా విద్యార్థులు చాలమంది చైనాలో అధ్యయనంచేసి విజ్ఞానశాస్త్ర పరిశోధనలద్వారా తమ దేశ సంస్కృతిని ఎంతో పెంపొందించారు.

## టిబెట్, ఓయిగోర్, నాన్‌చావ్

టిబెట్ పీఠభూమిలో చిరకాలంనుంచి నివసించుతున్న టిబెటన్లు కొంత వ్యవసాయంపైన, కొంత పశుపాలనంపైన పొట్ట పోసుకునేవారు. బార్లీ, గోధుమ మొదలైనవి పండించేవారు. జడల బర్రెలను, లొట్టిపిట్టలను మేపుతుండేవారు. గోధుమ పండే సమయం సంవత్సరానికి ఆరంభంగా టిబెటన్లు భావించేవారు.

టిబెటన్లు ఉన్నితో దుస్తులు తయారు చేసుకుని, అలంకారంగా ముఖాలకు ఎర్రరంగు పూసుకునేవారు. ఉన్ని గుడారాలలో నివసించేవారు. అనేక గుడారాలను జతపరచిన ప్రభువులు ఇళ్ళలో కొన్ని వందల మనుష్యులు నివశించకలిగేవారు.

టిబెటన్లు ధైర్యంగల యోధులు. యుద్ధంలో చనిపోయినవారిని వీరులుగా పూజించేవారు.

ఏడవ శతాబ్ద ఆరంభంలో సాంగ్‌ట్సాన్‌గాంబో అనే టిబెటన్ నాయకుడు వివిధ తెగలను ఐక్యపరచి, లాసా రాజధానిగా ప్రభుత్వాన్ని స్థాపించాడు. టిబెటన్లు బౌద్ధమతావలంబకులు. వారి భాషకు స్వంత లిపిని సంపాదించుకున్నారు. సాంగ్ ట్సాన్‌గాంబో టాంగ్ సంస్కృతిని అభిమానించేవాడు. టాంగ్ రాజకుమారి వెన్ చెంగ్‌ను వివాహం చేసుకుని, ఆమె నివశించేందుకు టాంగ్ పద్ధతిలో రాజభవనాన్ని నిర్మించాడు. ప్రభువుల బిడ్డలను విద్యకోరకు చైనా పంపించేవాడు: టాంగ్ పండితు లను టిబెట్‌కు ఆహ్వానించేవాడు. టాంగ్ ప్రజలనుంచి పట్టుపురుగులను పెంచడం టిబెటన్లు నేర్చుకున్నారు. టాంగ్ నిపుణులవద్ద సారా కాయడం, తిరుగలిరాళ్ళను చేయడం, కాగితము సిరా తయారుచేయడం నేర్చుకున్నారు. హాన్ టిబెటన్ ప్రజల మధ్య సంస్కృతీసంబంధాలు పెరగడంలో ఈ దశకు ఎంతో ప్రాముఖ్యముంది.

యుఘుర్లకు పూర్వీకులైన ఓయిగోర్ తెగ ప్రజలు సెలెంగా నదీ ప్రాంతంలో పశుపాలకులుగా వుండేవారు. ఏడవ శతాబ్దారంభంలో పశ్చిమ తురుష్కుల పిడికిలి నుండి విముక్తిచెందారు ఈ విజయం తాయిట్సుంగ్ చక్రవర్తి తూర్పు తురుష్కులపై ప్రాబల్యం సంపాదించడానికి ఎంతో వినియోగపడింది.

ఓయి గోర్లు క్రమంగా దక్షిణానికి విస్తరించేకొలదీ, టాంగ్ ప్రజలలో దగ్గర సంబంధాలు ఏర్పడ్డాయి. రెండు ప్రాంతాలను కలిపి రహదారులమీద పోస్టల్ స్టేషన్లు స్థాపించుకున్నారు. ఓయిగోర్ ప్రజలు గుర్రాలను ఉన్ని, తోళ్ళను మారకం యిచ్చి టాంగ్ ప్రజలనుంచి పట్టువస్త్రాలు, పంచదార తెచ్చుకునేవారు. యుద్ధాలలో టాంగ్ సైన్యాలకు ఓయిగోర్ అశ్వికదళాలు సహాయపడేవి.

ఎనిమిదవ శతాబ్దం మధ్యభాగంలో ఓయిగోర్ తెగ నాయకుడు (ఖాన్) హుయేజెన్ ఎడారికి ఉత్తరభాగమంతటినీ ఆక్రమించుకుని, తూర్పున హీలంగ్ కియాంగ్ నదివరకూ, పడమర ఆల్టాయ్ పర్వతాలవరకూ తన రాజ్యాన్ని విస్తరించుకొన్నాడు. టాంగ్ సామ్రాజ్యానికి ఉత్తరాన అదొక బలమైన రాజ్యంగా తయారయింది.

యున్నాన్ ప్రాంతంలో నివసించే అనేక తెగలు కాలక్రమేన ఆరుతెగల సమాఖ్యగా ఏర్పడ్డారు. ఎనిమిదవ శతాబ్దం మధ్యలో నాన్‌చావ్ తెగ నాయకుడైన పిలోకా తక్కిన ఐదు చావ్ తెగలను ఐక్యపరచి, బలమైన రాజ్యాన్ని స్థాపించాడు.

నాన్‌చావ్ ప్రజలు వ్యావసాయకులు. ముగ్గురు మనుష్యుల దళాలతో-ఎద్దుకు ముందు ఒకడు, వెనుక తోలేవాడు ఒకడు, నాగలి సరిచేసేవాడు మరొకడు - వీరు తమ పొలాలను దున్నేవారు. ఏడాదికి ఒకపంట మాత్రమే పండించే రైతులకు పన్ను మినహాయించేవారు. రెండు పంటలు పండించేవారు 20 కాంటీల ధాన్యం పన్ను చెల్లించాలి. తూర్పు నాన్‌చావ్ ప్రజలు పట్టువస్త్ర పరిశ్రమలోనూ, పశ్చిమ నాన్‌చావ్ ప్రజలు దూదివస్త్ర పరిశ్రమలోనూ ప్రావీణ్యత సంపాదించారు. వారంతా మంచి ఆయుధాలను తయారు చేసేవారు. ఖచ్చితమైన సైనిక శిక్షణ పొందేవారు. ముందుభాగంలో గాయపడినవారికి చికిత్స, రక్షణ బాధ్యత తీసికుని, వీపుపై దెబ్బతగిలినవారిని చంపివేసేవారు.

చాలకాలం నాన్‌చావ్ ప్రభుత్వం టాంగ్ సామ్రాజ్యంతో స్నేహ సంబంధాలు కలిగివుండేది. పిలోకోరాజు మనుమడు చాంగన్ నగరానికి వచ్చినపుడు గొప్ప స్వాగతమిచ్చారు. తిరిగి వెళ్ళేటప్పుడు సంస్కృతీ సంబంధమైన ఘన సంపదను బహూకరించి సంగీత నృత్యదళాన్ని కానుకగా పంపారు. వేలకొలది నాన్‌చావ్ విద్యార్థులు చాంగన్‌లో విద్యాభ్యాసం చేసేవారు. చెంగ్టూ కళాకారులు నాన్‌చావ్ వెళ్ళి, నాన్‌చావ్ పట్టువస్త్రాలు నాణ్యంలో జెచివాన్ సరుకుతో సరితూగే విధంగా అభివృద్ధి చేశారు.

24.వ అధ్యాయం

# టాంగ్ సామ్రాజ్య పతనం

## భూమి పంపక విధానానికి స్వస్తి

భూమి పంపక విధానం బంజరు భూములను, సాగుచేసేందుకు వాటిపై హక్కు భుక్తాలను కలిగివుండేందుకు అవకాశమిచ్చేది. ఇలా చేశాక ప్రభుత్వాధికారులు, భూస్వాములు ఏదో ఒక మార్గాన రైతుల భూములను ఆక్రమించేవారు. విస్తీర్ణమైన పడావు భూములు ఆదివరకే వారి చేతుల్లో వుండేవి. పశువుల పెంపకానికి అనే పేరుతో వారి స్వాధీనంలో చాలా లోయలు వుండేవి. ఈ విధంగా భూస్వాముల కమతాలు విపరీతంగా పెరిగాయి.

ట్స్యాయుంగ్ విధానం ప్రకారం వెట్టిచాకిరికి బదులుగా నిర్ణీతమైన పట్టు వస్త్రాన్ని పన్నుగా చెల్లించితే సరిపోయేది. కాని యిదికూడ ఎల్లప్పుడూ అమలు జరుగలేదు. టాంగ్ ప్రభుత్వం తన కవసరమైనపుడల్లా నిర్బంధంగా ప్రజలచేత చాకిరీ చేయించుకునేది. అందుచేత మొదట్లో యిచ్చిన సౌకర్యం ఉపసంహరించడమో లేక నిరుపయోగమవడమో జరిగేది. తరువాత ప్రభుత్వం రైతులపై పన్నులభారాన్ని పెంచింది. దీనిని మోయలేక రైతులు తమ భూములను అమ్ముకోవడమో, తాకట్టు పెట్టడమో జరిగేది. ఇంతేగాక అనేకమంది స్వరాష్ట్రాలను వదలి పారిపోయేవారు.

టాంగ్ ప్రభుత్వం విస్తీర్ణమైన రాజ్య సరిహద్దుల రక్షణకు రైతులనుండి చాలమంది సైనికులను సేకరించేది. చట్టం ప్రకారం సైనిక సేవ ఆరు సంవత్సరాలకు పరిమితమై వుండాలి. కాని ఆచరణలో ఇంతకంటే చాల ఎక్కువ కాలమే - కొన్ని సందర్భాలలో యవ్వనదశనుంచి వృద్ధాప్యంవరకు సైనిక సేవ చేయాలసి వచ్చేది.

అందుచేత చాల రైతు కుటుంబాలలో వ్యవసాయానికి అవసరమైన శ్రామిక శక్తి కొరవడేది. యుద్ధంలో సరిహద్దు కాపలాదార్లు చనిపోయినపుడు పరాజయాన్ని కప్పిపుచ్చుకునేందుకుగాను మరణించినవారి లిస్టును ప్రభుత్వానికి సేనానులు పంపేవారుకాదు. కాపలా సైనికుడు ఎచటవుందీ తేలేవరకూ అతనికుటుంబం చెల్లించాలిసిన పన్నులను ఆరేళ్ళు వాయిదావేయాలని ప్రభుత్వం శాసించింది. సైనికుడెచట వుందీ ఈ లోగా తేలకపోతే, సైనిక డ్యూటీనుండి పారిపోయినట్లుగా యెంచి, బకాయిపడిన

పన్నులన్నిటినీ, వెట్టిచాకిరిని ఆ రైతు కుటుంబం చేసి తీరాలి. కొన్ని సందర్భాలలో ఈ బకాయి ముప్ఫయి సంవత్సరాల వెట్టిచాకిరికి మించేది. ఈ అక్రమచట్టం ఫలితంగా చాలా రైతు కుటుంబాలు నాశనమయ్యాయి.

భూమిపైన, రైతులపైన అధికారం తన చేతుల్లో వుంచుకోవాలంటే భూమి పంపక విధానాన్ని నిలబెట్టాలనీ, భూస్వాములు రైతుల భూమిని ఆక్రమించరాదనీ టాంగ్ ప్రభుత్వం భావించి తనకు చేతనైనంత కృషిచేసింది. ఐనప్పటికీ క్రమేణా రైతులలో ఎక్కువమంది భూమిని కోల్పోవడమూ, నిర్బంధాలనుండి పారిపోవటమూ జరిగింది. ఎనిమిదవ శతాబ్దం మధ్యలో జరిగిన ఒక పరిశీలనలోనే 8 లక్షల కుటుంబాలు తనభూమిని వదలి పారిపోయాయని తేలింది. భూస్వాముల అధికారం క్రమంగా పెరుగుతూంటే కేంద్ర ప్రభుత్వాధికారం క్రమంగా తగ్గిపోయింది. భూమి పంపక విధానం అమలు జరుగకుండా పోయింది.

## సరిహద్దు రక్షణల బలహీనత

ఎనిమిదవ శతాబ్దం మధ్యనాటికి ఆడంబరం, అవినీతి ఫలితంగా టాంగ్ ప్రభుత్వం దిగజారిపోయింది. రైతులను పీడించడం ఎక్కువయింది. రైతులను సరిహద్దురక్షణ సైనికులుగా రిక్రూటుచేసేటపుడు వారినుండి వుద్యోగులు డబ్బు పిండేవారు. లంచం చెల్లిస్తే, బలం, ఆరోగ్యమున్న వారిని కూడ మినహాయించేవారు. డబ్బివ్వలేకపోతే అనారోగ్యపరులను కూడ సరిహద్దు కాపలాకు పంపేవారు. సరిహద్దురక్షణ బాధ్యత నిర్వహించే సేనానులు మరింత దారుణంగా వ్యవహరించేవారు. కాపలాదార్లు ఏమైనా విలువైన వస్తువులు కలిగివుంటే, పగలల్లా కఠినవరకం చేయించి, రాత్రివేళ చీకటికొట్లలో బంధించేవారు. దీని ఫలితంగా జబ్బుచేసి, వారు చనిపోతే, వారి సామానులు కాజేసేవారు ఈ దారుణ పరిస్థితులవల్ల టాంగ్ సైన్యం పోరాటశక్తి పూర్తిగా దెబ్బతినిపోయింది.

ఈ కాలంలో టిబెట్, తజిక్ ప్రభుత్వాలు బలమైన రాజ్యాలుగా పెంపొందాయి. సింకియాంగ్ రాష్ట్ర దక్షిణ భాగాన్ని ఆక్రమించాలని టిబెట్ ప్రభుత్వం చూసింది. కాస్పియన్ సముద్రం చుట్టూవున్న టాంగ్ సామ్రాజ్య భాగాన్ని కాజేసి, మధ్య ఆసియాలో దాని పలుకుబడిని తుదముట్టించాలని తజిక్ ప్రభుత్వం ఆశించింది. పశ్చిమోత్తర సరిహద్దుల పరిస్థితికూడ విషమించింది. 751 లో టాంగ్ సేనలను తజిక్ ప్రభుత్వం ఓడించింది. మధ్యఆసియాపై టాంగ్ ప్రభుత్వ అధికారం ఈ విధంగా అంతమయింది.

టాంగ్ సరిహద్దు సేనానులు తమను అవమానపరచారనే సాకుతో ఈ పరిస్థితులను వినియోగించుకుని 751 లో నాన్‌చావ్ ప్రభుత్వం దాడిచేసి, టాంగ్ సేనలను ఓడించింది.

టాంగ్ సామ్రాజ్య సైనికశక్తి ఈ విధంగా క్షీణించిపోసాగింది.

## ఆన్‌షీ తిరుగుబాటు - సైనిక ప్రభువులు

జయించిన ప్రాంతాలపై అధికారాన్ని దృఢపరచుకునేందుకు, పొరుగు రాజ్యాల ఆకస్మిక దాడులను అరికట్టేందుకు టాంగ్ ప్రభుత్వం రాజ్యసరిహద్దు ప్రాంతాలలో చాల ఎక్కువ సైన్యాలను కేంద్రీకరించింది. ఈ సేనలకు ఆధిపత్యం వహించే సైనికప్రభువులు పరిపాలనా బాధ్యతను, ఆర్థిక పెత్తనాన్ని కూడ నిర్వహించేవారు. సరిహద్దుప్రాంతాలపై వీరే పూర్తిపెత్తనం వహించేవారు. చక్రవర్తి హ్సువాన్‌ట్సుంగ్ కాలంలో యిలాంటి సైనికప్రభువులు పదిమంది వుండేవారు.

పశ్చిమోత్తర సరిహద్దు పట్టణాలు మూడింటిపైన ఆన్-లూ-షాన్ అనే తార్తారును సైనిక ప్రభువుగా చక్రవర్తి నియమించాడు. హోపీ రాష్ట్రింపై సివిల్ మిలిటరీ పరిపాలన అధికారాలను హస్తగతం చేసుకుని ఆన్-లూ-షాన్ ఉత్తర ప్రాంతంలోని దేశ దిమ్మరులను చేర్చుకుని సేనల సంఖ్యను విపరీతంగా పెంచాడు. 755 లో ఇతడు లక్షాయాభైవేల సేనతో హోపీనుంచి దక్షిణంగా కేంద్రప్రభుత్వాన్ని పట్టుకునే దృష్టితో బయలుదేరాడు.

టాంగ్ సామ్రాజ్యం చాల సంవత్సరాలుగా శాంతిభద్రతలను అనుభవించింది. హోనాన్ రాష్ట్రింలోని అధికారులు సైనికంగా అజాగ్రత్తగా వున్నందున తిరుగుబాటుదారులు ఎలాంటి ప్రతిఘటనను ఎదుర్కోకుండానే త్వరగా లోయాంగ్ నగరం సమీపానికి చేరుకున్నారు. టాంగ్ ప్రభుత్వం సైనిక తర్ఫీదు లేనివారిని నగరంలో సోమరులుగా కాలక్షేపంచేసే 60 వేలమందిని హడావుడిగా సైన్యంగా సమకూర్చింది. టాంగ్ సైన్యం వరుసగా అపజయాలుపొంది, లోయాంగ్ నగరం ఆన్-లూ-షాన్ సేనల వశమయింది.

టంగ్ కువాన్ కనుమను రక్షించేందుకు పశ్చిమోత్తర సరిహద్దు కాపలాదార్లను కొందరిని టాంగ్ ప్రభుత్వం పంపింది. ఉద్యోగులు త్రాగుడు, జూదంతో కాలంపుచ్చారు. సైనికులకు సరిపోయినంత ఆహారం సైతం లేదు. 756 వ సంవత్సరం వేసవిలో టంగ్ కువాన్ కనుమలోని టాంగ్ ప్రభుత్వసేన ధ్వంసమయింది. చక్రవర్తి హ్సువాన్ ట్సుంగ్ జిచివాన్‌కు పారిపోయాడు. ఆన్-లూ-షాన్ చాంగన్ నగరాన్ని వశపరచుకున్నాడు.

ఆన్-లూ-షాన్ సైన్యాలు దారిపొడుగునా దోపిళ్ళు, తగులబెట్టడం సాగించారు. రాజమందిరాన్ని ధ్వంసంచేసి, దోచుకున్న సామాన్లంతటినీ హోపేకు పంపారు.

ప్రతిచోటా ప్రతిఘటనోద్యమం విజృంభించింది. హోపేలో 20 లక్షలమంది సైన్యంలో సంఘటితమయ్యారు. పీ నదీ లోయలోని గెరిల్లా దళాలు చాంగన్ సమీపానికి తిరుగుబాటుదార్లను తరిమివేశారు.

తిరుగుబాటుదార్ల అంతఃకలహాలలో అతని కొడుకే ఆన్-లూ-షాను చంపాడు. హ్స్వాన్‌ట్స్యుంగ్ తరువాత చక్రవర్తిఐన సూ ట్సుంగ్ కంసూరాష్ట్రి పశ్చిమోత్తర

సరిహద్దునుండి కొన్ని సేనలను పోగుచేసి, ఓయిగోర్ల సహాయంతో చాంగన్, లోయాంగ్ నగరాలను తిరిగి స్వాధీనం చేసుకున్నాడు. ఆన్-లూ-షాన్ క్రింది వుద్యోగియైన షీ-జీ-మింగ్, టాంగ్ ప్రభుత్వంపై తిరుగుబాటు చేశాడు. చాలా సంవత్సరాల పోరాటం తరువాత ఓయిగోర్ల సహాయంతో టాంగ్ ప్రభుత్వం మరల తిరుగుబాటును అణచివేసింది.

763 వ సంవత్సరంలో అంతమైన ఈ పోరాటాన్ని చరిత్రకారులు ఆన్ - షీ తిరుగుబాటని పిలుస్తారు.

ఆన్ - షీ సైన్యం ఓడిపోయినప్పటికీ తిరుగుబాటు నాయకుల క్రింది వుద్యోగులే హోపే రాష్ట్రానికి సైనిక ప్రభువులుగా తమ పెత్తనం సాగించారు. పెద్దసేనలకు ఆధిపత్యం వహించుతూ, టాంగ్ ప్రభుత్వాధికారాన్ని త్రుణీకరించేవారు. వసూలు చేసిన పన్నులు మక్తాలు టాంగ్ ప్రభుత్వ కోశంలోనికి వెళ్ళేవి కావు. ఉద్యోగులను నియమించే అధికారం కూడ టాంగ్ ప్రభుత్వానికి వుండేదికాదు. ఒక సైనికప్రభువు చనిపోతే, అతని కొడుకో లేకపోతే క్రింది వుద్యోగో అతని పదవిని అక్రమించేవాడు. ఇదే అలవాటును తరువాత షాంటుంగ్, షాన్సీ, హోనాన్ రాష్ట్రాలలోకూడ అనుసరించారు.

తమరాజ్య విస్తరణకు, తద్వారా మరింత ఎక్కువమంది రైతులను దోచుకునేందుకు మిలిటరీ ప్రభువులు తమలో తాము పోరాడుకునేవారు; కేంద్ర ప్రభుత్వంతో పోరాడేవారు. ఈ యుద్ధాలలో పాల్గొనే బానిససేనల సంఖ్య చాల ఎక్కువగావుండి, జనసామాన్యంపైన, ముఖ్యంగా రైతాంగంపైన మోయలేని బరువుగా తయారయ్యారు.

## రెండు పన్నుల విధానం

ఆన్-షీ తిరుగుబాటు సమయంలో ఎక్కువగా బాధలపాలైన రైతులు తమ ప్రాంతాలను వదలి పారిపోయారు. భూస్వాములకు కౌలుదార్లు అయ్యారు. భూమి పంపక విధానం పటాపంచలైపోయింది.

ఆ రోజుల్లో చాలామంది స్థానికాధికారులు తాము వసూలుచేసే మక్తాలను, పన్నులను టాంగ్ ప్రభుత్వానికి అందజేసేవారు కాదు. ఉద్యోగులు, చాలమంది భూస్వాములు పన్నుల చెల్లింపును, చాకిరినీ ఎగవేసేవారు. దివాళాతీసి, భూస్వాములకు కౌలుదార్లుగా మారిన రైతులుకూడ కేంద్ర ప్రభుత్వానికి పన్నులు చెల్లించేవారు కాదు.

విపరీతంగా పెరిగిన మిలిటరీ ఖర్చులను రాబట్టుకునేందుకు టాంగ్ ప్రభుత్వం వివిధరకాల పన్నులను ప్రవేశపెట్టింది. అలాంటివి వందల రకాల పన్నులు తయారై నందున, ఈ భారంతో రైతులు దారిద్ర్యం పాలయ్యారు. దీర్ఘకాల పోరాటంవలన గ్రామీణ జనాభాకూడ తగ్గిపోయింది. ఉదాహరణకు [illegible]నాన్‌లోని టా చౌ

ప్రాంతంలో 40 వేల రైతు కుటుంబాలుండేవి. అన్-షీ తిరుగుబాటు ఫలితంగా 8 సంవత్సరాల అనంతరం పదోవంతు - 4 వేల కుటుంబాలు మాత్రమే మిగిలాయి.

ఐనప్పటికీ టాంగ్ ప్రభుత్వం తన కవసరమైన డబ్బు నంతనూ రైతులనుండి పిండలేకపోయింది. ఈ ప్రతిష్టంభననుంచి బయటపడటానికి 780 వ సంవత్సరంలో రెండు పన్నుల చట్టం జారీచేసింది. (1) కేంద్రప్రభుత్వం తనకయ్యే ఖర్చులను దృష్టిలో వుంచుకుని ప్రతిప్రాంతం కొంత నిష్పత్తిలో పన్ను చెల్లించాలి; (2) పన్ను చెల్లించేవారు తమ ఆస్తినిబట్టి దాని కనుగుణ్యమైన నిష్పత్తిలో పన్ను చెల్లించాలి; (3) సంవత్సరానికి రెండుసార్లు - వేసవిపన్ను ఆరోనెల లోపల, ఆకురాలుకాలపు పన్ను పదకొండోనెల లోపున - చెల్లించాలి. అదివరకటి వివిధరకాల పన్నులను, వెట్టిచాకిరీని ప్రభుత్వం రద్దుచేసింది. దీనివల్ల రైతులపై పన్నులభారం కొంత తగ్గింది. కాని బలవంతులైన భూస్వాములు తాము చట్టప్రకారం చెల్లించాలిసిన మొత్తాన్ని చెల్లించకుండా, ఆ భారాన్ని రైతులమైకి నెట్టేవారు.

టాంగ్ వంశ హయాములో చాలమంది రైతులు తమ భూమిని కోల్పోవడమే-గాక, చాలమంది వుద్యోగులు, భూస్వాములు వినోదాల్లోనూ వ్యసనాలలోనూ నగరాల్లో కాలక్షేపం చేస్తూ, తమ కమతాలను అమ్ముకోవలసివచ్చింది. తరచుగా భూమి చేతులు మారడం జరిగేది.

పెద్ద భూస్వాములు మరింత భాగ్యవంతులు శక్తివంతులుగా తయారయ్యారు. దుబారా ఖర్చుదార్లనుండి కమతాలను కొనివేసి, కొందరు వర్తకులుకూడ భూస్వామ్య వర్గంలో చేరారు.

## పరీక్షావిధానం

ప్రభువుల సిఫార్సులను అనుసరించి ప్రభుత్వోద్యోగులను ఎంచుకునే 'పీ-ట్సిన్' పద్ధతిని విడనాడి, సూయ్‌టాంగ్ వంశాల పరిపాలకులు పోటీపరీక్షల విధానాన్ని అమలుజరిపారు. ప్రతి మూడు సంవత్సరాలకు ఒకసారి "చిన్ షీ" పట్టాకొరకు పరీక్షలు జరిగేవి. కావ్యాలు, నియమబద్ధమైన వచనం పాఠ్యక్రమంలో వుండేవి. ఎల్లప్పుడూ రెండు మూడు వేల అభ్యర్థు లుండేవారు. టాంగ్ వంశం చివరి దశలో యీ పరీక్షలలో వుత్తీర్ణులైనవారే ముఖ్యమైన వుద్యోగపదవుల్లో ఎక్కువగా వుండేవారు. దీని ఫలితంగా సామాన్య భూస్వాముల, వర్తకుల కుటుంబాలనుంచి వచ్చిన యువకులు ప్రభుత్వ యంత్రాంగంలో చేరగలిగారు.

## రైతుల తిరుగుబాట్లు

రెండుపన్నుల విధానం అమలుజరిపాక భూమి కేంద్రీకరణకు పరిమితిలేకుండా పోయింది. ముఖ్యోద్యోగులలోనూ,ఖోజ్జాలు వగైరాలలోనూ అవినీతి విపరీతంగా పెరిగి నందున టాంగ్ ప్రభుత్వ పతనం ఆసన్నమయింది. ఖోజ్జాలు వారి ఏజెంట్లు రాజధాని సివార్లలో సగం [illegible] ధీనం చేసుకున్నారు. చట్టప్రకారం భూస్వాములనుంచి

కౌలుకు తీసికున్న రైతు తానుదున్నే ప్రతి మౌ (ఎకరంలో ఆరోవంతు) భూమికి 50 నుంచి 100 కాటీల వరకు మక్తా చెల్లించాలి. 873 వ సంవత్సరంలో షాంటుంగ్, హోనాన్ రాష్ట్రాలలో వర్షాలు లేక గోధుమ సగానికి సగమే పండింది. ఇతర పంటలు పూర్తిగా పాడయ్యాయి. ఐనప్పటికీ రైతులనుండి పన్నులు పిండడానికి వుద్యోగులు ప్రయత్నించారు. చెల్లించనివారికి కొరడాదెబ్బల శిక్ష విధించారు. దీనిని భరించలేక రైతులు ఆయుధాలు చేపట్టారు.

క్రీ. శ. 874 వ సంవత్సరంలో షాంటుంగ్ రాష్ట్రంలో రైతు తిరుగుబాటుకు వాంగ్ హ్సియెన్ - చీ నాయకత్వం వహించాడు. మరుసటి సంవత్సరం ట్సా చౌ లోని తిరుగుబాటుకు నాయకత్వం వహించిన హువాంగ్ చావ్ వారితో చేరాడు. టాంగ్ ప్రభుత్వం ప్రజలపై విధించిన పన్నులభారాన్ని, క్రూరమైన శిక్షలను నిరశించుతూ, అమానుషంగా ప్రవర్తించే వుద్యోగులను శిక్షించనందుకు అసమ్మతి తెలుపుతూ తిరుగుబాటుదార్లు ప్రకటనచేశారు. కొన్ని నెలలలోనే తిరుగుబాటుదార్ల సంఖ్య లక్షల్లోకి పెరిగింది.

హోనాన్ రాష్ట్రంనుంచి విప్లవసేనలు అన్‌హ్వీ రాష్ట్రంలోకి తరలివెళ్ళాయి. 878 లో అచట యుద్ధరంగంలో వాంగ్ హ్సియెన్ - చీ చనిపోయాడు. సైన్యాధిపత్యం వహించిన హువాంగ్ చౌ సైన్యంతో సహా యాంగ్‌ట్సీనది దాటి, కియాంగ్సీ రాష్ట్రంలో ఎక్కువ భాగాన్ని ఆక్రమించాడు. విప్లవజ్యోతి యాంగ్‌ట్సీ నదికి దక్షిణానకూడ వ్యాపించ సాగింది.

విప్లవసేన ఎంతో శిక్షణతోనూ, అకుంఠిత దీక్షతోనూ వ్యవహరించింది. చెకియాంగ్‌నుంచి ఫూకిన్‌వరకు 700 లీల దూరం కొండదారిని నిర్మించడమే అందుకు వుదాహరణగా పేర్కొనవచ్చు. తరువాత వారు త్వరగా క్వాంటుంగ్ రాష్ట్రంలోకి చొచ్చుకుపోయారు. రాజధాని చాంగన్ నగరాన్ని ఆక్రమించి, టాంగ్ వంశ పాలనను కూలదోస్తానని హువాంగ్ ప్రకటించాడు.

తరువాత హువాంగ్ చౌ తన సేనలను ఉత్తరదిశగా నడిపాడు. హ్సియాంగ్ చియాంగ్ నదిని పడవలపై దాటి హోనాన్ రాష్ట్రానికి వెళ్ళారు. ఈ విధంగా పన్నెండు నెలల్లో హువాంగ్ చౌ సైన్యం హోపేనుంచి కియాంగ్సీకి, చెకియాంగ్‌కు, అన్‌హ్వీయీకి, తిరిగి హోనాన్‌కు వెళ్ళి, 10 వేల లీలకు మించిన దూరం తరలివెళ్ళింది. నిత్యం కదలివెళ్ళే ఎత్తుగడను అనుసరిస్తూ, శత్రువుపై ఆకస్మిక దాడులుచేస్తూ దెబ్బ తీసింది. లోయాంగ్ నగరం ఆక్రమించేటప్పటికి విప్లవసేన 6 లక్షలకు పెరిగింది.

టంగ్ కువాన్ కనుమవద్ద టాంగ్ సైన్యంతో ఢీకొని విప్లవసేన భీకరంగా పోరాడింది. చుట్టూ ప్రదేశమంతా విప్లవసేన జెండాలతో తెల్లగా కన్పించింది. టాంగ్ ప్రభుత్వ సేనలు ఓడిపోయి, చిందరవందరగా పారిపోయాయి.

టాంగ్ చక్రవర్తి జెచివాన్ రాష్ట్రానికి పారిపోయాడు. రైతుసేన రాజధానీ నగరం చాంగన్‌లో కనివినియెరుగని శిక్షణతో ప్రవేశించింది. పౌరులు వారికి ఘనమైన

స్వాగతమిచ్చారు. తన సైన్యం ప్రజలను రక్షించేందుకే విజృంభించిందనీ, ప్రజలయెడ సానుభూతిలేని టాంగ్ చక్రవర్తికి - తనకు ఎంతో విభేదముందనీ, ప్రతివారు ఎలాంటి భయంలేకుండా శాంతియుత జీవితం గడపవచ్చుననీ హువాన్ చా ప్రకటించాడు. పేదలకు ధనం పంచారు; మరీ దుర్మార్గులైన వుద్యోగులను హతమార్చారు.

రైతు సైన్యం సహజంగా ఎల్లప్పుడూ, కదలుతుండటంవల్ల దానికి బలమైన కేంద్రాలు లేవు. చాంగన్‌లో రాజకీయాధికారం స్థాపించినప్పటికీ విస్తారమైన ప్రాంతాన్ని స్వాధీనంలో వుంచుకోలేక పోయింది.

టాంగ్ చక్రవర్తి దేశంలోని వివిధ ప్రాంతాలనుంచి అదనపు బలాలను చేకూర్చుకున్నాడు. తమవర్గం స్వార్థప్రయోజనాలకు ఉమ్మడి శత్రువునుంచి వచ్చే ప్రమాదాన్ని ఎదుర్కొనేందుకు సరిహద్దు సైనిక ప్రభువులంతా తమ అంతరంగిక తగాదాలను వదలుకున్నారు. విప్లవ రైతుసేనలకు వ్యతిరేకంగా పెద్ద సేనలను సమకూర్చారు. చాంగన్ నగరంలోనూ, చుట్టూవున్న భూస్వాములు తమధాన్యాన్ని దాచివేసి, పర్వతాలకు పారిపోయారు. చాంగన్ చుట్టూ కొద్ది ప్రాంతంలో రైతు సైన్యం ఇరుకునపడింది. ఆహారం కొరత ఏర్పడినందున సైన్యాలు చెట్ల బెరడును తినవలసివచ్చింది.

టాంగ్ పరిపాలకులు రైతు సేనలను చీల్చడానికి కుట్రపన్నారు. ముఖ్య సేనాని చూవెన్ తానెందుకు విప్లవంలో చేరాడో ఆ లక్ష్యానికి ద్రోహం చేశాడు.

విప్లవాన్ని అణచివేయడంలో టాంగ్ ప్రభుత్వం లీ-కె-యంగ్ నాయకత్వాన వున్న షాటో (పశ్చిమ తురుష్కుల) సైన్యంపై ఆధారపడింది. 833 వ సంవత్సరంలో లీ-కె-యంగ్ తన సేనలతో చాంగన్ ఆక్రమించాడు. తరువాత వచ్చిన టాంగ్ సైనికులు నగరాన్ని దోచుకున్నారు. రాజభవనానికి, పౌరుల ఇళ్ళకు నిప్పంటించి, ప్రజలను చంపారు.

హువాంగ్ చా మిగిలిన తన సేనతో హొనాన్ రాష్ట్రానికి తిరోగమనం చేశాడు. అక్కడినుంచి షాంటుంగ్‌కు వెళ్ళి, టాయిషాన్ పర్వతాలలో 884 లో ఆత్మహత్య చేసుకున్నాడు.

తిరుగుబాటు విఫలమయింది. కాని టాంగ్‌వంశ పరిపాలన పతనమైపోవడానికి అదే ముఖ్యకారణం. బలహీనమైపోయిన టాంగ్ ప్రభుత్వాన్ని 907 వ సంవత్సరంలో చూవెన్ కూలదోశాడు.

25 వ అధ్యాయం

# ఐదు వంశాలు - పది రాజ్యాలు

ఎల్లోనదీలోయ ప్రాంతములోని సైనిక ప్రభువులందరిలోకి బలవంతుడైన చూవెన్ టాంగ్ చక్రవర్తిని కూలదోసి, సింహాసనాన్ని ఆక్రమించాడు. ఆతడు స్థాపించిన రాజ్యాన్ని ఉత్తర లియాంగ్ అనబడేది. దానినీ, తదనంతరం ఉత్తర చైనాను 53 యేళ్ళవరకూ పరిపాలించిన ఉత్తర టాంగ్, ఉత్తర ట్సిన్, ఉత్తర హాన్, ఉత్తర చౌ రాజ్యాలను ఐదువంశాల పరిపాలనదశని చరిత్రకారులు పిలుస్తారు.

దక్షిణ చైనాలో కొందరు సైనిక ప్రభువులు వేర్వేరు రాజ్యాలను స్థాపించారు. ఐదువంశాల పరిపాలన చివరిదశలో ఉత్తర హాన్ ప్రభుత్వం షాన్సీరాష్ట్రం పైనకూడ అధికారం వహించింది. వీటన్నిటినీ కలిపి పదిరాజ్యాలని పిలచేవారు.

ఐదువంశాలు పదిరాజ్యాలుగా దేశం విభజించబడివున్న దశలో టాంగ్ సామ్రాజ్యం ఆఖరి రోజుల్లోవలెనే మిలిటరీ నియంతల నిరంకుశత్వం కొనసాగింది. అశాంతి పరిస్థితులవల్ల ప్రజలు ఎన్నో బాధలు, కాటకం అనుభవించారు.

లియోనది ఎగువప్రాంతాల్లో నివశించే ఖైతాన్లు పశుపాలక దశలోవున్న ప్రజలు. పదో శతాబ్దారంభంలో వారి నాయకుడు ఎలూఅపోచీ అనేకమంది హాన ప్రజలను ఎత్తుకుపోయి, బలవంతాన వారిచేత భూమిని దున్నించి, కుక్కాలు పన్నులు వసూలు చేయసాగాడు. హాన్ పద్ధతిలోనే ఖైతాన్లు తమ నగరాలను నిర్మించుకున్నారు; స్వంతలిపిని సృష్టించుకున్నారు.

టాంగ్ పరిపాలన ఆఖరిరోజుల్లో షీ-చింగ్-టాంగ్ అనే సైనిక నియంత ఖైతాన్ల సాయంతో అధికారం హస్తగతం చేసుకుని, ఉత్తర ట్సిన్ రాజ్యాన్ని స్థాపించాడు. సాయపడిన ఖైతాన్లకు కృతజ్ఞతగా ప్రస్తుత హోపే రాష్ట్రంలోని 16 తాలూకాల ప్రాంతాన్ని అర్పించి, వారి నాయకునికి సామంతుడుగా వుండి, ప్రతి సంవత్సరం 3 లక్షల తానుల బట్టను సుంకంగా చెల్లించాడు.

ఖైతాన్లు 937 వ సంవత్సరంలో 'లియా' వంశ పరిపాలనను స్థాపించారు. 946 లో లియో సైన్యాలు దక్షిణానికి దండయాత్రచేసి, ఉత్తరట్సిన్ రాజధాని అయిన కై ఫెంగ్‌ను ఆక్రమించాయి. ఎల్లోనది లోయలో ప్రతిచోట ప్రజలు ప్రతిఘటనను

ఉద్యమించారు. అందుచేత బలవంతాన కైఫెంగ్ నగరాన్ని ఖాళీచేసి, లియో సైన్యాలు తమ స్వంత రాష్ట్రానికి తిరిగి వెళ్ళాయి.

ఐదు వంశాల పరిపాలన ఆఖరి దశలో పరిస్థితి కొంత కుదటబడి, యుద్ధాలు తగ్గినందున జాతీయ ఆర్థిక విధానం కొంత మెరుగయింది. ఉత్తర చౌ చక్రవర్తి అయిన షీ-ట్సుంగ్ బంజరు భూములసాగును ప్రోత్సహించి, భూమిని సర్వేచేయించి, కక్షాలను, పన్నులను తగ్గించాడు. ముసలివాళ్ళను, బలహీనులను తొలగించి, యువకులను ఆరోగ్యవంతులను చేర్చుకుని సైన్యాన్ని పునర్నిర్మించాడు. దీనివల్ల ఉత్తర చౌ ప్రభుత్వ ఆర్థిక సంపద, సైన్యశక్తి పెరిగింది. 959 లో ఉత్తర చౌ చక్రవర్తి తన సైన్యాలతో లియోపై దాడిచేసి, ప్రస్తుత హోపే రాష్ట్రంలోని - ఇంగ్ చౌ మో చౌ లను ఆక్రమించాడు. ఉత్తర ట్సిన్ చక్రవర్తి షీ-చిం-టాంగ్ వాటిని లియో ప్రభుత్వానికి అర్పించారు.

దక్షిణ దేశంలో శాంతిభద్రతలు వుండటంవల్ల ఉత్తరప్రాంతాలనుంచి ప్రజలు చాలమంది దక్షిణానికి తరలివచ్చారు.

యాంగ్ ట్సీనది దిగువ ప్రాంతాలలోవున్న 'వూ' ప్రభుత్వ ప్రోత్సాహంవల్ల వ్యవసాయం, పట్టుపరిశ్రమ చాల అభివృద్ధి చెందింది. దక్షిణ టాంగ్ పరిపాలన కాలానికి యాంగ్ ట్సీనది దిగువ ప్రాంతంలో ప్రతి 'మౌ' భూమిలోనూ వరి పంటో లేక మల్బరీ మొక్కలో నాటబడుతుండేవి.

దక్షిణటాంగ్ రాజ్యానికి తూర్పుగావున్న 'వూయుచ్' రాజ్యానికి ముఖ్య పట్టణంగా హాంగ్ చౌ నగరం వుండేది. ఈ రాజ్యం ఇతర రాజ్యాలతో యుద్ధం తలపెట్టకుండా పంట కాలువల నిర్మాణంపై దృష్టిని కేంద్రీకరించింది. ప్రతి నదిమీద ఆనకట్టలను నిర్మించి, వర్షాలు లేనపుడు పంటపొలాలకు నీరు అందించేటందుకు, వర్షాలు ఎక్కువైనపుడు మురుగునీటిని పోగొట్టేందుకు వనరులు ఏర్పరచారు. వ్యవసాయోత్పత్తి చాలా ఎక్కువయింది. బియ్యం చౌకగా లభించేవి. ఈ శాంతియుత సంవత్సరాలలో తైహు సరస్సు ప్రాంతంలో పంటచేలకు నీరు అందించే చక్కని వనరులు నిర్మించబడ్డాయి. భాగ్యవంతమైన, అందమైన నగరంగా హాంగ్ చౌ అభివృద్ధి చెందింది.

హునాన్‌లో బట్టల పరిశ్రమ, తేయాకు పరిశ్రమ గొప్పగా అభివృద్ధిచెందాయి. ముఖ్య రేవుపట్టణాలైన చెకియాంగ్, ఫూకీన్, క్వాంగ్ టంగ్ రేవులద్వారా తగినంత పెద్దయెత్తున వ్యాపారం జరిగేది.

100B



దేవతల నృత్యాన్నిచూపే తున్‌హాంగ్ శిల్పాలు

26 వ అధ్యాయం

# సూయ్, టాంగ్, ఐదు వంశాల పరిపాలనలో సంస్కృతి

## టాంగ్ కవిత్వం

టాంగ్ సామ్రాజ్యం పరిపాలించిన మూడువందల సంవత్సరాల కాలంలో విశాలమైన రాజ్యం, పెరుగుతున్న ఆర్థిక విధానం ఫలితంగా జాతీయ సంస్కృతి ఎంతో వర్ధిల్లింది. చైనాదేశ చరిత్రలో అది దేదీప్యమానమైన దశ. టాంగ్ కవులు తమదేశ ప్రకృతిని వర్ణించుటేగాక సరిహద్దు ప్రాంతాలను చిత్రించుతూ కావ్యాలు రాశారు. టాంగ్ రాజ్యంలోని ప్రజల జీవితాన్ని, ఇతర ఆసియా ప్రజల ఆచార వ్యవహారాలను వర్ణించారు. ప్రకృతి శోభతో శాంతియుతంగా వర్ధిల్లే పల్లె సీమలను, సంపదలతో తులతూగే నగరాలను, పర్వతాల రామణీయకతను, నదుల సౌందర్యాన్ని, బ్రహ్మాండమైన భవనాలను కీర్తించుతూ గానం చేశారు. టాంగ్ కవులు తమ ఆలోచనలను, అనుభూతులను వ్యక్తంచేశారు. కొన్ని గేయాలలో పాలకవర్గం దుబారాను, క్రూరత్వాన్ని వర్ణించారు; కొన్నిటిలో శ్రామిక ప్రజల బాధలను ప్రతిధ్వనించారు. కొన్ని గొప్ప గ్రంథాలు అప్పటి సామాజిక జీవితాన్ని ప్రతిబింబించాయి.

అత్యంత ప్రతిభావంతులైన కవులలో లీ పో ఒకరు. "బలవంతులను, పలుకుబడి గలవారిని" ఆయన కీర్తించలేదు. దురాక్రమణయుద్ధాలను వ్యతిరేకించుతూ, స్వాతంత్ర్యంతో కూడిన శాంతియుత జీవితాన్ని ఆయన అభిలషించారు. లీ షాన్ పర్వతాలలోని ఆకాశగంగను, యాంగ్ ట్సీ నదిపై తేలియాడే ఓడలను కీర్తించుతూ ఆయన గానం చేశారు. సరిహద్దుప్రాంతాల ప్రజల కష్టాలను, జిచివాన్ ఇరుకు దారుల్లో ప్రయాణీకుల ఇబ్బందులను గురించి విషాదం వ్యక్తపరచారు; ఆయన రచనల్లో సౌందర్యం, ఆవేదన కూడ ప్రతిబింబించుతుంది.

లీపోకు సమకాలీనుడైన టూఫూ కూడ అత్యంత గౌరవనీయులైన కవులలో [illegible]రు. బీదపండిత కుటుంబంలో పుట్టినందున ఆయన, జనసామాన్యం అనుభవించే [illegible]దకరమైన బాధలను ఆయన రుచిచూశాడు.

చలికాలం ఒక రోజున టూఫూ కవి చాంగన్ నగరంనుంచి ఇంటికి వెళ్తూ లీషాన్ పర్వతం ప్రక్కనే నడుస్తున్నాడు. పర్వతంమీదవున్న హువాచింగ్ రాజభవనంలో హ్సువాన్ ట్సుంగ్ చక్రవర్తి గాయకులతోనూ, నాట్యకత్తెలతోనూ విలాసంగా గడుపుతూ, తన అనుచరులకు పెద్ద బహుమానాలను యిచ్చివేస్తున్నాడు. చక్రవర్తి దర్బారు విలాసాలను, దుబారాను గురించి ఆలోచించుతూ, చాంగన్ నగర వీధుల్లో చలిగాలికి వణికిపోతున్న బీదల అవస్థను గుర్తుచేసుకున్నాడు. కవి ఆమరవాణి ఈ పదాలలో వ్యక్తమయింది :

"రక్తవర్ణపు దర్వాజా లోపల
పులిసిపోతున్న సారా
మురిగిపోతున్న మాంసం
దర్వాజా బయట ఆకలితో
చలిలో బిగుసుకుపోయిన
అన్నార్తుల ఎముకలు ॥

అతడు ఇంటికి చేరే సమయానికి లోపలనుంచి ఏడుపు వినిపించింది. ఆయన చిన్నకొడుకు ఆకలితో అపుడే ప్రాణం వదలాడు. ఇరుగుపొరుగువారంతా సానుభూతితో ఆయనను ఓదార్చారు. కాని టూ ఫూ దుఃఖం కేవలం తనకొడుకు మరణానికే పరిమితం కాలేదు. తన భూమిని కోల్పోయిన రైతుజన సామాన్యం వైపు, సరిహద్దు కాపలాదార్ల కష్టాలవైపు విస్తరిల్లిన కవి దుఃఖానికి అవధులు లేవు. తన గేయాలలో న్యాయోచితమైన కోపాన్ని, బాధను కవి ఎలుగెత్తి చాటాడు.

దీర్ఘకాల యుద్ధాలు సాగుతున్న రోజులలో టూ ఫూ. ఎన్నో బాధలను, లేమిని అనుభవించాడు. మాతృదేశం, ప్రజలతోపాటు తన జీవితం ముడివడిందని కవి గుర్తించాడు. రెండిటి యెడల గాఢప్రేమను వ్యక్తంచేస్తూ గేయాలు రచించాడు. ఆకురాలు కాలంలో ఒక రాత్రి తన యింటి కప్పుపైన వున్న గడ్డి గాలికి కొట్టుకుపోయినపుడు, వర్షానికి పడక తడిసిపోయినపుడు యిలా వ్రాశాడు :

" పదిలక్షల గదులున్న
బ్రహ్మాండమైన గృహం
నిర్మించడం సంభవమైతే ?
ప్రపంచమందలి బీద పండితులు
అందరికి ఆశ్రయమిచ్చి ఆనందం
చేకూర్చడం సంభవమైతే ?
తూఫానుల తాకిళ్ళకు పర్వతంలా
నిలబడగలిగిన ఆ భవనాన్ని
ఈ కళ్ళతో చూడకలిగితే ?
నా గుడిశె కూలిపోయినా

ఒంటరిగా మరణించవలసినా
సంతృప్తితో కళ్ళు మూయగలను "

ప్రజల శాంతియుత జీవితాన్ని ధ్వంసంచేసిన, ఆన్ లూ షాన్ షీ జెమింగ్ తిరుగుబాటుదారులపైకి తరలివెడుతున్న సైనికులయెడల ఆయన సానుభూతి వ్యక్తం చేశాడు.

"ఋషి తుల్యుడైన కవి" అని పిలువబడుతున్న టూ ఫూ తన రచనలలో చిక్కులతోనూ, కదలికలతోనూ వున్న యుగాన్ని ప్రతిబింబించాడు.

టూ ఫూ మరణానంతరం జన్మించిన పోచో-ఇ కి, పై కవి యెడల అత్యంత గౌరవభావముంది. సరిహద్దు సైనిక ప్రభువుల నిరంకుశ పాలన ఫలితంగా ఉద్భవించిన ఆటుపోట్లను, సహజ అరిష్టాలను ఆయన అనుభవించాడు. ప్రజల బాధల యెడల సానుభూతిని వ్యక్తంచేశాడు. వ్యంగ్యధోరణిలో వ్రాసిన పద్యాలద్వారా పాలకవర్గ నేరాలను నిర్దాక్షిణ్యంగా తూర్పారబట్టాడు. పీడితప్రజల న్యాయమైన కోపాన్ని ప్రతిధ్వనింపజేశాడు.

## చిత్రకళ, సంగీతం, నృత్యం

చాలా కాలంనుంచి కంసూ రాష్ట్రంలోని తున్ హాంగ్, చైనా భారత దేశాలకు, మధ్య ఆసియాకు సాంస్కృతిక కేంద్రంగా వుండేది. నాలుగో శతాబ్దం నుంచి పదునాల్గో శతాబ్దంవరకు వేయి సంవత్సరాల కాలంలో కాంటీ పట్టణానికి 40 లీల దూరాన కొండల్లో వెయ్యి కంటే ఎక్కువ గుహలను తొలిచారు. టాంగ్ పాలనలోనూ, ఐదువంశాల పాలనలోనూ కలసి 700 గుహలను తొలిచారు. ఇప్పటికీ పూర్తిగా 480 గుహలు వున్నాయి. 4 లీల పొడుగున కొండను తొలిచి, మూడు లేక నాలుగు వరుసల్లో గుహలు నిర్మించబడ్డాయి. దూరాన్నుంచి చూస్తే సువిశాల మైన పట్టణంలాగ కన్పించే ఈ గుహల సమూహం మోకావ్ కుధ్యాలనీ, వేయి బుద్ధుల గుహలనీ పిలవబడుతోంది.

ఈ గుహల్లోవున్న చాలా బౌద్ధవిగ్రహాలు గొప్పశిల్పాన్ని, కళానైపుణ్యాన్ని వ్యక్తపరుస్తాయి.

గుహల గోడలమీద రంగుచిత్రాలలోనూ, ఉబ్బెత్తుగా చెక్కిన శిల్పాలలోనూ బుద్ధుని జీవితగాథను చిత్రించబడ్డాయి. విశాలమైన ఈ గోడలపై వేలకొలది విగ్రహాలను మలచడంలో చిత్రకారులు, శిల్పులు పూర్తిస్వాతంత్ర్యాన్ని తీసుకున్నారు. మత సంబంధమైన చిత్రాలైనప్పటికీ, ఆ కాలపు సమాజ పరిస్థితులను అనేక సందర్భాలలో ఇవి వ్యక్తం చేస్తున్నాయి. శిరోవేష్టాలపైన,దుస్తులపైన, నగిషీలు ప్రతిదీ ఎంతో నేర్పుతో వివరంగా చిత్రించబడ్డాయి. భూమిని దున్నడం, పడవలను నడపడం, పశువులను మేపడం, సంగీతవాయిద్యాలను ప్రయోగించడం, నృత్యాలు చేయడం వగైరా అనేక కార్యకలాపాలు చిత్రించబడ్డాయి. శ్రామిక ప్రజల

పరిశ్రమను, పాలకవర్గ విలాసాన్ని కూడ ఈ బొమ్మలలో వివరంగా చిత్రించారు. గుహాల పైభాగంలో అందమైన డిజైన్లు చిత్రించబడ్డాయి.

మాకోవ్ కుడ్య చిత్రాలన్నిటినీ ఒకదాని ప్రక్కన మరొకటి వుంచుతూ పోయినట్లయితే 50 లీల దూరమంత పొడుగవుతాయి. ప్రపంచంలోని గొప్ప కళా నిలయాల్లో టున్‌హాంగ్ ఒకటి.

సూయ్ - టాంగ్ పరిపాలనలో సంగీతం ఉన్నతస్థాయికి అభివృద్ధి చెందింది. వాద్య సమ్మేళనం (ఆర్కెస్ట్రా) ఔన్నత్యానికి చేరుకుంది. అనేకరకాల సంగీత పరికరాలు, వాయిద్య విశేషాలు వుండేవి. ప్రాచీనకాలంనుంచి వస్తున్న షెంగ్ (వివిధరకాల పొడుగున్న అనేక గొట్టాలతో కూడిన వాద్య విశేషం), హ్సియోవ్ (ఒక రకమైన వేణువు), చెంగ్ (తీగలతో నిర్మించిన వాద్య విశేషం), పీపా (తిత్తి శృతి), చీహ్కు (జింకతోలు డోలు), వేణు వగైరా పశ్చిమ ప్రాంతాల మధ్యఆసియా వాద్య పరికరాలు ఉపయోగించబడేవి. ఆసియా జాతుల సంస్కృతీ సమ్మేళనానికి విశిష్టమైన ఉదాహరణగా సూయ్-టాంగ్ సంగీతాన్ని చూపించవచ్చు.

జింకతోలు డోలును వాయించే కళాకారుడు జంత్ర సమ్మేళనానికి నిర్వాహకుడుగా వుంటాడు. అతడు ప్రత్యేకంగా కుట్టిన శిరోవేష్టాన్ని ధరించేవాడు. రెండు చిరతలతో వాయించినపుడు ఆ డోలు నిర్దిష్టమైన స్థాయిలో కూడిన ధ్వనిని పలికేది.

సూయ్-టాంగ్ నృత్యాలు ఎక్కువగా పశ్చిమ ప్రాంతాలు, మధ్య ఆసియా, భారతదేశంనుండి చాల నాట్యరూపాలను స్వీకరించాయి. నృత్యాలు రెండు రకాలుగా, విసురుఅడుగులు వేసే పద్ధతి, నిదానం అడుగులువేసే పద్ధతి వుండేది. మొదటిరకం నృత్యం చేసేవారు ఎంత త్వరగా తిరిగేవారంటే ప్రేక్షకులు తాము కళాకారుల ముఖం చూస్తున్నారో, వీపు చూస్తున్నారో గుర్తించడం అసాధ్యమయ్యేది. నిదానంగా అడుగులువేసే రెండోరకం నాట్యకారులు పొడుగాటి చేతులున్న దుస్తులను ధరించేవారు. పొడుగుచేతులను ఉపయోగించి, నిదానంగా హంస యానం వలె హుందాతనం వెల్లివిరిసేలా నృత్యం చేసేవారు.

## 27 వ అధ్యాయం

# లియోవ్, హ్సియా కిన్, రాజ్యాలకు వ్యతిరేకంగా ఉత్తర సుంగ్ రాజ్య పోరాటం

ఉత్తర చౌ ప్రభుత్వ ఆఖరి సంవత్సరాలలో పోరాట దక్షతగల సామ్రాజ్య సేనలు జనరల్ చావ్ క్వాంగ్ యిన్ నాయకత్వంక్రింద వుండేవి. క్రీ. శ. 960 వ సంవత్సరంలో ప్రభుత్వాధికారాన్ని హస్తగతం చేసుకుని ఇతడు సుంగ్ వంశ పరిపాలనను స్థాపించాడు. చరిత్రకారులు దీనిని ఉత్తర సుంగ్ అని పిలుస్తారు.

పన్నెండు యేళ్ళలో ఉత్తర సుంగ్ ప్రభుత్వం వరుసగా చింగ్, నాన్ షూ, దక్షిణహాన్, దక్షిణటాంగ్, వూయేహో, ఉత్తర హాన్ రాజ్యాలను జయించి, చాల కాలంగావున్న దేశ విభజనను తుదముట్టించి, చైనాలో ఐక్యకేంద్ర ప్రభుత్వాధికారాన్ని పునరుద్ధరించింది.

తన పరిపాలనను బలపరచుకొని, స్థానికాధికారుల పెత్తనాన్ని తొలగించడానికి ఉత్తరసుంగ్ ప్రభుత్వం సైన్యంపైన రాజకీయ ఆర్థికశాఖలపైన ప్రత్యక్ష అధికారాన్ని కేంద్రం చేతుల్లో వుంచుకుంది. చక్రవర్తే స్వయంగా సైన్యంపై ఆధ్వర్యం వహించేవాడు.

భూస్వాముల తోడ్పాటును సంపాదించేందుకు సివిల్ సర్వీసు పరీక్షా పద్ధతిని మార్చి, అభ్యర్థుల సంఖ్యను, వుద్యోగులకోటాను ఎక్కువచేశారు. దీని ఫలితంగా ప్రభుత్వ నిర్మాణాలు క్రమంగా పెరిగి, భారంగా తయారయ్యాయి. పెద్ద జీతాలు పుచ్చుకునే అసంఖ్యాకమైన వుద్యోగుల పోషణకు ప్రభుత్వధనం విపరీతంగా ఖర్చయ్యేది. ఈ పరిస్థితిని తట్టుకోడానికి ప్రజలపై భారం ఎక్కువవేసి, కళ్ళాలు బిగించవలసి వచ్చింది.

లియో తెగకు వెనుకటి టాంగ్ చక్రవర్తి వదలిన ప్రాంతాన్ని తిరిగి వశం చేసికోడానికి చక్రవర్తి తమ్ముడైన చావ్ క్వాంగ్-ఇన్ రెండుసార్లు లియోపైన దాడిచేసి, రెండుసార్లూ ఓడిపోయాడు. లియో అశ్వికదళాలు వరుసగా తిరుగుదాడి చేసి పశువులను, వేలకొలది రైతులను ఎత్తుకుపోయారు

1004 వ సంవత్సరంలో లియో రాజు పెద్దసైన్యంతో ఉత్తర సుంగ్ రాజ్యంపై దాడిచేశాడు. కాని తీవ్ర ప్రతిఘటనవల్ల ముఖ్యమైన నగరం ఒకటైనా పట్టుపడ లేదు. టాంచో హోనాన్ రాష్ట్రంలోని ప్రస్తుత పుయాంగ్ యుద్ధంలో సుంగ్ సైన్యాలు లియో సైన్యాధ్యక్షుని కాల్చి చంపాయి; లియో సైన్యాన్ని తీవ్రంగా నష్టపరచాయి.

యుద్ధంలో సుంగ్ సేనలు జయించినప్పటికీ, టాన్‌చౌను శత్రుసేన సమీపించు తుందన్న వార్త వినగానే పిరికిబారిన మంత్రులు రాజధానిని నాన్‌కింగ్‌కో, చెంగ్టూకో మార్చాలని వాదించసాగారు. ఓటమి తత్వానికి దారితీసే ఈ వాదనను ముఖ్యమంత్రి కౌచున్ తీవ్రంగా ఎదిరించాడు. ఎల్లోనది దాటివెళ్ళి, చక్రవర్తే స్వయంగా యుద్ధాన్ని నడిపించాలని ప్రతిపాదించాడు. అతనిసలహాను పాటించి, టాన్‌చౌకు చక్రవర్తి వెళ్ళాడు. లియో దండయాత్రికులు ఓడిపోయారు; ఐనప్పటికీ శత్రువులింకా బలంగానూ, ప్రమాద కరంగానూ వున్నారు. ఈసారి పిరికి మంత్రుల సలహా విని చక్రవర్తి ప్రతియేటా లక్ష వెండి నాణాలు, 2 లక్షల పట్టుతాన్లు యిచ్చేందుకు అంగీకరించి, లియో ప్రభుత్వంతో ఒడంబడిక చేసుకున్నాడు.

పదకొండో శతాబ్దం మధ్యలో టాంగూట్ నాయకుడు చావో యువాన్-హో కంసూ రాష్ట్రం తూర్పు ప్రాంతంలో రాజ్యాన్ని స్థాపించాడు. దీనిని చరిత్ర కారులు పశ్చిమ హ్సియా అనీ, క్లుప్తంగా హ్సియా అనీ పిలుస్తారు.

హ్సియా ప్రభుత్వం టిబెట్‌ను, ఐఘుర్‌ను ఓడించుటేగాక కంసూలోనూ ఆర్డూస్‌లోని ఎక్కువ భాగాన్ని ఆక్రమించింది.

బలపడిన తర్వాత హ్సియా ప్రభుత్వం పెద్దపెట్టున సుంగ్‌పై అనేక యుద్ధాలు చేసింది. సుంగ్ ప్రభుత్వం చెప్పుకోతగిన నష్టాలను పొందింది.

యుద్ధంవలన సుంగ్, హ్సియా రాజ్యాలమధ్య వర్తకం ఆగిపోయింది. సుంగ్ నుంచి అవసరమైన సరుకులను హ్సియా తెప్పించుకోలేక పోయింది; సైనికుల కొరత కూడ ఏర్పడింది. ఈ పరిస్థితులలో హ్సియా ప్రభుత్వం 1044 లో సుంగ్ ప్రభుత్వంతో శాంతిసంధి చేసుకుంది. సుంగ్ సార్వభౌమాధికారాన్ని నామమాత్రంగా హ్సియా అంగీకరించింది. ప్రతియేటా 70 వేల వెండి నాణాలను, 150 వేల పట్టు తాన్లను 30 వేల కాటీల తేయాకునూ హ్సియాకు చెల్లించేందుకు సుంగ్ ప్రభుత్వం అంగీక రించింది.

లియో, హ్సియా దండయాత్రికుల యెడల సుంగ్ ప్రభుత్వం అవలంబించిన అవమానకరమైన వైఖరి ఫలితంగా ప్రజల కష్టాలు మరింత పెరిగాయి.

## ఉత్తర సుంగ్ ఆర్థికాభివృద్ధి

ఉత్తర సుంగ్ పరిపాలన త్వరగా స్థిరపడటంవల్ల వ్యవసాయ అనుభవాలను నేర్చుకునే అవకాశ మేర్పడింది. ప్రభుత్వ ఆర్థికవిధానాన్ని పునరుద్ధరించడానికి, అధికారాన్ని సుస్థిరం చేసుకోడానికి, వ్యవసాయోత్పత్తిని పెంచే నిమిత్తం పరిపాల

కులు కొన్ని చర్యలు తీసుకున్నారు. ఐదు వంశాల పరిపాలన కాలంలో బలవంతాన వసూలు చేసిన విపరీతపు పన్నులలో చాలా రద్దుచేశారు. బంజర్లను, పడావులను సాగులోకి తీసుకువచ్చే రైతులనుండి మూడేళ్ళవరకు పన్నుల వసూళ్ళు మినహాయించారు. దుక్కి పశువులు కొరత ఏర్పడినచోట్ల మానవ శ్రమను వినియోగించేందుకు వీలుగా నాగలిని మార్పు చేశారు. "చాన్ చెంగ్" అనే వరి విత్తనాన్ని, స్వల్పకాలంలో ఎక్కువ పంట నిచ్చే రకాన్ని, పండించేందుకు ప్రజలలో ప్రచారం చేశారు. ఎల్లో నది కరకట్టలను మరమ్మతు చేయించారు. యాంగ్‌ట్సీనదికి దక్షిణానవున్న రాష్ట్రాలలో నీటి వనరులను ఏర్పరచే ప్రాజెక్టులను నిర్మించారు. సాగుజేసే భూమి విస్తరించి జనాభా పెరిగింది.

ప్రభుత్వం చేతుల్లోవున్న విస్తీర్ణమైన భూములను కౌలుదార్లచేత సాగుచేయించి భూస్వాములు వసూలుచేసే మక్తాలకంటే తక్కువ మక్తాను ప్రభుత్వం రాబట్టేది. సాధారణంగా పెద్దభూస్వాముల కమతంలో వారి కుటుంబవసతి గృహం, పండ్లతోట, కాయగూరలు పండించే చేను, చెరువులు, పిండిమరలు, ధాన్యపు గిడ్డంగులు వుండేవి. కమతానికి ఒక అంచున కౌలుదార్ల గుడిసెలు వుండేవి. సాగు భూములేగాక అడవులు, సరస్సులుకూడ పెద్దభూస్వాముల ఆధీనంలో వుండేవి. కొందరు భూస్వాములకు డజన్లకొద్దీ కమతాలుండేవి. వందలకొలదీ, లేక వేలకొలదీ కౌలుదార్లనుంచి వారు పండించేదానిలో సగానికంటే అధికంగా భూస్వాములు కాజేసేవారు. ఆర్థికంగా దోచుకోడంతోపాటు భూస్వాములు కౌలుదార్లను కొరడాతో బాదడం, అతడి కుటుంబ సభ్యునిచేత వూడిగం చేయించుకోవడం సర్వసాధారణంగా జరిగేది. భూస్వామి తన కమతాన్ని తాకట్టుపెట్టడం లేదా అమ్మడం జరిగినపుడు, భూమితోపాటు కౌలుదార్లుకూడా కొత్తయజమానికి స్వాధీనమయ్యేవారు.

పూర్వంవలెనే ఇచటకూడ పెద్ద భూస్వాములలో హెచ్చుమంది ఉద్యోగంలో లేక వుద్యోగులపద్ధతు గలవారో ఐనందున అనేక వక్రమార్గాలద్వారా తమ కమతాల విస్తీర్ణాన్ని దాయడం, పన్నులను వెట్టిచాకిరిని తప్పించుకోవడం జరిగేది. ఈ భారాన్నంతటినీ రైతులపైన మోపేవారు.

గనుల త్రవ్వకం ప్రభుత్వ ఆధీనంలో వుండేది. బంగారం, వెండి, రాగి, ఇనుము వగైరా ఖనిజాలను టాంగ్‌వంశ పరిపాలనలోకంటే ఎక్కువగా వుత్పత్తి చేశారు. ప్రతిసంవత్సరం గనులనుండి వేలకొలది టన్నుల ముడిఇనుము త్రవ్వబడుతుండేది. ఇనుము కరిగించే బట్టీలలో డజన్లకొలదీ కార్మికులు పాల్గొనేవారు.

పట్టుపరిశ్రమ ప్రభుత్వంచేతనూ, వర్తకులచేతనూ నిర్వహించబడుతూ, అభివృద్ధి చెందింది. అనేక రకాల పట్టువస్త్రాలు లభ్యమయ్యేవి. కైఫెంగ్, లోయాంగ్, జన్‌చౌ, ట్జూచౌ తదితర నగరాలలో పట్టునూలు వస్త్రాలను తయారుచేసే పెద్ద కర్మాగారాలను ప్రభుత్వం నిర్వహించేది. దానితోపాటు అనేకచోట్లనుండి పట్టు వస్త్రాలను పెద్ద మొత్తంగా ప్రభుత్వం కొనుగోలు చేసేది. ఉదాహరణకు యూహ్‌చౌ

నగరంనుంచి (ప్రస్తుత చెకియాంగ్ రాష్ట్రంలోని షావ్‌సింగ్) 3 లక్షల తాళ్లు ఒక సంవత్సరంలో ప్రభుత్వం ఖరీదు చేసింది. శ్రేష్టమైన కుండలూ, పింగాణీ ఉత్పత్తి అయ్యేది. సుంగ్ సరుకులు ప్రశస్తమైనవని ఖ్యాతిచెంది, విదేశాలలో బాగా ఖర్చయ్యేది.

పరిశ్రమలు చేతివృత్తులు అభివృద్ధి చెందటంతోపాటు వర్తక వ్యాపారాలు విస్తరించసాగాయి. కైఫెంగ్‌లో రాత్రిళ్ళు బజార్లు కొన్ని సమయాల్లో తెల్లవారే వరకు తెరచివుండేవి. చెంగ్టూ, హ్సింగ్‌యువాన్ (ప్రస్తుత షెన్సీ రాష్ట్రంలోనిది) నగరాలు కూడా పెద్ద వ్యాపారకేంద్రాలుగా వుండేవి. కాంటన్, మింగ్ చౌ (ప్రస్తుత చెకియాంగ్ రాష్ట్రంలోనిది), హాంగ్ చౌ నగరాలు విదేశాలతో వ్యాపారం చేసే కేంద్రాలుగా వుండేవి. కాంటన్ నగరంలోని విదేశీయుల హాస్టళ్లో ఇతరదేశాల నుంచి వచ్చే వర్తకులకు వసతి యేర్పాట్లు వుండేవి. వ్యాపార సుంకాలవల్ల ప్రభుత్వానికి చాల ఆదాయం వచ్చేది; సైన్యానికయ్యే ఖర్చులో సగాన్ని ప్రభుత్వం సుంకాల ద్వారా వసూలు చేయగలిగేది.

వ్యాపారం అభివృద్ధి చెందేకొలదీ, మార్కెట్టులో చెలామణికి రాగినాణాల అవసరం చాల ఎక్కువయింది. ప్రతి సంవత్సరం ప్రభుత్వం కోట్లకొలదీ దండల రాగి నాణాలను ముద్రించినప్పటికీ మార్కెట్టు అవసరాలకు యింకా కొరత యేర్పడే వెండికూడా చెలామణి అవడం ప్రారంభమయింది. ఉత్తర సుంగ్ పరిపాలన మధ్య కాలంలో "చియోావ్ ట్సే" అని పిలువబడే బ్యాంకునోట్లు కూడ ప్రవేశపెట్టబడ్డాయి.

## వాంగ్ ఆన్-షీ సంస్కరణలు

లియో, హ్సియో తెగలతో జరిగిన యుద్ధాలవల్ల డబ్బు విపరీతంగా ఖర్చయింది. అదీగాక నష్టపరిహారంగా సుంగ్ ప్రభుత్వం పెద్ద మొత్తాలను చెల్లించాలిసి వచ్చింది. ఆడంబరాలతోకూడిన రాజదర్బారు విపరీతఖర్చులను, ప్రభుత్వ పన్నులు వసూలుచేసే పెద్దయంత్రాంగం ఖర్చులను, సుమారు పదిలక్షల సేనకు అయ్యేఖర్చులను, భరించేందుకు చాల ఎక్కువ ఆదాయం కావాలి. ప్రతి సంవత్సరం వచ్చే ఆదాయం ఖర్చులకు సరిపోయేది కాదు. ప్రభుత్వం ఆర్థిక చిక్కులు క్రమంగా పెరుగుతూంటే, ప్రజలపై భారం పెరిగి అసంతృప్తి ఎక్కువయింది.

సైన్యాలకు తరిఫీదు లేక శిక్షణ కొరవడింది. సరిహద్దులను సరిగా రక్షించలేకపోయినందున, లియోావ్, హ్సియా తెగల దండయాత్ర ప్రమాదాన్ని అరికట్టలేకపోయింది.

తాయ్ ట్సుంగ్ చక్రవర్తి పరిపాలన జరుగుతూండగా జేచివాన్ రాష్ట్రంలో రైతులు తిరుగుబాటు చేశారు. వారి నాయకుడు వాంగ్ హ్సియోావ్-పో "సంపదను సమానంగా పంచాలనే" నినాదం తీసుకున్నందున రైతులు బలపరచారు. ఈ పోరాటం

చాల సంవత్సరాలు సాగింది. తరువాత చక్రవర్తి జెన్ ట్సుంగ్ సింహాసనం అధిష్టించే నాటికి దేశమంతటా రైతుల తిరుగుబాట్లు కొనసాగుతున్నాయి.

దేశాంతర్గత పరిస్థితులను, బయటి పరిస్థితులను గమనించి, రానున్న ప్రమాదాన్ని గురించి, సంస్కరణల అవసరాన్ని గురించి, కొందరు సలహాదార్లు ప్రభుత్వాన్ని హెచ్చరించారు.

"రాజకీయ సంస్కరణలను వెంటనే అమలుజరపాలి; లేనిచో ఎర్ర కనుబొమల విప్లవం, పసుపు తలపాగాల విప్లవం లాంటి ప్రజావెల్లువ మనలను ముంచివేస్తుంది" అని వారు హెచ్చరించారు. వాంగ్ ఆన్ - షీ చైనా చరిత్రలో ప్రఖ్యాత రాజకీయవేత్త. పూర్వీకులు ప్రవేశపెట్టిన సంస్కరణలను పరిశీలించి వాటిపై ఆధారపడి కొన్ని ప్రతిపాదనలు చేశాడు. మంత్రుల, పెద్దభూస్వాముల వ్యతిరేకతను ఖాతరు చేయకుండా వాంగ్ ఆన్ - షీని ప్రధాన మంత్రిగా చేసి, అతను సూచించిన సంస్కరణలను అమలుజరుపేందుకు అధికారమిచ్చాడు.

1069 వ సంవత్సరంలో ప్రారంభించి, వరుసగా "కొత్తశాసనాలు" అమలు జరిగాయి. ముఖ్యమైనవి క్రింద ఉదహరించబడ్డాయి.

"వ్యవసాయం - నీటి వసతులు"—వ్యవసాయాభివృద్ధిని సాధించేందుకు నీటి వనరులను పెంచే నిర్మాణాలను కట్టడం, బంజరు భూములను సాగుచేయడం.

"తక్కావీ అప్పులు" - భూస్వాములు, వడ్డీవ్యాపారులు గుంజుతున్న అధిక వడ్డీలనుండి రైతులను రక్షించేందుకు విత్తనాల తరుణంలో ప్రభుత్వమే పంటల జామీనుపై రైతులకు అప్పులిస్తుంది. ఆరు నెలల తరువాత నూటికి 20 వడ్డీతో అప్పులు తీర్చాలి.

"చాకిరీ రమిషన్": ఉద్యోగుల ప్రత్యేక సౌకర్యాలను తొలగించి, తమ పొలాల్లో పనిచేసుకునేందుకు అవకాశమిస్తూ, చాకిరీనుండి మినహాయించినందుకు ఆయా కుటుంబాల ఆదాయాన్ని అనుసరించి క్రమానుగత పన్నులను విధించింది. చాకిరీనుంచి మినహాయించబడినవారు ప్రత్యామ్నాయంగా (సబ్సిడీగా) పన్ను చెల్లించాలి. ఈ డబ్బుతో ప్రభుత్వం వేతనాలిచ్చి కూలీలచేత పనులు చేయించు కునేది.

"భూమి సర్వే సక్రమమైన పన్నుల విధానం": ఉద్యోగులు భూస్వాములు తమ కమతాల లెక్కలను దాచకుండా అరికట్టేందుకు, ప్రభుత్వ ఆదాయాన్ని పెంచేందుకు భూమిని సర్వే చేయించారు. పన్నులను విధించేందుకు వీలుగా భూమిని సమానభాగాలుగా విభజించారు. తద్వారా వుద్యోగులు, భూస్వాములు కూడ పన్నులు చెల్లించడం తప్పనిసరయింది.

"ధరల కంట్రోలు"— మార్కెట్టుపై గుత్తాధికారం సంపాదించకుండా పెద్ద వర్తకులను అరికట్టేందుకు, ప్రభుత్వఆదాయాన్ని పెంచేందుకు, మార్కెటుకి విపరీతంగా

సరుకు వచ్చేసమయంలో ప్రభుత్వమే న్యాయమైన ధరలకు వస్తువులుకొని, సప్లయిలు తగ్గినపుడు తనవద్దవున్న నిల్వలను తిరిగి అమ్మేది.

“పావ్-చియా”— సైన్యం ఖర్చులను తగ్గించేందుకు, దేశరక్షణను బలపరచేందుకు, పావ్-చియా పద్ధతి ప్రవేశపెట్టారు. తీరుబడి సమయాల్లో రైతులను తర్ఫీదు యిచ్చి సంఘటితపరచడంద్వారా క్రమంగా డబ్బుకోసం పనిచేసే సైనికుల సంఖ్య తగ్గించారు.

“కొత్త శాసనాల” వల్ల రైతులకు కొన్ని సౌకర్యాలు లభించాయి. నిరంకుశోద్యోగులు, భూస్వాములు, పెద్ద వర్తకులపై కొన్ని ఆంక్షలు విధించబడ్డాయి. నీటిని అమలుజరిపాక, కోట్ల మౌల భూమి అదనంగా సాగులోకి తీసుకురాబడింది. నీటి వనర్లకొరకు వేలకొలదీ ప్రాజెక్టులు నిర్మించబడ్డాయి. ప్రభుత్వాదాయం పెరిగింది: ప్రజలపై భారం తగ్గింది.

ఉన్నతోద్యోగులకు, భూస్వాములు “కొత్త శాసనాల”ను ఏవగించుకున్నారు. జెన్ ట్సుంగ్ చక్రవర్తి, వాంగ్ అన్-షీ ల మరణానంతరం కొత్త శాసనాలను పూర్తిగా రద్దుచేయించారు.

“కొత్త శాసనాలు” ఏర్పరచిన పరిమితులనుండి తప్పించుకున్నాక వుద్యోగులు, భూస్వాములు మరింత దారుణంగా రైతులను దోచుకోసాగారు. అదేసమయాన రాజదర్బారు ఆడంబరపు ఖర్చులు కూడ పెరిగాయి. రాజభవనాన్ని, ఉద్యానవనాన్ని అలంకరించడానికి అపురూపమైన పూలను, రాళ్ళను (స్ఫటికాలను) తెప్పించడానికి చక్రవర్తి వుద్యోగులను దక్షిణానికి పంపాడు. బ్రహ్మాండమైన రాతిని తైహు సరస్సునుంచి మోసుకువస్తున్న ఓడ రావడానికిగాను తూములను, బ్రిడ్జీలను బద్దలు కొట్టారు. నగర గోడలను పూడదీశారు. అధికారంలో వున్నవారు భోగభాగ్యాలతో కులుకుతుంటే, నిరంకుశాధికారులు పెట్టే బాధలతో రైతులు మూలుగుతూ వుండేవారు. అనేకమంది తమ కొడుకులను, కూతుళ్ళను అమ్ముకోవలసి వచ్చేది.

రైతులను భరింపలేనంతగా దోచుకున్నందువల్ల తిరుగుబాట్లు బద్దలయ్యాయి. 1120 లో సాయుధులైన రైతులకు నాయకత్వం వహించిన ఫాంగ్ లా హాంగ్ చౌ నగరాన్ని చెకియాంగ్ రాష్ట్రంలో ఎక్కువభాగాన్ని పట్టుకున్నాడు. ప్రఖ్యాత రైతు నాయకుడు సుంగ్ చియాంగ్, షాంటుంగ్, హోనాన్, క్యాంగ్సి రాష్ట్రాలలో తిరుగుబాటుకు నాయకత్వం వహించాడు.

ప్రభుత్వం తిరుగుబాటుదారులను అణచివేసింది. కాని పతనం ఆరంభమయింది. బయటనుంచి కొత్తగా విజృంభించి కిన్ తెగ దండయాత్ర ప్రమాదాన్ని ఎదుర్కోవలసి వచ్చింది.

## కిన్ దండయాత్ర - దక్షిణానికి సుంగ్ పలాయనం

సుంగారీ నదీ లోయలోనూ, హీలుంగ్ కియాంగ్ నది దిగువ ప్రాంతాలలోనూ నూచెన్ ప్రజలు నివసించేవారు. సగంమంది వ్యవసాయంపైన, సగంమంది వేటాడటం

చేపలు పట్టడంపైన బ్రతికేవారు. లియోజాతి వీరిని పీడించుతుండేది. లియో చక్రవర్తి నూచెన్ ప్రజలనుంచి బంగారం గుర్రాలు ఇతర విలువైన వస్తువులను సుంకంగా వసూలు చేసేవాడు. పన్నెండవ శతాబ్దారంభంలో నూచెన్ ప్రజలలో భాగమైన వాన్‌యేన్ తెగ నాయకుడు అకుట్టా తన తెగలన్నిటినీ ఐక్యపరచాడు. దోపిడీదార్లకు వ్యతిరేకంగా నూచెన్ ప్రజలందరినీ సంఘటితపరచాడు. లియో సైన్యాలను నూచెన్ సైన్యాలు వరుసగా ఓడించాయి. క్రీ. శ. 1115 వ సంవత్సరంలో అకుట్టా కిన్ రాజ్యాన్ని స్థాపించాడు.

లియో ప్రభుత్వానికి వ్యతిరేకంగా సుంగ్ కిన్ ప్రభుత్వాలు రెండూ ఒడంబడిక చేసుకున్నాయి. పూర్వపు టాంగ్ చక్రవర్తి లియోకు ఇచ్చిన ప్రాంతాన్ని లియోను ఓడించాక, కిన్ ప్రభుత్వానికి దఖలుపర్చడానికి, లియో ప్రభుత్వానికి చెల్లించుతున్న వెండి, పట్టు వస్త్రాలనుకూడ యివ్వడానికి ఉత్తర సుంగ్ ప్రభుత్వం అంగీకరించింది.

లియో సేనలతో ప్రథమఘర్షణలోనే సుంగ్ సేనలు ఓడిపోయాయి. కిన్ సేనలు యెన్‌చింగ్ (పెకింగ్)ను ఆక్రమించుకుని, వదలి వెళ్ళడానికి నిరాకరించాయి. సుంగ్ చక్రవర్తి పదిలక్షల దండల రాగినాణాలు పరిహారం చెల్లించి, నగరాన్ని విడిపించుకోవలసి వచ్చింది.

లియోను జయించిన తరువాత 1125 లో కిన్ ప్రభుత్వం దక్షిణదిశకు దండయాత్ర ప్రారంభించింది. పశ్చిమానికి బయలుదేరిన కిన్ సైన్యాన్ని ఎదిరించి తాయ్‌యువాన్‌లో లక్షల సైనికులు, పౌరులు వీరోచితంగా పోరాడారు. తూర్పుదిశగా బయలుదేరిన కిన్ సైన్యాలు కైఫెంగ్ నగరంపై దాడిచేశాయి. చక్రవర్తి గాభరాతో పలాయన మయ్యాడు.

ఉత్తరసుంగ్-ప్రభుత్వానికి చెందిన కొందరు ఉన్నతోద్యోగులు రాజీపడాలనీ, లొంగిపోవాలని సూచించారు. కాని సైనికులు, పౌరులు కైఫింగ్‌ను రక్షించాలని పట్టుబట్టారు. తండ్రి అనంతరం సింహాసన మెక్కిన చక్రవర్తి చిన్‌ట్సుంగ్ ప్రజల ఒత్తిడివల్ల రాజధాని రక్షణకు లీ కాంగ్‌ను సేనానిగా నియమించాడు.

1126 లో కిన్‌సేనలు కైఫింగును చుట్టుముట్టాయి. లీకాంగ్ వీరోచితంగా రక్షణకు పూనుకున్నాడు. చుట్టుపట్ల ప్రజలను సంఘటిత పరచగా, కిన్ సేనలతో తలపడ్డారు. ఈ లోగా 2 లక్షల అదనపుబలాలు నగరానికి సహాయంగా వచ్చాయి.

దండయాత్ర సేనలకు వెనుకనుండి సప్లయిలు అందక, వేరుబడిపోయాయి. కాని పరిస్థితులు యిలా అనుకూలంగా వున్నప్పటికీ శత్రువుతో రాజీపడాలని చక్రవర్తి నిశ్చయించుకున్నాడు. నగరంలో తాను సేకరించగలిగిన వెండినంతనూ బహుమానంగా యిచ్చి కిన్ సేనలను సంతృప్తిపరచదలిచాడు. లీకాంగ్‌ను పదవినుంచి తొలగించాడు. అనేకవేల ప్రజలు కోపంతో రాజభవనం ముందుచేరి, ప్రభుత్వ కాలేజీ విద్యార్థి నాయకత్వాన లీకాంగ్‌ను తిరిగి ఆస్థానంలో నియమించాలని డిమాండుచేశారు. ప్రజల ఒత్తిడికి చక్రవర్తి అంగీకరించక తప్పలేదు.

కృతనిశ్చయంతో కూడిన ప్రతిఘటన ఫలితంగా కిన్ సైన్యాలు వెనుతిరిగి పోయాయి.

అదే సంవత్సరం ఆకురాలు కాలంలో మరల ఒకసారి కిన్ సైన్యాలు దక్షిణ దిశకు దండయాత్ర ప్రారంభించి ఈసారి విజయం సాధించాయి. చక్రవర్తి శాంతి కొరకు విజ్ఞప్తిచేసి దేశం వివిధ ప్రాంతాలనుండి సహాయానికి వస్తున్న అదనపు బలాలను ఆగిపొమ్మని ఆజ్ఞాపించాడు. 1127 వ సంవత్సరంలో కిన్ సేనలు కైఫింగ్ నగరాన్ని పట్టుకుని ధ్వంసం చేశాయి. చక్రవర్తి చిన్‌ట్సుంగ్‌నూ, పదవినుండి వైదొలగిన అతని తండ్రి హుయిట్సుంగ్ నూ, అనేకమంది చక్రవర్తి వంశీకులను ఖైదీలుగా పట్టుకున్నారు.

హుయి ట్సుంగ్ మరో కొడుకైన కావ్ ట్సుంగ్ కొందరు మంత్రులతో దక్షిణానికి పారిపోయి, హోనాన్ రాష్ట్రంలోని పాంచె చియూ నగరాన్ని కొంత కాలమూ, తరువాత లినాన్ (హాంగ్ చౌ) నగరాన్ని రాజధానిగా చేసుకొని పరిపాలించాడు. అతడు సంస్థాపించిన ప్రభుత్వాన్ని చరిత్రకారులు దక్షిణ సుంగ్ అని పిలుస్తారు.

## 28 వ అధ్యాయం

# కిన్, యువాన్లకు వ్యతిరేకంగా దక్షిణ సుంగ్ పోరాటం

హోపే షాన్సీ రాష్ట్రాలలో ప్రతిచోటా ప్రజలు సంఘటితులై, కిన్ సేనలకు వ్యతిరేకంగా ఆయుధాలు పుచ్చుకున్నారు. పర్వత సానువుల్లోనూ, నదుల ప్రక్కన సమీకృతమయ్యేవారు. ఎర్రతలపాగాలని ప్రఖ్యాతి చెందిన గ్రూపు ఆకస్మికంగా కిన్ సైన్యాధ్యక్షుని శిబిరంపై దాడిచేసి, లోనున్న వారందరినీ హతమార్చింది.

కైపింగ్ రక్షణకు నియమించబడిన ట్సుంగ్ ట్సేహ్ అనే దక్షిణ సుంగ్ సేనాని నాయకత్వం వహించాడు. ఎల్లోనది అవతలకూడ దేశభక్తులు చాల మెళుకువగా వున్నారు. ఒకసారి ట్సుంగ్ ట్సేహ్ నదిదాటివెళ్ళి, పోగొట్టుకున్న ప్రాంతాన్ని ఏ విధంగా తిరిగి స్వాధీనం చేసుకోవాలన్న విషయాన్ని దేశభక్తులతో చర్చించి వచ్చాడు. అతడి ఆజ్ఞానుసారం 7 వేలమంది సైనికులు వాంగ్ ఎన్ నాయకత్వం క్రింద చుట్టూవున్న వేలకొలదీ కిన్ సేనల వలయాన్ని బ్రద్దలు చేసికుని, తైహాంగ్ పర్వతాన్ని చేరుకున్నారు. తైహాంగ్ పర్వతంవద్ద తరుచుట్టూ లక్ష సేనను కూడగట్టుకుని, వరుసగా కిన్ సేనలను ఓడించి, అనేకమంది ప్రజలను, చాల ఆస్తిని స్వాధీనం చేసుకున్నారు.

ట్సుంగ్ ట్సేహ్ అనేకసార్లు ఉత్తరదిశకు దండయాత్ర చేయాలని సలహా యిచ్చినప్పటికీ చక్రవర్తి పెడచెవిని పెట్టాడు. రెండో వైపున సేనాని దేశభక్తులతో కలసి తనను బెదిరించుతాడేమోననే భీతితో సేనానిపై కాపలాకు వేగులవాళ్ళను నియమించాడు. డెబ్బదియేళ్ళ వృద్ధుడైన సేనానికి ఈ సంగతి తెలసి, కోపంతో క్రింద పడిపోయాడు. మరణశయ్యపై వుండగా దేశభక్తులందరినీ దగ్గరకు పిలిచి, శత్రువును నాశనం చేయమని విజ్ఞాపన చేశాడు. కొనవూపిరితోవున్న ఆఖరుఘడియల్లో సైతం ఆయన ఆలోచనలన్నీ ఎల్లోనదిని దాటడంపైనే కేంద్రీకరించి వున్నాయి.

కిన్ సైన్యాలు యింకా దక్షిణానికి తరలివెళ్లి, ఎల్లోనదికి దక్షిణాన చాలా ప్రాంతాన్ని ఆక్రమించాయి.

ఈ దశలో దేశభక్తుల నాయకుడైన యోఫీ పనిచేశాడు. ఇతడు హోనాన్ రాష్ట్రంలోని టాంగ్యాన్ జిల్లా నివాసి. రైతుకుటుంబానికి చెందినవాడు. కిన్ వ్యతిరేక పోరాటంలో పాల్గొని సామర్థ్యంగల నాయకుడని నిరూపించుకున్నాడు. మాతృదేశంయెడల అత్యంత ప్రేమ, శత్రువులయెడల అమిత ద్వేషం కలిగినవాడు. అతని సైనికులంతా ఉత్తరాది రైతులనుంచి వచ్చినవారు; ఖచ్చితమైన శిక్షణతో ప్రవర్తించేవారు. ఎంత చలి, ఆకలి వేసినాసరే పౌరుల ఇళ్ళలో ప్రవేశించి, వారి ఆహారం తీసికోకూడదనే నినాదాన్ని వారు అమలు జరిపారు. అందుచేత యోఫీ సైనికులు ప్రజల గాఢాభిమానాన్ని, తోడ్పాటును కూడ సంపాదించారు.

శత్రుదాడులను వరుసగా భగ్నంచేశాక యోఫీ అగ్రగామిదళాలు ఎల్లోనది వైపు పురోగమించాయి. అచట వారు తైహాంగ్ పర్వతాలనుంచి వచ్చిన దేశభక్తులతో కలిశారు. హోపీ రాష్ట్రంలోని దేశభక్తులతో కూడ యోఫీ సంబంధాలు పెట్టుకున్నాడు.

1140 లో కిన్ సేనానియైన వూ చూ తన సేనలను దక్షిణానికి నడిపించాడు. షన్‌చాంగ్ (ప్రస్తుత అన్‌హ్వీయ్ రాష్ట్రంలోనిది) వద్ద ఇతనితో దక్షిణ సుంగ్ సేనాని లియూ చీ ఢీకొని ఓడించాడు. దక్షిణ సుంగ్ మరో సేనాని మాలిన్ ప్రస్తుత షెన్సీ రాష్ట్రంలోని ఫూపెంగ్ వద్ద కిన్ సైన్యాలతో తలపడి, తీవ్రమైన దెబ్బతీశాడు. ఆ తరుణంలో యోఫీ ఎదురుదాడిని హ్సియాంగ్యాంగ్ (ప్రస్తుత షెన్సీ రాష్ట్రంలోనిది) నుంచి ప్రారంభించాడు. ఉత్తరాన పోరాడుతున్న సహచరులకు సహాయపడేందుకు కొంతమంది దేశభక్తులను ఎల్లోనది అవలకు పంపాడు. వారు శత్రుసైన్యాల సప్లయి మార్గాలను గండికొట్టడంలో జయంపొందారు. యోఫీ సైన్యం తిన్నగా యెన్‌ఛెంగ్‌కు (ప్రస్తుత హోనాన్ రాష్ట్రంలోనిది) వెళ్ళి, అచటవున్న కిన్ సేనలతో ఢీకొంది. కిన్ సేనాని వూ చూ తన గుర్రపు దళాలను యుద్ధరంగంలోకి పంపాడు. క్వాయ్ త్సేమా అని పిలువబడే ఈ దళాలలో ముగ్గురేసి అశ్వికులను ఒక దళంగా గొలుసుతో బంధించుతారు. అందుచేత ఒక గుర్రం పడిపోతే దళమంతా నిరుపయోగమవుతుంది. యోఫీ సైనికులు ఒక గుర్రం కాలు నరికితేచాలు, ముగ్గురున్న ఆశ్వికదళం కుప్పకూలి పోయేది. ఈ విధంగా తన అశ్వికదళాలు నాశనమైపోయినందున వూ చూ చేతిలో తురుపుముక్క లేకుండాపోయింది.

ఎల్లోనది ఉత్తరపు గట్టునవున్న దేశభక్తులు, శత్రుసేన పరిస్థితులను గురించిన సమాచారం యోఫీకు అందచేసి, అతనితో చేతులు కలపడానికి సంసిద్ధతను తెలియ జేశారు. యోఫీ సైన్యానికి ఆహారం అందజేయడానికి ప్రజలు తమంతటతామే ముందుకొచ్చారు. సైన్యం అత్యుత్సాహంతో శత్రువుపై దెబ్బతీయడానికి తయారుగా వుంది. ఈ విధంగా యోఫీ విజయానికి చేరువగా వున్న సమయంలో ఉపసంహారణకు చక్రవర్తి హుకుం జారీచేశాడు.

కాట్సుంగ్ చక్రవర్తి, ప్రధానమంత్రి చిన్‌కుయీ రాజీపడాలని కోరుతున్నా, కిన్ ప్రభుత్వంతో తమ రహస్యరాయబారాలు విఫలమౌతాయని భయపడుతున్నారు.

దేశభక్తుల నాయకులబలం పెరుగుతోందని, ముఖ్యంగా యోఫీతో ఉత్తర ప్రాంత దేశభక్తులు కలుస్తారని చీకాకు పడుతున్నారు. అందుచేత యోఫీని, దేశభక్తులైన ఇతర సేనానులను పదవులనుండి తొలగించివేశారు.

1141లో కిన్ సేనాని వుూమాంరహస్యంగా ప్రధానమంత్రిచిన్ కుయీకి వ్రాసిన ...లో "శాంతి కావాలని మీరడుగుతున్నారు, కాని యోఫీ హోపీ రాష్ట్రాన్ని ...ంచాలని చూస్తున్నాడు. యోఫీని చంపితేగాని శాంతి సాధ్యంకాదు."

యోఫీని ఖైదుచేసి, ప్రధాని ప్రోద్బలంతో చంపించారు.

1141 లో దక్షిణ సుంగ్ ప్రభుత్వం కిన్ ప్రభుత్వంతో అవమానకరమైన రాజీచేసుకుంది. రెండు రాజ్యాలమధ్య సరిహద్దులను నిర్ణయించారు. దీని ప్రకారం హుకాయ్‌నదికి వుత్తరాన షెన్సీ రాష్ట్రంలోని టూసాంకువాన్ కనుమ వరకూవున్న విశాలమైన ప్రాంతమంతా కిన్ ప్రభుత్వానికి వదలివేయబడింది. అదనంగా సుంగ్ ప్రభుత్వం ప్రతి యేటా 2 లక్షల 50 వేల వెండి నాణాలను, అదే సంఖ్య పట్టుతాన్లను కిన్ ప్రభుత్వానికి చెల్లించాల్సి వుంటుంది.

## ఆర్థికాభివృద్ధి

అంతరంగికంగానూ, బయటి నుంచీ యిలాంటి చిక్కులు ఎదుర్కొన్నప్పటికీ దక్షిణ సుంగ్ పరిపాలనలో దేశం యొక్క ఆర్థిక విధానం విస్తరించుతూ వచ్చింది. భూమి సమతలంగా వున్న దక్షిణ కియాంగ్సూలోనూ, ఉత్తర చెకియాంగ్‌లోనూ ఆనకట్టలు నిర్మించి, తూములకు తలుపులు పెట్టి, పంట కాలవల ప్రవాహాన్ని అదుపులో వుంచారు. నీటి మరలను వినియోగించారు. చాలా కాలవలు త్రవ్వడం వల్ల భూమి వివిధ ఖండాలుగా విభజించ బడింది. కేవలం వంద మౌలనుంచి పది లక్షల మౌలవరకు విస్తీర్ణమున్న ఈ ఖండాలను యూటీన్లని పిలిచేవారు. ఒక్కొక్క ఖండంలో నివసించే రైతులు ఒక సంఘంగా (కమ్యూనిటీగా) వుండేవారు. తీరిక రోజుల్లో వరద కట్టల మరమ్మతును, పంట కాలువల త్రవ్వకానికి రైతులను యూటీన్ నాయకుడు సమీకరించేవాడు. క్షేత్రం దీకరించి సాగుచేయడం, వత్తుగా నాట్లువేయడం అలవరచుకున్నారు. ఒక అంగుళం నేలను కూడ వృధా కానిచ్చేవారు కాదు. వరి పంటను సంవత్సరానికి రెండుసార్లు పండించేవారు. సైన్యంగాని, కొరతజిల్లాలుగాని ఆహారధాన్యాలు లభ్యంకావని బాధపడనవసరం లేదు. "కియాంగ్సూ, హోపే రాష్ట్రాలలో పంటలు చేతకొస్తే ప్రపంచ (చైనా) అవసరాలన్నీ తీరుతాయి" అనే సామెత ప్రచారంలో వుండేది.

యాంగ్‌ట్సీ నదికి దక్షిణాన వున్న భూముల్లో ఎక్కువభాగం బలవంతులైన భూస్వాముల ఉన్నతోద్యోగుల, చేతుల్లో వుండేది కొన్ని కమతాలు అనేక తాలూకాలకు విస్తరించి వుండి, యజమాన్లకు పదిలక్షల పికుల్సుకు మించిన ధాన్యం ఆదాయంగా వచ్చేది. యధాప్రకారంగా భూస్వాముల దోపిడి, అధిక వడ్డీల

ఫలితంగా రైతులు క్రమంగా భూమిని కోల్పోయి, కౌలుదార్లుగా తయారయ్యారు. వ్యవసాయోత్పత్తి పెరిగినప్పటికీ రైతుల పరిస్థితి మాత్రం బాగుపడలేదు.

## ఉత్తర చైనా పరిస్థితులు

ఉత్తర చైనా నిజస్థితి వేరు విధంగా వుంది. ప్రజలను చంపడం, వారి ఆస్తిని దోచుకోవడం, నగరాలను, గ్రామాలను ధ్వంసం చేయడం కిన్ సైన్యాలకు నిత్య కృత్యమయింది.

కిన్ యోధుని కుటుంబాన్ని ప్రాతిపదికగా చేసుకొని, సాంఘిక విధానాన్ని నిర్మించారు. మూడు వందల కుటుంబాలు కలసి ఒక 'మాక్' అనీ, పది మాకులు మెంగన్ అనీ పిలువబడేవి. ఇవి హాన్ ప్రజల మధ్య నివసించుతూ, కాపలా కాస్తూ అవసరమైనపుడు నిర్బంధ విధానం ప్రయోగించేవారు. వీరికి కేటాయించిన విస్తారమైన భూములను తాము దున్నకుండా, బలవంతాన హాన్ ప్రజలచేత సాగు చేయించేవారు. అదివరకు సాగులోవున్న భూములను స్వాధీనంచేసుకుని కిన్ పరిపాలకులు బీళ్ళుగానూ, వేట స్థలాలుగానూ మార్చారు.

హాన్ ప్రజలలో చాలమందిని బానిసలుగా చేశారు. ప్రతి కిన్ యోధునికి ఒకరిద్దరు బానిసలుండేవారు. ప్రతి ప్రభువు కుటుంబానికి వందలకొలదీ లేదా అంతకు మించిన బానిసలుండేవారు. రైతులను బలవంతాన సైన్యంలో చేర్చుకునేవారు. వారు తమ ఆహారం, గుడ్డలు తెచ్చుకోవాలి. కొందరు పది సంవత్సరాలవరకు సర్వీసు చేయవలసివచ్చేది.

కిన్ ప్రభుత్వ నిరంకుశత్వం ప్రజలలో ప్రతిఘటనాశక్తిని రగుల్కొల్పింది. దోపిడికి వ్యతిరేకంగా ప్రజలు నిరంతర పోరాటం సాగించి, ప్రభుత్వాన్ని బలహీనపరచారు. కిన్ రాజ్యం పతనమయింది.

## మంగోలుల విజృంభణ

మంగోలులు పశుపాలకులుగానూ, వేటగాళ్ళుగానూ జీవించేవారు. తూర్పున ఖీంగన్ కొండలనుంచి పడమర ఆల్టాయ్ పర్వతాలవరకు విశాలమైన బీటి భూముల ప్రాంతంలో దిమ్మరిల్లుతుండేవారు. పశువులు, గుర్రాలు, గొర్రెలు వారి సంపద. ఎద్దు మాంసం గొర్రె మాంసం, ఆవుపాలు, మేకపాలు వారి ముఖ్యాహారం.

మంగోలులు ధైర్యంగల కష్టజీవులైన ప్రజలు. ఖచ్చితమైన శిక్షణను పాటించేవారు. తెగ ఐక్యత వారికి అత్యంత ముఖ్యమైనది. "స్నేహితులను, బంధువులను వదలుకున్నవాడు శత్రువులకు బలియైపోతాడు" అని వారంటారు.

పన్నెండవ శతాబ్దంనాటికి మంగోల్ ప్రజలు ఇనుప ఆయుధాలను, పనిముట్లను ఉపయోగించడం నేర్చుకున్నారు. క్రమంగా వారు బలపడ్డారు. తెముజిన్ అనే మంగోల్ నాయకుడు మిలిటరీ నిర్మాణంలో అసాధారణమైన ప్రతిభావిశేషాలు గలవాడు. ఆయన ఆధ్వర్యం క్రింద బలమైన అశ్వికసైన్యం సంఘటితమయింది.

ప్రతి రౌతుకు తోలు దుస్తులు, గుర్రపుస్వారి చేస్తుండగా వుపయోగించేందుకు చిన్న విల్లు, పదాతిగా వున్నపుడు వినియోగించేందుకు ఒక పెద్ద విల్లు, రెండు మామూలు విల్లులు వుంటాయి. 1206 నాటికి తెముజిన్ తన నాయకత్వం క్రింద మంగోల్ తెగలన్నిటినీ ఐక్యపరచగలిగాడు. చంఘీజ్ ఖాన్ అనే బిరుదుతో అధికసంఖ్యాకుల గొప్ప చక్రవర్తి - మంగోలుజాతి కంతటికీ గొప్ప ఖాన్ అయ్యాడు.

చంఘీజ్ ఖాన్ తన రాజ్య విస్తరణకు పూనుకున్నాడు. మధ్య ఆసియాను స్వాధీనం చేసికున్నాడు; టాన్స్ కాకసస్, నల్ల సముద్ర ప్రాంతాలను పాదాక్రాంతం చేసుకున్నాడు; డాన్యూబ్ నదీ లోయవరకు చొచ్చుకు వెళ్ళాడు. చైనాతో యుద్ధంలో అతడు మరణించాడు. అతని మనుమడైన కుబ్లాయి ఖాన్ ఈ దిగ్విజయాన్ని పూర్తి చేశాడు.

మంగోలులు ఆసియానుండి యూరపు వరకు విస్తరించిన బ్రహ్మాండమైన సామ్రాజ్యాన్ని స్థాపించారు.

చైనాపై మంగోల్ దండయాత్ర 1211 లో ప్రారంభమైంది. అప్పటికే కిన్ రాజ్యం చాల బలహీనపడి వుంది. మంగోలులు త్వరగానే బ్రహ్మాండమైన చైనా గోడను సమీపించారు. చు యుంగ్ కువాన్ కనుమవద్ద జరిగిన యుద్ధంలో కిన్ సైన్యాలు ధ్వంస మయ్యాయి.

మంగోల్ సేనలు త్వరత్వరగా హోపే, షాన్సీ, షా టుంగ్ రాష్ట్రాలలోని అనేక నగరాలను పట్టుకున్నారు. మంగోలుల విజృంభణను అరికట్టలేక కిన్ ప్రభుత్వం తన రాజధానిని ఎన్ చింగ్ (పెకింగ్) నుంచి కై ఫెంగ్ కు మార్చుకుంది. ఎల్లోనదికి ఉత్తిరానవున్న ప్రాంతమంతా మంగోలుల వశమయింది.

1227 లో జంఘీజ్ ఖాన్ పశ్చిమహ్సియాపై దాడిచేసి స్వాధీనం చేసుకున్నాడు. ఆ సంవత్సరంలోనే అతడు మరిపోయాడు. 1232 లో మంగోలులు దక్షిణ సుంగుతో కలసి కిన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా దాడి చేసేందుకు ఒడంబడిక కుదుర్చుకున్నారు. కిన్ ప్రభుత్వాన్ని జయించాక, ఎల్లో నదికి దక్షిణ ప్రాంత మంతటినీ దక్షిణ సుంగ్ ప్రభుత్వానికి అప్పగించడానికి అంగీకరించారు.

కై ఫెంగ్ నగరంపైకి మంగోల్ సేనలు దాడి వెడలాయి. కిన్ చక్రవర్తి ట్సాయిచౌ (ప్రస్తుత హోనాన్ రాష్ట్రంలోనిది) నగరానికి పారిపోయాడు. నగరాన్ని చుట్టు ముట్టడానికి దక్షిణ సుంగ్ ప్రభుత్వం 20 వేల సేనను మంగోలులకు సహాయంగా పంపింది. 1234 లో దక్షిణ సుంగ్ సేనలు నగరాన్ని ఆక్రమించి కిన్ రాజ్యపాలనను అంతమొందించాయి.

ఐనప్పటికీ మంగోలు పాలకులు ఎల్లో నదికి దక్షిణ ప్రాంతాన్ని దక్షి సుంగ్ ప్రభుత్వానికి అప్పగించ నిరాకరించారు. సుంగ్ సేన లోయాంగ్ నగరానికి వెళ్ళడానికి ఉపక్రమించితే, మంగోల్ సేన ఎల్లో నది కరకట్టలను తెగగొట్టి వారిని నీట ముంచింది.

# మంగోలులను వ్యతిరేకించుతూ దక్షిణ సుంగ్ ప్రతిఘటన

యూరపు ఖండంలో తూర్పు దేశాల్ని జయించిన తరువాత మంగోలులు దక్షిణ సుంగ్ రాజ్యంపైన దాడిని ప్రారంభించారు. చింఘాయ్ పచ్చిక బైళ్ళను దాటివచ్చి, టిబెట్‌ను తాలీని ఆకస్మికంగా ఆక్రమించుకున్నారు. హునాన్, జెచివాన్‌లపై దాడిలో మంగోల్‌లు తీవ్రప్రతిఘటనను ఎదుర్కోవలసివచ్చింది. హోచౌవద్ద (ప్రస్తుత జెచివాన్‌లోనిది) జరిగిన యుద్ధంలో మంగోల్‌ల పెద్దఖాన్ ఐన మంగూ చనిపోయాడు.

1260 లో మంగూ తమ్ముడు కుబ్లాయ్ ఖాన్ అయ్యాడు. 1271 లో అతడు తన రాజ్యానికి యువాన్‌వంశ నామకరణం చేసుకున్నాడు.

ఉత్తర దక్షిణ ప్రాంతాలను కలిపే రవాణా కేంద్రముగానూ, యాంగ్‌ట్సీనది మధ్య భాగాన్ని దాటేందుకు బహిఃద్వారముగాను హ్సియాంగ్ యాంగ్ నగరం వుండేది. యువాన్ సేనలు హ్సియాంగ్యాంగ్‌ను చుట్టుముట్టారు. నగర ప్రాంగణంలో యువాన్లు పది రక్షణ దుర్గాలను నిర్మించి, నగర రక్షకులను బయటి ప్రపంచాన్నుంచి వేరుచేసి, బలవంతాన రాజీకి లొంగివచ్చేలా చేయాలని ప్రయత్నించారు. ఈ కష్ట పరిస్థితులలో కూడ ఐదేళ్ళవరకు రక్షణసేనలు నగరాన్ని కాపాడాయి. సహాయం పంపమని వరుసగా చేసిన అభ్యర్థనలను దక్షిణ సుంగ్ ప్రభుత్వం పెడచెవిని పెట్టింది.

అత్యంత క్లిష్టసమయంలో కొన్ని వేలమంది రైతు వాలంటీర్లు హాన్‌నది వెంట వచ్చి చిక్కుల్లో వున్న నగరానికి తోడ్పటానికి ప్రయత్నించారు. భూమార్గాలకు, పడవమార్గాలకు మంగోల్ సేనలు పెట్టిన ఆటంకాలను బ్రద్దలుచేసుకుని నగరప్రాకారాలవద్దకు వాలంటీర్లు చేరుకున్నారు. అచట జరిగిన భీకర యుద్ధములో ఆఖరు మనిషి వరకూ రైతు వాలంటీర్లు వీరోచితంగా పోరాడారు.

మంగోల్ సేనలు హ్సియాంగ్యాంగును పట్టుకొని, తమ దండయాత్రను తూర్పుదిశకు కొనసాగించారు. 1276 లో లినాన్ (హాంగ్‌చౌ) దక్షిణసుంగ్ రాజధాని కూడ మంగోల్‌ల వశమయింది.

ఐనప్పటికీ ప్రతిఘటన ఇంకా కొనసాగింది. చాలా నగరాలలో ఆఖరి వీధి వరకు ప్రతిఘటన జరిగింది. రక్షకులకు ఎట్టి సహాయం రాకపోయినా, ఆహారం లేకపోయినా తమ కంఠంలో ప్రాణమున్నంత వరకు శత్రువును నిలవేశారు.

యువాన్ సేనలు యాంగ్‌చౌనగరాన్ని చుట్టుముట్టినపుడునగరాన్ని రక్షించేందుకు లీటింగ్ - చీహో, చియాంగ్‌ట్సాయ్ అనే సేనానులు సైనికులను, పౌరులను సంఘటితపరచడానికి పూనుకున్నారు. మహారాణిని, బాల చక్రవర్తిని ఖైదీలుగా పట్టుకున్న యువాన్‌సేనలు, నగర రక్షణను మాని లొంగిపొమ్మని మహారాణి చేత జాబు వ్రాయించాయి. సేనాని చియాంగ్‌ట్సాయ్ చక్రవర్తి జాబుని తగులబెట్టి, తాము చక్రవర్తికోసం గాక దేశం కొరకు నగరాన్ని రక్షించుతున్నామని ప్రకటించాడు. రక్షకులు మరణించే వరకు పోరాడారు.

జాతీయ వీరుడైన వెన్‌టీన్‌హ్స్యాంగ్ దేశభక్తుల దళాన్ని గెరిల్లా పోరాటంలో నడిపాడు. కియాంగ్సి నుంచి ఫ్యూకియాన్‌కు అచటినుంచి క్వాంగ్‌టుంగ్‌కు మంగోల్ సేనలతో పోరాడుతూ చివరకు ఖైదీగా పట్టుబడ్డాడు. ఖైదులో వున్నపుడు అతడిని లొంగదీయడానికి సంవత్సరాల తరబడి మంగోల్‌లు ప్రయత్నించారు. ప్రతిసారి తీవ్రమైన ప్రతిఘటనను వారు ఎదుర్కొన్నారు. చివరకు ఆ వీరుని చంపివేశారు.

దక్షిణ సుంగ్ మంత్రులైన చాంగ్‌షీచీహ్, లూహ్సియూఫూ అనేవారు చక్రవర్తి వంశీకుడైన బాలుని చక్రవర్తిగా ప్రకటించి, ఫూకియేన్ క్వాంగ్‌టుంగ్ రాష్ట్రాల సముద్రతీర ప్రాంతాలలో ప్రతిఘటనోద్యమాన్ని కొనసాగించారు. క్వాంగ్‌టుంగ్‌లోని చివరి సుంగ్ స్థావరాన్ని మంగోల్ సేనలు చుట్టుముట్టినపుడు బాలచక్రవర్తిని భుజంపై ఎక్కించుకుని మంత్రి లూ సముద్రంలో దూకాడు.

129

## 29 వ అధ్యాయం

# చైనాపై యువాన్ వంశ పాలన

ఉత్తర చైనాలో మంగోల్ ప్రభువులు అదివరకు సాగులోవున్న లక్షలకొలది హెక్టార్ల భూమిని పచ్చిక బీళ్ళుగా మార్చారు. షెన్సీ రాష్ట్రంలో ఒక మంగోల్ ప్రభువు కోట్ల మూల భూమిని ఆక్రమించుకున్నాడు. తాము సాగుచేసే భూములనుంచి కోట్ల కొలదీ రైతులు తొలగించబడ్డారు. వ్యవసాయం బాగా దెబ్బతింది.

మంగోల్ పరిపాలకులు ఆక్రమించుకున్న వాటిని వుద్యోగుల భూములుగా మార్చి, కౌలుకు దున్నేందుకు తిరిగి రైతులకిచ్చారు. ఉద్యోగుల భూమిని పిలచే దీన్లో ఒక భాగాన్ని ప్రభుత్వాధీనంలో వుంచి, ఎక్కువ భాగాన్ని మంగోల్ ప్రభువులకు, వుద్యోగులకు లేక మఠాలకు అప్పగించారు. కోటీ అరవై లక్షల మూల భూమిని ఒకే మఠానికిచ్చినట్లు లెక్కలున్నాయి. దక్షిణదేశంలో మఠాల ఆధిపత్యం క్రింద చాల భూమి వున్నందున మఠాల భూములను సాగుచేసే రైతులే ఐదు లక్షలు వుండేవారు.

మంగోల్ పరిపాలకులక్రింద హాన్ భూస్వాములుకూడ పెద్ద కమతాలను, కౌలుదార్లను కలిగివుండేవారు.

కౌలుదారు సాగుచేసే ప్రతి మూ భూమికి 30 నుంచి 100 కాటీలవరకు ధాన్యం భూస్వామికి చెల్లించాలి. స్వంత ఆస్తికివలెనే కౌలుదార్లనుకూడ అమ్మడం, తాకట్టు పెట్టడం జరిగేది. తమ స్వంత పొలాలను సాగుచేసే రైతులు ప్రతి సంవత్సరం - 300 కాటీల ధాన్యం తలపన్ను, 3 కాటీల భూమిపన్ను, ఇంటిపన్ను వగైరా - వివిధ రకాల పన్నులు చెల్లించాలి. రైతుల గుర్రాలను సైన్యం కొరకు తీసికుపోయేవారు. ఇలాంటి సేకరణలో ఒకసారి 7 లక్షల గుర్రాలను రైతులు కోల్పోయారు.

రైతులు, కౌలుదార్లు దరిద్రంతో బాధపడుతూ ఋణాలు చేయవలసివచ్చేది. మంగోల్ ప్రభువులు, వర్తకులు సంవత్సరానికి నూటికి నూరు చొప్పున వడ్డీ వసూలు చేసేవా[illegible]నికి ఋణం తీర్చలేకపోతే రైతుల పశువులనుగాని, కుటుంబ[illegible]గించవలసి వచ్చేది. చాలా రైతు కుటుంబాలు సర[illegible]

దేశంలోని చేతివృత్తులవారు మంగోల్ ప్రభుత్వంక్రింద, ప్రభువులక్రింద పనిజేసేవారు. ప్రభుత్వం నడిపే కర్మాగారాలలో పనిజేసేవారు "వుద్యోగ కళా కారులు" లేదా "మిలిటరీ కళాకారుల"ని పిలువబడేవారు. వారికిచ్చే భత్యాలు ఉదరపోషణకైనా సరిపోయేవి కాదు.

## నిర్బంధ విధానం

తమ పరిపాలనకు వ్యతిరేకులు బలపడకుండా అరికట్టేందుకు యువాన్లు "విభజించి జయించాలనే" సూత్రాన్ని అనుసరించారు.

ప్రజలను నాలుగువర్గాలుగా విభజించారు: మంగోలులు; పశ్చిమప్రాంతాలలో వున్న హిస్సియాలు వగయిరాలతోసహా సెముాలు (రంగుకన్నులున్నవారు); ఉత్తర చైనాలోవున్న ఖైతాన్లు, నూచెన్లు, కొరియన్లు వగయిరాలతోసహా హాన్లు; దక్షిణచైనా లోని వివిధజాతులకు చెందిన దక్షిణాదివారు.

మంగోల్‌లోని ఉన్నతవర్గం అనేక ప్రత్యేక సౌకర్యాలు అనుభవించేది. వారూ, సెముాలు ప్రభువులు. కేంద్రంలోనూ, స్థానిక ప్రభుత్వాలలోనూ పాలక వర్గానికి వీరే కీలకంగా వుండేవారు.

మంగోల్ పరిపాలకులు తమకు వ్యతిరేకత తలెత్తకుండా అనేక కఠినచర్యలు తీసుకునేవారు. ఉదాహరణకు హాన్లు, దక్షిణాదివారు ఆయుధాలను తయారు చేయడం, లేక దాయడం, గుర్రాలను పెంచడం, వేటాడటం, పోరాట నైపుణ్యాన్ని సంపాదించడం నిషేధించబడింది. ఒకచోట సమావేశమవడం, బజారులో కొనడం అమ్మడం కూడ నిషేధించబడింది. రాత్రిళ్ళు బయటకుసైతం వెళ్ళరాదు.

మంగోల్ సైన్యాలు వివిధ స్థలాలలో కేంద్రీకరించబడ్డాయి. దక్షిణాది 20 కుటుంబాలను ఒక 'చియాగా' మంగోల్ పరిపాలకులు ఏర్పరచి, దానిపై అజమాయిషీ వహించేటందుకు మంగోల్ కుటుంబాన్ని నియమించారు. జనాన్ని బెదిరించి డబ్బు గుంజడం, స్త్రీలను అవమానించడం మంగోల్ కాపలాదార్ల నిత్య కృత్యాలు.

యువాన్ చట్టాల ప్రకారం మంగోల్‌లు, సెముాలు నేరంచేస్తే ప్రత్యేక న్యాయస్థానాలుమాత్రమే వారిని విచారణచెయ్యగలవు. హాన్‌లనుగాని, దక్షిణాదివారిని గాని మంగోల్‌జాతివారు దెబ్బకొడితే ఆత్మరక్షణకైనాసరే తిరిగికొట్టరాదు. మంగోల్ జాతివాడు హాన్ జాతివాడిని లేక దక్షిణాదివాడిని చంపితే, కేవలం కొద్ది జరిమానా శిక్షమాత్రం విధించబడేది.

మంగోల్‌ల నిరంకుశ పరిపాలన, క్రూరమైన దోపిడి ఫలితంగా ప్రజలలో తీవ్ర ద్వేషాలనం అలుముకొని ప్రతిఘటన తరంగాలు లేచాయి.

# యువాన్ పరిపాలన చివరిదశలో రైతుల తిరుగుబాట్లు

యువాన్ వంశపాలన ప్రారంభమైనప్పటినుంచీ ప్రజలలో అసంతృప్తి ద్యోతకమయింది. కుబ్లాయ్ ఖాన్ పరిపాలనలో ఒక మంత్రి ఇలా నివేదించాడు: "దక్షిణ రాష్ట్రాలు చక్రవర్తికి లొంగిపోయాక పది సంవత్సరాలలో తిరుగుబాట్లను అణచివేసేందుకు చేసిన ప్రయత్నాలు పూర్తిగా జయప్రదం కాలేదు."

మరొక నివేదికలో యాంగ్‌ట్సీనదికి దక్షిణాన 400 లకు మించినచోట్ల తిరుగుబాట్లు రేగాయని తెలుపబడింది. ప్రజాతిరుగుబాట్లకు ప్రతీకారంగా మంగోల్ ప్రభుత్వం విధ్వంసనాన్ని అరెస్టులను, మారణహింసాకాండను అమలు జరిపేది.

నలభైయేళ్ళలోపల పన్నులు ఇరవై రెట్లు పెరిగాయి.

దేశదిమ్మరులైన మంగోల్‌లకు వ్యవసాయము, నీటివనరుల రక్షణ ప్రభుత్వానికి ఎంత ప్రాముఖ్యమో త్వరగా గుర్తించనందున, వరద నివారణకు, నీటికొరతను తొలగించడానికి తగుజాగ్రత్తలు తీసికోలేదు. ఎల్లోనది వరదకట్టలకు వరుసగా గండ్లు పడ్డాయి. కరువులు తరుచుగా రాసాగాయి.

ప్రకృతిసిద్ధమైన విపత్తులు సంభవించడంవల్లకూడ అశాంతి మరింత పెరిగింది. ఆయుధాలను వ్యక్తులు స్వంతంగా కలిగివుండరాదనీ, గుర్రాలను పెంచరాదనీ చక్రవర్తి మరొకసారి శాసించాడు. ప్రజలలో చెలరేగుతున్న అలజడిని అణచివేయడానికి కఠినమైన చర్యలు తీసుకున్నాడు.

పదునాల్గో శతాబ్దం మధ్యకాలానికి మంగోల్ సామ్రాజ్యం బలహీనత బయటపడసాగింది.

అప్పటి చారిత్రక పరిస్థితులకు అనుగుణ్యంగా అసమ్మతి రైతు తిరుగుబాటు రూపం ధరించింది. దీనికి ఎర్రతలపాగాలవారు నాయకత్వం వహించారు.

ఎర్ర తలపాగాల వుద్యమం అన్ని రైతు తిరుగుబాట్లవలెనే రహస్య నిర్మాణంగా ప్రారంభమయింది. మంగోల్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు బ్రద్దలవగానే, రైతు జనసామాన్యం అందులోచేరి బలపరచారు. 1351 లో లియూఫూ-టుంగ్ నాయకత్వాన ఎర్ర తలపాగాలవారు విప్లవధ్వజాన్ని లేవనెత్తారు.

ఇంగ్ చౌ నగరాన్ని, హొనాన్ రాష్ట్ర దక్షిణ భాగాన్ని ఎర్ర తలపాగాలు స్వాధీనం చేసుకున్నాయి. త్వరలోనే వారి బలం లక్షమందికి పెరిగింది. లంచగొండితనం, అవినీతితో మంగోల్ సేనల పోరాటపటిమ బీటలువారినందున, అవి అపజయాలు పొందాయి. దీనితో మంగోల్ మంత్రులు గాభరాపడ్డారు. వెదజల్లబడినట్లుగా దేశమంతటా వున్న మంగోల్, సెమూస్ సైన్యాలను పిలిపించి, యువాన్ రాజధాని టాటు (పెకింగ్) వద్ద కేంద్రీకరించాలనీ, ఎర్ర తలపాగాలవారి దాడిని ఎదుర్కోవాలనీ సలహా యిచ్చారు.

అప్పటికే విప్లవజ్వాలలు ఎల్లోనదీ, యాంగ్‌ట్సీనదీ లోయలంతా వ్యాపించాయి బీదరైతులు, చేతిపనివారు, చిన్నవర్తకులు తిరుగుబాటుకు నాయకత్వం వహించారు.

లియూ ఫూ-టుంగ్ నాయకత్వాన ఎల్లోనది విస్తృత ప్రాంతంలో ఎర్రతల పాగాల సైన్యం విజృంభించింది. కొన్ని సేనలు ఉత్తరాన రాజధానీనగరం టాటుపైకి వెళ్ళగా, మరికొన్ని సేనలు బ్రహ్మాండమైన చైనాగోడను దాటి నియోనది తూర్పు గట్టుకు చొచ్చుకుపోయి, యువాన్ సామ్రాజ్యం గుండెకాయలో రెండు బాకులు గుచ్చిన చందమయింది.

1368 నాటికి శక్తిని కోల్పోయి, చైనాగోడ అవతల ఎడారికి ఉత్తర దిశగా మంగోల్ సేనలు తిరోగమనం చేశాయి.

30 వ అధ్యాయం

# సుంగ్, యువాన్ కాలంలో చైనా సంస్కృతి

## మూడు ప్రముఖ పరిశోధనలు

టాంగ్ వంశం పరిపాలన కాలంలో కొయ్య అచ్చులతో అక్షరాలను ముద్రించడం కనిపెట్టబడింది. చేత్తో నకళ్ళు వ్రాయడం స్థానే అచ్చువేయడంవలన కొద్ది సమయంలోనే ఎక్కువ కాపీలు తయారుచేయడం సంభవమయింది. ప్రపంచ సంస్కృతికి చైనా ప్రసాదించిన గొప్ప కానుకల్లో అదొకటి.

ఐదు వంశాల పరిపాలన కాలంనాటికే ప్రజలు ఎక్కువగా వినియోగించే పంచాంగం, బాల శిక్షలు వగైరా పుస్తకాలను జెచివాన్, కియాంగ్సు, చెకియాంగ్ రాష్ట్రాలలో అచ్చువేసేవారు. టాంగ్ ప్రభుత్వం చివరిదశలో పాటల పుస్తకం, చరిత్ర పుస్తకం కాపీలు పండితుల వినియోగంకొరకు చాల పెద్ద సంఖ్యలో అచ్చువేయబడ్డాయ్.

సుంగ్ వంశ పరిపాలనలో కేంద్ర స్థానిక ప్రభుత్వాలు పుస్తకాలను అచ్చువేయడమేగాక, పుస్తక దుకాణాల యజమాన్లు, వ్యక్తులుకూడ స్వంతంగా పుస్తకాలను అచ్చువేయించేవారు. కియాంగ్సు, చెకియాంగ్, ఫూకియేన్, జిచువాన్, షాన్సీరాష్ట్రాలలో ముద్రణ కేంద్రాలుండేవి. సాహిత్యం, తత్వశాస్త్రం, చరిత్రకు సంబంధించిన ప్రఖ్యాత గ్రంథాలతోపాటు విజ్ఞానశాస్త్రం, టెక్నాలజీకి సంబధించిన గ్రంథాలు కూడ అచ్చువేయబడేవి. స్పష్టమైన అక్షరాలతో మంచికాగితంపై ముద్రించిన పుస్తకాలు చూడముచ్చటగా వుండేవి.

సుంగ్ పరిపాలన మధ్యకాలంనాటికి వేర్వేరు అక్షరాలను కూర్చేపద్ధతిని పిషెంగ్ అనే నిపుణుడు కనిపెట్టాడు. యువాన్ వంశకాలంనాటికి అక్షరాలనుకూర్చే పద్ధతి పశ్చిమప్రాంతాలమీదుగా యూరపుకు వ్యాప్తిచెందింది. ఆధునిక ముద్రణాలయాలకు ముద్రణకళకు యిదే ప్రాతిపదిక అయింది.

సూరేకారం, గంధకం, బొగ్గు పొడులను కలిపి తుపాకిమందును తయారుచేయడం ప్రాచీన చైనా ప్రజలకు తెలుసు. సూరేకారం, గంధకం కలిపి నూరితే

తీవ్రమైన ప్రేలుడు సంభవించుతుందని రసవాదులు (Alchemists) కనిపెట్టారు. తుపాకిమందు తయారు చేయడానికి యిదే ప్రాతిపదిక అయింది.

టాంగ్ ప్రభుత్వ చివరిదశలో తుపాకిమందువాడకం సైన్యంలో ప్రారంభ మయింది. ఉత్తర సుంగ్ ప్రభుత్వం ఏర్పడిన కొలది కాలంలోనే మందు కూర్చిన బాణం కనిపెట్టబడింది. బాణం మొనకు తుపాకిమందు దట్టించి వదిలితే,—ధాన్యం, కొయ్యలేక తగులబడే మరేపదార్థంతో—ఢీకొన్న వెంటనే నిప్పంటుకునేది. దక్షిణ సుంగ్ వంశ పరిపాలననాటికి నిప్పుతుపాకి కనిపెట్టబడింది. పొడుగాటి వాసపు గొట్టంలో మందుకూరి, దీనిని తయారుచేసేవారు. మందుకు నిప్పంటితే వాసపు గొట్టం ప్రేలి చుట్టూ మంటలు విరజిమ్మేది. దక్షిణసుంగ్ ఆఖరి సంవత్సరాలలో "తుహ్యూ చియాంగ్" అనే ఆయుధాన్ని కనిపెట్టారు. తుపాకిమందు పేల్చడం ద్వారా రాతిగుళ్ళను విసరే పద్ధతిని కనిపెట్టిన ఈ సాధనమే, ఫిరంగిని తయారుచేయ డానికి మార్గదర్శి అయింది.

తరువాత ఫిరంగి వచ్చింది. దక్షిణ సుంగ్ రాజ్యాన్ని జయించాక మంగోల్ సేనలు యాంగ్ చౌ నగరంవద్ద వున్న మందుకొట్టును పట్టుకున్నాయి. ఒకరోజున కాపలాదారు గంధకం నూరుతుండగా నిప్పంటుకుంది. ప్రేలుడు సంభవించి, మందు కొట్టును కాపలాకాస్తున్న వందమంది భటులు తునాతునకలైపోయారు.

తుపాకిమందును వినియోగించే ఆయుధాలు వాడకంలోకి రావడంవల్ల మిలిటరీ ఎత్తుగడలలో గొప్ప మార్పులు వచ్చాయి. శాంతియుత కార్యాలకు కూడ తుపాకి మందు ఉపయోగపడింది. మధ్య ఆసియాద్వారా పదమూడు, పదునాల్గో శతాబ్దా లలో తుపాకిమందు యూరపులో పరిచయమై వాడుకలోకి వచ్చింది.

క్రీస్తుకు పూర్వం మూడవ శతాబ్దంలో సూదంటురాయికి ఇనుమును ఆకర్షించే శక్తి వుందని కనిపెట్టారు. క్రీస్తుకు పూర్వం ఒకటో శతాబ్దంలో సూదంటురాయి కొన ఉత్తరదిశకు చూపుతుందని గుర్తించారు. తరువాత సూదంటురాయితో దిశలను చూపే సాధనాన్ని తయారుచేశారు.

ఉత్తర సుంగ్ పరిపాలన రోజుల్లో ఓడల ఉపయోగం నిమిత్తం దిక్సూచి మొదటిసారి వాడుకలోకి వచ్చింది. దక్షిణ సుంగ్ కాలంలో దిక్సూచి యంత్రాలు గల వర్తకపుటోడలు చైనా దేశంనుంచి దక్షిణ సముద్ర దీవులకు, భారతదేశానికి తిరుగుతుండేవి. పర్షియా, అరేబియా దేశాల వర్తకులు చైనా ఓడలపైసముద్ర ప్రయాణం చేసేవారు. దిక్సూచి వాడకాన్ని చైనానుంచి అరబ్బులు నేర్చుకున్నారు.

ఓడ ప్రయాణాల్లో దిక్సూచిని వాడటంవల్ల సముద్ర ప్రయాణానికి వున్న ఆటంకం తొలగింది. ప్రపంచ ఆర్థికవిధానం, సంస్కృతి పెంపొందడానికి వివిధదేశాల మధ్య వస్తుమార్పిడి ఎక్కువ జరగడానికి దీనికెంతో ప్రాముఖ్యతవుంది.

# సుంగ్ యువాన్ దశలలో ట్జూ కవిత్వం, నాటకం, నవల

టాంగ్ వంశ పరిపాలన చివరిదశలో ట్జూ అని పిలువబడే కొత్త కవితారీతి పరిణతి చెందింది. ట్జూ పదాల పొడవు, సంఖ్య ఎగుడు దిగుడుగా వుంటాయి. అందుచేత భావప్రకటనకు ఎక్కువ అవకాశం సౌలభ్యం వుంటుంది.

సుంగ్ వంశ హయాములో ట్జూ కవిత్వం రాణించింది. మాతృభూమి యెడల ప్రేమను, విదేశస్థుల దాడిని ప్రతిఘటించాలనే నిశ్చయాన్ని తెలుపుతూ పాటల ద్వారా దేశభక్తులు ప్రచారం చేశారు. ఆ కాలంలో హ్సిన్ చి-చి అనే కవి గేయ రచయితలలో ఖ్యాతిపొందాడు. అతడు దక్షిణసుంగ్ ప్రభుత్వంక్రింద పనిచేసిన దేశ భక్తిగల సేనాని. యాభైమంది అశ్వికులను వెంటదీసికుని, యాభైవేల కిన్ సైన్యాల మధ్యవున్న శత్రుశిబిరాన్ని ముట్టడించి, ద్రోహిగా తయారైన సేనానిని పట్టు కొచ్చాడు. అతని పాటలు దేశభక్తిని ప్రజ్వరిల్ల చేసేవి.

సుంగ్, వంశ పాలనక్రింద పెద్ద నగరాలలో పాటకచేరీలను, నాటకాలను ప్రదర్శించేటందుకు మందిరాలుండేవి. నాటకదళాలు ప్రదర్శనాలిస్తూ దేశమంతటా తిరిగేవి. యువాన్ పాలనలో నాటకం విస్తృతమైన ప్రజాభిమానం పొందింది.

మంగోల్ ప్రభువులు, భూస్వాములు అనులుజరిపే నిరంకుశత్వానికి పాలకవర్గ దుశ్చర్యలకు వ్యతిరేకంగా ప్రజల ప్రతిఘటనను ప్రతిబింబించుతూ నాటకాలు వ్రాసేవారు. ఉదాహరణకు కువాన్ హాన్-చింగ్ అనే ప్రఖ్యాత నాటక రచయిత వ్రాసిన "మండు వేసవిలో మంచు" అనే పేరుగల నాటకంలో ఒక బాల వితంతువు క్రూరుని మోసాన్ని, నిరంకుశాధికారుల పశుత్వాన్ని ప్రతిఘటించిన గాధను చిత్రించాడు. యువాన్ పరిపాలనకాలంలో రాజకీయంగా సాగుతున్న అవినీతిని, సమాజంలోని అక్రమాలను బట్టబయలు చేసే నిశిత విమర్శ ఆ నాటకంలో ద్యోతక మవుతుంది. వాంగ్ షీ-ఫూ వ్రాసిన "పడమటిల్లు" అనే నాటకంలో ఫ్యూడల్ సాంప్రదాయాలను ఎదిరించుతూ, స్వాతంత్ర్యంకొరకు సుఖజీవనంకొరకు పోరాడిన యువ దంపతుల గాధ చిత్రించబడింది. యువతీ యువకుల యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా నిర్బంధంగా జరిగే వివాహపద్ధతిని సవాలుచేస్తూ, ప్రేమాభిమానాలే వివాహానికి ప్రాతిపదికగా వుండాలని ఈ నాటకం నిరూపించుతుంది. అందుచేత దీని ప్రభావం ప్రజలపై చాల ఎక్కువగా పడింది.

సుంగ్ వంశ కాలంలో గేయకథలు చెప్పడం వృత్తిగా కలవారు పెద్ద నగరాలలో వుండేవారు. 'హువా పెన్' లేక జానపద గాథలపై ఆధారపడి ప్రజల భాషలో వీరు కథలు చెప్పేవారు షుయీ (నీటి ఒడ్డున), శాన్ కువో ఎన్ యీ (మూడు రాజ్యాల ప్రణయగాథ) అనేవి యువాన్ వంశ పాలన ఆఖరి రోజులకు మింగ్ వంశ పాలన ప్రారంభానికి మధ్య వ్రాయబడినవి. ఈ సాహిత్య రూపానికి యివి రెండూ చక్కని ఉదాహరణలు.

"షుయీ హు" అనే గద్యకావ్యం (నవల) భూస్వాములకు, ఫ్యూడల్ పరిపాలనకు వ్యతిరేకంగా రైతుల పోరాటాన్ని చిత్రించుతుంది. చైనా ప్రజలకు పరిచయమైన వూ సుంగ్, లిన్ సుంగ్ వంటి వీరుల ఘనకార్యాలను కీర్తించుతుంది.

సుంగ్, యువాన్ వంశాల కాలంలో సాహిత్యం ప్రజల జీవితాన్ని ప్రతిబింబించుటతో పాటు ఫ్యూడల్ నిరంకుశత్వానికి, విదేశ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో ప్రజలను వుత్సాహ ప్రొంది.

128

31 వ అధ్యాయం

# మింగ్ సామ్రాజ్య స్థాపన

యువాన్ వంశ పరిపాలన చివరి సంవత్సరాలలో చు యువాన్-ఛాంగ్ అనే బీద రైతు యువకుడు చాల ప్రాముఖ్యత వహించాడు.

చు యువాన్-చాంగ్ మాతృభూమియైన అన్‌హ్వాయి రాష్ట్రానికి చెందిన ఫెంగ్‌యాంగ్ కౌంటీలో పదిహేడు సంవత్సరాల యువకుడుగా వున్నపుడు వర్షాభావంవల్ల పంటలు దెబ్బతిన్నాయి. అంటుజాడ్యాలు వ్యాపించాయి. చూ తలిదండ్రులు' అన్న చనిపోయారు. దిక్కులేనివాడుగా మిగిలిపోయిన చూ సన్యాసుల్లో చేరి, అన్‌హ్వాయి, హోనాన్ రాష్ట్రాలలో కొన్ని సంవత్సరాలపాటు తిరిగాడు. యువాన్ ప్రభుత్వానికి ఎదురు తిరిగిన సాయుధ రైతులదళంలో చేరాడు. చాల ధైర్యంగల సైనికుడుగా సహచరులందరి అభిమానాన్ని పొందాడు. తరువాత గొప్పసైన్యానికి నాయకుడై చూ తనసేనలతో నాన్‌కింగ్ నగరం పట్టుకుని, దానిని ప్రధాన కేంద్రంగా చేసుకున్నాడు.

ఎల్లోనదీ లోయ ప్రాంతంలో ఎర్రతలపాగాల వారి తిరుగుబాటు ఉధృతంగా వుండి, దక్షిణ ఉత్తర యువాన్ సైన్యాలమధ్య సంబంధాన్ని తెగగొట్టాయి. పది సంవత్సరాల తీవ్రపోరాటం తరువాత యాంగ్‌ట్సీనదికి దక్షిణానఉన్న ప్రధానమంగోల్ సైన్యాన్ని తుడిచివేసి, యాంగ్‌ట్సీ దిగువ మధ్యభాగాల చుట్టూవున్న ప్రాంతమంతటినీ ఆక్రమించి, తన అధికారాన్ని సుస్థిరమొనర్చుకోవడంలో చు యువాన్-చాంగ్ విజయం సాధించాడు. 1968 లో నాంకింగ్ రాజధానిగా తన సామ్రాజ్యాన్ని స్థాపించాడు. ఇతనికి తాయ్ ట్సూ చక్రవర్తి అనీ, ఇతని వంశాన్ని మింగ్‌వంశ పరిపాలన అని చరిత్రకారులు పిలుస్తారు.

చక్రవర్తి తాయ్ ట్సూ ఉత్తర దండయాత్రకు పిలుపు యిచ్చాడు. మంగోల్ పరిపాలకులను పారదోలడంలో తమకు తోడ్పడవలసిందిగా ఉత్తరదేశంలో వున్న హాన్ ప్రజలకు విజ్ఞప్తి చేశాడు. మంగోల్, సెమూ సామ్రాజ్య ప్రజలకు వారిచటనే వుండాలని కోరుకుంటే హాన్ ప్రజలతో సమాన ప్రతిపత్తి యిస్తామని ప్రకటించాడు. వారిలో కొలదిమంది మాత్రమే మింగ్‌రాజ్యంలో మిగిలారు. ఎక్కువమంది చైనా

గోడను దాటిపోయారు; అందులో కొందరు స్థిరనివాసం ఏర్పర్చుకోగా, మరికొందరు తిరిగి మంగోల్ తెగలలో లీనమైపోయారు.

ఉత్తర దండయాత్రకు బయలుదేరిన సైన్యం శిక్షణతో మెలగుతూ ప్రజలను వారి ఆస్తులను, వ్యవసాయ పనిముట్లను దుక్కి పశువులను రక్షించుటకు పూనుకుంది. అందుచేత ప్రజల సహకారంతో త్వరగా పురోగమించగలిగింది.

1368 వ సంవత్సరం ఆకురాలు కాలంలో ఉత్తర దిగ్విజయసైన్యాలు టాటు (పెకింగ్) నగరాన్ని పట్టుకొని, మంగోల్ ప్రభుత్వాధికారాన్ని తుదముట్టించాయి. తరువాత పదిసంవత్సరాలలో మింగ్ సైన్యం పశ్చిమోత్తర ప్రాంతాలను, ఈశాన్య ప్రాంతాలను, నైరుతి ప్రాంతాలను జయించి, మిగిలివున్న మంగోల్ సైన్యాలను తుడిచివేసింది.

తన ప్రభుత్వాధికారాన్ని బలపరచుకోడానికి తాయ్‌ట్సూ చక్రవర్తి రైతులతో రాజీపడి, వ్యవసాయాభివృద్ధికి తగు చర్యలు తీసికున్నాడు.

ఎవరి ప్రాంతాలకు వారు తిరిగివెళ్ళి వ్యవసాయోత్పత్తిని పెంచేందుకు లేదా జనసంఖ్య తక్కువగావున్న ప్రాంతాలకు వెళ్ళి బంజరుభూములను సాగుచేసేందుకు రైతులను మింగ్ ప్రభుత్వం ప్రోత్సహించింది. దుక్కి పశువులను, వ్యవసాయ పనిముట్లను, విత్తనాలను రైతులకు అందజేసి, మూడేళ్ళవరకు పన్నులను, వెట్టిచాకిరీని మినహాయించింది. బంజర్లను సాగుచేసినపుడు ఆ భూములను ఆ రైతులకే ఇచ్చేవారు.

నీటి వనరులను ఎక్కువచేసే ప్రాజెక్టులను నిర్మించేందుకు మింగ్ ప్రభుత్వం శ్రద్ధ వహించింది. ఆనకట్టలను నిర్మించడం, వరద కట్టలను మరమ్మత్తు చేయడం నదీగర్భాలను బాగుచేయడం జరిగింది. అదివరకు పడావులుగావున్న ప్రతి పొలాన్ని తిరిగి దున్ని సాగుచేయడానికి మింగ్ పరిపాలన ఆరంభమైన మొదటి సంవత్సరాలలో కృషి జరిగింది.

ప్రత్తి పంటను మింగ్ ప్రభుత్వం ప్రోత్సహించింది. ఐదునుంచి పది మౌల భూమిని సాగుచేసే రైతు కుటుంబం ప్రత్తిపంటను అరమౌలో వేసితీరాలని నిర్ణయించింది. కమతం పెద్దదైనకొలదీ ఎక్కువ ప్రాంతంలో ప్రత్తిపంట వేయాలి. నూలుతో బట్టలు నేయడం రైతులకు అనుబంధ వృత్తిగా తయారయింది. పట్టువస్త్రాలకుబదులు నూలువస్త్రాలను ధరించడం ప్రజలలో ఎక్కువయింది.

భూమిని తిరిగి సర్వే చేయించడం, జనాభాలెక్కలు తీయడం ఖచ్చితంగా జరిగినందున భూస్వాములు రహస్యంగా వుంచిన కమతాల నిజపరిస్థితి బయటపడి వారిపై సక్రమంగా పన్ను విధించబడింది. రైతులపై పన్నులభారం తగ్గింది. అవినీతిని, లంచగొండితనాన్ని తొలగించడానికి తాయ్‌ట్సూ తీవ్రమైన చర్యలు తీసుకున్నాడు. లంచగొండి వుద్యోగులు చాలమంది శిక్షించబడ్డారు.

దేశ ఆర్థిక పరిస్థితిని పునరుద్ధరించడానికి వీలుగా డెబ్బదియేళ్ళవరకు శాంతి కూడవుంది. కరువును ఎదుర్కొనేందుకు అవసరమైన ధాన్యాన్ని ప్రభుత్వం నిల్వ చేయగలిగేది.

# గొప్ప సముద్ర ప్రయాణాలు

ఇదివరకే ఉదహరించినట్లుగా చైనా ప్రజలు దిక్సూచి యంత్రాన్ని అభివృద్ధి చేయడంలో జయంపొందారు. సముద్రయానం చేయడంలోకూడ చాల అనుభవం సంపాదించారు.

పదిహేనవ శతాబ్దం ప్రారంభంలో ప్రపంచమంతటిలోకి చైనా భాగ్యవంతమైన శక్తివంతమైనదేశం. ఓడల నిర్మాణం ఉన్నతస్థాయిలో వుండేది. తాయ్ ట్సూ చక్రవర్తి నాలుగవ కొడుకు దక్షిణ సముద్ర దీవులను (తూర్పు ఇండియా దీవులని పిలువబడేవి) పరిశోధించాలని నిర్ణయించాడు. యున్నాన్ రాష్ట్రానికి చెందిన కయీ వంశస్తుడు చెంగ్ హోకు ఈ బాధ్యత యివ్వబడింది.

1405 లో 27 వేలమంది మనుష్యులతో చెంగ్ హో బయలుదేరాడు. సముద్రయానానికి ఉపయోగించే 60 ఓడల నిండా బంగారు, పట్టు, పింగాణి సరకులతో ఈ దళం బయలుదేరింది. తూర్పు సముద్రాన్ని దక్షిణచైనా సముద్రాన్ని దాటి, చంపా (కొచిన్ చైనా) రేవుకు, ఇతరదేశాలకు వెళ్ళింది. ప్రతిదేశంలోనూ స్థానిక ప్రజలతో వ్యాపారం చేయడానికి, రాజులకు బహుమతులు యివ్వడానికి అవసరమైనంతకాలం అచట ఆగారు.

తరువాత ముప్పది సంవత్సరాలలో చెంగ్ హో అతని అనుచరులు ఆరుసార్లు సముద్రయానం చేశారు. ఇండోచైనా ద్వీపకల్పానికి, మలయా ద్వీపకల్పానికి, తూర్పు ఇండీస్‌దీవులకు, భారతదేశానికి, పర్షియాకు, అరేబియాకు, ఆఫ్రికా తూర్పు తీరానికి వెళ్లారు. దిగిన ప్రతి దేశంయొక్క పరిస్థితులను, స్థానిక ప్రజల సాంప్రదాయాలను, అలవాట్లను తెలసికున్నారు. వారితో శాంతియుతంగా వ్యాపారం చేశారు. రాజు అనుమతితో మలయా ద్వీపకల్పంలో ఆహారాన్ని, వర్తకపు సరుకులను నిల్వచేయడానికి గిడ్డంగులను నిర్మించుకున్నారు. ఇతర దేశాలకు వెళ్లివచ్చిన ఓడలు స్వదేశానికి తిరిగివచ్చే దారిలో అచట మకాం వేసేవి. చెంగ్ హో యాత్ర విజయం పొందడం ఫలితంగా చైనాకు విదేశాలతో వ్యాపారసంబంధాలు ఏర్పడ్డాయి. చైనా వర్తకులు, విదేశ వర్తకులు పరస్పరం రాకపోకలు తరచుగా జరపసాగారు.

చెంగ్ హో, అతని దళం సముద్ర ప్రయాణపు ప్రమాదాలను ఎదుర్కోడంలో కనపరచిన ధైర్యం మెచ్చుకోదగినది. కొలంబస్ అమెరికాను కనిపెట్టడానికి, వాస్కోడిగామా గుడ్‌హోప్ అగ్రాన్ని చుట్టివెళ్లడానికి అర్థశతాబ్దం ముందుగానే చెంగ్ హో ఈ మహాత్కార్యాలను సాధించాడు.

తూర్పు ఇండియా దీవులకు చెంగ్‌హో యాత్రల ఫలితంగా చైనాకు, ఆ దేశాలకు మధ్య స్నేహపూర్వకమైన వర్తక సంబంధాలు ఏర్పడ్డాయి. ఆ దీవులతో వర్తక వ్యాపారాలకోసం చైనా ప్రజలు ఎక్కువ సంఖ్యలో వెళ్ళారు. సహజంగా కొందరు అచటనే నివాసమేర్పరచుకుని, కుటుంబాలను కూడా తీసికువెళ్ళారు. వారి బిడ్డలు

పెరిగాక పెళ్లిళ్ళు చేసుకుని, అచటనే తమ వృత్తులను కొనసాగించారు. సుమత్రా దీవిలోని పాలెంబాంగ్‌లో కొన్ని వేల చైనా కుటుంబాలున్నాయి. జావా దీవిలో వేలకొలదీ చైనా కుటుంబాలున్నాయి.

దేశాంతరాలకు వెళ్లిన చైనా ప్రజల కృషి, తూర్పు యిండియా దీవులను అభివృద్ధి చేయడానికి ఎంతో తోడ్పడింది. పట్టువస్త్రాలు, పింగాణి, ఇనప పనిముట్లు వగయిరా చైనా సరుకులు ఆ దీవుల్లోని వివిధ భాగాలలో లభ్యమయ్యేవి. స్థానిక ఆర్థిక విధానాన్ని, సంస్కృతిని పెంపొందించడానికి చైనావారి ఉత్పత్తి నైపుణ్యం, సంస్కృతి ఎంతో ఉపయోగపడింది.

32 వ అధ్యాయం

# విదేశ దండయాత్రలకు వ్యతిరేకంగా మింగ్ ప్రభుత్వ పోరాటం

## మంగోలులతో యుద్ధం

మంగోలియన్ సేనలను ఎడారి అవతలకు మింగ్ సైన్యం పారదోలిన తరువాత మంగోల్ జాతి చాలా తెగలుగా చీలిపోయింది. పాలక తెగలను తార్తారులని పిలచేవారు.

తార్తారులకు పడమరగా మరో మంగోల్ తెగ అయిన ఓయ్‌రాట్‌లు నివసించే వారు. పదునైదవ శతాబ్దం మధ్యభాగంలో ఓయ్‌రాట్‌లు బలపడి, తార్తారులను ఓడించి, తమ అధికారాన్ని శియోనదీ లోయవరకు విస్తరించుకుని, మింగ్ సామ్రాజ్యం ఉత్తర సరిహద్దులకు తీవ్ర ప్రమాదంగా తయారయ్యారు.

1449 లో ఓయ్‌రాట్ నాయకుడు తన సేనలను దక్షిణ దిశకు పంపాడు. శత్రుబలం తెలియనందున, మింగ్ ప్రభుత్వం తయారుగాలేదు. చక్రవర్తి స్వయంగా టాటుంగ్‌కు వెళ్ళి సైన్యాన్ని నడిపించాడు. పరిస్థితి క్లిష్టంగా వుందని గ్రహించి, తిరోగమించాలని సైన్యాన్ని ఆజ్ఞాపించాడు. సరైన నాయకత్వం లేని సైన్యం విశ్రాంతి, తిండి లేకుండా త్వరత్వరగా ప్రయాణం చేసింది. టుముపావ్ చేరుకునేటప్పటికి పూర్తిగా అలసిపోయింది. ఇరవై అడుగుల లోతు తవ్వినా మంచి నీళ్ళు లభ్యంకాలేదు. ఈలోగా ఓయ్‌రాట్ గుర్రపుసేన వచ్చి వారిని చుట్టుముట్టింది. మింగ్ సైనికులు గాభరాతో చిందరవందరగా పారిపోయారు. చక్రవర్తిని ఖైదీగా పట్టుకున్నారు.

ఈ వార్త పెకింగ్‌కు చేరినపుడు కొత్త చక్రవర్తి చింగ్‌టీ మంత్రులను పిలచి ప్రమాద పరిస్థితులను ఎలా ఎదుర్కోవాలన్న విషయాన్ని చర్చించాడు. రాజధాని నాంగ్‌కింగ్‌కు మార్చాలని కొందరు సలహాయిచ్చారు. రక్షణ చర్యలు సాగించాలని వాదించిన యూచెన్ అనే ఉన్నతోద్యోగికి బాధ్యత అప్పగించబడింది. వివిధ ప్రాంతాలనుంచి ఆ

ధాన్యాలను పెకింగ్ నగరానికి అతడు తెప్పించాడు. నగరంలోని సైనికులను, పౌరులను వీరోచితంగా పోరాడమని విజ్ఞప్తిచేశాడు.

ఓయిరాట్లు తమదారిలో మింగ్ సరిహద్దు కాపలాదార్ల తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కోవలసివచ్చింది. పెకింగ్ సమీపించేసరికి నగరమంతా యుద్ధానికి సన్నద్ధమై వుంది. అనేక దాడులను మింగ్ సైనికులు తిప్పికొట్టారు. అదనపు బలాలు వరుసగా చేరుకోసాగాయి. అందుచేత ఓయిరాట్లు ఉపసంహరించుకోవలసివచ్చింది.

మింగ్ వంశ పరిపాలన మధ్యభాగంలో తార్తారులు తమబలాన్ని సమీకరించుకొని మరొకసారి ఆర్డోస్‌ను ఆక్రమించుకున్నారు. పచ్చికబైళ్ళను పశువుల పెంపకానికి, దక్షిణదేశ దండయాత్రకు కేంద్రంగా చేసుకున్నారు. ఎడారి ఉత్తర దక్షిణ భాగాలను బలపరచుకున్నాక మింగ్ సామ్రాజ్యానికి ప్రమాదంగా తయారయ్యారు. తార్తార్ గుర్రపు సేనలు చైనా గోడను తరుచుగా దాటివచ్చి, షెన్సీ షాన్సీ రాష్ట్రాలలోను హోపే రాష్ట్ర ఉత్తర భాగాలలోను శాంతియుత పరిపాలనను భగ్నం చేశారు. అనేకసార్లు పెకింగ్ నగర శివార్లదాకా చొచ్చుకువచ్చేవారు.

తార్తారులకు వ్యతిరేకంగా రక్షణ దుర్గాలను బలపరచేందుకు చైనా గోడను మరమ్మతు చేయాలనీ, విస్తరించాలనీ మింగ్ చక్రవర్తి నిర్ణయించాడు. పాతపునాదులపైన మరింత మందంగాను, ఎత్తుగాను గోడను నిర్మించుతూ, ఒక భాగం తరువాత మరొక భాగాన్ని కార్మికులు పూర్తిచేశారు. శత్రుదాడి వచ్చినపుడు పోరాటంతోపాటు గోడను మరమ్మతు చేయాలసిన బాధ్యత ప్రజలపై పడింది.

కొత్తగా బలపరచబడిన చైనాగోడ తూర్పున షాన్ హై కాన్ కనుమనుంచి పడమర చియాయు కాన్ కనుమవరకు అనగా దాదాపు ఐదువేల మీల పొడవు వుండేది. శత్రువుల దాడులకు బలవత్తరమైన ఆటంకంగా వుండేది.

మింగ్ పరిపాలన కాలంలో జపాన్ వర్తకులు తమ ఓడలలో సరుకులతోపాటు సాయుధ ... సుకుని చైనా సముద్రరేవులలో దిగేవారు. వ్యా ... వంలో అవకాశం దొరికినప్పుడల్లా ప్రజలను దో ... డం వీరికి పరిపాటయింది. అందుచేత సముద్ర ... వారుగా ఈ జపాన్ ఓడదొంగలు తయారయ్యారు.

... డీ ప్రజలను రక్షించే విషయమై మింగ్ ప్రభుత్వం ... వహించింది. సముద్రతీరంవెంట అనేక దుర్గాలను ... వేలమంది తర్ఫీదుపొందిన రైతులను కాపలాగా వుంచింది. ... ఏమరపాటు జరిగినా జపాన్‌వాళ్లు తమ దుశ్చర్యలను కొ ... లవారు.

1‥ లో జపాను ఓడదొంగల మూకలు కియాంగ్సూ, చెకియాంగ్ రాష్ట్రాలపై దాడిచేసి, కొన్ని సందర్భాలలో అంతర్భాగాలకు సైతం చొరబడి,

ప్రజలను చంపి, సంపదను దోచుకుపోయారు. తరువాత జపానువాళ్ళు యింకా దక్షిణానికి వెళ్ళి, ఫూకీన్ రాష్ట్రంపై దాడిచేశారు.

జపాన్ ఓడదొంగలకు వ్యతిరేకంగా మింగ్ ప్రభుత్వం తన బలాలను సమీకరించింది. సైన్యానికి చెకియాంగ్‌లో తర్ఫీదు యివ్వడానికి ప్రఖ్యాత మింగ్ సేనాని ఐన చిచి-కాంగ్ నియమితుడయ్యాడు. కోస్తాప్రజల తోడ్పాటుతో, మార్గదర్శకులుగా రైతుల సహాయంతో చిచి-కాంగ్ సైన్యం జపాన్ ఓడదొంగలపై తీవ్రమైన దెబ్బలను వరుసగా కొట్టింది. 1565 నాటికి ఓడదొంగలను పూర్తిగా తుడిచిపెట్టింది.

## కొరియాకు సహాయం

1592 లో హిదెయోషీ టొయొటోమీ అనే జపాన్ సేనాని అనేక వందల నావలపై లక్షకుమించిన సైన్యంతో కొరియాదేశంపై దాడిచేశాడు. దక్షిణకొరియా సముద్రతీరంలో దిగి, జపానువాళ్ళు దారిపొడుగునా తగులబెట్టడం, దోపిళ్ళు సాగించుతూ ప్యాంగ్‌యాంగ్, సూయెల్ వగైరా నగరాలను ఆక్రమించుకుంది. కొరియా ప్రజలు ఎదురునిలచి పోరాడసాగారు.

కొరియా ప్రభుత్వం తమకు సహాయపడవలసిందిగా మింగ్ ప్రభుత్వాన్ని అర్థించింది. 1593 లో జనరల్ లీ జు-సుంగ్ ఆధిపత్యంక్రింద మింగ్ సైన్యం కొరియాకు వెళ్ళింది. కొరియా సేనల సహకారంతో జపాన్ సైన్యాలను ఓడించి, ప్యాంగ్‌యాంగ్‌ను విముక్తి చేసింది. తీవ్రమైన నష్టాలను పొందిన జపానువాళ్ళు వెనక్కి తిరిగిపోయి, ద్వీపకల్పం దక్షిణ కొసనువున్న పూసాన్‌లో తిష్టవేశారు.

1597 లో హిదెయోషి తిరిగి దండయాత్ర చేశాడు. మింగ్ సేనలు, కొరియా సేనలు కలసి జపాన్ దండయాత్రను ఎదిరించాయి. మరొకసారి జపాన్ సేనలను పూసాన్ సమీపంవరకు త్రిప్పికొట్టాయి. పన్నెండు నెలల అనంతరం ఉభయసేనలు ఐక్యంగా భూమిపైనుంచి, సముద్రంపైనుంచి జపాన్ వారిపై భీకరమైన దాడిచేశాయి. ... కాశం సర్వనాశనమయింది. మిగిలిన జపానువాళ్ళు పారిపోయారు.

## 33 వ అధ్యాయం

# వ్యాపారం, పరిశ్రమల అభివృద్ధి: భూమి కేంద్రీకరణ

### పెట్టుబడిదారీ ఉత్పత్తికి ప్రారంభ చిహ్నాలు

యువాన్ వంశ ప్రభుత్వం కూలిపోవడంతో బానిసత్వంలో వుంచబడిన చేతి వృత్తి కళాకారులు తిరిగి స్వాతంత్ర్యం పొందారు. మింగ్ ప్రభుత్వంక్రింద "వుద్యోగులుగా వున్నకళాకారులు" నిర్ణీతమైన సాంవత్సరిక సర్వీసును పూర్తిచేశాక, స్వంతంగా పనిచేసుకునే అవకాశం వుండేది. ఉత్పత్తిని పెంచడానికి దీనివలన వుత్సాహం లభించింది. వ్యవసాయం అభివృద్ధి చెందేకొలదీ పల్లెసీమలు ఎక్కువ ధాన్యాన్ని, ముడిపదార్థాలను నగరాలకు అందజేసేవి : రైతుల కొనుగోలుశక్తి పెరుగుతున్నందున నగరాలలో చేతిపారిశ్రామికులు తయారుచేసిన సరుకులను ఎక్కువగా కొనగలిగేవారు. ఈవిధంగా చేతిపరిశ్రమలు విస్తరించాయి. ఇనుము కరిగించడం, కుండలను తయారుచేయడం, బట్టలు నేయడం, అచ్చువేయడం, ఓడలనిర్మాణం వగయిరా పరిశ్రమలలో టెక్నికల్ నైపుణ్యం అభివృద్ధిచెందింది. చేతివృత్తుల పనివారి సంఖ్య పెరిగింది: చేతిపరిశ్రమల కర్మాగారాలు వృద్ధిచెందాయి.

మింగ్ వంశ పరిపాలన కాలంలో తైహూసరస్సుప్రాంతం ముఖ్యంగా సూచౌ పట్టుపరిశ్రమకు కేంద్రంగా వుండేది. ఇచట చాలా చేతివృత్తులవారు, చేతిపరిశ్రమల కర్మాగారాలు వుండేవి. ఈ కర్మాగారాల యజమానులు రోజుకూలికి పనిజేసే నిపుణులైన కళాకారుల శ్రమను వినియోగించుకుని లాభంపొందేవారు. ఉదయమే తాత్కాలిక పనివారు పనికోసం ఎదురుచూస్తూ కర్మాగారాల గేట్లముందు తిరుగుతుండేవారు. ఈవిధమైన ఫ్యాక్టరీ వుత్పత్తిలో అప్పటికే పెట్టుబడిదారీవిధానం చిహ్నాలు ద్యోతకమయ్యాయి.

మింగ్ పరిపాలనలో కుండల పరిశ్రమ చాలా అభివృద్ధిచెందింది. చింగ్ టెక్చెన్ ఈ పరిశ్రమకు కేంద్రంగా వుండేది. కియాంగ్సీ రాష్ట్రంలో "పింగాణీ పట్టణమని" పిలువబడే యిచట ప్రభుత్వ ఆధ్వర్యం క్రిందను, వ్యక్తుల యాజమాన్యం క్రిందను నిర్వహించబడుతున్న వేలకొలదీ బట్టీలు రాత్రింబవళ్ళు పనిచేసేవి. పింగాణీని తయారుచేయడానికి చాల చిక్కులతో కూడిన ప్రత్యేక నైపుణ్య పద్ధతులు అవసరమౌతాయి. పనివారికిచ్చే వేతనాలలో చాల తేడావుంది. సాధారణ పనివారికంటే

నిపుణులు చాల ఎక్కువ జీతం సంపాదించేవారు. కర్మాగారాలలో పనిని అజమాయిషీ చేసే మానేజర్లు వుండేవారు. చింగ్ టెక్చేన్‌లో తయారైన పింగాణీసామాన్లు దేశమంతటా అమ్మబడేవి; విదేశాలకు ఎగుమతయ్యే వాటిలో పింగాణీ ముఖ్యమైన సరుకుగా వుండేది.

చేతివృత్తుల కర్మాగారాలు, వర్తకం అభివృద్ధి చెందడంతో కొన్ని వ్యవసాయ పంటలు వర్తకపుసరకు లయ్యాయి. కియాంగ్సురాష్ట్రింలోని ప్రతిపంట కేంద్రమైన సుంగ్ చియాంగ్ జిల్లాలో ప్రత్తిపంటను సాగుచేసేందుకు సగంభూమి వినియోగించేవారు. పట్టణాలోని ప్రతి కుటుంబం నూలువడకడం, బట్టలు నేయడంవల్ల వస్త్ర పరిశ్రమకు అది కేంద్రమయింది. దేశంలో వివిధ ప్రాంతాలనుంచి ధనిక వర్తకులు అచటకివచ్చి, మధ్యవర్తుల (కమిషన్ వర్తకుల) ద్వారా నూలు వస్త్రాలను కొని, కియాంగ్సీ, హోపేహునాన్, క్వాంటంగ్, క్వాంగ్సీ రాష్ట్రాలకు, దూరానవున్న షెన్సీ షాన్సీ రాష్ట్రాలకు సైతం రవాణా చేసేవారు.

చేతివృత్తుల పరిశ్రమ అభివృద్ధి చెందడంతో పాటు నగరాల విస్తీర్ణం, సంఖ్య పెరిగి, భాగ్యవంతమయ్యాయి. దేశంలో ముప్పదికంటే ఎక్కువ పెద్ద నగరాలు వుండేవి. అందులో ఎక్కువభాగం ఆగ్నేయ సముద్రతీరంలో వుండేవి. మూడోవంతు కియాంగ్సూ, చెకియాంగ్ రాష్ట్రాలలో వుండేవి. మింగ్ ప్రభుత్వ రాజధానీ నగారాలైన పెకింగ్, నాంకింగ్‌లు రాజకీయంగానూ, ఆర్థికంగానూ ముఖ్య కేంద్రాలుగా వుండేవి. చేతి పరిశ్రమలు, వ్యాపారం పెంపొందుతూవుండేవి. ఒకే రకమైన వ్యాపారం ఒకే వీధిలో లేక ఒకే కేంద్రంలో కేంద్రీకరించబడివుండేవి. ఉదాహరణకు నాంకింగ్ నగరంలో బుటేదారుపట్టు, రంగులు, కంచు, ఇనుముసామాను తయారుచేసే కర్మాగారాలు వేర్వేరుగా వుండేవి. పెకింగ్ నగరంలో బియ్యం, బొగ్గు, కుండలు, గాడిదలు, గుర్రాలు అమ్మేందుకు వేర్వేరు మార్కెటులు వుండేవి.

విదేశ వ్యాపారంకూడ వృద్ధిచెందింది. కాంటన్ నగరం పెద్ద వర్తక రేవుగా వుండేది. పింగాణీ, పట్టుసరుకులు, ఇనుప సామాను తూర్పు ఇండీస్ దీవులకు ఎగుమతి చేయబడేవి. మింగ్ ప్రభుత్వ మధ్యకాలానికి యూరపుతో వర్తకసంబంధాలు ఏర్పడ్డాయి.

## భూమి కేంద్రీకరణ

మింగ్ వంశ పరిపాలన ప్రారంభదశలో వ్యవసాయ పనిముట్లను బాగుచేసుకుని, పొలాలను బాగా పదునుచేసి, ఎరువులను ఉపయోగించి రైతులు తక్కువ విస్తీర్ణంలో ఎక్కువ పంటలు పండించేవారు. సాగుచేసే భూమి విస్తీర్ణం కూడా ఎక్కువయింది. ఫలసాయం చాల ఎక్కువయింది. కాని రైతుల భూములను క్రమక్రమంగా భూస్వాములు కాజేయసాగారు.

రైతులకు హక్కులను యిస్తూ చట్టాలు చేసిన ప్రథమదశ గడచిపోయాక మింగ్ ప్రభుత్వం తన అధీనంలో వున్న భూములను ప్రభువులకు, మంత్రులకు చక్రవర్తి ఈనాములుగా ప్రదానం చేశాడు. విపరీతమైన ఈ బహుమానాలతో సంతృప్తిచెంద

ఉద్యోగులు, వారి యేజెంట్లు అక్రమంగా అనేక సాకులతో రైతుల భూములను కాజేశారు. చక్రవర్తికూడ విశాలమైన ప్రాంతాలను రాజకుటుంబానికి దఖలు చేసుకున్నాడు. చక్రవర్తి కుటుంబానికి ప్రత్యేకించిన జాగీర్లు ఒకటినుంచి మూడువందలకు పైగా పెరిగాయి. వీటిని కౌలుదార్లతో సాగుచేయించేవారు.

చక్రవర్తి కుటుంబానికి, ప్రభువులకు చెందిన జాగీర్లను సాగుచేయించే నిగామాన్లు, యజమానుల అధికారాన్ని వినియోగించుకుని రైతులను దోచుకుని తాము లాభపడేవారు. జాగీరుప్రాంతంలో పడవలు నడిపినా, బళ్ళు తోలినా, చేపలు పట్టినా, కట్టెలు కొట్టినా, ఆ సమీపంలో పశువులను మేపినా రైతులనుండి అక్రమవసూళ్లను గుంజేవారు. అంతటితో సంతృప్తిచెందక జాగీరు భూములను విస్తరించుతూ, జాగీరు పరిహద్దుల్లోనే వున్నవని రైతుల భూములను ఆక్రమించి బలవంతంగా మక్తాలువసూలు చేసేవారు.

మింగ్ పరిపాలన ఆరంభదశలో ప్రభుత్వం పన్ను వసూలుచేసే భూమి విస్తీర్ణం 80 కోట్ల మౌలకు మించివుండేవి. పదహారవ శతాబ్దం మొదటికి దీని విస్తీర్ణం సగానికి సగం తగ్గిపోయింది. చక్రవర్తి, ప్రభువులు, మంత్రులు, భూస్వాములు విశాలమైన ప్రాంతాలను ఆక్రమించుకుని, పన్నులనుండి తప్పించుకునేవారు. మింగ్ పరిపాలన ఆఖరి సంవత్సరాలలో తైహూ సరస్సు చుట్టూవున్న సారవంతమైన భూములలో నివసించే కుటుంబాలలో పదింట ఒకరికిమాత్రమే స్వంతభూమి వుండేది. తక్కిన తొమ్మిదివంతుల కుటుంబాలు కౌలుదార్లుగా వుండేవారు.

## డబ్బురూపేణా మక్తాలు

మింగ్ పరిపాలన మధ్యదశ అనంతరం భూమి శిస్తుద్వారా వచ్చే ఆదాయం తగ్గినప్పటికీ ప్రభుత్వఖర్చు పెరిగింది. భూమి శిస్తుతోడు రైతులు అదనంగా అక్రమ పన్నులభారాన్ని, ప్రభుత్వ వెట్టిచాకిరిని భరించవలసివచ్చేది. చాలామంది రైతులు దివాళాతీసి, తమగ్రామాలను వదిలి పారిపోయారు.

ప్రజలనుండి ఎక్కువ పన్నులను గుంజాలనే దృష్టితో ప్రభుత్వం "ఒక కొరడా చట్టం" అనే పేరుతో కొత్త పద్ధతిని ప్రవేశపెట్టింది. ఈ పద్ధతిక్రింద భూమిని తిరిగి సర్వేచేయించి, భూమి పన్నుతో వెట్టిచాకిరీ మొదలైనవాటినికూడా చేర్చి ఒకే పన్నుక్రింద ధనరూపంలో కమతాల సైజును అనుసరించి వసూలు చేస్తారు. ఈ పద్ధతిని ముందుగా కొన్ని జిల్లాలలో అమలుజరుపుటద్వారా పరీక్షించిన తర్వాతనే 1581 లో దేశమంతటిలోనూ వర్తింపజేశారు; అప్పటినుంచి డబ్బురూపేణా పన్నులు వసూలు చేయడం చైనా అంతటా విస్తరించింది.

ఐనప్పటికీ భూమిని రీసర్వే చేయించాలనే నియమాన్ని సక్రమంగా ప్రభుత్వం అమలుజరపలేదు. పెద్ద భూస్వాములు యీ పద్ధతి అమలుజరుగకుండా అరికట్టేందుకు అన్నివిధాలా ప్రయత్నించారు. పన్నెండు సంవత్సరాల అనంతరం యీ విధానం అమలుజరుగకుండా పోయింది. వెండినాణాల రూపంలో పన్ను చెల్లించడం మాత్రం వుండిపోయింది.

## 34 వ అధ్యాయం

# మింగ్ పరిపాలన చివరిదశ

## పన్నులు వసూలుచేసే ఖోజ్జాలకు వ్యతిరేకంగా పౌరుల పోరాటం

మింగ్ వంశ మొదటిదశలో అధికారాన్నంతటినీ తన చేతుల్లో కేంద్రీకరించుకుని చక్రవర్తి అతి నిరంకుశంగా పరిపాలించేవాడు. మింగ్ పాలన మధ్యభాగం గడచిపోయాక చక్రవర్తిపేరుతో ఖోజ్జాలు అధికారం చెలాయించసాగారు. ప్రజలను అణచివుంచేందుకు, వుద్యోగులను ఒక కంట కనిపెట్టివుంచేందుకు ఖోజ్జాల ఆధిపత్యం క్రింద రహస్య సర్వీసులను ఏర్పరచారు. ఖోజ్జాల ఏజెంట్లు దేశమంతటా తిరుగుతూ ప్రజలపైన తప్పుడుకేసులు బనాయించేవారు. ఒక కుటుంబం శిక్షింపబడితే ఇరుగు పొరుగువారినికూడ ఆ కేసులో ఇరికించేవారు; ఒక మనిషి జైలులో బంధించబడట మంటే హింసాకాండకు గురికావలసిందే. ఖోజ్జాలచేత నేరస్తులని ఎంచబడినవారు క్రూరాతిక్రూరమైన చిత్రహింసల పాలయ్యేవారు. అసంఖ్యాకులు ఖూనీ చేయబడ్డారు. ఎచటచూసినా భీభత్సం చెలరేగుతుండేది.

ఖోజ్జాలలో లియూచిన్ అనేవాడికి అందరికంటె ఎక్కువ పలుకుబడి వుండేది. చక్రవర్తికి బదులుగా వాడే విజ్ఞాపనలకు సమాధానాలను తయారు చేసేవాడు. మంత్రులుసైతం వాడి దయకొరకు ఎదురుచూసేవారు. ప్రజలను దోచుకుని వాడు సేకరించిన ధనం 20 లక్షల బంగారు నాణాల దండలకు, 5 కోట్ల వెండి నాణాల దండలకు పైగా వుంది.

ఆఖరిదశలో మింగ్ చక్రవర్తులలో ఒకడు ఇరవై సంవత్సరాల పర్యంతం తన మంత్రులను కలసికోలేదనీ, ప్రతి విషయాన్ని ఖోజ్జాలకే వదలివేశాడనీ తెలుస్తుంది. వీ చుంగ్-హ్సీన్ అనే అత్యంత క్రూరుడైన ఖోజ్జా లంచగొండులతో కలిసి చక్రవర్తి దర్బారులోని తన ప్రత్యర్థులందరినీ ఖూనీచేయించాడు. స్థానికోద్యోగులంతా దాదాపు అతడి ఏజెంట్లే.

పరిశ్రమలు, వ్యాపారం పెరగడంతోపాటు పరిశ్రమలపైన, వర్తకంపైన విధించే పన్నుల మొత్తం, స్థాయి పెరిగింది. పన్నులు వసూలుచేసే నిమిత్తం విశేషాధికారాలతో ఖోజ్జాలు పెద్ద నగరాలకు పంపబడేవారు. పన్ను వసూళ్ళ సాకుతో ప్రజల ఆస్తులను కాజేయడం, అరెస్టుచేయడం, చంపించడం సర్వసాధారణంగా జరిగిపోయేది. ఇందువల్ల వ్యాపారం, పరిశ్రమలు చాల దెబ్బతిన్నాయి. పన్ను

వసూలుచేసే వుద్యోగుల నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పౌరులు తీవ్ర ప్రతిఘటనకు పూనుకోవలసివచ్చింది.

1601 లో పన్ను వసూలుచేసే ఒక ఖోజ్జా వుద్యోగి సూ చౌలో అనేక పన్ను వసూలు కేంద్రాలను వలయంమాదిరిగా స్థాపించాడు. పన్ను చెల్లించిన రశీదును తనిఖీచేసే సాకుతో దుండగుల దళాలను ప్రయోగించి ప్రతిచోటా చిక్కులు కలిగించేవారు. ఇతర ప్రాంతాల వర్తకులు సూ చౌ లో కాలిడటానికే భయపడ సాగారు. పట్టువస్త్రాలు నేసే కర్మాగారాలు చాలా ఉత్పత్తిని తగ్గించవలసి వచ్చింది. నేత కార్మికులు అనేకమంది నిరుద్యోగులై కరువు పాలయ్యారు. ఇన్ని జరిగినా లెక్కచేయకుండా వుద్యోగి మగ్గాలపై పన్నును పెంచాడు. మగ్గాలు యజమానికే చెందినప్పటికీ కార్మికుల శ్రమకు అవి ప్రాతినిధ్యం వహించుతాయి. కార్మికులు సమీకృతమై, శిక్షణగా వూరేగుతూ, పన్నులు తగ్గించాలని కోరారు. ఉద్యోగి వారి కోర్కెను నిరాకరించి, వూరేగింపును అణచివేయడానికి తన ఏజెంట్లను వుసికొల్పాడు. పర్యవసానంగా రెచ్చిపోయిన కార్మికులు రెవిన్యూ ఆఫీసును తగుల బెట్టారు. ఐతే మంటలు వ్యాపించకుండా చుట్టూ ప్రజలను జాగ్రత్త తీసుకోవలసిందిగా ముందుగానే హెచ్చరించారు.

షాంటుంగ్, కియాంగ్సూ, కియాంగ్సీ, హూపే, హునాన్, షెన్సీ, యున్నాన్ లలో యిలాంటి పోరాటాలే జరిగాయి.

## మింగ్‌పాలన ఆఖరి దశలో రైతుల యుద్ధం

మింగ్ ప్రభుత్వ చివరిదశలో పన్నులు విపరీతంగా పెరిగాయి; భూమి కేంద్రీకరణ ఎక్కువయింది. ప్రకృతి సిద్ధమైన విపత్తులు సంభవించితే రైతుల దారిద్ర్యం మరీ సహింపరానిదిగా తయారై కరువు పాలయ్యేవారు. 1628 లో షెన్సీ రాష్ట్రం ఉత్తరాన మొదలైన రైతుల తిరుగుబాటు త్వరగా రాష్ట్రమంతటికీ, తూర్పు కంసూకు వ్యాపించింది.

ఎల్లోనదిని దాటిన రైతుసైన్యం విప్లవజ్యోతిని యాంగ్‌ట్సీనది ఎగువ, మధ్య ప్రాంతాలకు వ్యాపింపజేసింది. ఏటేటా ఉద్యమం విస్తరించి శక్తివంతమయింది. మింగ్ ప్రభుత్వం గాభరాపడి విప్లవకారులను అరికట్టేందుకు వివిధ రాష్ట్రాలనుంచి తన సైన్యాలను పంపింది.

1635 లో వివిధ రైతుసైన్యాల నాయకులు హోనాన్‌రాష్ట్రంలోని ఇన్ గ్యాంగ్‌వద్ద సమావేశమయి, ఐక్య కార్యాచరణను గురించి చర్చించారు. మింగ్‌సేనల దృష్టిని మరల్చేందుకు పడమర, ఉత్తరాన, దక్షిణాన రక్షణ సన్నాహాలు చేశారు. ప్రధాన సైన్యాలను తూర్పున కేంద్రీకరించి దెబ్బకొట్టారు. మింగ్ ప్రభుత్వ వలయాన్ని బ్రద్దలుచేసి, రైతుసేనలు తుపానువలే ముందుకుసాగి, పక్షంరోజుల్లో ఫెంగ్‌యాంగ్, అన్‌హ్వీయ్ రాష్ట్రాలను స్వాధీనం చేసుకుంది.

1636 లో లీ ట్సే-చెంగ్ నాయకత్వాన రైతుసేన షెన్సీ, కంసూ, హోనాన్ రాష్ట్రాలలో చర్యలు కొనసాగించింది. చాంగ్ హ్సియెన్-చుంగ్ నాయకత్వాన మరొక రైతుసేన హూపే, జేచివాన్ రాష్ట్రాలలో మింగ్ ప్రభుత్వ సైన్యాలతో పోరాటం సాగించింది.

1640 నాటికి హోనాన్ రాష్ట్రంలో వున్న లీ ట్సే-చెంగ్ సైన్యం లక్షల బలగాన్ని చేకూర్చుకుంది. "బీదల, భాగ్యవంతుల మధ్య భూమిని సమానంగా పంచాలనే" నినాదాన్ని లీ యిచ్చాడు. ఐదేళ్ళవరకు (ధాన్యసేకరణ వాయిదా వేస్తామని) ధాన్యపు వసూళ్ళను ఆపుచేస్తామని వాగ్దానం చేశాడు. బీదలకు ధాన్యం, డబ్బు పంచాడు. రైతు సైన్యం వెళ్ళిన ప్రతిచోటా ప్రజలు స్వాగతమిచ్చారు. పౌరులయిళ్ళలో దిగరాదనీ, వెండి, బంగారాలను కలిగివుండరాదని సైనికులను లీ నిషేధించాడు. పంటచేలను తొక్కించి పాడుచేసిన మరణశిక్ష విధించబడేది.

నాలుగు సంవత్సరాల అనంతరం లీట్సే-చెంగ్ తన సేనలను సియాన్‌నుంచి పెకింగ్‌వైపు నడిపించాడు. మింగ్ ప్రభుత్వ దుశ్చర్యలను బట్టబయలుచేస్తూ దారి పొడుగునా ప్రకటనలు చేయించాడు. రైతుసేనల అధీనంలోవున్న ప్రాంతంలో ఐదేళ్ళవరకు ప్రభుత్వ ధాన్యసేకరణ వుండదనీ, స్త్రీ పురుషులెవరూ తమ రక్షణ విషయమై భయపడనక్కరలేదనీ, క్రయ విక్రయాలు సమాన ప్రాతిపదికపై జరుగుతాయనీ ప్రకటించాడు.

ఎల్లోనదిని దాటి రైతు సైన్యం త్వరలోనే తాయువాన్ పట్టుకుంది. నెల రోజుల్లోనే టా టుంగ్‌ను పట్టుకుని, చుయుంగ్ క్వాన్ కనుమను ఎట్టి ప్రతిఘటన లేకుండానే అధిగమించింది. మింగ్ సైనికులు అధికసంఖ్యలో రైతు సైన్యంలో చేరారు. అవినీతిలో మునిగివున్న మింగ్ పాలకులు ఆఖరి నిమిషంలో కళ్ళుతెరచి పెకింగ్ నగరాన్ని రైతు సేనలు చుట్టుముట్టిందని తెలిసికున్నారు. నగర రక్షణ సైనికులు పోరాడ నిరాకరించారు.

లీట్సే-చెంగ్ గుర్రంపై ముందుండి ఆధ్వర్యం వహించగా రైతుసైన్యం రాజధానిలో ప్రవేశించింది. నగరంలోవున్న కొండపై మింగ్ చక్రవర్తి ఆత్మహత్య చేసుకున్నాడు. దీనితో మింగ్‌వంశ పరిపాలన అంతమయింది. మింగ్‌పరిపాలన చివరి దశలో పదిహేడు సంవత్సరాలు కొనసాగిన రైతుయుద్ధం చైనా చరిత్రలోనే అపురూపమైనది.

# 35వ అధ్యాయం

# మంచూల విజృంభణ

భాగ్యవంతమైన ప్రకృతి వనరులు గల చాంగ్‌పాయ్ పర్వతాలలో మింగ్ పరిపాలనక్రింద నివసించే నూ చెన్ తెగ ప్రజలనే మంచూలని పిలుస్తారు. బొచ్చు కొరకు నల్ల నక్కలను వేటాడటం, అడవుల్లో జిన్‌సెంగ్ అను మూలిక త్రవ్వడం, ముతాంక్యాంగ్ నదిలో ముత్యపు చిప్పలు పట్టడం నూ చెన్ ప్రజల వృత్తులు. వారు పశువులనుకూడ పెంచేవారు. గుర్రాలను, ముత్యాలను మారకం యిచ్చి హాన్ ప్రజల నుండి ధాన్యం, బట్టలు, ఇనుప పనిముట్లు తెచ్చుకునేవారు.

నూచెన్లు గ్రామీణ ప్రాంతాలలో నివసించేవారు. యుద్ధానికిగాని, వేటకు గాని వెళ్ళేటపుడు కుటుంబాలుగా లేక జనపదాలుగా సంఘటితమయ్యేవారు. భూమి వ్యక్తుల స్వంత ఆస్తిగా వుండి, హాన్ బానిసలచేత పనిచేయించేవారు. మట్టి తోను, లేక కొయ్యలతోను నిర్మించుకున్న కోటలలో తమ సంపదను దాచుకునేవారు.

నూచెన్ నాయకుడైన నుర్‌హాచు పిన్నవయస్కుడై వుండగా ఫుషూన్‌కు వెళ్ళి హాన్ వర్తకులనుండి హాన్ భాష మాట్లాడటం, వ్రాయడం నేర్చుకున్నాడు. తరువాత నూచెన్ తెగలన్నిటినీ ఐక్యపరచాడు. 1616 లో తన వంశానికి కిన్ వంశ బిరుదును స్వీకరించి, ఖాన్‌గా ప్రకటించుకున్నాడు.

తన రాజ్య పౌరులను ఎనిమిది జెండాలక్రింద సంఘటితపరచి, వారి నాయకులు ప్రభుత్వ పరిపాలనలో పాల్గొనాలని నూర్‌హాచు నిర్ణయించారు. సభ్యులు శాంతి సమయంలో ఉత్పత్తిలో పాల్గొంటారు: యుద్ధసమయంలో సైనికులుగా పోరాడు తారు. ప్రభుత్వాని కంతటికీ నూర్‌హాచు సార్వభౌముడుగా వ్యవహరించుతాడు.

నూర్‌హాచు ఎనిమిది జండాలక్రింద 60 వేల సైన్యాన్ని సమీకరించి మింగ్ ప్రభుత్వ సేనలను సార్‌హూ పర్వతంవద్ద ఓడించి తూర్పు లియోనింగ్‌ను క్రమంగా ...మించాడు. తరువాత పశ్చిమ లియోనింగ్ పైకి దాడివెళ్ళి, నింగ్‌యువాన్ నగర ...మింగ్ సైన్యంతో భీకరయుద్ధం చేశాడు. నగర రక్షణను ప్రసిద్ధ మింగ్ ...ంగ్-హువాన్ చాకచక్యంగా నిర్వహించాడు. యుద్ధరంగంలో ...న్ యాంగ్‌కు తిరోగమనం ... మరణించాడు.

నూర్హాచు కొడుకు హాంగ్తైచి అధికారానికి వచ్చాక, హాన్ జాతివారిని బానిసత్వంనుండి విడుదలచేశాడు. హాన్ ఉద్యోగుల పాలనక్రింద పౌరుల కుటుంబాలుగా సంఘటిత పరచాడు. జెండాల నాయకుల అధికారాలనుకూడ అతడు క్రమంగా తగ్గించాడు. వివిధ మంగోల్ తెగలను జయించి, 1696 లో తనను చక్రవర్తిగా ప్రకటించుకున్నాడు. "చింగ్" వంశ బిరుదును స్వీకరించి, జాతి పేరును నూచెన్ కుబదులు మంచుగా మార్చుకున్నాడు.

హాంగ్తైచి చైనాగోడకు లోపలనున్న మంగోలియాను ఆక్రమించాడు. మంచూ సైన్యాలు అనేకసార్లు చైనాగోడను దాటి, చైనాపై దాడిచేసి, దక్షిణ హోపీ షాంటుంగ్ లవరకు చొచ్చుకు వెళ్ళారు. ఒక దాడిలో 2 లక్షల 60 వేల మనుష్యులను, 5 లక్షల 50 వేల పశువులూ, గుర్రాలను ఎత్తుకుపోయారు. దోచుకున్న సంపదతో నిండిన బళ్ళవరుస ముప్పది లీల పొడుగువుంది.

రైతు సేనకు నాయకుడైన లీట్సీ-చెంగ్ 1640 లో పెకింగ్ నగరంలో ప్రవేశించాక, మంచూ దురాక్రమణకు వ్యతిరేకంగా షాన్ హైకువాన్ కనుమలవద్ద తన సైన్యాలతోవున్న మింగ్ సేనాని వూ సాన్-కీతో ఉమ్మడి ప్రతిఘటనకు కలసి రమ్మని రాయబారాలు జరిపాడు. కాని లీట్సీ-చెంగ్ ఆహ్వానాన్ని వూ తిరస్కరించాడు. ఉమ్మడి ప్రతిఘటనకు కలసిరాకపోగా, రైతు సైన్యాలకు వ్యతిరేకంగా మంచూ దురాక్రమణదార్లతో చేతులు కలపడానికి సిద్ధమయ్యాడు.

వూ ద్రోహం బయటపడగానే అతనితో ఢీకొనడానికి లీట్సీ-చెంగ్ రెండు లక్షల సేనతో షాన్ హైకువాన్ కనుమవద్ద వెళ్ళాడు; కాని ఆకస్మికంగా మంచూ సైన్యాలు మరొకవైపునుంచి లీ పైకి ఉపక్రమించాయి. రెండువైపులనుండి ఒత్తిడివల్ల రైతు సైన్యం తిరోగమించడం తప్పనిసరయింది.

సియాన్ కు ఉపసంహరించాక లీ ట్సీ-చెంగ్ తన ప్రతిఘటనను కొనసాగించాడు. 1644 మే నెలలో మంచూలు రాజధాని పెకింగ్ ను పట్టుకున్నారు. మింగ్ ప్రభుత్వాధికారులు, భూస్వాములు మంచూల బూట్లను నాకడానికి తయారయ్యారు. రైతు సైన్యంపైకి సాయుధ దళాలను పంపడానికి పూనుకున్నారు. 1645 లో మంచూ సైన్యాలు సియాన్ పైకి దాడివెడలాయి. రైతు సైన్యం హ్సియాంగ్యాంగ్ కు తిరోగమించింది. తరువాత హూపేలో భూస్వాముల సాయుధ సేనలు లీ ట్సీ-చెంగ్ ను చంపాయి.

లీ ట్సీ-చెంగ్ మరణానంతరం అతడి అనుచరులు మంచూలపై పోరాటాన్ని కొనసాగించారు.

## దక్షిణ చైనాలో మంచూ వ్యతిరేక పోరాటం

పెకింగ్ లో లీ ట్సే-చెంగ్ ప్రవేశించాడనే వార్త చేరగానే మింగ్ వంశానికి చెందిన ఒకడిని సింహాసన మెక్కించి, మింగ్ గించడానికి ప్రయత్నిస్తారు. శిథిలావస్థలోవున్న మిం



నుంచి స్వీయరక్షణయెడ ఎలాంటి శ్రద్ధను కనపరచలేదు. మంత్రులందరిలో షి-కో-ఫా మాత్రమే ప్రతిఘటించి తీరాలని వాదించాడు. యాంగ్ చౌ రక్షణకు, యాంగ్‌ట్సీ నదికి ఉత్తరంగా వున్న సేనలకు అతడు ఆధిపత్యం వహించాడు.

మింగ్ సైన్యాలకు సంఖ్యాబలం వుంది; కాని సేనానులమధ్య తగాదాలున్నాయి. వీటి ఫలితంగా షి-కో-ఫా వేసిన రక్షణవ్యూహం భగ్నమయి, మంచూ సేనలు త్వరలోనే యాంగ్ చౌ నగరాన్ని చుట్టుముట్టాయి. సైన్యానికి యాంగ్ చౌ పౌరులకు నాయకత్వం వహించి షి-కో-ఫా వీరోచిత ప్రతిఘటన నిర్వహించాడు. ఏడురోజులు రాత్రింబవళ్ళు పోరాడాక పట్టుకోబడ్డారు. షి-కో-ఫా ఖైదీగా బంధింపబడినా, లొంగుబాటు చూపనందున మంచూలచేత చంపబడ్డాడు.

మంచూ సైన్యం యాంగ్‌ట్సీ నదిని దాటాక నాంకింగ్‌లోని మింగ్ ప్రభుత్వోద్యోగులు పారిపోవడమో, లొంగిపోవడమో జరిగింది. కియాంగ్సూ, ఉత్తర చెకియాంగ్‌లను త్వరగా మంచూలు ఆక్రమించారు. ప్రతివాడు నెత్తిమీద జుట్టును జడవేసేందుకు వీలుగా వదలి, తక్కినదాన్ని నిర్ణయించిన పద్ధతిలో కత్తిరించుకోవాలని మంచూ ప్రభుత్వం శాసించినందున తిరుగుబాటు జ్వాలలు ప్రజ్వలించాయి.

ప్రజలు తమ వ్యతిరేకతను బహిరంగ పోరాటంద్వారా వ్యక్తపరచారు. కియాంగ్సూ రాష్ట్రంలోని కియాంగ్సిన్, చియాటింగ్ ప్రజలు ఈ విషయంపై యుద్ధానికి తలపడ్డారు; 4 లక్షల 20 వేల మంచూ సేనలను ఎదిరించి, పౌరులందరూ ఆహుతయ్యేవరకు 81 రోజుల పర్యంతం కియాంగ్సిన్ ప్రజాప్రతిఘటన సాగింది. చియాటింగ్ పౌరులుకూడ రెండు నెలలకు పైగా పోరాడారు. ఇచటకూడ పెద్దయెత్తున హత్యలు జరిగాయి.

చెకియాంగ్, ఫూకీన్ రాష్ట్రాలలో కొంత భాగాన్ని మంచూలు ఆక్రమించాక దురాక్రమణదారులకు వ్యతిరేకంగా ప్రజాపోరాటం కొనసాగింది. చాంగ్ హువాంగ్-యెన్ నాయకత్వాన, చెంగ్ చెంగ్-కుంగ్ నాయకత్వాన వున్న మింగ్ సైన్యాలు చౌషాన్‌దీవుల్లోనూ, చిన్‌మెన్ అమోయ్‌లలోనూ వరుసగా వుండి, ప్రతిఘటన కొనసాగించాయి.

1659 లో లక్షమందికి పైగా సైన్యాన్ని సమీకరించుకొని, యాంగ్‌ట్సీనదిలో వేలకొలదీ పడవలపై ఈ సేనానులు బయలుదేరివచ్చారు. నాంకింగ్‌వరకు నదీ ప్రయాణంచేసి, నగరాన్ని చుట్టుముట్టారు. తరువాత చాంగ్‌హువాంగ్-యెన్ నాయకత్వాన ఒక సైన్యం దక్షిణ ఆన్‌హ్వీయ్‌పై దాడి వెడలింది. ఎచటికివెళ్ళినా ప్రజలు మాంసం, ద్రాక్షసారాయితో ఆహ్వానించారు. యాంగ్‌ట్సీనదిగట్టులపైవున్న నాలుగు ప్రీఫెక్చరు (ప్రాంతం) మూడు ఉప ప్రీఫెక్చర్సు 24 జిల్లాలు వీరికి సహాయంగా తిరుగుబాటు చేశాయి.

ఐతే మంచూ సైన్యం తాకిడివల్ల చెంగ్ చెంగ్-కుంగ్ సైన్యం యాంగ్‌ట్సీనది నుంచి తిరోగమించి, చిన్‌మెన్ అమోయ్‌లకు తిరిగి పోవలసివచ్చింది.

కొన్ని సంవత్సరాల అనంతరం మంచూలు చాంగ్ హువాంగ్ ఎన్‌ను పట్టుకొని చంపివేశారు.

## తాయివాన్ అభివృద్ధి

ప్రాచీనకాలంనుంచి తాయివాన్ దీవి చైనాదేశంలో భాగంగా వుంటూంది.

మూడవ శతాబ్దంనాటికే హాన్ ప్రజలు తాయివాన్ దీవికి వెళ్ళి, కావోషాన్ ప్రజలతో కలసి చెమటోడ్చి, భూమిని బాగుచేశారు. దక్షిణ సుంగ్, యువాన్ వంశాల హయాంలో చైనా ప్రభుత్వం పంపిన వుద్యోగులే తాయివాన్‌ను పరిపాలించేవారు. 1624 లో డచ్‌వాళ్ళు తాయివాన్ దీవిలో ఒక భాగాన్ని ఆక్రమించారు. తాయివాన్ ప్రజలు ఎదురు తిరిగి, దురాక్రమణదారులకు వ్యతిరేకంగా నిరంతర పోరాటం సాగించారు. 1661లో చెంగ్ చెంగ్-కుంగ్ వందలకొలదీ పడవలపై 25 వేల సేనతో సముద్రాన్ని దాడివెళ్లి డచ్‌వాళ్ళను ఓడించాడు. మరుసటి సంవత్సరం డచ్‌వాళ్ళు లొంగిపోయారు.

ఆ కాలంలో కోయ్‌షాన్ ప్రజలకు వ్యవసాయంలో ఎద్దుల ఉపయోగం తెలియదు. కొడవలి, తవ్వగాలు, నాగలి ఉపయోగం ఎరుగరు. చెంగ్ చెంగ్-కుంగ్ ఆయన వారసులు ఎద్దులను, ఇనుప పనిముట్లను స్థానిక ప్రజలకు పంచిపెట్టి, వాటి ఉపయోగాన్ని అలవరచి, తాయివాన్‌లో వ్యవసాయాన్ని అభివృద్ధిచేశారు. పాఠశాలలు స్థాపించి, కోయ్‌షాన్లు పిల్లలను చదివించేందుకు ప్రోత్సహించారు. అభివృద్ధిచెందిన టెక్నిక్ అలవరచుకోవడంవల్ల కోయ్‌షాన్ల జీవనస్థాయి, సంస్కృతీ పెరిగింది. చెంగ్ చెంగ్ - కుంగ్, ఆయన వారసులు హాన్ ప్రజలతో సమానంగా కోయ్‌షాన్ ప్రజలను పరిగణించి, వారి ప్రయోజనాలను కాపాడారు.

ఇరవై సంవత్సరాల వరకు మంచూ ప్రభుత్వాన్ని తాయ్‌వాన్ ప్రజలు గుర్తించక నిరాకరించారు. ఐనప్పటికీ 1681 లో తాయ్‌వాన్ దీవిని మంచూ ప్రభుత్వం ఆక్రమించుకుంది.

లీ ట్సీ-చెంగ్ మరణానంతరం హ్యునాన్‌లో అతని అనుచరుడైన లీ చిగ్ 3 లక్షల సైన్యానికి నాయకత్వం వహించాడు. అచటి మింగ్ సేనాని అయిన హో టెంగ్-చియావ్ రైతు సైన్యంతో సహకరించడానికి ఒప్పుకున్నారు. అతని సేనాధిపత్యం అంగీకరించి, మంచూలకు వ్యతిరేకంగా ప్రతిఘటనను బలపరచుకున్నారు.

రైతు సైన్యం హ్యూనాన్‌లో మంచూలను ఓడించి క్వాంగ్సీ, హ్యూపే యుద్ధాలను జయించింది.

ఐతే కొందరు మింగ్ సేనానులు రైతు సైన్యంతో సహకరించడానికి బదులు వ్యతిరేకించారు. మంచూ వ్యతిరేక ఐక్యసంఘటనను బలహీనపరచారు. హో టెంగ్-చియో యుద్ధరంగంలో మరణించాడు.



డచ్చివారి లొంగుబాటును చెంగ్ చెంగ్ - కుంగ్ అంగీకరిస్తున్న దృశ్యాన్ని చూపే చిత్రం

లీ చిన్ కొడుకైన లీ లై-హెంగ్ నాయకత్వాన రైతుసైన్యం జేచివాన్, హూపే రాష్ట్రాల కొండల ప్రాంతాలలోకి తరలివెళ్ళింది. అచటి బంజర్లను సాగులోకి తెచ్చి, తనకవసరమైన ఆహారధాన్యాలను పండించుకుంది. పది సంవత్సరాలకు పైగా రైతుసైన్యం కొండ ప్రాంతాలలోనే వుండిపోయింది. మంచూ సేనలు నిరంతరం వారిని యాతనపెడుతూ, 1664 లో రైతు సేనల బలమైన కేంద్రంగా వున్న మావ్ లూ పర్వతాన్ని చుట్టుముట్టడించారు. తరువాత జరిగిన భీకరయుద్ధంలో రైతు సైన్యం అణచివేయబడింది.

ఉత్తర జేచివాన్‌లో మంచూలతో జరిగిన భీకరయుద్ధంలో చాంగ్ హీస్వియెన్-చుంగ్ చనిపోయాడు. చాంగ్ హీస్వియెన్-చుంగ్ అనుయాయుడైన లీటింగ్-క్వుహోవ్ నాయకత్వాన రైతుసైన్యం యున్నాన్, క్వీచౌ రాష్ట్రాల్లోకి తిరోగమించింది. 1651 లో క్వ్యాయిూవాంగ్ యువరాజు రైతుసైన్యంతో కలసి, మంచూలకు వ్యతిరేకంగా ఐక్యసంఘటన ఏర్పరచడానికి అంగీకరించాడు. తరువాత ఎదురుదాడి చేసి, క్వాంగ్సీ, దక్షిణ హునాన్‌లను పునరాక్రమించుకున్నాడు.

పది సంవత్సరాలకు పైగా ఆగ్నేయప్రాంతంలో రైతుసైన్యం తన కాళ్ళమీద తాను నిలబడింది. ద్రోహియైన మింగ్ సేనాని వూసాంకుయి ఆధ్వర్యాన మంచూసేన వారిపై అనేకసార్లు దాడిచేసింది. రైతుసేన ఎదిరించి పోరాడింది.

కాని చివరకు పశ్చిమయున్నాన్ సరిహద్దుకు నెట్టబడింది.

1662 లో కుయిూవాంగ్ యువరాజును వూసాంకుయిూ ఖూనీచేయించాడు. ఈ సంగతి తెలిసి లీటుంగ్-క్వ్యా విచారం, కోపంతో ఆహారం నిరాకరించి, మరణించాడు.

36 వ అధ్యాయం

# నల్లమందు యుద్ధానికి పూర్వం : చింగ్ (మంచూ) వంశ పరిపాలన

## చింగ్ పాలన ఆరంభదశలో వ్యవసాయం, చేతిపరిశ్రమలు, వర్తకం

దీర్ఘ కాలం జరిగిన యుద్ధం వలన కొత్త ప్రభుత్వం ఆర్థికంగా చిక్కు పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. చాల సారవంతమైన భూములు పాడుపడ్డాయి : భాగ్యవంతమైన చాలా నగరాలు శిథిలావస్థకు దిగజారాయి. జనాభా చాలా తగ్గిపోయింది. ఆదాయం తక్కువైనందున మంచూ ప్రభుత్వం మక్తాలను, పన్నులను పెంచింది. కాని రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు "భూమిని దున్నడానికి ఎవరూ సిద్ధపడటంలేదనీ, మక్తాలను, పన్నులను పెంచడం అసంభవమనీ" నివేదించారు.

రైతులనుంచి, ప్రజలందరినుంచి ప్రతిఘటన వస్తున్నదన్న, ఆర్థిక చిక్కులవలన మంచూ ప్రభుత్వం రాజీ విధానాన్ని అనుసరించవలసివచ్చింది. మింగ్ ప్రభుత్వ ఆఖరి దశలో విధించబడిన వెట్టిచాకిరీని, అక్రమ పన్నులను కొత్త ప్రభుత్వం రద్దుచేసింది. పడావు భూముల సాగును ప్రోత్సహించింది. 1712 లో ప్రభుత్వం జారీచేసిన ప్రకటన ప్రకారం తదనంతరం పుట్టేవారిపై తలపన్ను విధించబడదు. తరువాత తల పన్నును భూమిశిస్తులో కలిపివేశారు దీనిని "భూమి - తల డబ్బు" అని పిలచేవారు. ఇందువల్ల ప్రజలు వెట్టిచాకిరినుంచి, భూమిలేని రైతులు మక్తానుంచి విముక్తులయ్యారు.

పడావు భూములను రైతులు సాగుచేయడం ప్రారంభించారు. ప్రత్తి, పొగాకు చెరుకు పండించేందుకు మింగ్ కాలంలో కంటే ఎక్కువ భూమిని వినియోగించారు. జనాభా క్రమంగా పెరిగి, పందొమ్మిదవ శతాబ్దం మధ్యకాలానికి 40 కోట్లు వుంటుందని అంచనా వేయబడింది. చరిత్రలో అదివరకెపుడూ లేనంతగా పెరిగింది.

దక్షిణ కియాంగ్సూ పట్టువస్త్ర పరిశ్రమకు కేంద్రంగా వుండేది. నాంకింగ్ నగరం ఒకదాన్లోనే 50 వేల మగ్గాలుండేవి. ఒక కర్మాగార యజమాని స్వాధీనంలో 600 మగ్గాలుండేవి. ఇంతేగాక వారు పట్టునూలును చిన్న నేత పారిశ్రామికులకు సప్లయి చేసేవారు. సూచౌలో 10 వేలకు పైగా మగ్గాలుండేవి.

దక్షిణ కియాంగ్సూ, చెకియాంగ్‌లలో నూలివస్త్రాల పరిశ్రమ కూడ అభివృద్ధి చెందింది. ఉత్పత్తిదారులనుండి తాము కొన్న ప్రత్తిని వర్తకులు రైతు కుటుంబాలకు, చేతిపనివారికి అందజేసేవారు. తరువాత తయారైన బట్టను వర్తకులు కొనేవారు.

క్వాంగ్ టుంగ్‌లోని ఫూషాన్ ఇనుము పరిశ్రమ కేంద్రంగా వుండేది. అచట ఇనుము కరగించే బట్టీలు వందకు పైగా వుండేవి. ఇనుపరేకులు పెద్ద సంఖ్యలో ఉత్పత్తి అయ్యేవి. డజను మొదలు వందమందికి పైగా కార్మికులు పనిజేసే కర్మాగారాలుండేవి. వాటిలో మేకులు. సూదులు, తీగ వగైరా యినుప సామాగ్రి పెద్దయెత్తున తయారు చేయబడేవి.

యున్నాన్‌లో ఖనిజ పరిశ్రమ అభివృద్ధి చెందింది 18 వ శతాబ్దంలో రాగి వుత్పత్తి 400 టన్నులనుంచి 6000 టన్నులకు కొలది దశాబ్దాలలోనే పెరిగింది. 19 వ శతాబ్దారంభంలో ఏటా 170 వేల వెండి నాణాలు ఉత్పత్తి అయ్యేవి.

మింగ్ పరిపాలనలోకంటే వర్తకం త్వరగా జరిగేది. హోనాన్‌లో పండిన ప్రత్తి కియాంగ్సూ చెకియాంగ్‌లకు రవాణాఅయి, అచట బట్టలు నేయబడేవి. హూచౌనుంచి పట్టునూలు పడవలపై హాంగ్‌చౌ, నాంకింగ్‌లకు రవాణా అయ్యేవి. అచట నేయబడిన పట్టువస్త్రాలు దూరాన ఈశాన్యంగా వున్న లియోనింగ్‌లోనూ, ఉత్తరంగావున్న కంసూలోనూ, ఆగ్నేయంగావున్న యున్నాన్‌లోనూ అమ్మకమ్యేవి. చాంగ్‌చుయా, పొంటుంగ్‌లలో తయారైన ఇనుపసామగ్రి ఎల్లోనది యాంగ్‌ట్సీనది దిగువప్రాంతాలలోనూ, చాలాదూరాన వున్న ఈశాన్యప్రాంతంలో కూడ అమ్మకమయ్యేవి.

చేతిపరిశ్రమలు, వర్తకం అభివృద్ధి చెందినప్పటికీ, అంకురించుతున్న పెట్టుబడిదారీ విధానం పెరుగుదలకు ఫ్యూడల్ సమాజవ్యవస్థ తీరని ఆటంకంగా తయారైంది. భూస్వాములచేత నిర్దాక్షిణ్యంగా దోచుకోబడుతున్న రైతుల కొనుగోలుశక్తి చాల తక్కువగా వుంది. దీనికితోడు పరిశ్రమలపైన, వర్తకం పైన భారమైన పన్నులను విధించుటద్వారా మంచూ ప్రభుత్వం చేతిపరిశ్రమల కర్మాగారాల విస్తరణను అరికట్టింది. దీని పర్యవసానంగా భాగ్యవంతులైన వర్తకులు, చేతి పరిశ్రమల కర్మాగారాల యజమానులు ఉత్పత్తిని పెంచేందుకు పెట్టుబడిగా తమ ధనాన్ని వినియోగించే బదులు, భూమిని కొని భూస్వాములయ్యేందుకు సివిల్ పరీక్షల్లో పాల్గొని ప్రభుత్వాధికారులుగా తయారయ్యేందుకు ప్రయత్నించేవారు.

## టిబెటన్లు, మంగోల్‌లు, ఉయ్‌గుర్లు

సాంగ్‌ట్సాన్ గాంబో కాలంనాటి నుంచి టిబెటన్లు బౌద్ధమతావలంబకులు. శాక్యుల గ్రాండ్ లామా అయిన పాస్పాను టిబెట్ సామంతరాజుగా కుబ్లాయిఖాన్ చేశాడు. టిబెట్ రాజకీయ, మతవ్యవహారాలన్నిటికి ఆధిపత్యం వహించి పరిపాలించే హక్కు అతనికేవుంది. అనుచరులంతా ఎర్రరంగు టోపీలను, చొక్కా

లను ధరించినందున "ఎర్రశాఖ"ని పిలువబడే బౌద్ధమతశాఖకు అతడు నాయకుడుగా వుండేవాడు.

పదిహేనవ శతాబ్దంనాటికి ట్సాన్-ఖా-పా అను మతగురువు తూర్పు టిబెట్‌లో "పసుపుశాఖ"ను ప్రారంభించాడు. తరువాత ప్రథమ శిష్యులైన దలై, పంచన్‌లు లాసాలో వుంటూ పసుపుశాఖకు నాయకులయ్యారు.

పదిహేడవ శతాబ్దంలో పసుపుశాఖ అనుయాయుల సంఖ్య పెరిగి, ఎర్రశాఖ పలుకుబడిని తొలగించి, పశ్చిమ టిబెట్‌లోకూడ ప్రాబల్యం సంపాదించింది. పశ్చిమ టిబెట్‌లోని టాషీ - లంపోకు పంచన్ తరలి వెళ్ళాడు.

1716 చలికాలంలో మంగోలియాలోని జుంగార్ తెగ టిబెట్‌పై దాడిచేసింది. లాసాలోనికి చొచ్చుకు వచ్చారు. చింఘాయ్, జీచివాన్ రాష్ట్రాలనుండి మంచూ ప్రభుత్వ సేనలు టిబెట్‌లో ప్రవేశించి, జుంగార్లను పారదోలాయి. తరువాత మంచూప్రభుత్వం టిబెట్‌లో కమిషనర్ను నియమించింది. రాజకీయ వ్యవహారాలను అతడే పరిపాలించుతుండేవాడు.

ఎడారికి దక్షిణవైపున నివశించుతున్న మంగోల్ తెగలను పదహారవ శతాబ్దం మధ్యకాలంనుంచీ ఇన్నర్ మంగోలియన్ తెగలని పిలిచేవారు. చింఘాయ్, టీయెన్ షాన్ పర్వతాలకు ఉత్తరంగా నివశించే మంగోల్ తెగలను ఔటర్ మంగోలియన్ తెగలని పిలిచేవారు.

షాన్‌హాయ్‌కువాన్ కనుమలో ప్రవేశించకముందే మంచూ సేనలు ఇన్నర్ మంగోలియాను స్వాధీనంచేసుకుని, దానిని 8 జెండాల పరిపాలనక్రింద విభజించారు.

ఔటర్ మంగోలియాలోని జుంగర్ తెగ ఇలీనది లోయలో నివశించుతుండేది. పదిహేడవ శతాబ్దం మధ్యకాలంలో జుంగర్ తెగ నాయకుడు ఔటర్ మంగోలియాలోని ఇతర తెగలను కలుపుకొని బలం సంపాదించి, టీయెన్‌షాన్ పర్వతాలకు దక్షిణ ప్రాంతాన్ని ఆక్రమించాడు.

టిబెట్‌నుంచి జుంగర్లను పారదోలాక, కొన్ని సంవత్సరాల అనంతరం మంచూ సేనలు టీయెన్‌షాన్ పర్వతాలకు ఉత్తర ప్రాంతంపై దాడిచేశాయి. యుద్ధం సంవత్సరాల తరబడి కొనసాగేక చివరకు శాంతి ఏర్పడింది. పద్ధెనిమిదవ శతాబ్దం మధ్యలో జుంగర్లు అంతర్యుద్ధంలో చిక్కుకున్నారు. తదవకాశాన్ని వినియోగించుకుని మంచూ ప్రభుత్వం సైన్యం దాడిచేసింది. 1757 లో టీయెన్‌షాన్ పర్వతాలకు ఉత్తర ప్రాంతాన్ని ఆక్రమించుకుంది.

ఉయ్‌గర్లు ముస్లిం మతావలంబకులు. పదకొండవ శతాబ్దంలో దేశ దిమ్మరి జీవితాన్ని వదలి, టీయెన్‌షాన్ పర్వతాలకు దక్షిణ ప్రాంతంలో వ్యవసాయం పశువుల పెంపక వృత్తులను చేబట్టారు.

పదిహేడవ శతాబ్దం మధ్యలో జుంగర్లు టీయెన్‌షాన్ పర్వతాలకు దక్షిణ ప్రాంతాన్ని ఆక్రమించుకుని, ఉయ్‌గర్లను లొంగదీసుకున్నారు.

జుంగర్లను ఓడించిన తర్వాత ఉయ్‌గర్లనుండి కప్పం వసూలుచేయాలని మంచూలు ప్రయత్నించారు. కాని ఉయ్‌గర్లు నిరాకరించారు. దానిపై మంచూలు దాడిచేసి, రెండు సంవత్సరాల యుద్ధానంతరం ఉయ్‌గర్లను ఓడించి, టియెన్‌షాన్ పర్వతాలకు దక్షిణ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్నారు.

## అనేక జాతులపై చింగ్ వంశ పరిపాలన

విశాలమైన చింగ్ సామ్రాజ్యంలో అనేక జాతులు - హాన్, మంచూలు, మంగోల్‌లు, హుయీ, టిబెటన్లు, ఉయ్‌గర్లు, మియావ్, లీ, చువాంగ్, కోవషాన్... వగైరా - నివసించుచుండేవి. వారు వేర్వేరు భాషలను మాట్లాడుతూ, వేర్వేరు అలవాట్లు సంప్రదాయాలు కలిగివుండేవారు. మంచూ ప్రభుత్వం ఏర్పరచిన ఐక్య పరిపాలన ఫలితంగా వివిధ జాతులమధ్య ఆర్థిక సాంస్కృతిక సంబంధాలు ఏర్పడి మార్పులకు అనుకూల పరిస్థితులు ఏర్పడ్డాయి. కాని రాజకీయంగా మంచూ ప్రభుత్వం, చైనాలోని మంచూలు కాని యితర జాతులపై అతిక్రూరమైన నిర్బంధ విధానాన్ని అమలుజరిపేది. వారికి సమాన హక్కులను తృణీకరించేది.

మంచూ సైనికులను నిలిపిన కేంద్రాలలో రైతులను వారు సాగుచేసే భూముల నుండి తొలగించి, ఆ భూములను ఎనిమిదిజెండాల ప్రభువులకు కొంతభాగం, సైనికులకు మరికొంతభాగం పంచేవారు. హాన్ ప్రజలచేత భూమిని దున్నించి, మక్తాలు వసూలు చేసుకునేవారు. మంచు ప్రభుత్వ ఉద్యోగుల నిరంకుశత్వం క్రింద అన్ని జాతుల రైతుల జీవితం నానాటికి మరింత దుర్భరమయింది. ఉయ్‌గర్లనుంచి భూమిశిస్తును, ధనాన్ని, సంపదను మంచు పరిపాలకులు గుంజేవారు. దీనికితోడు ఎంతో రాగిని, తివాసీలను, బంగారాన్ని, స్ఫటికాలను ప్రతి సంవత్సరం వసూలు చేసేవారు. క్వీచౌలోని మియావ్ ప్రజలచేత వెట్టిచాకిరీ చేయించుకునేవారు.

మంచు ప్రభుత్వంలోని ఉన్నతోద్యోగాలన్నీ మంచూ ప్రభువులకు హాన్ భూస్వాములకు, మంగోల్ సామంతులకు ప్రత్యేకించేవారు. మంచూ ప్రభువుల చేతుల్లోనే నిజమైన అధికారమంతా వుండేది. రాష్ట్ర ప్రభుత్వాలలో కీలక స్థానాలైన గవర్నరుపదవుల అన్నిటినీ మంచూ ప్రభువులే ఆక్రమించేవారు.

మంచూల దావాలను విచారించేందుకు ప్రత్యేక కోర్టులుండేవి. నేరాలుచేసిన మంచూలను వదలివేయడమో లేదా శిక్షలో ప్రత్యేక సౌకర్యాలు పొందడమో జరిగేది.

మంచూల పరిపాలనా కాలమంతటిలోనూ అల్పసంఖ్యాక జాతులపైన, ప్రభుత్వాన్ని విమర్శించినవారిపైనా కఠిన చర్యలు తీసుకునేవారు. మింగ్‌చరిత్ర అనే గ్రంథంలో మంచూ పాలకులను నిరసించే భాగాలున్నాయని తెలిసికొని, ఆ గ్రంథ సంపాదకుడైన చువాంగ్ టింగ్-లంగ్ చనిపోయినప్పటికీ, అతని శవాన్ని గోరీ నుండి తవ్వించి బయటికితీసి, తల తీయించారు. అతని కుటుంబసభ్యులను, పదహారు సంవత్సరాలకు మించిన వయస్సుగల మగవాళ్ళందరికీ మరణశిక్ష విధించారు. స్త్రీలను రాజ్య పొలిమేరలు బయటికి ప్రవాసం పంపారు. గ్రంథానికి ఉపోద్ఘాతం వ్రాసిన

వారిని, చిత్రాలు గీసినవారిని, అమ్మినవారిని, కొన్నవారిని, అందరినీ చంపారు మంచూలను ఆక్షేపించే వ్రాతలున్న పుస్తకాలన్నిటినీ లాక్కొని తగులబెట్టించడమో, మార్పించడమో చేయాలని స్థానికోద్యోగులను ఆజ్ఞాపించారు. పన్నెండు సంవత్సరాలలో 13 వేల సంపుటాలకు పైగా ధ్వంసం చేయబడ్డాయి.

వివిధ జాతుల ప్రజలు కలసి, ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఐక్య కార్యాచరణకు పూనుకోకుండా అరికట్టేందుకు మంచూ పరిపాలకులు అనేక చర్యలు తీసుకున్నారు. హాన్ జాతివారికి, మంగోల్ జాతివారికి మధ్య వివాహాలను నిషేధించారు. టిబెటన్లు జుంగర్లమధ్య, హాన్‌లకు, ఉయ్‌గర్లకుమధ్య సంబంధాలను నిషేధించారు. అన్ని జాతుల ప్రజలమధ్య స్నేహ సంబంధాలకు అవకాశం లేకుండాచేసి, వారిమధ్య ద్వేషాలను రెచ్చగొట్టేవారు.

మంచూ ప్రభుత్వ క్రూరపరిపాలనక్రింద క్రుంగుతున్న అన్నిజాతుల ప్రజలు, నిరంకుశత్వానికి వ్యతిరేకంగా నిలబడి, తమ భవిష్యత్తును నిర్ణయించుకోవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

## మంచూలకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు

అన్ని జాతుల ప్రజలను అణచివేయడం, దోచుకోవడంలో దుష్టత్రయం — మంచూ ప్రభువులు, హాన్ భూస్వాములు, మంగోల్ సామంతులు — తీవ్రమైన ప్రతిఘటనను ఎదుర్కోవలసివచ్చింది. పద్దెనిమిదో శతాబ్దం చివరలో హుయి, మియోవ్, హాన్ ప్రజలు ఒకరి తర్వాత ఒకరు వరుసగా తిరుగుబాటు చేశారు.

హుయీ ప్రజలు చాలకాలంగా చింఘాయ్, కంసూలలో నివసించుతుండేవారు. దేశంలో యితర ప్రాంతాలలో కూడ వారు నివసించేవారు. ముస్లిం మతావలంబకులు ప్రధానంగా వ్యవసాయంపై జీవించుతూ పశువులనుకూడ పెంచేవారు.

యువాన్, మింగ్ వంశాల పరిపాలన చివరి రోజుల్లో తిరుగుబాటు చేసిన రైతు సేనలతో హుయీలు చేతులు కలిపారు. మంచూ సేనలు షాన్‌హై కువాన్ కనుమలో ప్రవేశించాక, కంసూ వైపున వున్న హుయీ ప్రజలు కొత్త దురాక్రమణదారులతో పోరాడారు. మంచూ వ్యతిరేకశక్తులను బలపరచి లాంచూనగరాన్ని, చుట్టూవున్న అనేక జిల్లాలను పట్టుకున్నారు. మంచూలు అదనపు బలాలను పంపినపుడు పర్వతాలలో రక్షణ తీసికుని, మంచూ సేనలకు చాల నష్టం కలిగించారు. చివరకు మంచూలు ఆ ప్రాంత మంతటినీ చుట్టుముట్టి నీటివనరులను, ఆహార సప్లయిలను బంద్‌చేశారు. హుయీల దేవాలయాలను తగులబెట్టారు. ఐనప్పటికీ చివరి మనిషి వరకూ హుయీలు పోరాడారు.

క్వీచౌ, పశ్చిమ హునాన్‌లలో మియో ప్రజలు నివశించేవారు. వారికి దీర్ఘకాల చరిత్ర వున్నప్పటికీ వారి వ్యవసాయం కొంత వెనుకబడివుండేది. వారి పాటలు, నృత్యాలు గొప్పగా వుండేవి: వారి వైద్య అనుభవాలు చైనా వైద్యశాస్త్రానికి ఎంతో ఉపకరించాయి.

మంచూ ప్రభువులు, హాన్ భూస్వాములు తరుచుగా బలవంతాన వారి భూములను స్వాధీనంచేసుకునేవారు. 1795 సంవత్సరంలో క్వీచౌలోని టుంగ్ జెన్‌లో నివశించే మియో ప్రజలు తిరుగుబాటు చేశారు. పశ్చిమ హునాన్‌లోని మియో రైతులుకూడ ఆ పిలుపును అందుకున్నారు. హునాన్‌లోని జిల్లా, పట్టణాలను వారు పట్టుకున్నారు. చివరకు మంచూలు తిరుగుబాటును అణచివేయ గలిగినప్పటికీ మియోలు చెదురుముదురుగా పోరాటాన్ని కొనసాగించారు.

మియో తిరుగుబాటు సమయంలో మంచూ ప్రభుత్వం విపరీతమైన మిలిటరీ ఖర్చును భరించవలసి వచ్చింది. ఈ నష్టాన్ని భర్తీచేయడానికి హూపే, జీచివాన్ రాష్ట్రాలపై పన్నులను ఎక్కువచేసింది. ఈ భారం మోయలేక అచటి ప్రజలు ఆయుధాలు పుచ్చుకుని తిరుగబడ్డారు.

1796 లో చింగ్‌చౌ, హూపేలలోని రైతులు మొదటి దెబ్బకొట్టారు. "ఉద్యోగుల నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ప్రజలు తిరుగబడాలని నినాదమిచ్చారు. పశ్చిమ హూపేలోని రైతులు వారితో కలిసారు. జీచివాన్, హూపే, షెన్సీ సరిహద్దున వున్న పర్వతప్రాంతాన్ని రైతుసైన్యం తన కేంద్రంగా చేసుకుంది. ప్రధాన సైన్యం ఎప్పుడూ తరలిపోతూ హోనాన్, జీచివాన్, షెన్సీ, కంసూ రాష్ట్రాలలో సాయుధ చర్యలు జరిపింది.

రైతు సైన్యాన్ని అరికట్టేందుకు మంచూ ప్రభుత్వం దేశ వివిధ ప్రాంతాల నుంచి అదనపు బలాలను పంపింది. భూస్వాముల సాయుధదళాలచేత కోటలు నిర్మించింది. గ్రామాలచుట్టూ వలయంగా కందకాలు తవ్వించింది. ధాన్యాన్ని దాచివేయించి, రైతు సైన్యాలకు ఆహార సప్లయిలు అందకుండా నిరోధించింది. తొమ్మిది సంవత్సరాల అనంతరం, 20 కోట్ల వెండినాణాలను ఖర్చుపెట్టి ఎట్టకేలకు మంచూ ప్రభుత్వం రైతుల తిరుగుబాటును అణచివేసింది.

37 వ అధ్యాయం

# యూరోపియన్ పెట్టుబడిదారీ దేశాలు చైనాపై దాడిచేయడం ప్రారంభం

పదహారవ శతాబ్దారంభంలో సముద్రాలపై దోపిడిగాళ్ళవలె ప్రవర్తించే పోర్చుగీస్ వర్తకులు చైనా ఆగ్నేయ కోస్తాలో దిగారు. నిషిద్ధవస్తువులను రవాణా చేయడం, ఓడలపై దాడిచేసి సరుకులను దోచుకుపోవడమేగాక మనుషులనుకూడ బానిసలుగా అమ్మేందుకు ఎత్తుకుపోయేవారు. వారి చట్టవిరుద్ధ చర్యలను చైనా ప్రజలు దృఢనిశ్చయంతో ప్రతిఘటించారు. క్వాంగ్‌టుంగ్, ఫూకీన్, చెకియాంగ్ కోస్తా ప్రాంతాలనుండి పోర్చుగీస్‌వారిని చివరకు పారదోలారు. 16 వ శతాబ్దం మధ్యలో పోర్చుగీస్ వర్తకులు మకావోలో దిగారు. మొదటివారు కేవలం ఓడ ఆగడానికి మాత్రమే అనుమతి అడిగారు. కాని 1557 లో కోటలను నిర్మించడం, నగర గోడలను కట్టడం ప్రారంభించారు. తమ స్వంత ఉద్యోగులను నియమించ డానికి తయారయ్యారు. ఈ విధంగా మకావోలో పోర్చుగీస్ దురాక్రమణ ప్రారంభ మయింది.

పోర్చుగీస్ అడుగుజాడల్లోనే స్పెయిన్, డచ్ వర్తకులు బయలుదేరి, చైనా కోస్తా ప్రాంతాలలో దోపిడీ చర్యలు సాగించారు. పదిహేడవ శతాబ్దం మధ్య భాగంలో ఒకసారి డచ్‌వాళ్ళు తాయ్‌వాన్‌దీవిలో కొంత భాగాన్ని ఆక్రమించారు.

వర్తకులు రావడంతోపాటు యూరోపియన్ మత ప్రచారకులుకూడ చైనాకు పరిచితమయ్యారు. యూరోపియన్ విజ్ఞాన శాస్త్రాలతో చైనా ప్రజలకు పరిచయ మేర్పడింది. కాని కొందరు మతబోధకుల ముసుగులో తమదేశ ప్రభుత్వాల ప్రచారకులవలె వ్యవహరించారు.

తాయ్‌వాన్ దీవిలోవున్న చెంగ్ చెంగ్-కుంగ్‌కు ప్రధాన చైనా భూమితో వున్న సంబంధాలను తుంచివేయడానికి, సముద్రంపైకి వెళ్ళే వర్తక ఓడల యజమానులకు మరణశిక్ష వేస్తామనీ, సరకులను జప్తు చేస్తామనీ మొదటి మంచూ పాలకులు హుకుం జారీ చేశారు. విదేశ వర్తక నావలు మకావోలో మాత్రమే దిగేందుకు ఒకేసారి

25 కు మించి దిగరాదనీ నియమం విధించారు. మంచూసైన్యం తాయ్‌వాన్ దీవిని స్వాధీనం చేసుకున్నాక ఓడప్రయాణాలపై నిషేధాలు తొలగించబడ్డాయి. ఐనప్పటికీ సముద్ర ప్రయాణంచేసే చైనా వర్తకపు ఓడలు ఏరకంగా వుండాలో, ఎంత సరకు వేయవచ్చో నియమాలు విధించారు. కాంటన్ రేవును విదేశ వ్యాపారానికి ప్రత్యేకించారు. క్వాంగ్‌టుంగ్‌లోని పెద్ద వర్తకులను కో-హాంగ్ అని పిలువబడే అధికార గిల్డుగా ఏర్పడమని మంచూ ప్రభుత్వం సూచించింది. కో-హాంగ్ అధికారులు విధించే నియమాలను విదేశ వ్యాపారస్తులు పాటించాలి; అది ఏర్పరచే వసతి గృహాలలో నివశించాలి. విదేశ వర్తకులు సరకులను కొనడం, అమ్మడం, ప్రభుత్వంతో వ్యాపారం చేయడం వగైరా అన్నీ కో- హాంగ్ మధ్యవర్తిత్వంద్వారానే జరగాలి.

పద్దెనిమిదవశతాబ్దానికి ప్రపంచంలోని వర్తకదేశాలన్నిటిలో బ్రిటన్ అత్యంతశక్తివంతమైన దేశంగా తయారైంది. ఆయుధబలంతో తన సామ్రాజ్యాన్ని విస్తరించుకోవడంలో నిమగ్నమైవుంది. చైనాదేశ విస్తీర్ణము, అపార సంపద, పెద్ద జనాభా బ్రిటిష్ ఈస్టు ఇండియా కంపెనీ దృష్టిని ఆకర్షించింది. తరువాత ఇంగ్లాండులోని స్వతంత్ర వర్తకులు, ఓడ యజమానులేగాక ఇతర వర్తకదేశాలవారుకూడ ఆకర్షించబడ్డారు. ప్రత్యేక వర్తక సదుపాయాలను సంపాదించడానికి బ్రిటీషు రాయబారి మేకార్ట్‌నే 1793 లో పెకింగ్‌కు వచ్చి, మంచూ ప్రభుత్వం ముందు తన కోర్కెల జాబితాను వుంచాడు. దాన్లో క్రింది కోర్కెలున్నాయి : బ్రిటిషువారి వర్తక విషయాలను అజమాయిషీ చేసే బ్రిటిష్ ప్రతినిధి పెకింగ్‌లో వుండేందుకు అనుమతించాలి; నింగ్‌పో, టిన్‌ఘాయ్, టీన్‌ట్సిన్ నగరాలతో వర్తకం చేసేందుకు బ్రిటిష్ వ్యాపారస్తులకు అనుమతి యివ్వాలి; చౌషాన్ దీవుల సమీపంలో చిన్న దీవిపై బ్రిటిష్ వర్తకులు నివసించేందుకు, తమ సరకులను నిల్వ చేసుకునేందుకు అనుమతి యివ్వాలి; మకావ్‌నుంచి కాంటన్‌కు రవాణా అయ్యే సరకులపై సుంకాలను మినహాయించడానికి లేదా తగ్గించడానికి అనుమతించాలి. ఈ దుష్ట కోర్కెలను మంచు ప్రభుత్వం తిరస్కరించింది.

మంచూ ప్రభుత్వం అనుసరించిన తలుపు బిగించుకూర్చునే విధానం (Closed-door policy) శైశవాస్థలో వున్న చైనా పెట్టుబడిదారి ఆర్థికవిధానం పెరుగుదలకు ఆటంకంగా తయారైంది. ఐనప్పటికి సామ్రాజ్యవాద ప్రభుత్వాలు చైనా సంపదలను విచ్చలవిడిగా దోచుకునేందుకు పెద్దయెత్తున వేగులవాళ్ళను పంపుతున్న సమయంలో, మంచూప్రభుత్వ విధానం ఆత్మరక్షణకు సాధనంగా వినియోగపడింది.

అప్పటికి చైనాలో సమాజస్థితి ఫ్యూడల్ ఆర్థికవిధానం వుంది: ప్రజల ప్రాథమిక అవసరాలను తీర్చేటంత సరకు దేశంలోనే వుత్పత్తి జరుగుతుంది. విలాస వస్తువులను కొనగలశక్తి భాగ్యవంతులలో పరిమితంగా వుంది.

నల్లమందు వ్యాపారం కొరకు మూసివున్న చైనా తలుపులను ఇంగ్లాండు బలవంతాన తెరచింది. ఒకసారి మార్గం తెరిచాక సామ్రాజ్య ప్రభుత్వాలు, వర్తక దేశాలు అన్నీ చైనాలో ప్రవేశించాయి.

చైనాదేశంలో నల్లమందు ప్రవేశ పెట్టబడింది. ఇంగ్లండు దేశానికి వలసగా వున్న ఇండియాను దోచుకుంటున్న ఈస్టుఇండియాకంపెనీ నల్లమందు పరిశ్రమద్వారా విపరీతలాభాలు తీసేది. నల్లమందు వర్తకాన్ని నిషేధించి, పట్టుకున్న నల్లమందు సరుకునంతనూ ధ్వంసంచేయమని మంచూ ప్రభుత్వం అమలుజరిపిన చర్యలను ఇంగ్లాండు ప్రభుత్వం సాకుగా తీసుకుంది. పర్యవసానమే నల్లమందు యుద్ధం.. ...

38 వ అధ్యాయం

# మింగ్, చింగ్ రాజ్యాల కాలంలో చైనా సంస్కృతి

## ప్రకృతి శాస్త్ర విజ్ఞానం

మింగ్ పాలనలో వ్యవసాయం, చేతి పరిశ్రమల్లో టెక్నిక్ (నైపుణ్యం పెరిగింది. ప్రకృతి శాస్త్రాలు, అనుబంధ (Applied) శాస్త్రాలు కొంతవరకు అభివృద్ధి చెందాయి. వైద్య పరిశోధనలో ప్రఖ్యాతి వహించిన లీ-షీ-చెన్ అప్పటివరకు వైద్య విజ్ఞానంలో చైనావారు సాధించిన అనుభవాలన్నిటినీ సమీకరించాడు. ఇరవైయేడు సంవత్సరాలు కృషిచేసి, "పెన్‌ట్సావో కాంగ్ మూ" (వస్తుగుణ దీపిక) అనే గొప్ప వైద్యశాస్త్ర గ్రంథాన్ని రచించాడు. దీనిలో లీ-షీ-చెన్ మందులను 60 భాగాలుగా విభజించాడు. ప్రతి రకానికి వేర్వేరు నామకరణం చేశాడు. ఏ మూలిక ఎచట దొరుకుతుందో, ఏ మందు ఎలా తయారుచేశారో, ఏయే జబ్బులకు ఏయే మందులు వాడాలో వివరించాడు. 1892 మందులను గురించి, 10 వేల అనుపానాలను గురించి "పెన్ ట్సావో కాంగ్ మూ" (మెటీరియా మెడికా) అను యీ గ్రంథంలో వివరించబడింది.

పెన్ ట్సావో కాంగ్ మూ చైనా వైద్య శాస్త్రానికి ఎంతో తోడ్పడిన గ్రంథం. దీనిలో వృక్షజాతిని వేర్వేరు తరగతులుగా విభజించడంలో అనుసరించిన పద్ధతి అప్పటి ప్రపంచంలో అత్యంత ఆధునికమైనది. పదిహేడవ శతాబ్దంనాటికే యీ గ్రంథం యితర భాషల్లోకి అనువదించబడింది.

సుంగ్ ఇంగ్-హ్సింగ్ వ్రాసిన "టియెన్ కుంగ్ కైవూ" (ప్రకృతి వనరులను వినియోగించుకోవడం) అనే పుస్తకంలో వివిధ పంటలను దశలవారీగా పెంచడం, చేతి పరిశ్రమలద్వారా వస్తువులను తయారుచేయడం వివరించాడు. ఉత్పత్తిని పెంపొందించే విషయమై అమూల్య అనుభవాలను యీ గ్రంథం తెలియజేస్తుంది. ఇనుము కరిగించే బట్టీలను గురించి వ్రాస్తూ, గనులనుండి యినుప మట్టిని (కాకిరాయిని) తవ్వడం, కొలిమిని నిర్మించడం, బట్టీలలో యినుము కరిగించడం, దుక్కయినుము

నుంచి ఉప్పును తయారుచేయడం వగైరా పద్ధతులన్నీ వర్ణించబడ్డాయి. పట్టు పరిశ్రమను గురించి వ్రాస్తూ పట్టు పురుగులను పెంచడం, నూలు తీయడం, బట్టలు నేయడం వగైరా వివరించబడ్డాయి. మగ్గాలలో వివిధరకాలను తెలిపే చిత్రాలు కూడ గీయబడ్డాయి.

మింగ్ పాలన చివరి సంవత్సరాలలో హ్సూ క్వాంగ్-చీ అనే రచయిత వ్యవసాయానికి సంబంధించిన వివిధ సమస్యలను అధ్యయనం చేశాడు. యూరోపియన్ మిషనరీలనుండి కొంత శాస్త్రీయ విజ్ఞానాన్ని సంపాదించి, "నుంగ్ చెంగ్ చువాన్ షు" (వ్యవసాయంపై పూర్తి విజ్ఞానం) అనే గొప్ప గ్రంథాన్ని వ్రాశాడు. దీనిలో ఆహార పంటలను, పండ్లతోటలను, ప్రత్తి, జనుము, తదితర చెట్లను నాటే విధానం గురించి, పట్టుపురుగులను, పశువులను, కోళ్ళను, చేపలను పెంచడం గురించి, వివిధ జంతువుల జబ్బులకు మందులు వేయడం గురించి చర్చించాడు. నీటివనరులను వృద్ధి చేయడం చాల ప్రాముఖ్యమైన విషయం. వేర్వేరు ప్రాంతాలలోవున్న జలాశయ నిర్మాణాలను పరిశోధించి, యూరపులో నీటిపారుదల ప్రాజెక్టులను నిర్మించే పద్ధతులను కొన్నిటిని పరిచయం చేశాడు. కరువు నివారణ పద్ధతులను పరిశీలించడంపై దృష్టిని కేంద్రీకరించాడు. పెన్ ట్సావో కాంగ్ మూ తదితర వైద్యశాస్త్ర గ్రంథాలలో ఉదహరించబడిన ఆహారానికి పనికివచ్చే మూలికలు ఏవేవి కరువు కాలంలో దొరుకుతాయో వివరించారు.

## ప్రజాస్వామిక భావాలు

మింగ్, చింగ్ వంశాల పరిపాలనా కాలంలో వర్తకవ్యాపారాలు క్రమంగా విస్తరించాయి. పెట్టుబడిదారీ ఉత్పత్తికి ప్రాథమికరూపం ఏర్పడి, వృద్ధిచెందుతూంది. ప్రజాస్వామిక భావాలు రూపొంది, విస్తరించుతున్నాయి. ఆ కాలపు సాహిత్యంలో యీ భావాలు ప్రతిబింబించుతున్నాయి.

ఆ కాలంలో ప్రజాస్వామిక భావాలను ప్రచారంచేసిన వారిలో హుయాంగ్ ట్సుంగ్-హ్సీ, కూ యెన్-వూ, వాంగ్ ఫూ-చి ప్రఖ్యాతివహించిన మేధావులు. వీరు మంచూ వ్యతిరేక పోరాటంలో పాల్గొని, ప్రభుత్వ నిర్బంధానికి గురయ్యారు. ఉదాహరణకు హుయాంగ్ ట్సుంగ్-హ్సీ ఒక దీవిలో జీవితం గడపవలసివచ్చింది. వాంగ్ ఫూ-చి చాలకాలం మియావో ప్రజలు నివసించే ప్రాంతంలో తలదాచుకోవలసి వచ్చింది. కూ యెన్-వూ ఉత్తర రాష్ట్రాలలో తిరుగుతూ, ఆ ప్రాంత భౌగోళిక పరిస్థితులను పరిశీలించుతూ, మంచూలకు వ్యతిరేకంగా సాయుధ తిరుగుబాటుకు సన్నాహాలు చేశాడు. రాజరికాన్ని, మంచూ పరిపాలనను నిరసించుతూ వారందరూ చాల పుస్తకాలు వ్రాశారు.

హుయాంగ్ ట్సుంగ్-హ్సీ తన రచనలో సింహాసనంకోరకు పెనుగులాడుతూ రాజు క్రూరంగా ప్రజలను ధ్వంసంచేస్తాడని వ్రాశాడు: సింహాసనం అధిష్టించాక ప్రజలను దారుణంగా దోచుకుంటాడు. కాబట్టి రాజు ప్రజలకు శత్రువనీ, అతడికి

156B



లిన్‌ట్సే-షు (1785-1850) (చూ. పే. 161)

వ్యతిరేకంగా ప్రజలు పోరాడటం సహజమనీ ఆయన వివరించాడు. తన ఆస్తిని, ప్రత్యేక హక్కులను రక్షించుకోడానికి రాజు శాసనాలు చేస్తాడు. ఈ చట్టాలు దేశమంతటి శ్రేయస్సుకొరకు కాదు; కేవలం స్వప్రయోజనాలను, కుటుంబ లాభాలను సాధించడానికి మాత్రమే. రాజు సరైనదని నిర్ణయించిన విషయం సరైనది కాక పోవచ్చు; అతడు తప్పుగా పరిగణించేది తప్పు కాకపోవచ్చు. ప్రజలే వాటిని పరిశీలించి నిర్ణయించాలిసివుంది.

భూమి రాజుగారి స్వంత ఆస్తికాదని వాంగ్-ఫూ-చి అభిప్రాయపడ్డాడు. దానిపై నివసించుతూ, దున్నుతున్నారు కాబట్టి భూమి ప్రజలదే అని స్పష్టపరిచాడు.

ఫ్యూడల్ భూస్వామ్య విధానంపై ప్రజలకున్న అసహ్యతకూడ ఆ కాలపు సాహిత్యంలో ద్యోతకమయింది.

"జులిన్ వైషి" (పండితులు) అనే గొప్ప హాస్యరస నవల చింగ్ వంశ కాలంలో వ్రాయబడింది. దీనిని రచించిన వూ చింగ్-ట్జూ ఆ రోజుల్లోవున్న సివిల్ సర్వీస్ విధానాన్ని నిశితంగా విమర్శించాడు. నిజాయితీ, నైపుణ్యం శూన్యమైనప్పటికీ బిరుదులను, భాగ్యాన్ని ఎలా సంపాదించేవారో, మోసంచేయడం, ఏ రోటికాడ ఆ పాట పాడటం, అవినీతి పనులు చేయడం, లంచాలు మేయడం ఎలా సర్వసాధారణ మైపోయిందో చిత్రించాడు. మర్యాదస్తుడు, నిజాయితీపరుడైన యువకుడు సివిల్ పరీక్షలో నెగ్గి ఉద్యోగి ఐన తర్వాత అబద్ధాలకోరుగానూ, సిగ్గు ఎగ్గూ లేని అవినీతి పరుడుగానూ ఎలాదిగజారాడో రచయిత వర్ణించాడు ప్రభుత్వ పరీక్షలో సంపాదించిన బిరుదులను వినియోగించుకుని కొందరు ఏ విధంగా తమ ప్రాంతంలోని ప్రజలపై నిరంకుశత్వం చెలాయించేవారో నిరూపించాడు. ఉద్యోగులలో అత్యధిక సంఖ్యా కులు లంచగొండులు, సంకుచిత స్వభావం కలిగిన క్రూరులు, తెలివితేటలులేని బడుద్ధాయిలు అని చిత్రించాడు.

ట్సావో హ్స్యూయే-చిన్ రచించిన *హుంగ్ లో మెంగ్ (ఎర్రభవనం కల) అనే గ్రంథం ఆ కాలపు సాహిత్యంలో ఉత్తమ రచనగా పరిగణించబడుతోంది. ఒక ఉన్నతవంశ కుటుంబ జీవితాన్ని, దాని పతనావస్థను, పీడిత ప్రజల దుర్భర జీవితాన్ని ప్రతిబింబించుతూ యీ గ్రంథం వ్రాయబడింది. ఈ కుటుంబంలోని యువక వీరుడైన జేడ్ ఫ్యూడల్ సాంప్రదాయాలపై తిరుగుబాటు చేస్తాడు. పదవికొరకు, ధనం కొరకు తాపత్రయపడేవారిని అతడు ఏవగించుకుంటాడు. ఉద్యోగులతో కలసిమెలసి వుండాలన్న సూచనను తిరస్కరించుతాడు. ఫ్యూడల్ సమాజంలో అణచివేయబడిన మహిళల యెడల సానుభూతి వ్యక్తపరుస్తాడు. విశాల

---

* దీనిని విదేశభాషల ప్రచురణాలయం 1957 లో ఇంగ్లీషులో ప్రకటించింది.

మైన చిత్రపటంమీద స్వతంత్ర వ్యక్తిత్వంగల స్త్రీ పురుష పాత్రలు వందకు పైగా ఈ గ్రంథంలో చిత్రించబడ్డాయి.

ట్సావో హ్స్యుయే-చిన్ ఆ కాలంలోని సామాజిక జీవితాన్ని చిత్రించడంలో గొప్ప విజయం సాధించాడు. ఫ్యూడల్ సమాజపు శిథిలావస్థను గంభీరంగా వర్ణించాడు.

### 39 వ అధ్యాయం

# నల్లమందు యుద్ధం

## నల్లమందు వర్తకానికి వ్యతిరేక వుద్యమం

నల్లమందు యుద్ధకాలానికి చైనాలో ఫ్యూడల్ సమాజం వుండేది. భూస్వాములు రైతులను దారుణంగా దోచుకునేవారు. తాము సాగుచేసే భూమిలో పండిన పంటలో నూటికి 50 నుంచి 80 వంతులవరకూ రైతులు భూస్వాములకు మక్తాగా చెల్లించేవారు. దీనికితోడు అదనంగా భూమిశిస్తును రైతులు ప్రభుత్వానికి చెల్లించాలి. ప్రాథమికమైన పనిముట్లతో చిన్న మళ్ళలో రైతులు కృషి చేసేవారు. చేమగ్గాలపై బట్టలు నేసేవారు. సంవత్సరాల తరబడిగా నడుంవిరిగేలా శ్రమపడినప్పటికీ రైతులలో చాలమందికి కుటుంబపోషణే అస్తుబిస్తుగా జరిగేది. వెనకబడిన ఉత్పత్తి పద్ధతులను మార్చడం వారి శక్తికి మించిన విషయంగా కన్పించేది.

ఐనప్పటికీ చైనా ఫ్యూడల్ సమాజం గర్భకోశంలో అప్పటికే పెట్టుబడిదారీ విధానం అంకురాలు ప్రారంభమయ్యాయి. పట్టువస్త్రాలు, తేయాకు, ఇనుము,పింగాణీ తదితర చేతి పరిశ్రమల కర్మాగారాలలో ఇది స్పష్టంగా గోచరమయ్యేది. కాని అభివృద్ధి నిరోధక ఫ్యూడల్ మంచూ ప్రభుత్వం వీటిని ప్రోత్సహించలేదు. పైగా చేతిపరిశ్రమల అభివృద్ధిని ఆటంకపరచేది. ఉదాహరణకు పట్టుపరిశ్రమ ఆకాలంలో చేతిపరిశ్రమల ఉత్పత్తిలో ప్రముఖపాత్ర వహించేది. పట్టుపరిశ్రమ కేంద్రాలైన నాంకింగ్, సూచౌ, హాంగ్ చౌ నగరాలలో ప్రయివేటు పట్టుపరిశ్రమ ఉత్పత్తిని, అమ్మకాలను కంట్రోలు చేయడానికి మంచూ ప్రభుత్వం ఉద్యోగులను నియమించింది. కర్మాగార యజమాని వంద మగ్గాలను మించి కలిగివుండరాదని ప్రభుత్వం నిషేధించింది. ప్రతి మగ్గానికి 50 వెండినాణాల పన్ను ప్రతిసంవత్సరం వసూలు చేసింది.

చైనాలోని వివిధజాతుల ప్రజలు ముఖ్యంగా హాన్, మంగోల్, టిబెటన్, హుయీ మియావ్, ఉయిఘుర్ ప్రజలు నిరంతరం తమను పీడించుతున్న మంచూ పరిపాలనకు వ్యతిరేకంగా పోరాటం సాగించారు.

1830 వ సంవత్సరంనుంచి బ్రిటిషువాళ్ళు నల్లమందును ఎక్కువ మొత్తాలలో చైనాకు ఎగుమతిచేయ సాగారు. ఉద్యోగస్థులలోనూ, ధనికవర్గాలలోనూ ఎక్కువ

మందికి నల్లమందు సేవించే దురభ్యాసం అలవడింది. మంచూ సైన్యంలోకూడ కొందరు వుద్యోగులు, సైనికులకు కూడ నల్లమందు అలవడింది. కాంటన్ రేవు పట్టణం లోనే దిగుమతయిన నల్లమందుకు 3 కోట్ల దండల వెండినాణాలు చెల్లించవలసి వచ్చేది. ఈ విధంగా వెండి ఎగుమతి అవడంవల్ల దేశీయ మార్కెటు వెండిధర పెరిగింది. చిన్ వంశ పరిపాలన మొదటి రోజుల్లో వెండి నాణాలదండ ఒకటి ఎనిమిదివందల రాగి నాణాలతో సమానంగా వుండేది. నల్లమందు యుద్ధం నాటికి ఈ ధర పదహారువందల రాగి నాణాలకు (అనగా రెట్టింపుకు) పెరిగింది. మంచూ ప్రభుత్వం పన్నులను వెండి నాణాలలో వసూలుచేసేది. కాని రైతులు అమ్మే వ్యవసాయ సరుకులకు రాగి నాణాలు మాత్రమే యిచ్చేవారు. ఇందువల్ల తాము చెల్లించవలసిన పన్నులకు పూర్వంకంటే రెట్టింపు రైతులు చెల్లించవలసివచ్చేది.

నల్లమందు వ్యాపారాన్ని గురించి చక్రవర్తి సలహాదార్లలో భేదాభిప్రాయాలు వుండేవి. నిజాయితీగల దేశభక్తుడు లిన్ త్సే - సూ గుంపు దీనికి వ్యతిరేకంగా వుంది. నల్లమందు దొంగవర్తకం ద్వారా లాభం పొందుతున్న యితరులు వేరు దృక్పథం కలిగివున్నారు. టాంగ్ కాంగ్ చక్రవర్తి వెండి దేశాన్నుంచి అదృశ్యమైపోతూందనీ, నల్లమందు ప్రభావంవల్ల తన సైన్యం దిగజారిపోతూందనీ, తన ప్రభుత్వ అస్తిత్వమే దెబ్బతింటూందనీ గ్రహించాడు. నల్లమందు నిషేధించడానికి లిన్ త్సే-సూను కాంటన్ నగరానికి పంపాడు.

1839 వసంత ఋతువులో లిన్ కాంటన్ నగరానికి చేరుకున్నాడు. విదేశ వర్తకులు తమవద్దనున్న నల్లమందునంతనూ ప్రభుత్వ స్వాధీనం చేయాలనీ, యిక ముందు నల్లమందు వ్యాపారం చేయమని హామీపత్రం వ్రాసియివ్వాలనీ ఆజ్ఞాపించాడు. ఈ నియమాన్ని ఉల్లంఘించినవారికి తక్షణం మరణశిక్ష విధించుతామనీ, వారి ఓడలను, సరుకును ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుందనీ ప్రకటించాడు. బ్రిటిష్ వర్తకానికి సూపరింటెండెంటుగా వున్న కాప్టెన్ ఇలియెట్ చైనా ప్రభుత్వ ఉత్తరువులను ఉల్లంఘించాడు.

ఆ తర్వాత సైనికులను పంపి లీ విదేశ ఫ్యాక్టరీలకు చుట్టూ కాపలా పెట్టించాడు. కూరగాయలు, నీళ్ళు సప్లయిలను బంద్ చేయించాడు. ఇళ్ళనుగాని, ఓడలను గాని అద్దెకు యివ్వరాదనీ, నల్లమందు వర్తకుల క్రింద పనిజేసే చైనావారంతా మానివేయాలనీ ప్రకటించాడు.

మూడురోజుల ముట్టడి అనంతరం తప్పనిసరై క్కాప్టెన్ ఇలియెట్ 20 వేల పెట్టెల నల్లమందును ప్రభుత్వానికి అప్పగించాడు. దీనిలో వెయ్యి పెట్టెలకు పైగా అమెరికన్ వర్తకుల నల్లమందుకూడ చేరివుంది. 1839 సంవత్సరం జూన్ 3 వ తేదీన యీ నల్లమందునంతనూ బోన్ సముద్రతీరంలో లిన్ తగులబెట్టించాడు. ఇది పూర్తిగా కాలిపోవడానికి 20 రోజులు పట్టింది. అప్పటినుంచీ నల్లమందు దొంగ రవాణాకు వ్యతిరేకంగా తీసికున్న యీ చర్య ఎన్నడూ మరపురాని ఘటనగా చైనా ప్రజల దృష్టిపథంలో వుంటుంది.

# బ్రిటిష్ దురాక్రమణ చర్యలు

పారిశ్రామిక విప్లవానంతరం పద్ధెనిమిదవ శతాబ్దం రెండవ భాగంలో పెట్టుబడి దారీ ఉత్పత్తివిధానం త్వరితగతిని అభివృద్ధి చెందడం ఫలితంగా బ్రిటన్ అన్నిటికంటే ఎక్కువ వలసలుగల గొప్ప సామ్రాజ్యవాద దేశంగా తయారైంది. చైనాదేశ తలుపులను తెరచి తమ పారిశ్రామిక వస్తువులను అమ్ముకోడానికీ, పరిశ్రమలలో వినియోగపడే ముడి సరుకును చౌకగా తీసుకుపోవడానికీ బ్రిటిష్ పెట్టుబడిదారులు ఆతురతగావున్నారు. అంతేగాక విశేషలాభం సంపాదించుతున్న నల్లమందు వర్తకం, బ్రిటిష్‌వాళ్ళకు ఎంతో ప్రాముఖ్యమైనది. అందువేత విపరీత లాభాలు తెస్తున్న నల్లమందు వర్తకాన్ని పునరుద్ధరించుకోడానికి కత్తులునూరి, యుద్ధానికి తయారయ్యారు.

1839 సంవత్సరం జులై నెలలో బ్రిటిష్ నావికులు కౌలూన్‌లో చైనారైతును చంపారు. ఖూనీకోరును అప్పగించాలని లిన్ హెచ్చరించాడు. కాని ఇలియట్ అప్పగించనని తిరస్కరించాడు. తరువాత బ్రిటిష్ యుద్ధ నావలు చైనా పడవలపై ఫిరంగులను కాల్చాయి. చైనా యుద్ధ నావలు ఎదురు దెబ్బతీశాయి.

లిన్ ఉత్తరువు అనుసరించి, కొయ్యబాదులు పాతి ఇనప గొలుసులుకట్టి, పెరల్ నదిలోకి యుద్ధ నావలు రాకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. కొత్త కోటలను నిర్మించి, నది రెండు గట్లపైన 300 ఫిరంగులను నిలబెట్టారు. నావికా సేనాని కువాన్ టియెన్-పీ తన మనుష్యులకు తరిఫీదు యిచ్చి సిద్ధంగావున్నాడు. సైన్యం ఉత్సాహంగావుంది.

క్వాంగ్‌టుంగ్ సముద్రతీరంపై బ్రిటీష్‌సేనలు దాడిచేశాయి. కాని ప్రతి చోటా - నీళ్ళలో జాలరివాళ్ళు, భూమిపైన స్థానిక సైనికులు ఎదుర్కొన్నారు. లిన్ పిలుపునందుకొని ప్రజలు తమ మాతృభూమి రక్షణకు సంఘటితమయ్యారు. సైన్యానికి - పౌరులకు మధ్య సన్నిహిత సహకారం, ఐకమత్యం వున్నందున బ్రిటిష్ సాయుధదాడి ప్రయత్నాలన్నిటినీ భగ్నం చేయగలిగారు.

చైనాపై బ్రిటిష్ ప్రభుత్వం యుద్ధం ప్రకటించింది. 1840 జూన్‌లో కాంటన్‌పై దాడిచేయడానికి నావికాసైన్యాన్ని పంపింది. కాంటన్ నగరంలో రక్షణకోటలున్నాయని దానిని దాటిపోయి బ్రిటిష్‌సేనలు అమోయ్‌పై దాడికి ప్రయత్నించాయి. అచటకూడ దెబ్బతిన్నారు. తరువాత ఉత్తరానికి వెళ్ళి, చెకియాంగ్ సముద్రతీరాన వున్న టింఘాయిపై బ్రిటిష్‌సైన్యం దాడిచేసింది. టింఘాయిలోని సేనలు, పౌరులు వీరోచితంగా పోరాడారు; కాని ప్రభుత్వం ఎలాంటి రక్షణలను నిర్మించనందున చౌషాన్ దీవులలోవున్న ముఖ్యమైన రేవును బ్రిటిష్‌వాళ్ళు ఆక్రమించకుండా అరికట్ట లేకపోయారు.

టింఘాయి పడిపోయిందన్న వార్త పెకింగ్‌కు చేరగానే, చాలమంది ఉద్యోగులు యీ అవకాశాన్ని వినియోగించుకుని, లిన్ త్సే-సూ తలబిరుసుతనాన్ని తీవ్రంగా నిరసించారు. బ్రిటిష్‌వాళ్ళతో రాజీపడాలని కోరారు. చక్రవర్తి వూగిస

లాడి, దేశభక్తుడైన లిన్‌ను తొలగించాడు. చిహ్లీ (ప్రస్తుత హోపీ) రాష్ట్ర రాజ ప్రతినిధికి, టిన్ స్టిన్‌పై బ్రిటిష్ నావలు దాడిచేస్తే, చైనా సైన్యాలు మొట్టమొదట ఫిరంగులు కాల్చరాదని సూచనలు పంపాడు.

బ్రిటిష్ యుద్ధనావలు రాగానే, బ్రిటిష్‌వాళ్ళు క్వాంగ్‌టుంగ్‌కు తిరిగి వెళ్ళితే అన్ని సమస్యలను సంతృప్తికరంగా పరిష్కరించుకోవచ్చునని చీ షాన్ బ్రిటిష్‌వారికి రాయబారం పంపాడు. కాంటన్‌లో రాయబారాలు జరుపడానికి బ్రిటిష్‌వాళ్ళు అంగీకరించారు. టావ్ కువాంగ్ చక్రవర్తి రాయబారాలు జరిపేందుకు చీ షాన్‌ను నియమించారు.

చీ షాన్ కాంటన్ నగరం చేరగానే కొయ్య బాదులను, యినుప గొలుసులను పెరల్ నది ముఖద్వారంలోనుంచి తొలగించాలని ఉత్తరువు జారీచేశాడు రక్షణలన్నీ వూడపీకించాడు : ప్రజా సైన్యాలను రద్దుచేశాడు. ఐనప్పటికీ బ్రిటిష్‌వాళ్లు సంతృప్తి చెందలేదు. 1841 జనవరిలో ఫిరంగులు కాల్చి, బోగ్ వెలుపలి కోటలను స్వాధీనం చేసుకున్నారు. హాంకాంగ్‌ను తమకు అప్పగించాలనీ, 60 లక్షల వెండినాణాల దండ లను పరిహారం చెల్లించాలనీ బ్రిటిష్‌వాళ్ళు పట్టుబట్టారు. ఈ చేదు మాత్రను చక్రవర్తి మింగలేక, క్వాంగ్‌టుంగ్‌లో యుద్ధాన్ని నిర్వహించమని యీ షాన్‌ను నియ మించాడు. అతడు చేరే లోపల, బ్రిటిష్‌వాళ్ళు బోగ్ కోటలపై దాడిచేశారు. అడ్మిరల్ కువాన్ టీయెన్-పీ నాయకత్వాన అచటి సేనలు తీవ్రంగా ప్రతిఘటించి, పోరాటంలో అందరూ ఆహుతయ్యారు. బ్రిటిష్ యుద్ధనావలు బోగ్ ముఖద్వారం కుండా కాంటన్ నగరానికి వెళ్ళాయి. ఈ షాన్ తెల్లజెండా ఎత్తినందువ యుద్ధం తాత్కాలికంగా ఆగిపోయింది.

## చైనా ప్రజల ప్రతిఘటన

బ్రిటిష్ దురాక్రమణసేనలు కాంటన్‌నగర శివార్లలో దోచుకోవడం, తగుల పెట్టడం, చిత్రవధలు చేయడంలో నిమగ్నులయ్యారు. దీనివల్ల ద్వేషాగ్ని రగుల్కొని, స్థానిక ప్రజలు ఆత్మరక్షణకు సంఘటితమవసాగారు. ఒక గ్రామాన్ని దోచుకో డానికి బ్రిటిష్ సేనలు వచ్చినపుడు, చుట్టూ గ్రామాలన్నీ దాని రక్షణకు తోడ్పడా లని నిర్ణయించుకున్నారు.

1841 మే నెల 30 వ తేదీన బ్రిటిష్ దోపిడిదార్లు కాంటన్ సమీపంలోవున్న సాన్‌యువాన్లీ గ్రామంపై దాడిచేశారు. అదివరకు చేసివున్న ఏర్పాటుప్రకారం శంఖాలు వూదగానే చుట్టుప్రక్కలవున్న 103 గ్రామాలనుండి అనేక వేలమంది ప్రజలు వచ్చి, శత్రువును చుట్టుముట్టారు. "పింగ్ ఇంగ్ టువాన్" (బ్రిటిష్ వ్యతిరేక రక్షణ సేనలు) అనే పతాక శీర్షికతో గొడ్డళ్ళు, త్రవ్వగాళ్ళు వగైరా వ్యవసాయ ముటను ధరించి పోరాడారు. స్త్రీలు, పిల్లలు ఆహారం నీళ్ళు అందించారు.

వర్షం జోరుగా కురుస్తోంది. బ్రిటిష్ సైనికులు బురద పొలాల్లో గాభరాతో (Scurried) చిందులు తొక్కసాగారు. ప్రమాదాన్నుంచి వారిని తప్పించడానికి కెప్టెన్ ఇలియెట్ పరుగెత్తుకొచ్చాడు. కాని అతనినికూడ ప్రజలు చుట్టుముట్టారు. వలయాన్ని బద్దలుచేసుకుని పోడానికి అనేక ప్రయత్నాలుచేసి విఫలమయ్యారు. బ్రిటిషువాళ్ళు 200 మందికి పైగా మరణించడమో, గాయపడడమో జరిగింది. ఈ షాన్ (చైనా ప్రభుత్వ ప్రతినిధి) వచ్చి, రైతులను చెదరిపొమ్మని బలవంత పెట్టాకనే బ్రిటిష్ సేనలు బయటపడ్డాయి.

సాన్ యువాన్లీ పోరాటం ఒంటరి ఉదాహరణమాత్రం కాదు. సమీపానవున్న సాన్‌షాన్ గ్రామ ప్రజలు దారికాచి మరొక బ్రిటిష్ దళంపై దెబ్బతీసి, రెండు ఫిరంగులను, కొన్నివందల తుపాకులను పట్టుకున్నారు. పోషాన్ (ఫాట్సాన్) పట్టణం వద్ద బ్రిటిష్ దురాక్రమణదారులను పౌరులు చుట్టవేసి, కొందరిని హతమార్చారు. హ్సిన్-ఆన్ జిల్లా ప్రజలు మూడు నావికా దళాలను ఏర్పరచి, బోగ్‌లో లంగరు వేసిన బ్రిటిష్ యుద్ధనావలపైకి నిప్పుడింగీలను వదలారు. ఒక్క నావకు నిప్పంటుకోగా, తక్కినవన్నీ లంగరు ఎత్తివేసి, జారుకున్నాయి.

పింగ్ ఇంగ్ టువాన్ పోరాటంతో విదేశ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా చైనా ప్రజల వీరోచిత పోరాటాలు ప్రారంభమయ్యాయి.

బోగ్‌లోనూ, కాంటన్‌లోనూ దురాక్రమణతోపాటు బ్రిటిష్‌వాళ్ళు ఆగ్నేయ సముద్రతీరానికి నావికాసేనలను పంపారు. అచటకూడ తీవ్రమైన ప్రతిఘటన వారిని ఎదుర్కొంది.

అమోయ్‌లో దిగిన బ్రిటిషు దురాక్రమణదారులపై స్థానిక ప్రజలు దెబ్బతీసి, రేవు నగరాన్నుంచి బలవంతాన వెళ్ళగొట్టారు.

టింఘాయ్‌లో చైనా ప్రజలు ధైర్యంగా నిలబడి పోరాడారు. ఆరు రోజులు రాత్రింబవళ్ళు భీకరయుద్ధం జరిగింది. బ్రిటిషువాళ్లు తీవ్రంగా నష్టపడ్డారు. జనరల్ కో యున్-ఫీకి నలభై గాయాలు తగిలినప్పటికీ, ప్రాణం పోయేవరకు నిలబడి పోరాడాడు. హీ షుయి టాంగ్ అనే ప్రజా సైనికదళం శత్రువుకు తీవ్రమైన నష్టాలు కలిగించాయి.

ఊసుంగ్ కోటల సేనానిగావున్న చెన్ హువా-చెంగ్‌ను ప్రత్యేకంగా వుదహరించవలసివుంది. సామాన్యులనుండి పైకి వచ్చిన ఈ సేనాని తన సైనికులతో బాగా మెలగేవాడు. కోటలపై బ్రిటిష్ కాల్పులు ప్రారంభమైనపుడు సైనిక స్థావరాల్లోనే నివసించుతూ సైనికులతోపాటే నిద్ర, ఆహారాలు తీసుకునేవాడు. ధైర్యంగా పోరాడేందుకు సైనికులలో వుత్సాహం కలిగించాడు.

బ్రిటిష్ యుద్ధ నావల గమనాన్ని జనరల్ చెన్, ఆతడి సేన అడ్డగించింది. శత్రువు వారిని చుట్టుముట్టినప్పటికీ, రక్షణ సేనలో చాలభాగం మరణించినప్పటికీ పోరాటం కొనసాగింది. సేనానికి ఏడుసార్లు గాయాలు తగిలి, దుస్తులు నెత్తురుతో

తడిసిపోయాయి. ఐనప్పటికీ తన స్థానాన్ని సేనాని వదలి వెళ్ళలేదు. రక్షణ సేనంతా మరణించాకనే బ్రిటిషువాళ్ళు కోటలను ఆక్రమించుకోగలిగారు.

## మొదటి అసమాన ఒడంబడిక - ప్రజా పోరాటం కొనసాగింపు

బ్రిటిష్‌వాళ్ళు చింకియాంగ్‌ను ఆక్రమించుకొని, నాంకింగ్ వైపు దాడి సాగించుతున్నారనే వార్త మంచూ ప్రభుత్వాన్ని చాలా గాభరా పెట్టింది. శాంతిని అభ్యర్థించుతూ రాయబారాలను పంపింది. దాని ఫలితంగా బ్రిటిష్ యుద్ధనావపై 1842 ఆగస్టు 29 వ తేదీన చైనా - బ్రిటిష్ ఒడంబడిక జరిగింది. విదేశ ప్రభుత్వంతో చైనా చేసుకున్న మొట్టమొదటి అసమాన ఒడంబడిక యిదే.

ఈ ఒడంబడికలోని ప్రధాన పాంశాలివి :

1. కాంటన్, ఫూ చౌ, అమోయ్, నింగ్‌పో, షాంఘై నగరాలలో విదేశ వర్తకానికి స్వేచ్ఛ యివ్వడం;

2. నష్టపరిహారంగా 2 కోట్ల 10 లక్షల వెండి డాలర్లను బ్రిటిష్‌వాళ్ళకు చెల్లించడం;

3. హాంగ్ కాంగ్‌ను బ్రిటిష్‌వాళ్ళకు అప్పగించటం;

4. పరస్పర అంగీకారంతో బ్రిటిష్ సరకులపై సుంకాలను విధించడం.

మరుసటి సంవత్సరమే బ్రిటిష్‌వాళ్ళు బలవంతంగా మంచూ ప్రభుత్వంచేత మరొక పత్రంపై సంతకం చేయించారు. దీని ప్రకారం కాంటన్, అమోయ్, ఫూచౌ, నింగ్‌పో, షాంఘై రేవులు ఐదింటిలోనూ బ్రిటిష్ వర్తకానికి స్వేచ్ఛ లభించింది. ఈ ఒడంబడికతోపాటు సంతకమైన అనుబంధ పత్రంలో యితర విషయాలతోపాటు క్రింది షరతులున్నాయి ;

1. బ్రిటిష్ వస్తువులపై దిగుమతి సుంకాలు 5 శాతం మించరాదని నిషేధించినందున, చైనా దేశీయ పరిశ్రమల అభివృద్ధికి అవసరమైన రక్షణ లేకుండాపోయింది.

2. ఒడంబడికలో ఉదహరించబడిన రేవు పట్టణాలున్న జిల్లాలలో బ్రిటిష్‌వాళ్లు నివసించడానికి అనుమతించుట ద్వారా విదేశీ స్థావరాల అంకుర మేర్పడింది.

3. చైనా వర్తకులతో బ్రిటిష్‌వాళ్ళకు తగాదాలువస్తే, బ్రిటిష్‌వాళ్ళను బ్రిటిష్ కాన్సలేట్‌కు అప్పగించుటద్వారా చైనా భూభాగంపై విదేశ చట్టాలు అమలు చేయడమనే దుష్టసాంప్రదాయం ప్రారంభమయింది.

ఒడంబడిక షరతులను, అనుబంధపత్రంలోని పాంశాలను అంగీకరించుట ద్వారా చైనాదేశం అర్థవలస స్థాయికి దిగజారింది.

అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వం 1842 లోనే ఒక సైనికదళాన్ని బ్రిటిష్ దురాక్రమణదారులకు సహాయంగా పంపింది. ఇపుడు మంచూ ప్రభుత్వాన్ని వత్తిడిచేసి, 1844 లో చైనా-అమెరికా ఒడంబడికపై వాంఘియావద్ద సంతకం చేయించింది. నాంకింగ్ ఒడంబడిక ద్వారా బ్రిటిష్‌వాళ్ళకు లభ్యమైన ప్రత్యేక

సౌకర్యాలన్నీ, 1844 చైనా, అమెరికా ఒడంబడికవల్ల అమెరికా ప్రభుత్వానికి లభ్యమయ్యాయి. దీన్లో చైనా భూభాగంపై యితర దేశస్థుల చట్టాల చెలామణీ, "అత్యంత అభిమానం పొందిన జాతి హక్కులను" గురించినహాంశాలు మరింత స్పష్టంగా ఉదహరించబడ్డాయి.

తరువాత ఫ్రెంచి ప్రభుత్వం రంగ లో ప్రవేశించింది. వ్హాంపో ఒడంబడికపై బలవంతంగా మంచూ ప్రభుత్వంచేత సంతకం చేయించింది. అదివరకు బ్రిటిష్, అమెరికను సామ్రాజ్యవాదులకు లభ్యమైన సౌకర్యాలన్నీ, ఈ ఒడంబడికవల్ల ఫ్రెంచి సామ్రాజ్యవాదులకు సైతం దఖలుపడ్డాయి. అదనంగా రోమన్ కాథలిక్ మత ప్రచారాన్ని స్వేచ్ఛగా చైనాదేశంలో కొనసాగించే హక్కునుకూడ ఫ్రెంచి ప్రభుత్వం సాధించింది. అటుపిమ్మట విదేశీ సరుకులతోపాటు, నల్లమందు వ్యాపారంతోపాటు, విదేశీ మతప్రచారకులు చైనాలో ప్రవేశించసాగారు.

1842 నాంకింగ్ ఒడంబడికపై సంతకం జరుగగానే, కాంటన్ ప్రజలు తమ నగరం గోడలలోపల బ్రిటిష్‌వాళ్ళు ప్రవేశించరాదని ఉద్యమం ప్రారంభించారు. నల్లమందు యుద్ధానంతరం లొంగిపోయింది మంచూపాలకులే గాని, చైనా ప్రజలు కాదని నిరూపించడానికి, ఈ వుద్యమం అనేక సంవత్సరాలు కొనసాగడమే నిదర్శనం.

బ్రిటిష్ దురాక్రమణను ప్రతిఘటించడమే, ఆశయంగావున్న "షెంగ్‌పింగ్ షే హ్స్యూయేహ్" అని పిలువబడే సాయుధ ప్రజాసంస్థ ఈ వుద్యమానికి నాయకత్వం వహించింది. ఈ సంస్థలో ప్రధానంగా రైతులు, చేతి పారిశ్రామికులు లక్షలనుంది సభ్యులుగా వుండేవారు. వర్తకులు, ప్రభువులు, చాలమంది స్త్రీలు కూడ ఇందులో చేరారు. అత్యవసరపరిస్థితు లేర్పడినపుడు వారంతా సమావేశమై, ఒకే జెండాక్రింద పోరాడేవారు.

ఈ విధంగా బ్రిటిష్ వాళ్ళను తమ నగరంలో కాలిడకుండా ప్రతిఘటించడంలో కాంటన్ ప్రజలు విజయం పొందారు వరుసగా అపజయాలు పొందాక, హాంకాంగ్‌లోని బ్రిటిష్ గవర్నరు తమ సేనలతో 1849 లో కాంటన్ నదిలోకి బలవంతాన చొచ్చుకువచ్చి నగరాన్ని స్వాధీనం చేయమని హెచ్చరించాడు. బ్రిటిష్ సవాలును ఎదుర్కొంటూ "షెంగ్‌పింగ్ షే హ్స్యూయేహ్" తన చరిత్రలోకల్లా బ్రహ్మాండమైన పోరాటాన్ని సాగించింది. ప్రజా ఒత్తిడి ఫలితంగా క్వాంగ్‌టుంగ్, క్వాంగ్‌సీ రాష్ట్రాల రాజప్రతినిధి హ్స్యూ కువాంన్-చిన్ బ్రిటిష్ నావలోకి వెళ్ళి బ్రిటిషువారికి నగరాన్ని స్వాధీనం చేయబోమని తిరస్కరించాడు. అతడిని బ్రిటిషు వాళ్ళు బంధించారు. ఈ సంగతి తెలియగానే ప్రతిఘటనోద్యమ సభ్యులు యేటి గట్టులపైన సమీకృతమై పోరాడసాగారు. రాజప్రతినిధిని విడుదలచేసి, బ్రిటిష్‌వాళ్ళు తమసేనలతో కాంటన్ నదిలోనుంచి తమ నావలను వెనక్కి ఉపసంహరించుకున్నారు: తమ సవాలును తాత్కాలికంగా విరమించుకున్నారు.

# నల్లమందు యుద్ధం ఫలితాలు

నాంకింగ్ ఒడంబడిక చేసుకుని, హాంగ్ కాంగ్‌ను బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఆక్రమించడంతో చైనాభూమిపై సర్వం సహాధికారానికి దెబ్బతగిలింది. చైనా గడ్డపై విదేశీయుల నివాసాలను, చర్చీలను నిర్మించుకునే హక్కును అత్యంతాభిమానం పొందిన జాతిగా పరిగణించేహక్కును సాధించాక విదేశ దురాక్రమణదారులు మరింతగా చైనా దేశంలోకి చొరబడసాగారు.

దిగుమతిసుంకాల ఒడంబడిక ఫలితంగా విదేశీ సరుకులు స్వేచ్ఛగా దిగుమతి కావడం, ముడిపదార్థాలు చౌకగా ఎగుమతి కావడం జరిగింది. విదేశ సామ్రాజ్య వాదులు వర్తకపు సరుకులను అమ్ముకునే మార్కెటుగానూ, చౌకగా ముడిపదార్థాలను అందజేసేదిగానూ చైనాదేశం క్రమంగా మారిపోయింది.

నల్లమందును తగులబెట్టినందుకు నాంకింగ్ ఒడంబడిక ప్రకారం నష్టపరిహారం చెల్లించవలసి వచ్చినందున, నల్లమందు వర్తకంపై వున్న నిషేధం తొలగి చట్టబద్ధమైన అవకాశమిచ్చి నట్లయింది. నల్లమందు దిగుమతి ఎక్కువ కాసాగింది: 1840 నుంచి 1850 నాటికి రెట్టింపుకు పెరిగింది. దేశంనుంచి వెండి తరలిపోవడంవల్ల క్రమంగా దాని ధర పెరగసాగింది. నల్లమందు యుద్ధ సమయానికి 16 వందల రాగినాణాల విలువ చేసే వెండికి, తదనంతరం 23 వందల రాగినాణాలు చెల్లించవలసివచ్చింది.

ఈ విధంగా నల్లమందు యుద్ధానంతరం జరిగిన నాంకింగ్ ఒడంబడిక ఫలితంగా చైనాప్రజలు విదేశ దురాక్రమణదారులక్రింద, తమ దేశీయ ఫ్యూడల్ పరిపాలకులక్రింద ద్విగుణీకృతమైన భారాన్ని (రెండు రకాల సంకెళ్ళను) మోయవలసి వచ్చింది: చైనాదేశం అర్థ ఫ్యూడల్ బానిసత్వానికి, అర్థవలస బానిసత్వానికి దిగజారవలసి వచ్చింది.

నల్లమందు యుద్ధంలో మంచూ ప్రభుత్వ చేతగానితనం, కుళ్ళు బట్టబయలయింది. మేధావులలో ఒక భాగం సంస్కరణల స్వభావంగల అభ్యుదయలక్ష్యాలను ప్రకటించసాగారు; చైనాదేశం బలపడాలన్నా, సుఖసంపదలను సాధించాలన్నా, పాశ్చాత్యుల విజ్ఞానాన్ని, టెక్నికల్ నైపుణ్యాన్ని అలవరచుకోవాలని వారు వాదించసాగారు.

ఈ భావాలను వ్యక్తం చేసిన వారిలో ప్రముఖుడు లిన్ ట్సే-హ్సూ అనే వారు. యుద్ధానికిముందే విదేశాలలో పరిస్థితులను గురించి తెలిసికోడానికి కృషి చేశారు. విదేశాలలో ప్రకటించే పత్రికలను ఆయన తెప్పించుకునేవారు; విదేశ పుస్తకాలను అనువాదం చేయించుకునేవారు. యుద్ధం ముగిసాక గనుల తవ్వకాన్ని వ్యక్తులు నిర్వహించడాన్ని గురించి మంచూ ప్రభుత్వానికి సూచనలు చేశాడు.

అదేకాలంలో లిన్ స్నేహితులలో ఒకరైన వీ యువాన్ ఫ్యాక్టరీలను నిర్మించాలనీ, తుపాకులను, మందుగుండును తయారుచేయాలనీ, సైన్యాలను పాశ్చాత్య

పద్ధతిలో తర్ఫీదు చేయాలనీ కోరాడు. విదేశ వ్యాపారాన్ని సవ్యమైన పద్ధతిలో అభివృద్ధిచేయాలనీ, ఆధునిక విజ్ఞానశాస్త్రాన్ని, సాంకేతిక నైపుణ్యాన్ని (టెక్నాలజీ) నేర్చుకోవాలనీ ఆయన వాదించేవాడు. లిన్ వలెనే ఆయనకూడ విదేశాలలోని పరిస్థితులను సక్రమంగా అధ్యయనం చేయడం అవసరమని ఎంచేవాడు. ఈ దృష్టితోనే ఇతరదేశాల చరిత్రను, భూగోళ శాస్త్రాన్ని దేశ పటాలతో సహా వివరించే పుస్తకాన్ని (హై కూవో టు చీహ్) ఆయన వ్రాశాడు. దీనిలో ఆయన ఎంతో కష్టపడి పోగుచేసిన సమాచారసంపదను క్రోడీకరించాడు.

## 40 వ అధ్యాయం

# తైపింగ్ విప్లవం

నల్లమందు యుద్ధానంతరం చైనాపై విదేశ పెట్టుబడిదారుల దురాక్రమణ మరింత తీవ్రమైనప్పటికీ, దానిని అరికట్టేందుకు మంచూ ప్రభుత్వం ఏవిధంగానూ పూనుకోలేదు. పైగా నష్టపరిహారాన్ని చెల్లించేందుకు ప్రజలనుండి ఎక్కువధనం వసూలుచేసే పనిలో నిమగ్నమయింది. మూడు సంవత్సరాలలో అనేకసార్లు అదనపు పన్నులను విధించింది. అదివరకే దారిద్ర్యమనుభవించుతున్న రైతులు మరింత బాధల పాలయ్యారు. భూస్వాములవద్ద అప్పులు చేయవలసివచ్చినందున పచ్చి దోపిడికి గురయ్యారు. వసంతకాలంలో అప్పుగా తీసికున్న ధాన్యానికి అదే సంవత్సరం ఆకురాలు కాలంలో రెట్టింపు చెల్లించవలసివచ్చేది. జీవితం గడవడమే కష్టమయింది. అసంఖ్యాకమైన కుటుంబాలు తమ పొలాలను భూస్వాములకు, పెద్ద వర్తకులకు అమ్ముకోవలసివచ్చింది. కొందరు తమ పొలాలను వదలి, దేశ దిమ్మరులుగానూ, కూలీలుగానూ లేదా బిచ్చగాళ్లుగానూ కాలం వెళ్ళబుచ్చసాగారు. మరికొందరు రహస్య విప్లవ సంస్థలలోచేరి, మంచూ పరిపాలనకు, భూస్వామ్యవర్గానికి వ్యతిరేకంగా పోరాడసాగారు.

1841-49 సంవత్సరాల మధ్య వందకు తక్కువగాకుండా రైతు తిరుగుబాట్లు పెద్దపెట్టున జరిగాయి. అందులో 26 తిరుగుబాట్లు ఒక్క 1847 సంవత్సరంలోనే బ్రద్దలయ్యాయి. ఈ తిరుగుబాట్లలో నయెన్ లేక "కాగడా ధరించిన" వారి వుద్యమము, టియెన్ టి హుయ్ (స్వర్గ భూలోకాల సంఘం) తిరుగుబాటు అన్నిటి లోకి బాగా శక్తివంతమైనవి.

ఉత్తర ఆన్‌హ్వాయ్ రాష్ట్రంలో నీన్ ఉద్యమం ప్రారంభమయింది : టావ్ కువాంగ్ చక్రవర్తి పరిపాలనకాలంలో కియాంగ్‌సూ - హోనాన్ - ఆన్‌హ్వాయీ సరిహద్దులో యిది ఉధృతంగా వుండేది. నీన్ బలాలు ఎల్లప్పుడూ సరియైన సమయం, అనుకూల ప్రదేశం ఎంచుకొని దాడిచేసేవి. వాటిని కట్టుకోగల అవకాశం మంచూ ప్రభుత్వ సేనలకు వుండేదికాదు.

1849 వ సంవత్సర ప్రాంతంలో హ్యూనాన్ రాష్ట్రంలో తీవ్రమైన కరువు వచ్చినపుడు, టియెన్ టి హుయీ ముఖ్యుడైన లీ యువాన్-ఫా నాయకత్వాన రైతులు తిరుగుబాటు చేశారు. హ్సిన్నింగ్‌ను ఆక్రమించుకున్న తర్వాత తిరుగుబాటుదార్లు తమ కార్యకలాపాలను క్వాంగ్సీవైపు కొనసాగించారు. అచటవున్న టియెన్‌టీ హ్యూయీ (స్వర్గ భూలోక సంఘం) స్థానిక శాఖలతో పాటు చువాంగ్, యావ్ తదితర అల్పసంఖ్యాక జాతులు తిరుగుబాటుదార్లతో చేతులు కలిపాయి.

ప్రతిచోటా మంచూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా రైతులు ఆయుధాలు తీసికుని, తిరగబడుతున్న సమయంలో బ్రహ్మాండమైన తైపింగ్ విప్లవం క్వాంగ్సీ రాష్ట్రంలో ప్రారంభమయింది.

మధ్యతరగతి రైతు కుటుంబాన్నుంచి వచ్చిన దరిద్రపీడితుడైన బడిపంతులు హుంగ్ హ్సియూ-చువాన్ ఈ తిరుగుబాటుకు నాయకత్వం వహించాడు. అతడు క్వాంగ్‌టుంగ్ నివాసి; రైతుల దారిద్ర్యానికి కారణమని మంచూ ప్రభుత్వ అవినీతిని తీవ్రంగా ద్వేషించేవాడు. ఫెంగ్ యున్-షాన్‌తో కలిసి హుంగ్ దైవపూజకొరకు ఒక సంస్థను (షాంగ్ టీ హుయీ) స్థాపించాడు; యాంగ్ హ్సియూ - చింగ్ హ్సియావ్ చావ్-క్వీయీ, వీ చాంగ్ - హ్యూయి, షీహ్ టా-కాయ్ అను ఈ ఉద్యమంలోని ప్రముఖులు, తరువాత తైపింగ్ విప్లవానికి నాయకత్వం వహించారు. రైతులు, బొగ్గు కార్మికులు వీరిని అనుసరించారు.

1849 నాటికి కొన్ని సంవత్సరాలనుంచి క్వాంగ్సీరాష్ట్రం కరువుపాలయింది. దుర్భరబాధలు భరించలేక రైతులు టియెన్ టి హుయి నాయకత్వాన తిరుగుబాటులో విస్తృతంగా పాల్గొన్నారు. కాలం పరిపక్వమయిందని గుర్తించి, హుంగ్ హ్సియూ-చువాన్ తన అనుచరులకు కుయీపింగ్ కౌంటీలోని చిన్‌టీన్ గ్రామంలో సమీకరణ కావాలని ఆజ్ఞాపించాడు. 1851 సంవత్సరం జనవరి 11 వ తేదీన గొప్ప శాంతిని నెలకొల్పే స్వర్గ రాజ్యాన్ని (తైపింగ్ టీన్ కువో) స్థాపించుతూ ప్రకటన చేశారు.

అదే సంవత్సరం సెప్టెంబరులో ఉత్తర క్వాంగ్సీలోని యుంగాన్‌ను తైపింగ్ స్వాధీనం చేసుకుంది. 1852 ఏప్రిల్‌లో చక్రవర్తి సైన్యాల వలయాన్ని బద్దలు చేసికుని, విప్లవకారులు ఉత్తర దిశగా పురోగమించారు. ఎచటికి వెళ్ళినా టియెన్ టి హుయీ సాయుధ దళాలు, రైతులు వారితో కలవడంవల్ల తిరుగుబాటుదార్ల సంఖ్య బ్రహ్మాండంగా పెరిగింది. అనేక యుద్ధాలలో విజయం సాధించిన తర్వాత 1853 జనవరిలో వూహాన్ నగరంలో తైపింగ్ సైన్యాలు ప్రవేశించాయి.

విజయపరంపరలను సాధించుతున్న తైపింగ్ సేనలు ఎర్ర తలపాగాలు ధరించి నౌకలపై యాంగ్‌ట్సీ నది దిగువ ప్రాంతానికి తరలివెళ్ళాయి. అదే సంవత్సరం మార్చి నెలలో మందు పాతర్లు పెట్టి నాంకింగ్ నగర ప్రాకార గోడలకు గట్లుకొట్టి, తుపానులా విరుచుకుపడి నగరాన్ని స్వాధీనం చేసుకున్నాయి. నాంకింగ్‌కు కొత్త

నామకరణంచేసి, టియెన్ చింగ్ (స్వర్గ రాజధాని) అని పిలువసాగారు. తైపింగ్ స్వర్గ రాజ్యానికి పదకొండు సంవత్సరాలు ఈ నగరం రాజధానిగా వుంది.

## వ్యవసాయ విధానం - విదేశాంగ పాలసీ

ఫ్యూడల్ భూస్వాముల చేతుల్లో వున్న భూమి కేంద్రీకరణను తొలగించ డానికి కొత్త వ్యవసాయ విధానాన్ని తైపింగ్ ప్రభుత్వం ప్రకటించింది. దీని ప్రకారం పదహారు సంవత్సరాలు దాటిన స్త్రీ పురుషులందరికీ సగటు సారవంత మైన భూమిని ఒక్కొక భాగం, పదహారు సంవత్సరాలలోపు వారికి అర్థభాగం యివ్వాలిసి వుంటుంది. ఈ కార్యక్రమం రైతుల కోర్కెలను తీర్చేదిగా వుంది. కాని మంచూ సైన్యంతో నిరంతర యుద్ధంవల్ల దానిని అమలుజరపడం సాధ్యం కాలేదు. ఐనప్పటికీ దున్నే వారికి వారు సాగుచేసే భూమిపై హక్కును యిస్తూ, ఇకముందు భూస్వాములకు మక్తాలనురైతులు చెల్లించనవసరంలేదని ప్రభుత్వం శాసనం చేసింది. భూమిపై హక్కు భూస్వాములది కాదనీ, సాగుచేసే రైతులదేననీ నిర్ణయించింది. రైతులు సాగుచేసే భూములకు పట్టాలిచ్చి, వారే భూఖామందులని చట్టరీత్యా ధృవపరచింది. "దున్నే వారికే భూమి" నిచ్చే ఈ విధానంవల్ల రైతుల జీవన పరిస్థితులు బాగుపడ్డాయి : దానితో పాటు మొత్తం ఆరిక పరిస్థితి మెరుగయింది.

ఫ్యూడల్ సమాజంలో స్త్రీలకు ఎలాంటి హక్కులు లేవు. అలాంటప్పుడు పురుషులతో పాటు స్త్రీలకు సమాన ఆర్థిక రాజకీయ హక్కులను తైపింగ్ ప్రభుత్వం యిచ్చింది. సాగుచేసే భూమిలో స్త్రీలకు భాగమిచ్చింది ప్రభుత్వం నిర్వహించే పరీక్షలలో స్త్రీలు పాల్గొనవచ్చు; వాటిలో నెగ్గితే ప్రభుత్వోద్యోగాలు చేయవచ్చు. సైన్యంలోకికూడ స్త్రీలను చేర్చుకోవడం, పురుషులతో పాటు కర్తవ్యాలను నిర్వహించడం జరిగింది. బాలికల పాదాలను బంధించడం, బానిసలుగా అమ్మడం నిషేధించ బడింది.

ఫ్యూడల్ సమాజంలోని సంప్రదాయమైన పెళ్ళికొరకు స్త్రీల క్రయ విక్రయాలను నిషేధించుతూ తైపింగ్ ప్రభుత్వం కొత్త వివాహ చట్టాన్ని చేసింది. పెళ్లిళ్లలో పెద్ద బహుమానాలను, కట్నాలను నిరుత్సాహపరచింది. ఏకపత్నీ వివాహాన్ని అమలు జరిపింది. పురుషులు ఉంపుడుగత్తెలను వుంచుకోడాన్ని అరికట్టింది.

ఈ విధంగా ఆర్థికంగా, రాజకీయంగా విమోచనం పొందడంవల్ల తైపింగ్ పరిపాలనలో స్త్రీలు స్వతంత్రంగా, ధైర్యంగా వ్యవహరించేవారు. ఆ రోజుల్లో నాంకింగ్ నగరాన్ని దర్శించిన విదేశస్తులు, వీధుల్లో ధీమాగానూ, స్వతంత్రంగాను నడుస్తున్న లేదా స్వారీ చేస్తున్న స్త్రీలను చూసి ఆశ్చర్యపోయారు.

ఒకవైపున మంచూ ప్రభుత్వం విదేశ సామ్రాజ్యవాదులకు తలవొంచుతూంటే, తైపింగ్ ప్రభుత్వం స్వతంత్రమైన విదేశాంగ విధానాన్ని అనుసరించింది. వివిధ దేశాలమధ్య సమానత్వం కొరకు, స్వేచ్ఛా వ్యాపారం కొరకు నిలబడింది. నల్లమందు దిగుమతులను పూర్తిగా నిషేధించింది.

ఫ్రెంచి మంత్రి ఎ. డి. బోర్‌బోలన్, అమెరికా మంత్రి రాబర్ట్ మాక్‌లేన్ కూడ నాంకింగ్ వెళ్ళి, విదేశ ప్రభుత్వాలయెడల తైపింగ్ దృక్పథం ఏమిటో తెలిసికొనేందుకు ప్రయత్నించారు. తైపింగ్ ప్రభుత్వంయెడల భవిష్యత్తులో తా మెలా వ్యవహరించాలో నిర్ణయించుకొనేందుకు సామ్రాజ్యవాదుల కిది అవసరమయింది.

## ఉత్తర, పశ్చిమ దండయాత్రలు

1853 మే నెలలో తైపింగ్ ప్రభుత్వం పదివేల సైన్యాన్ని లిన్ ఫెంగ్-హ్సియాంగ్, లీకై-ఫాంగ్‌ల నాయకత్వం క్రింద యాంగ్‌ట్సీ నదికి ఉత్తరవైపు దండయాత్రకు పంపింది. మంచూ ప్రభుత్వ బలమైన కేంద్రంగావున్న పెకింగ్ నగరమే ఈ దండయాత్రకు లక్ష్యం. ఎలాంటి ప్రతిఘటన ఈ సైన్యాన్ని ఎదుర్కోలేదు: ఉత్తర ప్రాంతీయులు సంతోషంగా స్వాగతమిచ్చారు. ఐదునెల్లలో అన్‌హ్వేయ్, హొనాన్, షాంసీ, తర్వాత ఛీలీ (హోపీ) రాష్ట్రాలగుండా ముందుకు పురోగమించి, టీన్‌ట్సీన్ నగరంవద్దకు వచ్చారు. ఎంతో గాభరాపడి ప్రభువులు, వుద్యోగులు త్వరత్వరగా తమ కుటుంబాలను పెకింగ్‌నుంచి దూరంగా పంపివేశారు. చక్రవర్తి హ్సియేన్ ఫెంగ్ జెహోల్‌కు పారిపోవాలని సన్నాహాలు చేసుకున్నాడు. చాల ప్రదేశాలనుంచి చక్రవర్తి సేనలను ఛీలీవద్దకు రప్పించి, తైపింగ్ దాడిని అరికట్టేందుకు, వెనుకనుంచి సప్లయిలు బంద్ చేసేందుకు పూనుకున్నారు. తమకంటే ఎక్కువ సేనలు ఎదుర్కొన్నందువల్లను, తమ సప్లయి కేంద్రానికి చాలదూరం వచ్చినందువల్లనూ తైపింగ్ సైన్యం తిరోగమించి, దక్షిణ హోపీలోని లీన్‌చెన్‌కు వెళ్ళింది. అచట వారిచుట్టూ మంచూ సేనలు వలయంగా వున్నాయి. నాంకింగ్‌నుంచి తైపింగ్ ప్రభుత్వం అదనపు బలాలను పంపింది.

లిన్ ఫెంగ్-హ్సియాంగ్ నాయకత్వాన తైపింగ్ సేనలు లీన్ చెన్ చుట్టూ రక్షణలను నిర్మించుకుని, అనేక మంచూ దాడులను తిప్పికొట్టాయి. కాని రక్షణ సేనలకు ఆహారకొరత ఏర్పడి, కేవలం నల్ల చిక్కుడు గింజలు తినవలసివచ్చింది. ఐనప్పటికీ పోరాటంసాగించారు. నల్లచిక్కుళ్ళుకూడ అయిపోయి, ఆయుధాలనుపట్టే శక్తికూడ లేనంతగా సైనికులు బలహీనపడిన తర్వాతనే లీన్ చెన్ శత్రువుల వశమయింది.

ఈలోగా లీన్ చెన్ వదలి, నాంకింగ్‌నుండి వస్తున్న అదనపు సేనలను కలసికోడానికి వెళ్ళిన లీ కై-ఫాంగ్, సినాన్‌కు పశ్చిమోత్తరంగా వున్న కౌటాంగ్‌కు చేరుకున్నాడు. అదనపు బలాలను శత్రువులు చుట్టుముట్టి, ధ్వంసంచేశారనే వార్త తెలిసికున్నాడు. చిపింగ్ కౌంటీలోని ఫెంగ్ కువాంటుంగ్ వద్ద నిలబడి, శత్రువులను ప్రతిఘటించాలని నిర్ణయించుకున్నాడు. కాని మంచూ సేనలు గ్రాండ్ కెనాల్ (గొప్ప కాలువ) నీటిని మరల్చి, ఆ ప్రాంతాన్నంతటినీ ముంచివేశాయి. ఎచట చూసినా నడుంలోతు నీళ్ళు, తుపాకిమందు రక్షణకు వేసిన మందు పాతర్లు వగైరా తడిసిపోయినందున ఆ ప్రదేశంలో నిలబడి పోరాడటమే అసంభవమయింది. అందు

చేత వలయం బ్రద్దలుచేసుకొని బయటపడాలని తైపింగ్ సేనాని లీ కై-ఫాంగ్ నిర్ణయించుకున్నాడు. కాని ఆ ప్రయత్నంలో అతడు చనిపోయాడు.

లిన్ ఫెంగ్-హ్సియాంగ్, లీ కై-ఫాంగ్ ఉభయ సేనానుల నాయకత్వం క్రింద తైపింగ్ సేనలు మొత్తం రెండు సంవత్సరాలు వీరోచితంగా పోరాడాయి.

ఉత్తర దండయాత్రతో పాటే నాంకింగ్‌లోని తైపింగ్ ప్రభుత్వం హూ-ఈ-హువాంగ్, లై హాన్-ఇంగ్, షీ టా-కై నాయకత్వం క్రింద మరికొన్ని సేనలను పంపి, యాంగ్‌ట్సీ నది మధ్యప్రాంతంలోని మంచూ ప్రభుత్వ కేంద్రాలను ఆక్రమించుకునేందుకు కృషిచేసింది. ప్రజల తోడ్పాటుతో తైపింగ్ సేనలు ఆంకింగ్‌ను పట్టుకున్నాయి: నాన్‌చాంగ్‌ను చుట్టుముట్టాయి: చాంగ్‌షావై దాడిచేశాయి: వూహాన్ నగరాన్ని రెండుసార్లు ఆక్రమించుకున్నాయి. ఇచట మంచూ సేనలు ధ్వంసమయ్యాయి.

ఈ సమయంలోనే ట్సెంగ్ కౌ-ఫాన్ రంగం పైకి వచ్చాడు. హునాన్ రాష్ట్రానికి చెందిన భూస్వామి, ఉన్నతవర్గానికి (మండారిన్) ఉద్యోగి యైన ఇతడు, తన రాష్ట్రంలో "వాలంటీరు సైన్యాన్ని" సమీకరించాడు. తైపింగ్‌తో పోరాటానికి పూనుకున్నాడు. తైపింగ్ సేనాని షి టా-కై తన సేనతో పోయాంగ్ సరస్సు ముఖద్వారంవద్ద నిలిపి, యాంగ్‌ట్సీలోని హునాన్ సేనల కార్యకలాపాలను జాగ్రత్తగా కనిపెడుతూ, వేచివున్నాడు. రాత్రివేళ యేటిగట్టునే డోళ్లు, తప్పెట్లు వాయించుతూ, శత్రువుల యుద్ధఓడల పైకి నిప్పుబాణాలను తైపింగ్ సేనలు వర్షంలా కురిపించాయి.

ఈ విధంగా కొన్ని ఓడలు ధ్వంసం చేయబడ్డాయి. ఇలా ఒకమాసం గడిచేటప్పటికి హునాన్ సేనలు తరిగిపోయి, అలసిపోయాయి. తరువాత శత్రువుల యుద్ధనావలు పోయాంగ్ సరస్సులోనికి చొచ్చుకుపోయేలాగ షీ టా-కై వలపన్నాడు. అవి సరస్సులోకి వచ్చాక, ద్వారం బంధించి 40 శత్రు నావలకు నిప్పంటించి నాశనం చేశారు. కియాంగ్సీ రాష్ట్రంలో హెచ్చుభాగాన్ని తైపింగ్ సేనలకు వదలి, ఎలాగో ప్రాణం దక్కించుకుని ట్సెంగ్ కౌ-ఫాన్ పారిపోయాడు.

తైపింగ్ రాజ్యానికి రాజధానిగా నాంకింగ్ నగరాన్ని ఎంచుకున్నారనే వార్త తెలియగానే మంచూ ప్రభుత్వం రెండు పెద్ద సేనలను పంపింది. అందులో ఒక సైన్యం నాంకింగ్‌కు దక్షిణాన తిష్టవేసి, చియాంగ్‌నాన్ వద్ద గొప్ప సైనిక శిబిరాన్ని నిర్మించింది: రెండోది యాంగ్ ట్సీ నదికి ఉత్తరపు గట్టుపైన తిష్టవేసి చియాంగ్‌పీ వద్ద గొప్ప సైనిక శిబిరాన్ని నిర్మించింది.

## రెండవ నల్లమందు యుద్ధం

తైపింగ్ విప్లవం పురోగమించుతున్న సమయంలో నల్లమందు యుద్ధానంతరం 1842-44 లో జరిగిన ఒడంబడికలను తిరగతోడాలని సామ్రాజ్యవాద దేశాలైన

బ్రిటను, ఫ్రాంసు, అమెరికాలు పట్టుబడ్డాయి. దేశాంతర్గత వర్తకం చేసుకునేందుకు, మరిన్ని ఎక్కువ సముద్రరేవులను వినియోగించుకునేందుకు తమకు అవకాశ మివ్వాలని కోరారు. మంచూ ప్రభుత్వంతో రాయబారాలు ఒకసారికి మించియే విఫలమయ్యాయి. దేశంలోని అంతర్యుద్ధ పరిస్థితులవల్ల, ఉక్కిరిబిక్కిరవుతున్న ప్రభుత్వానికి మద్దతు యివ్వడంద్వారా తమ లక్ష్యాన్ని సామ్రాజ్యవాదులు సాధించుకున్నారు. తైపింగ్ విప్లవాన్ని అణచివేయడానికి మంచూ ప్రభుత్వానికి అండదండలుగా సామ్రాజ్యవాదులు నిలబడి సహాయం చేశారు.

1856 అక్టోబరులో నల్లమందు చేరవేస్తున్న "ఏరో" అనే చైనా ఓడను కాంటన్‌లోని ప్రభుత్వాధికారులు సోదాచేసి, కళాసులను బర్తరఫ్ చేశారు. ఇందుకు బ్రిటిష్ కాన్సల్ క్వాంగ్‌టుంగ్, క్వాంగ్సీ రాష్ట్రాలకు రాజప్రతినిధియైన ఎహ్ మింగ్-చెన్‌కు అసమ్మతి తెలియజేశారు. "ఏరో" బ్రిటిషువారికి చెందిన ఆస్థనీ, కళాసులను వెంటనే విడుదలచేసి, ఈ ఘటన జరిగినందుకు క్షమాపణ చెప్పాలనీ కోరారు. బ్రిటిష్ హెచ్చరికను రాజప్రతినిధి నిరాకరించినపుడు బ్రిటిష్ సైన్యాలు పెరల్ నదిలో ప్రవేశించి, కాంటన్ నగరంపై దాడి చేశాయి.

క్వాంగ్సీలో ఫ్రెంచి మత ప్రచారకుడొకడు చంపబడ్డాడనే సాకుతో ఫ్రెంచి ప్రభుత్వం బ్రిటిషువాళ్ళతో చేతులు కలిపింది. 1857 డిసెంబరులో బ్రిటిష్-ఫ్రెంచి నావికా సైన్యాలు కాంటన్ నగరాన్ని ఆక్రమించాయి; రాజప్రతినిధిని ఖైదీగా పట్టుకున్నాయి.

కాంటన్ నగరం తమ చేతుల్లో పడగానే బ్రిటిష్-ఫ్రెంచి నావికా సైన్యం ఉత్తరానికి సాగిపోయి, పీహో ముఖద్వారంలోవున్న టాకు కోటలను ఆక్రమించింది.

1858 జూన్‌లో బ్రిటిష్-ఫ్రెంచి సామ్రాజ్యవాదులకు లొంగిపోయి, మంచూ ప్రభుత్వం టీన్‌స్టిన్ సంధిపత్రాలపై సంతకం చేసింది. దీనిలో నియుచువాంగ్, టెంగ్ చౌ, తైవాన్, టాన్‌షుల్, హాన్‌కౌ, నాంకింగ్, చుంకియాంగ్ వగైరా కొత్త రేవులను విదేశ వ్యాపారస్తులకు తెరవడానికి, యాంగ్‌ట్సీ నదిలోనికి విదేశీ వర్తక నావలను రానివ్వడానికి అంగీకరించింది. ప్రొటెస్టంటు, రోమన్ కాథలిక్ ప్రచారకులకు చైనాలో క్రిస్టియన్ మత ప్రబోధానికి అవకాశ మివ్వబడింది. చైనా దేశ అంతర్భాగంలోనికి విదేశీయుల స్వేచ్ఛా ప్రయాణానికి, సంధిపత్రంలో పేర్కొన్న రేవుల్లోనికి విదేశీయుల యుద్ధనావలు వచ్చిపోయేందుకు హక్కు యివ్వబడింది. బ్రిటిష్ వర్తకుల ఆస్థికి జరిగిన నష్టానికి 20 లక్షల వెండి నాణాలను బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలకు చెరి 20 లక్షల వెండి నాణాలను నష్టపరిహారం క్రింది చెల్లించడానికి చైనా ప్రభుత్వం అంగీకరించింది.

తరువాత వరుసగా అమెరికా ప్రభుత్వంతోనూ, జారిస్టు రష్యాతోనూ ఆదేరకం సంధిపత్రాలపై మంచూ ప్రభుత్వం సంతకం చేసింది.

మరల 1860 లో బ్రిటిష్-ఫ్రెంచి ప్రభుత్వాలు చైనాపై దాడిచేశాయి. టీన్‌స్టీన్ సంధులపై ఆమోదపత్రాలను పంపడం ఆలస్యమైనదనే సాకు ఈసారి సామ్రాజ్యవాదుల దాడికి కారణం. శత్రుసైన్యాలు టీన్‌స్టీన్ నగరాన్ని ఆక్రమించుకుని, దారిలో దోపిడీలు, ఖూనీలు సాగించుతూ పెకింగ్ వైపు దాడివెడలాయి. రాజధానికి పడమరగావున్న ప్రపంచఖ్యాతి వహించిన యువాన్ మింగ్ యువాన్ వేసవి రాజభవనాన్ని దోచుకుని, తగులబెట్టి పూర్తిగా ధ్వంసం చేశాయి. గొప్ప శిల్ప సౌందర్యానికి, ప్రపంచంలోని కళాసంపదకు గొప్ప భాండాగారంగా యీ రాజ భవనం పరిగణించబడేది. ఈ సౌధాన్ని సర్వనాశనం చేయడంలో సామ్రాజ్యవాదుల పైశాచికత్వం ద్యోతకమయింది: చైనా ప్రజలకు తీరని నష్టం కలిగింది.

యుద్ధ పర్యవసానంగా పెకింగ్‌లో సమావేశం జరిగి, బ్రిటిష్ - ఫ్రెంచి ప్రభుత్వాలతో మరికొన్ని సంధిపత్రాలపై మంచూ ప్రభుత్వం సంతకాలు చేయవలసివచ్చింది. వీటి ప్రకారం టీన్‌ట్సీన్ రేవుకూడ విదేశీ నావల స్వేచ్ఛా విహారానికి అర్పితమయింది. కౌలన్ అగ్రమని పిలువబడే ప్రాంతం బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు పూర్తిగా ధారాదత్తం చేయబడింది. ఉభయ దురాక్రమణ దారులకు చెరి 80 లక్షల వెండి నాణాలను నష్టపరిహారంగా మంచూ ప్రభుత్వం చెల్లించింది.

కాంటన్ నగరం బ్రిటిష్, ఫ్రెంచి సైన్యాల ఆక్రమణలో వుండగా, నాన్‌హై పాన్యూ కౌంటీలలోని అనేక వేలమంది సోదరులతో కలసి సాన్‌యువాన్లీ ప్రజలు దేశభక్తుల సైన్యాన్ని సమీకరించి, దురాక్రమణదారులను ఎదుర్కొన్నారు. హాంకాంగ్‌లో పని చేస్తున్న చైనావారికి విజ్ఞప్తి చేయగా, 20 వేలమందికి పైగా దేశభక్తులు అచటినుండి తరలివచ్చారు. బ్రిటిష్ వలసలోని అనేక భవనాలను తగులబెట్టారు. రాత్రివేళ బయటకు రావడానికే బ్రిటిష్‌వాళ్లకు దమ్ములేకపోయింది. క్వాంగ్‌టుంగ్ రాష్ట్రంలో ప్రజలు అవకాశం దొరికినపుడల్లా, వీలున్న ప్రతిచోటా శత్రువుపై దాడిచేసి దుంపతెంపారు.

1859 లో రెండోసారి చైనాపై ఆంగ్లో - ఫ్రెంచి దురాక్రమణ సాగినపుడు, హైహో నది ముఖద్వారంలోవున్న 13 శత్రు ఫిరంగి బోటులపైన టాకు కోటల్లోని మంచూ సైనికులు దాడిచేశారు. శత్రు బోటులలో నాలుగింటిని ముంచివేశారు: ఆరింటిని పనికిరాకుండా పాడుచేశారు: మూడు మాత్రమే తప్పించుకుని పారిపోయాయి. ఫిరంగి యుద్ధం సాగుతుండగా చైనా కోటలను పట్టుకునేందుకు 900 మంది శత్రు సైనికులు ప్రయత్నించి, తీవ్ర నష్టాలతో పారిపోయారు. దీన్లో 460 మంది బ్రిటిష్, ఫ్రెంచి సైనికులు మరణించడమో, గాయపడటమో జరిగింది. టాకు కోటలపై దాడిచేసిన బ్రిటిష్, ఫ్రెంచి నావికా సైన్యానికి అండగా వచ్చిన అమెరికన్ యుద్ధనావలు కూడ మంచూ సైన్యాలపై కాల్పులు సాగించాయి. దేశ రక్షణకు పోరాడుతున్న సేనలకు, స్థానిక ప్రజలు దేశభక్తితో ప్రాణాపాయాన్ని ఖాతరు చేయకుండా ఆహారం అందజేశారు.

# యాంగ్‌ట్సీ నది దిగువ ప్రాంతంలో తైపింగ్ యుద్ధాలు

ఈ దశలో అంతర్గత తగాదాలవల్ల తైపింగ్ వుద్యమంలో చీలికలు వచ్చాయి. ప్రముఖ సేనానులలో ఒకడైన యాంగ్ హ్సియూ - చింగ్ యిందుకు ప్రధాన కారకుడు. అతడు బలం సేకరించుకుని హాంగ్ హ్సియూ-చువాన్‌తో కీచులాడ ప్రారంభించాడు. ఫలిత మేమంటే యాంగ్, మరొక నాయకుడైన వీ చాంగ్-హ్వూ ఖూనీ చేయబడ్డారు.

తైపింగ్ నాయకత్వంలో వచ్చిన చీలికలను అవకాశంగా తీసికుని, మంచూ ప్రభుత్వం పెద్ద సైన్యాన్ని సమీకరించింది. ఎదురుదాడులు ప్రారంభించి, నాంకింగ్ నగరం చుట్టూ వలయాన్ని మరింత దగ్గరకు నెట్టుకురాగలిగింది.

చియాంగ్‌నాన్‌లోని మంచూ ప్రభుత్వం పెద్ద సైనిక శిబిరం దృష్టిని ప్రక్క దారిని పట్టించేందుకు తైపింగ్ సేనాని లీ హ్సియూ-చెంగ్ 1860 లో హాంగ్ చౌ నగరంపై దాడి చేశాడు. మూడురోజుల్లో చెకియాంగ్ రాష్ట్రి ముఖ్యపట్టణాన్ని ఆక్రమించుకొన్నాడు. అదనపు బలాలను హాంగ్ చౌ నగరానికి మంచూ ప్రభుత్వం వురికించడం గమనించగానే లీ సేనాని తైపింగ్ సైన్యాలను నాంకింగ్ వద్దకు మరల్చాడు. దక్షిణ శిబిరంలోని మంచూ సైన్యంలో చాలమందిని పంపివేసినందున అది చాల బలహీనంగావుంది. ఇది గమనించి లీ తన బలాన్నంతటినీ కేంద్రీకరించి, చియాంగ్‌నాన్‌లోని గొప్ప శత్రు శిబిరాన్ని తుడిచిపెట్టాడు.

కీలకస్థానమైన ఆంకింగ్ కొరకు జరిగిన పోరాటంతో యుద్ధగతి మారింది. నది రేవు అయిన ఆంకింగ్, రాజధాని నాంకింగ్ రక్షణకు కీలకంగా వున్నందున, దానిని రక్షించేందుకు తైపింగ్ తన శక్తినంతనూ వినియోగించింది. ఆంకింగ్‌పై శత్రుముట్టడిని తొలగించడానికి 1860 లో నాలుగుసార్లు దండయాత్రలు సాగించింది; కాని ఆశించిన ఫలితం రాలేదు. నగరంచుట్టూ తమ స్వాధీనంలోవున్న ప్రాంతాన్ని తైపింగ్ విస్తరించగలిగిందే గాని శత్రుముట్టడిని తొలగించలేకపోయింది. పెద్ద ఫిరంగులతో నగర గోడలను కూల్చివేశాక, హ్యునాన్ సేనలు ఎట్టకేలకు ఆంకింగ్‌ను పట్టుకున్నాయి. 20 వేలకు మించిన తైపింగు సైనికులు చివరివరకు పోరాడి, ఆహుతయ్యారు. ఆంకింగ్ పతనంతో యిదివరకటికంటే నాంకింగ్‌కు ప్రమాద మెక్కువయింది.

## తైపింగ్ ఓటమి

తైపింగ్ ప్రభుత్వం స్వతంత్ర విదేశాంగ విధానాన్ని అనుసరించడం సామ్రాజ్యవాద దురాక్రమణదారులకు కంటకప్రాయమయింది. తైపింగ్ విప్లవం ప్రారంభదశలో "తాటస్థ్య" విధానం అనుసరించినప్పటికీ సామ్రాజ్యవాదులు రహస్యంగా మంచూ ప్రభుత్వానికి ఆయుధాలను, మందుగుండును అమ్మారు. రెండవ నల్లమందు యుద్ధానంతరం మంచూ ప్రభుత్వం తమకు నమ్మదగిన బంటుగా తయా

రయ్యాక, తైపింగ్ విప్లవాన్ని ఓడించడానికి సామ్రాజ్యవాదులు బహిరంగంగానే దానితో చేతులు కలిపారు.

1860 తరువాత సముద్ర తీరంలోని అన్ని పెద్ద నగరాల్లోనూ విదేశీ తుపాకీ దళాలు ఏర్పడ్డాయి; ఉదాహరణకు షాంఘై నగరంలో అమెరికన్లు, నింగ్పోలో ఫ్రెంచివాళ్లు అలాగే ఏర్పరచారు. బ్రిటిష్‌వాళ్లు, ఫ్రెంచివాళ్ళు కలసిన సంయుక్త దళాలుకూడ ఏర్పడ్డాయి. ఈ దళాలు ఎచటికి వెళ్ళినా దోచుకోడం, చంపడం ద్వారా చైనా ప్రజలను చెప్పరాని బాధలు పెట్టేవారు. హువాయ్ నదీలోయలో జమీందారు లీ హుంగ్-చాంగ్ సమీకరించిన అన్ హ్వీయ్ "వాలంటీర్" (త్సెంగ్ కో-ఫాన్ హునాన్ సైన్యం లాంటిది) సైన్యానికి సామ్రాజ్యవాదులు ఆయుధాలను సప్లయిచేశారు. దానిని బలమైన విప్లవ ప్రతీఘాత సైన్యంగా తయారుచేశారు.

1862 జనవరిలో లీ హ్సియూ-చెంగ్ నాయకత్వాన తైపింగ్ సేనలు షాంఘై నగరం పైకి దాడి వెడలాయి. అన్ హ్వీయ్ సైన్యం, బ్రిటిష్-ఫ్రెంచి సేనలు కలసి ప్రతిఘటించినప్పటికీ తైపింగ్ సేనలు చాలా విజయాలు పొందాయి. ఐనప్పటికీ హ్యూనాన్ సైన్యం దాడి ప్రమాదానికి గురైన నాంకింగ్‌కు తక్షణమే రమ్మని పిలుపు వచ్చినందున, షాంఘై దాడిని వదలివేసి, లీ తన సైన్యంతో నాంకింగ్‌కు వెళ్ళవలసి వచ్చింది.

మంచూ సేనలు నింగ్‌పోమీద దాడి చేస్తుంటే, 1862 మే లో హాంగ్ చౌ అఖాతంనుంచి బ్రిటిష్-ఫ్రెంచి సేనలు దిగి, నగరాన్ని ఆక్రమించుకోవడంలో పాల్గొన్నాయి. 1863 జూన్‌లో ఫ్రెంచి తుపాకి దళాల సహాయంతో మంచూ సైన్యం షావ్ హ్సింగ్‌ను పట్టుకున్నాయి: మరుసటి సంవత్సరం హాంగ్ చౌను పట్టుకున్నాయి. చెకియాంగ్ రాష్ట్రంలోని తైపింగ్ సైనిక చర్యలు ఆ విధంగా ముగింపుకొచ్చాయి.

## నాంకింగ్ పతనం

1862 మేలో హూనాన్ సైన్యం యుహుతై వైపునుంచి నాంకింగ్ నగరం పైకి దాడివచ్చింది. భీకరయుద్ధం జరిగింది. దాడి సేనలతో నలభైరోజులవరకు లీ హ్సియూ-చెంగ్ వీరోచితంగా పోరాడాడు; కాని శత్రువును తరిమివేయలేక పోయాడు. రాజధాని నాంకింగ్‌కు ప్రమాదం అలాగే వుంది. రెండు సంవత్సరాల అనంతరం హునాన్ సైన్యం మరింత ఉధృతంగా నాంకింగ్‌పై తిరిగి దాడిచేసింది. హుంగ్ హ్సియు-చువాన్ ఆత్మహత్య చేసుకున్నాడు. ఆహార కొరతవల్ల తైపింగ్ రక్షణసైన్యంలో మూడు లేక నాలుగువేలమంది మాత్రమే యుద్ధం చేయగలస్థితిలో వున్నారు. హునాన్ సైన్యం తుపానువలె నగరంపైకి అన్ని వైపులనుండి ముంచుకొచ్చినపుడు తైపింగ్ సైనికులు చివరి మనిషివరకు పోరాడి ఆహుతయ్యారు. లీ హ్సియు-చెంగ్ ఖైదీగా పట్టుకోబడి, తరువాత త్సెంగ్ కూ-ఫాన్‌చే చంపబడ్డాడు.

తైపింగ్ తిరుగుబాటు ద్వితీయ ఘట్టంలో లీ హ్సియు-చెంగ్ సేనాని అత్యంత ప్రముఖ పాత్రను నిర్వహించాడు. ఆయన యెడల విశ్వాసాన్ని, గౌరవాన్ని ప్రజలు చూపేవారు. సూచౌ, చాంగ్ షా నగరాల్లో వున్నపుడు లీ గౌరవార్థం స్మారక చిహ్నాలను స్థానిక ప్రజలు నిర్మించారు. ఆయన వీరత్వాన్ని చాటుతూ జానపద గేయాలను దక్షిణ కియాంగ్సులో ప్రజలు నేటికీ పాడుతుంటారు.

చైనాదేశ చరిత్రలోకల్లా అత్యంత పెద్ద రైతుల తిరుగుబాటు తైపింగ్ విప్లవం. నాయకులలో తగాదాలు, రాజకీయ సైనిక పొరపాట్లు తైపింగ్ విప్లవం ఓడిపోవడానికి కారణాలు. దేశంలోని ప్రతీఘాతకులు, విదేశీ దురాక్రమణదారులు కలసి చేసిన సంయుక్త దాడిని ఓడించేందుకు అవసరమైన శక్తి పై రెండు కారణాల వల్ల తైపింగ్‌కు లేకపోయింది. ఐనప్పటికీ తిరుగుబాటుదార్లు దీర్ఘపోరాటాన్ని - 1851 నుంచి 1864 వరకు, పధ్నాలుగు సంవత్సరాల వరకు - సాగించగలిగారు. పదిహేడు రాష్ట్రాలకు తిరుగుబాటుదార్ల పలుకుబడి విస్తరించింది. మంచూ ప్రభుత్వ పునాదులను కదల్చివేశారు; దేశీయ భూస్వాములకు విదేశీ దురాక్రమణదారులకు తీవ్రమైన దెబ్బ కొట్టగలిగారు.

41 వ అధ్యాయం

# నీన్ ఉద్యమం

# అల్పసంఖ్యాక జాతుల తిరుగుబాట్లు

## నీన్ ఉద్యమం

తైపింగ్ విప్లవం మొదటిరోజుల్లో నీన్ లేక "కాగడా ధారుల" వుద్యమం కియాంగ్‌సూ, ఆన్‌హ్వాయ్, షాంటుంగ్, హూనాన్ రాష్ట్రాలలో వృద్ధికాసాగింది. తైపింగ్‌కు ఉత్తర ప్రాంతంలో మిత్ర ఉద్యమంగా పెంపొందింది. నాంకింగ్ పడిపోయాక తైపింగ్ సైన్యంలో ఒకభాగం కలిసినందున నీన్ సైన్యం బలపడింది.

నీన్ ఆశ్వికసైన్యం ధైర్యానికి పేరు పొందింది. శత్రు కాల్బలనుకూడ లెక్క చేయకుండా నీన్ ఆశ్వికులు సుడిగాలివలె మంచూ సేనలపై విరుచుకుపడేవి. దగ్గరకు వచ్చాక కత్తులు, బల్లాలు వినియోగించి శత్రువును తుడిచిపెట్టేవారు. నీన్ దళాలు పారిపోతున్నట్లు నటించి వెంటాడుతున్న మంచూ సైన్యం అలసిపోయాక, ఆకస్మికంగా వెనుదిరిగి పక్క దెబ్బలు కొట్టి, శత్రువులను ధ్వంసంచేసేవి. నీన్ ఆశ్విక దళాలంటే మంచూ సేనలు భయపడేవి: దూరంగా వాటివల్ల రేగిన దుమ్ము కన్పించినా గాభరాపడేవి.

1865 సంవత్సరం మే నెలలో మంచూలపై నీన్‌లు అద్వితీయమైన విజయాన్ని పొందారు. పేరుపొందిన మంచూ సేనాని సెంగాలిన్‌ట్సిన్ రాకుమారుని నాయకత్వం క్రింద వున్న సేనలను షాంటుంగ్ రాష్ట్రం నైరుతి భాగంలో వున్న హోట్సెవద్ద చుట్టుముట్టి, సప్లయిలు అందకుండా ఆపుజేశారు. రాకుమారుడు రాత్రివేళ వందమంది ఆశ్వికులతో వలయాన్ని చీల్చుకొనిపోవాలని ప్రయత్నించాడు: కాని అడవుల్లో నీన్ కాపలాదార్లు దెబ్బతీసినందున సెంగాలిన్‌ట్సిన్ చనిపోయాడు.

మంచూ ప్రభుత్వం రాజధానికి ప్రమాదం సంభవించుతుందేమోనని చాల గాభరాపడింది. హునాన్, ఆన్‌హ్వాయ్ సైన్యాలను నీన్‌లతో పోరాడేందుకు పంపింది. నీన్ ప్రాంతాలలో వారి చర్యలను అరికట్టేందుకు రక్షణ దుర్గాలను (బ్లాక్ హౌసెస్) నిర్మించింది. భూస్వాముల సైనికదళాలను ఏర్పరచి కాపలా పెట్టింది.

దీనివల్ల నీన్‌లూ తన యుద్ధవ్యూహాన్ని మార్చుకోవలసివచ్చింది. తమ బలగాలను రెండు ప్రత్యేక సైన్యాలుగా విభజించి దాదాపు దేనికది స్వతంత్రంగా పోరాడ సాగాయి. తూర్పు నీన్ సైన్యం లై వెన్-కువాంగ్ నాయకత్వాన, పశ్చిమ నీన్ సైన్యం చాంగ్ ట్సుంగ్-యూ నాయకత్వాన వుండేవి.

తూర్పు నీన్ సైన్యం హోనాన్‌నుంచి హూపే రాష్ట్రం పైకి దాడి వెళ్లాయి. కొలది నెలల్లోనే అనేక యుద్ధాలలో పోరాడి జయించాయి. మంచూ సేనలనుండి విదేశ ఆయుధాలను, గుర్రాలను పట్టుకున్నాయి. వాటిని లక్షవరకు పెరిగిన తమ సైన్యానికి వినియోగించుకున్నాయి.

కాని తాము జయించిన ప్రాంతంలో సప్లయి కేంద్రాలను ఏర్పరచుకోనందున, దీర్ఘ కాల యుద్ధంలో తగినంత విశ్రాంతిలేక క్రమంగా నీన్ సైన్యం బలహీనపడ సాగింది. తూర్పు నీన్ సైన్యం హూపేనుంచి షాంటుంగ్‌కు తిరిగి వెళ్ళినపుడు, చేఫూవద్ద బ్రిటిష్ - ఫ్రెంచి దళాల తోడ్పాటుతో మంచూసైన్యం వారిని ఎదుర్కొంది. అచటినుంచి బలవంతాన నీన్ సైన్యం దక్షిణానికి నెట్టబడింది; 1868 వసంత కాలంలో యాంగ్‌చౌవద్ద జరిగిన యుద్ధంలో ఓడిపోయింది. వారి నాయకుడు లై వెన్-కువాంగ్‌ను ఖైదీగా పట్టుకుని, చంపివేశారు.

పశ్చిమ నీన్ సైన్యం హోనాన్‌నుంచి షెన్సీ, షాన్సీ రాష్ట్రాలగుండా చిహ్లీకి చొచ్చుకుపోయింది. టీన్‌ట్సీన్ నగరాన్ని సమీపించింది. మరల అచటకూడ బ్రిటిషు, ఫ్రెంచి దురాక్రమణదారుల తోడ్పాటుతో మంచూ సైన్యాలు వారిని ఎదుర్కొన్నాయి. నీన్ సేన ఉత్తర షాంటుంగ్‌కు తిరోగమించుతుండగా, ఆకస్మికంగా తుహై నది వరదవచ్చి వారికి ఆవరోధ మేర్పడింది. నీన్‌లు ధైర్యంగా పోరాడి ఆహుతయ్యారు.

## మియో తిరుగుబాటు

తైపింగ్ విప్లవ ప్రభావంక్రింద క్వీచౌ ఆగ్నేయభాగంలో నివసించుతున్న మియోజాతి ప్రజలు, మంచూ ప్రభుత్వ దారుణ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా, 1854 వ సంవత్సరంలో తిరుగుబాటు చేశారు.

చాంగ్ హ్సియూ-మీ నాయకత్వం క్రింద తిరుగుబాటుదార్ల సంఖ్య కొన్ని లక్షలకు పెరిగింది. విదేశ తుపాకులు, ఫిరంగులు కలిగిన మంచూ సైన్యాలు అనేక వైపులనుంచి 1867 లో చింగ్ చు-యువాన్ పైన, ఈశాన్య క్వీచౌలోని షీహ్‌చీన్ కౌంటీపైన దాడిచేశాయి. శత్రుసేనలు చుట్టుముట్టినప్పటికీ మియోలు మరుసటి సంవత్సరంవరకు ఆ ప్రాంతాన్ని వదలివేయలేదు. చాంగ్ హ్సియు-మీ నాయకత్వం క్రింద మరో నాలుగు సంవత్సరాలు పోరాటం సాగింది.

మంచూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మియో ప్రజలు పోరాటం పద్ధెనిమిది సంవత్సరాలు కొనసాగింది. వీరోచితంగానూ, ధైర్యంగానూ పోరాడినందున నైరుతీ చైనాలోని ప్రజలందరి అభిమానాన్ని మియోలు పొందారు.

## హుయియా ప్రజల తిరుగుబాట్లు

హుయియా ప్రజలు యున్నాన్‌లోనూ, పశ్చిమోత్తర చైనాలోనూ నివాస మేర్ప రచుకున్న అల్పసంఖ్యాక జాతికి చెందినవారు. యున్నాన్ రాష్ట్రవాసులు ప్రధానంగా వ్యవసాయంపై జీవించేవారు. గనుల తవ్వకం తెలుసు. ఆ రాష్ట్రానికి, బర్మాకు మధ్య వర్తకంకూడ చేసేవారు. మంచూ వుద్యోగులు వారినుండి అధికపన్నులు గుంజేవారు; వారి భూములనుకూడ కాజేసేవారు. ఈ నిరంకుశత్వాన్ని భరించలేక హుయియా ప్రజలు చాలసార్లు తిరుగుబాటు చేశారు.

1855 లో ఒక వెండి గని విషయంలో హాన్‌జాతికి చెందిన కొందరు గూండాలతో హుయియా ప్రజలకు తగాదావచ్చింది. మంచూ వుద్యోగులు జోక్యం చేసుకుని, హుయియా ప్రజలపై నిర్బంధ విధానాన్ని తీవ్రతరం చేశారు. తద్వతిరేకంగా అనేకచోట్ల హుయియా ప్రజలు తిరుగబడ్డారు. హాన్ జాతీయులను తమను సమానంగా పరిగణించాలనీ, పన్నులభారాన్ని తగ్గించాలనీ, హుయియా ప్రజలు అర్థించారు.

తిరుగుబాటుదార్ల సేనలలో ఒకటి, మధ్య యున్నాన్‌లోని టాలీని ఆక్రమించుకుని, అచటి సైనిక కేంద్రాన్ని ఏర్పరచింది. రైతులకు దుక్కి-పశువులను ఇదులిచ్చి, వారి జీవితం బాగుపడేందుకు కృషిచేసింది. ఇందువల్ల తిరుగుబాటుదార్లు ప్రజాభిమానాన్ని పొందారు.

హుయియా తిరుగుబాటుదార్లు కున్మింగ్‌పైన దాడిచేసి, 1868 లో దానిని చుట్టుముట్టారు. విదేశీ ఆయుధాలతోనూ, సప్లయిలతోనూ బలమైన సేనలను రాష్ట్ర రాజధాని రక్షణకు మంచూ ప్రభుత్వం పంపింది. హుయియా సేనలు తమ ముట్టడిని ఎత్తివేసుకోవలసి వచ్చింది.

మంచూ సేనలు మూడు వైపులనుండి టాలీపైన ఎదురుదాడి చేశాయి. హుయియా సేనలు తీవ్రంగా ప్రతిఘటించాయి; చాలమంది మంచూ సైనికులు చనిపోయారు. 1872 నాటికి మాత్రమే మందు పాతరలతో నగర గోడలను బ్రద్దలు చేయడం ద్వారా విజయం పొందారు. టాలీ శత్రు వశమైనప్పటికీ మరొక సంవత్సరం వరకు యితరచోట్ల హుయియాలు పోరాటం సాగించారు.

పశ్చిమోత్తరాన నివసించే హుయియా ప్రజలు ధైర్యం కలిగిన బలవంతులు. బాల్యంలోనే స్వారీ చేయడం, విలువిద్య నేర్చుకుంటారు. వంద అడుగుల దూరాన వున్న శత్రువును రాళ్ళతో సూటిగా కొట్టగలరు. యున్నాన్‌లోని హుయియాల వలెనే వీరుకూడ మంచూ వుద్యోగుల క్రూరత్వంవల్ల బాధపడుతుండేవారు

మంచూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా హుయియా ప్రజలు చాల తిరుగుబాట్లు చేశారు. 1863 వ సంవత్సరంలో జరిగిన తిరుగుబాటు వాటన్నిటికన్నా చాల వ్యాప్తి చెందింది. తిరుగుబాటుదార్లు 18 సైనికదళాలుగా సంఘటితమయ్యారు: పశ్చిమోత్తర ప్రాంతమంతా విప్లవజ్వాలలు వ్యాపించాయి. షెన్సీ రాష్ట్ర ముఖ్యపట్టణమైన సియాన్‌పై దాడిచేసి, మంచూ అసనపు బలాలపై తీవ్రమైన దెబ్బ కొట్టారు. పశ్చిమ

నీన్‌తో భుజం భుజం కలిపి వారు 1866 లో పోరాడి తమ పలుకుబడిని ఉత్తర షాన్సీకి విస్తరింపచేసుకున్నారు.

ట్సో ట్సుంగ్-టాంగ్ అనే హాన్ సేనాని తైపింగ్‌ను ఓడించడంలో ముఖ్యపాత్ర వహించాడు. మంచూ ప్రభుత్వం ఇతడిని హుయీలను అణచడానికి పంపింది. మంచూ సేనలు ఆధునికాయుధాలతో తిరుగుబాటుదార్లపై దాడిచేశాయి. కాని ఈశాన్య కంసూలో చిన్ చిపావోవద్ద హుయీలు ఐదువందల అడుగోడలను, రక్షణ దుర్గాలను నిర్మించి, మంచూ సేనలను ఓడించారు. ఎల్లోనది గట్లులను తెంచి, హుయీలున్న ప్రాంతాన్నంతటినీ మంచూలు నీటితో ముంచారు. ఇందువల్ల హుయీలకు తీవ్రమైన నష్టాలు కలిగాయి. ఈ విధంగా 1873 లో పశ్చిమోత్తర ప్రాంత హుయీ తిరుగుబాట్లను అణిచివేశారు.

1864 లో సింకియాంగ్ రాష్ట్రమంతటా ఉయ్‌ఘుర్ జాతి ప్రజల నాయకత్వం క్రింద అన్ని జాతుల ప్రజలూ మంచూ ప్రభుత్వంపై తిరుగుబాటు చేశారు.

ఈ అల్పసంఖ్యాక జాతుల తిరుగుబాటు లన్నిటిలోనూ రైతులు ప్రధాన పాత్ర వహించారు. మంచూ నిరంకుశత్వానికి, ఫ్యూడల్ దోపిడికి వ్యతిరేకంగా జరిగిన తైపింగ్ విప్లవంతో ఈ తిరుగుబాటు లన్నిటికీ సన్నిహితసంబంధం వుంది.

## 42 వ అధ్యాయం

# జాతీయ పెట్టుబడిదారీ విధానం పుట్టుక

## చైనాలో విదేశీ పెట్టుబడిదారీ సంస్థలు - చైనా కార్మికవర్గ ఉద్భవం

పంధొమ్మిదో శతాబ్దం మధ్యలో సామ్రాజ్యవాద దేశాలు తమ పారిశ్రామిక సంస్థలను చైనాలో స్థాపించుకోవడం ప్రారంభించాయి. మొట్టమొదటగా 1845 లో బ్రిటిష్‌వాళ్ళు కాంటన్‌లో ఓడరేవును (డాక్‌యార్డ్‌ను) నిర్మించారు: లండన్, చైనాలమధ్య నావికా మార్గాన్ని తెరచారు. షాంఘైలో అమెరికన్లు, బ్రిటిష్‌వాళ్ళు చేరి ఒక ఓడరేవును నిర్మించారు. తరువాత అమోయ్, ఫూచౌలలో కూడ వాళ్ళు ఓడరేవులను నిర్మించారు. క్రమక్రమంగా చైనాలోని ఓడ నిర్మాణ పరిశ్రమనంతనూ విదేశ ప్రభుత్వాలు తమ గుత్తసొమ్ముగా చేసుకున్నాయి.

1863 నుంచి రష్యన్లు తేయాకు ఫ్యాక్టరీలను హాంకౌ, కియుకియాంగ్, ఫూచౌ పట్టణాల్లో ఏర్పరచారు. దీనివల్ల దేశీయ తేయాకు పారిశ్రామికులకు దెబ్బతగిలింది. తేయాకు బిళ్ళలను తయారుచేసి, విదేశాలకు ఎగుమతిచేసే కేంద్రంగా హాంకౌ నగరం వుండేది. 1865 లో ఏడాదికి 14 వేల పికుల్సు ఎగుమతి అనగా, 1875 నాటికి 110 వేల పికుల్సు ఎగుమతి అవసాగాయి. హాంకౌలో దాదాపు తేయాకు ఎగుమతి వ్యాపారమంతా రష్యన్ల చేతుల్లోవుంది.

మొదటి పట్టునూలు మిల్లును 1862 లో బ్రిటిషువాళ్ళు షాంఘై నగరంలో స్థాపించారు: తదనంతరం ఫ్రెంచివాళ్ళు, అమెరికన్లు స్థాపించారు. విదేశీ నూలు మిల్లులవల్ల రైతుల ఇళ్ళలోనూ, దేశీయ కర్మాగారాల్లోనూ పట్టునూలు వడికే చేతి వృత్తికి దెబ్బతగిలింది.

పంచదారను, గుడ్లపొడిని, తోళ్ళపదును వగైరా చేసే ఫ్యాక్టరీలను విదేశ పెట్టుబడిదారులు స్థాపించారు.

ఈ ఫ్యాక్టరీల సంస్థాపనతో చైనా కార్మికవర్గం ఉద్భవించింది. వృత్తిని కోల్పోయిన చేతివృత్తులవారినుండి, దివాలాతీసిన రైతులనుండి కార్మికులు వచ్చారు. విదేశ ఫ్యాక్టరీ యజమానులు వారిని దారుణంగా దోచుకునేవారు.

1845 నుంచి బ్రిటిష్ డాక్‌యార్డులలో చైనా కార్మికులు పనిచేసేవారు. హాంకాంలోని రష్యన్ తేయాకుఫ్యాక్టరీలో 800మంది కార్మికులుపనిచేసేవారు. ఫూచౌ, కియుకియాంగ్ ఫ్యాక్టరీలలో పనిచేసేవారితో కలిసి 1890 నాటికి మొత్తం 7 వేల చైనా తేయాకు కార్మికు లుండేవారు. విదేశీయుల పట్టునూలు మిల్లులలో స్త్రీలు, పురుషులుకూడ పనిచేసేవారు. షాంఘేలో అమెరికన్లు నిర్మించిన ఒక నూలు మిల్లులో 1882 నాటికి వేయిమంది కార్మికులు పనిచేసేవారు.

ప్రారంభంనుంచి చైనా కార్మికవర్గం విదేశ పెట్టుబడిదారుల ఆర్థిక దోపిడీకి, ఫ్యూడల్ పరిపాలకుల రాజకీయ నిరంకుశత్వానికి గురౌతూవచ్చింది. రోజుకు పది నుంచి పదహారు గంటలు పనిచేయగా వేతనం రోజుకు 30 సెంట్లకు లోపుగావుండేది. దీనితో కుటుంబపోషణే చాలకష్టంగా వుండేది.

## జాతీయ పెట్టుబడిదార్లు

విదేశపెట్టుబడి చైనాలోనికి రావడం, ఫ్యాక్టరీలను పెట్టడం గమనించి, చైనా కర్మాగారాల్లోకికూడ యంత్రాలను తెప్పించసాగారు. 1861లో ఫూచౌలోని చైనా వర్తకులు తేయాకు బిళ్ళలు తయారు చేసేందుకు విదేశాలనుండి యంత్రాలు తెప్పించారు. రెండేళ్ళ అనంతరం షాంఘైలో హాంగ్‌చెంగ్ బియ్యం వర్తకులు, ధాన్యం ఆడేందుకు బియ్యపు యంత్రాలను ఉపయోగించసాగారు. 1880లో క్వాంగ్‌టుంగ్ రాష్ట్రంలో నాన్‌హై వర్తకులు పట్టునూలు యంత్రాలతో ఫ్యాక్టరీని స్థాపించారు. వీటితోనూ, తదితర చిన్న ఫ్యాక్టరీలతోనూ జాతీయపెట్టుబడిదారీ విధానం ప్రారంభమయింది.

చైనా ధనికులు – వర్తకులు, భూస్వాములు, నిరంకుశోద్యోగులు – ఆధునిక పరిశ్రమల్లో పెట్టుబడి పెట్టారు: చైనా పెట్టుబడిదారీ విధానానికి ప్రాతిపదిక వేశారు. వర్తకుల్లోంచి పెట్టుబడిదారులుగా తయారైనవారు యీ వర్గంలో క్రింది భాగంగా వుండేవారు: పూర్వపు భూస్వాములనుండి, నిరంకుశోద్యోగులనుండి వచ్చిన వారు చైనా బూర్జువావర్గంలో పైభాగంగా తయారయ్యారు. రెండోవారు తమకున్న రాజకీయాధికారాన్ని, ఎక్కువ పెట్టుబడిని వినియోగించుకుని మొదటివారికంటె త్వరగా పరిశ్రమలను అభివృద్ధి చేయగలస్థితిలోవుండేవారు. చాలచిక్కులను ఎదుర్కోవలసి వచ్చినందున మొదటి తరహావారు సామాజిక సంస్కరణలకు ఎక్కువ అనుకూలంగా వుండేవారు.

జాతీయ పెట్టుబడిదారీ విధానం ప్రారంభమవడంతోపాటు కొత్తగా రూపొందుతున్న చైనా బూర్జువావర్గంలో సంస్కరణవాద ధోరణులు తలెత్తాయి: తమ ప్రయోజనాలను రక్షించుకునేందుకు రాజకీయ సంస్కరణలు కావాలని ఆశించేవారు. పాశ్చాత్యుల భావాలను స్వీకరించిన మేధావులు రాజకీయ సంస్కరణల ఆవశ్యకతను గుర్తించసాగారు: ఆధునిక విజ్ఞానశాస్త్రాన్ని, యంత్ర నిర్మాణ కౌశల్యాన్ని అలవర్చుకోవాలని వాంఛించేవారు.

ఈ తెగకు చెందిన బూర్జువావర్గ మేధావులలో ఫెంగ్ కుయీ-ఫెన్, చెంగ్ కువాన్-ఇంగ్ అనేవారు ప్రముఖులు. లిన్ ట్సే-హ్సూ శిష్యవర్గంలోని వాడు ఫెంగ్. 1861 లో ఆయన వ్రాసిన పుస్తకంలో పెట్టుబడిదారీ దేశాలలోని విజ్ఞానశాస్త్రాన్ని, యంత్రోత్పత్తి విధానాన్ని అలవరచుకుని వాటిలో నైపుణ్యాన్ని చైనా సంపాదించాలని ప్రబోధించాడు. రాజకీయ సంస్కరణలను ప్రవేశపెట్టాలనీ, తద్వారా పెట్టుబడిదారీ పంథాలో చైనా అధిగమించ గలుగుతుందనీ ఆయన వాదించాడు.

గనుల తవ్వకం, రైల్వేల నిర్మాణం, ఆధునిక పత్రికా ప్రచురణ, పాశ్చాత్యుల పద్ధతిలో స్కూళ్ళు ప్రారంభించాలని, చెంగ్ కువాన్-ఇంగ్ ప్రబోధించాడు. అప్పటికి వున్న ఫ్యూడల్ రాజకీయవ్యవస్థస్థానే, శాసనసభను, రాజ్యాంగబద్ధమైన రాచరికాన్ని ఏర్పరచాలనీ వాదించాడు: తద్వారా పెట్టుబడిదారీ విధానం పెంపొందుతుందని ఆశించాడు.

స్థానిక రైతులు, చేతివృత్తులవారు కలసి ఏర్పరచుకున్న సంస్థ "హ్సియావ్ టావోహుయి" (చిన్న కత్తుల సంఘం) 1853 లో షాంఘైలోని మంచూ ప్రభుత్వాధికారాన్ని కూలదోసింది. తరువ కాశాన్ని వినియోగించుకుని ప్రముఖ రేవుగావున్న షాంఘై నగరంలోని సుంకాలు వసూలుచేసే ప్రభుత్వ యంత్రాన్నంతటినీ బ్రిటిష్ వాళ్ళు, అమెరికన్లు, ఫ్రెంచివాళ్ళు స్వాధీనం చేసుకున్నారు. రెండవ నల్లమందు యుద్ధానంతరం ఒడంబడికలోని యితర రేవులున్న ఇరవై పట్టణాలలోకూడ సుంకాల వసూలు అధికారాన్ని విదేశ సామ్రాజ్యవాదులు హస్తగతం చేసుకున్నారు. ఇందువల్ల పారిశ్రామిక సరుకులను చైనాపై రుద్దడానికీ, ముడి పదార్థాలను చౌకగా కాజేయుడానికీ విదేశీయులకు పూర్తి స్వేచ్ఛ దొరికింది.

చైనా ఆర్థిక జీవితంపై విదేశీయుల సంకెళ్ళు మరింత బిగిశాయి: అంతేగాక ప్రభుత్వ కార్యకలాపాలపై కూడ వారి ప్రాబల్యం ఎక్కువయింది. రాబర్ట్ హార్ట్ అనే ఇంగ్లీషువాడిని మంచూ ప్రభుత్వం సుంకాల ఇన్‌స్పెక్టర్ జనరల్‌గా నియమించింది. ఆచరణలో అతడే పోలీసు, విదేశాంగ వ్యవహారాలలో మంచూ ప్రభుత్వానికి సలహాదారుగా తయారయ్యాడు. రాజప్రతినిధులను నియమించడం మొదలు, సంధి రాయబారాలు నడపడంవరకు చాలా విషయాలలో అతడు జోక్యం కలిగించుకునేవాడు. చైనాదేశం అర్ధవలస స్థాయిలోకి దిగజారిపోయింది.

## పాశ్చాత్యుల అనుకరణ

తైపింగ్ విప్లవం, నల్లమందు యుద్ధం జరుగుతున్న రోజుల్లో ప్రభుత్వాధికారుల్లోనూ, భూస్వాముల్లోనూ ఒక భాగానికి ప్రతినిధులైన ట్సెంగ్ కువో-ఫాన్, లీ హుంగ్-చుంగ్ లాంటివారు ప్రభుత్వ నిధులతో ఆయుధ పరిశ్రమను నిర్మించడానికి పూనుకున్నారు. మంచూ ప్రభుత్వ ఫ్యూడల్ పరిపాలనను నిలబెట్టడం తమ స్వంతాధికారాన్ని విస్తరించుకోవడమే వారి లక్ష్యం. తుపాకులు, ఫిరంగులు

తయారుచేసి, చిన్న యుద్ధనావలను నిర్మించి, మంచూ సేనలకు సప్లయిచేశారు. విదేశ మిలిటరీ వుద్యోగులు పాశ్చాత్యపద్ధతిలో మంచూ సేనలకు డ్రిల్లుచెప్పి, తర్ఫీదు చేశారు. "పెట్టుబడిదారీ దేశాలను అనుకరించండి" అనే నినాదంతో పాశ్చాత్యీకరణ వుద్యమం కొనసాగింది.

1862 లో ప్రారంభించి, లీ హుంగ్ - చాంగ్ వరుసగా ఆయుధ ఫ్యాక్టరీలను షాంఘైలో రెండు, సూచౌలో ఒకటి, నాంకింగ్‌లో మరొకటి స్థాపించాడు. 1866 లో ట్సో ట్సుంగ్-టాంగ్ ఫూచౌలో ఓడరేవును నిర్మించాడు. 1867లో మంచూప్రభుత్వ ఉన్నతాధికారుల్లో ఒకడైన చుంగ్ హౌ టీన్‌ట్సీన్‌లో యంత్ర నిర్మాణ కర్మాగారాన్ని స్థాపించాడు.

ఈ సంస్థల యాజమాన్యం వేర్వేరు గ్రూపులకు చెందిన అధికార్ల-భూస్వాముల చేతుల్లో వుండేది. మేనేజర్లు, టెక్నికల్ నిపుణులు ప్రధానంగా విదేశీయులే వుండేవారు. నాంకింగ్ ఆయుధ ఫ్యాక్టరీలో బ్రిటిష్ ప్రాబల్యం వుండేది; ఫూచౌ ఓడరేవులో ఫ్రెంచి ఇంజనీర్లు, మేస్త్రీలు పెత్తనంచేసేవారు. ఈ సంస్థలలో బిగించిన యంత్రాలన్నీ విదేశాలనుండి దిగుమతి చేసినవే. ఉత్పత్తి అవకాశాలు కొద్దిగానే వుండేవి. పెద్ద ఆయుధాలను ఉత్పత్తిచేయగల శక్తి లేనేలేదు. మేనేజిమెంటులో అవినీతివల్ల ఈ సంస్థల నిర్వహణ అధ్వాన్నంగా వుండి, ఎంతో ధనం నష్టమై పోతుండేది.

43 వ అధ్యాయం

# చైనా - ఫ్రెంచి యుద్ధం

## చైనా సరిహద్దు ప్రాంతాలపై విదేశీయుల దురాక్రమణ

నల్లమందు యుద్ధం తరువాత చైనా భూభాగంపై అమెరికా కన్ను వేసి, కాచుకుని కూచుంది.

1867 లో మునిగిపోయిన ఓడ కళాసులను తాయివాన్ ప్రజలు చంపారనే సాకుతో అమెరికా సేనలు ఆ దీవి దక్షిణాన దిగాయి: అచటి వాస్తవ్యులను చంపాయి. తాయివాన్ ప్రజలు ప్రతిఘటించుతూ పోరాడారు. శత్రువు దాడిచేసినపుడు అడవుల్లో రక్షణ తీసుకునేవారు: శత్రువు విశ్రాంతి తీసుకునేటపుడు అన్ని వైపులనుంచి దాడిచేసి, సముద్రంలోకి తరిమివేసేవారు.

పంధొమ్మిదో శతాబ్దం చివరిభాగంలో అమెరికా మద్దతుతో జపాను, చైనా ఆగ్నేయ తీరంలోని దీవులపై అనేక దాడులు చేసింది. 1868 లో మేజీ పునరుద్ధరణ తర్వాత పెట్టుబడిదారీ విధానం త్వరగా అభివృద్ధి చెందిన రోజుల్లోనే జపాన్ సామ్రాజ్య విస్తరణకు పూనుకుంది.

1874 లో జపాన్ తాయివాన్ దీవిపై దాడి చేసింది. ఈ దండయాత్రలో జపాన్ యుద్ధ నావలపై అమెరికా మిలిటరీ ఉద్యోగులుండి నడిపించారు. దీవిలోని ప్రజలు, సైన్యంకూడ తీవ్రంగా ఎదిరించి పోరాడాయి: దురాక్రమణదారులను వెనుకకు నెట్టాయి. తాము "మధ్యవర్తిత్వం" నెరపుతామని అమెరికన్లు ముందుకొచ్చారు. జపాన్ సేనలను ఉపసంహరించుకున్నందుకు మంచూ ప్రభుత్వం 5 లక్షల వెండి నాణాలను, దీవిలో నిర్మించిన రోడ్లకు, భవనాలకుగాను చెల్లించవలసివచ్చింది.

బ్రిటిష్‌వాళ్ళు బర్మాదేశాన్ని ఆక్రమించుకున్న తర్వాత యున్నాన్ రాష్ట్రం (చైనా నైరుతి ప్రాంతం) లోనికి చొరబడసాగారు. పెకింగ్‌లోని బ్రిటిష్ రాయబార కార్యాలయంలోని ఉద్యోగి ఆర్. ఏ. మాగరీని 1875 లో యున్నాన్‌లో ఖూనీ చేశారనే సాకుతో, బర్మానుంచి యున్నాన్‌లోకి దారి యివ్వాలని మంచూ ప్రభుత్వంపై బ్రిటిష్‌వాళ్ళు ఒత్తిడి తెచ్చారు. 1876 సంవత్సరంలో జరిగిన చెఫూ

సదస్సులో ఉభయులూ ఒడంబడికపై సంతకాలు చేశారు. దీనిప్రకారం యున్నాన్, జిచువాన్, టిబెట్, కంసు, చింఘాయి రాష్ట్రాలలో కార్యకలాపాలు జరిపేందుకు బ్రిటిష్‌వాళ్ళకు హక్కు యివ్వబడింది.

పద్దెనిమిదో శతాబ్దం చివరిభాగం నాటికే బ్రిటిష్‌వాళ్ళు టిబెట్‌పై కన్నువేసి వుంచారు. అచటి వర్తక అవకాశాలను అధ్యయనం చేసేందుకు ఒక పరిశీలక దళాన్ని బ్రిటిష్ ప్రభుత్వం 1873 లోనే పంపింది. చెఫూ ఒడంబడిక ప్రకారం నైరుతి చైనా సరిహద్దు ప్రాంతాలలో ప్రవేశించేందుకు తమకు లభ్యమైన అవకాశాలను వినియోగించుకుని, ఆ ప్రాంతాల ఖనిజ సంపదను పరిశోధనకొరకు ఇంగ్లీష్‌వాళ్ళ దళ మొకటి తయారయింది. ఈ కోర్కెను టిబెట్ అధికారులు అనేకసార్లు నిరాకరించారు. అందుమీదట సాయుధచర్య తీసికుంటామని బ్రిటిష్‌వాళ్ళు బెదిరించారు. టిబెటన్లు కృతనిశ్చయంతో ప్రతిఘటనకు సంసిద్ధమయ్యారు. టిబెటన్ల సాయుధ శక్తి పెరుగుతుందనే భయంతో ప్రతిఘటనను అంగీకరించక, మంచూ ప్రభుత్వం బ్రిటిష్‌వాళ్ళకు లొంగిపోయింది. ఐనప్పటికీ టిబెటన్ల పట్టుదల, ధైర్యం ఫలితంగా ఈసారికూడ టిబెట్‌లో ప్రవేశించాలన్న బ్రిటిష్‌వాళ్ళ పన్నాగం విఫలమయింది.

## చైనా-ఫ్రెంచి యుద్ధం

పద్దెమిదవ శతాబ్దం చివర్లో ఫ్రెంచివాళ్ళు వియత్నాంపై దురాక్రమణ ప్రారంభించారు. అచటినుంచి యున్నాన్, క్వాంగ్సీ రాష్ట్రాలపై దురాక్రమణకు పూనుకున్నారు. ఇందువల్ల 1884-'85 లో చైనా-ఫ్రెంచి యుద్ధం ప్రారంభమయింది.

ఫ్రెంచి దురాక్రమణ సైన్యాలను చైనా "నల్లజెండా" వాలంటీర్లు లియూ యంగ్-ఫూ నాయకత్వాన వరుసగా ఓడించారు. తైపింగు యుద్ధకాలంలో క్వాంగ్టుంగ్, క్వాంగ్సీ రాష్ట్రాల సరిహద్దున కార్యకలాపాలు సాగించిన ఈ రైతు సైన్యం ఇండో-చైనాలో రక్షణ తీసికుంది. ఫ్రెంచి వలసాధిపతులకు వ్యతిరేకంగా వియత్నాం ప్రజల పోరాటానికి సహాయపడింది.

1884 ఆగస్టులో ఉత్తర తాయివాన్‌లోని కీలుంగ్‌పై ఫ్రెంచివాళ్ళు దాడి చేశారు. కాని మంచూ సైన్యాలు వారిని సముద్రంలోకి తరిమివేశాయి. రెండునెలల అనంతరం ఉత్తర తాయివాన్‌లోని టాన్‌షుయీవద్ద సైన్యాలను దించడానికి ఫ్రెంచివాళ్ళు మరోకసారి ప్రయత్నించారు. రెండువందల ప్రాణాల నష్టంతో ఫ్రెంచివాళ్లు తిరిగి వెనక్కు తరిమివేయబడ్డారు.

1885 మార్చిలో క్వాంగ్సీ-వియత్నాం సరిహద్దునవున్న చెన్నాకువాన్‌వద్ద ఫ్రెంచివాళ్ళు మరో పెద్ద పరాజయం పొందారు. డెబ్బదియేళ్ళకుపైగా వున్న వృద్ధ చైనా సేనాని ఫెంగ్ ట్సే-ట్సాయ్ చేతుల్లో ఈ పరాభవం జరిగింది. వేయిమంది ఫ్రెంచి సైనికులు గాయపడటమో, మరణించడమో జరిగిన ఫలితంగా జూలెస్ ఫెర్రీ మంత్రివర్గం రాజీనామా యివ్వాలిసివచ్చింది.

చెన్నాకువాన్ విజయం తర్వాతకూడ మంచూ ప్రభుత్వం శాంతిసంధికి ప్రాధేయపడింది. 1885 జూన్‌లో టీన్‌ట్సీన్ నగరంలో సంధిపత్రంపై సంతకాలు జరిగాయి. మంచూ ప్రభుత్వ ప్రతినిధిగా లీ హుంగ్ - చాంగ్ వ్యవహరించాడు. ఈ ఒడంబడికప్రకారం ఇండోచైనా ఫ్రెంచి రక్షణక్రింద వున్న దేశంగా గుర్తించడానికి మంచూ ప్రభుత్వం అంగీకరించింది. అంతేగాక చైనా-వియత్నాం సరిహద్దున వున్న నగరాలకు విదేశీయుల ప్రవేశార్హతను మంచూ ప్రభుత్వం గుర్తించాలి. రైల్వేల నిర్మాణానికి ఫ్రెంచి ఇంజనీర్లను చైనా వినియోగించుకోవాలి.

ఈ సంధిపై సంతకం చేయడంవల్లనూ, 1876 చెఫూ ఒడంబడికవల్లనూ నైరుతి చైనాలోనికి విదేశీయులు మరింత చొచ్చుకుపోడానికి తలుపులు పూర్తిగా తెరవబడ్డాయి.

44 వ అధ్యాయం

# చైనా - జపాను యుద్ధం

## యుద్ధానికి ముందు పరిస్థితి

1880 వ సంవత్సరం అనంతరం జాతీయపెట్టుబడిదారీవిధానం కొంత అభివృద్ధి చెందింది. ప్రభుత్వ ఫ్యాక్టరీలతో పాటు వ్యక్తుల స్వంత పెట్టుబడితో నిర్మించబడి, ప్రభుత్వంచే నిర్వహించబడే ఫ్యాక్టరీ లున్నాయి: ప్రభుత్వం వ్యక్తులు కలసి, సంయుక్త యాజమాన్యం క్రింద నిర్మించబడిన ఫ్యాక్టరీలు, వ్యక్తుల స్వంత పెట్టుబడితో ప్రయివేటు యాజమాన్యం క్రింద నిర్వహించబడే ఫ్యాక్టరీలు కూడ వున్నాయి. 1881 నాటికి పూర్తిగా ప్రయివేటు యాజమాన్యంక్రింద వున్న గనులు, ఫ్యాక్టరీలు నాలుగు మాత్రమే వుండగా 1895 నాటికి 69 కి పెరిగాయి. ఇదే కాలంలో వ్యక్తుల స్వంత పారిశ్రామిక పెట్టుబడి 3,30,000 నుంచి 85,30,000 వెండి నాణాలకు పెరిగింది.

ముఖ్యంగా బట్టల పరిశ్రమ మరీ త్వరగా అభివృద్ధిచెందింది. బట్టల మిల్లులలో మొత్తం పెట్టుబడి - ప్రభుత్వానిది, ప్రయివేటు వ్యక్తులది కలసి 1881 నుంచి 1895 నాటికి 22 రెట్లు పెరిగింది. బట్టల మిల్లులలో ఎక్కువభాగం షాంఘైనగరంలో ముఖ్యంగా హువా హిన్, హువా షెంగ్, యు యువాన్ ప్రాంతాలలో కేంద్రీకరించ బడ్డాయి: వూహాన్ నగరంలోకూడ హుపే నూలు మిల్లులు నిర్మించబడ్డాయి.

బొగ్గు గనుల తవ్వకం కూడ కొంత ముందుకుసాగింది. ప్రభుత్వ గనులతో పాటు, వ్యక్తుల పెట్టుబడితో ప్రభుత్వ పర్యవేక్షణక్రింద నిర్వహించబడే గనులు కూడ తలెత్తాయి. ఉదాహరణకు షాంటుంగ్‌లోని చుంగ్ హిస్సింగ్ బొగ్గుగని, కియాంగ్సూలోని లికోయి బొగ్గుగని యిలాంటివే.

## యుద్ధం ప్రారంభం

చాలాకాలంగా కొరియా, చైనాలు స్నేహంగావుంటున్నాయి: సాంస్కృతిక సంబంధాలు, ఉమ్మడి ప్రయోజనాలు కలిగిన ఇరుగుపొరుగు దేశాలు. కాని దురాశ

కలిగిన జపాన్ ప్రభుత్వం, అమెరికా సంయుక్త రాష్ట్రాల మద్దతుతో కొరియా దేశంపై దురాక్రమణకు పూనుకుంది.

కొరియా ప్రజలు ఫ్యూడల్ పరిపాలకుల దుష్పరిపాలనను, విదేశీయుల దండయాత్రలను అసహ్యించుకున్నారు. 1894 జనవరిలో టోన్‌ఘాక్ (తూర్పు సిద్ధాంతం) అనుచరుల నాయకత్వంక్రింద తిరుగుబాటు చేశారు. కొరియా ప్రభుత్వం తిరుగుబాటుదారులను అణచివేసేందుకు సహాయంగా ఉత్తరసరిహద్దునుంచి సేనలను పంపవలసిందిగా మంచూ ప్రభుత్వాన్ని అర్థించింది. ఈ అవకాశాన్ని వినియోగించుకుని జపాను ప్రభుత్వం తన సేనలను దక్షిణ కొరియాలో దించింది.

టోన్‌ఘాన్ విప్లవాన్ని అణచివేశాక మంచూ ప్రభుత్వం, కొరియాలోని విదేశీ సైన్యాలను ఒకేసారి ఉపసంహరించాలని సూచించింది. కాని జపాన్ ప్రభుత్వం ఈ సూచనను పెడచెవిని పెట్టింది; అంతరంగిక సంస్కరణలను అమలుజరిపేందుకు కొరియన్లకు తాము సహాయం చేయాలని సాకు చూపింది. సోయుకి నగరంలో జపాన్ తన సేనలను కేంద్రీకరించి, కొరియా సంక్షోభాన్ని మరింత తీవ్రతరం చేసింది.

"పాశ్చాత్యుల అనుకరణ" ఉద్యమంలో, చైనా సైన్యాలను ఆధునిక ఆయుధాలతో తరఫీదు చేయడంలో లీ హుంగ్-చాంగ్ ప్రముఖపాత్ర వహించాడని యిదివరకే తెలుపబడింది. ఐతే సైన్యాల ఆధునీకరణను, తన రాజకీయ ప్రతిష్టను పెంపొందించుకునేందుకు, తన వ్యక్తిగత బలాన్ని విస్తరింప మొనర్చుకునేందుకు మాత్రమే లీ వినియోగించుకున్నాడు. అందుచేత జపాన్ దురాక్రమణవల్ల కొరియా సార్వభౌమాధికారానికి, చైనా భద్రతకు ప్రమాదం రానున్న సమయంలో దేశరక్షణ సన్నాహాలను తీవ్రతరం చేయడానికి బదులు, యుద్ధం రాకుండా అరికట్టేందుకు పశ్చిమ రాజ్యాలపై ఆధారపడ్డాడు. కొరియాపై దాడిచేయవద్దని జపానుకు సలహా యివ్వమని బ్రిటిష్ మంత్రిని అర్థించాడు; తదనంతరం రాజీచేయమని రష్యా మంత్రిని ప్రాధేయపడ్డాడు. లీ హుంగ్-చాంగ్ అనుసరించిన లొంగుబాటు విధానం ఫలితంగా మంచూ ప్రభుత్వం యుద్ధసన్నాహాలు చేయకుండా నిద్రపోయింది.

ఈలోగా సర్వ సన్నాహాలు చేసుకున్న జపాన్, యుద్ధం ప్రకటించకుండానే 1894 జులై నెలలో దురాక్రమణ చర్యలు ప్రారంభించింది. సియోల్‌కు దక్షిణాన వున్న యాసాన్‌వద్ద జపాన్ క్రూయిజర్లు చైనా యుద్ధ నావలలో కొన్నిటిని ముంచివేయడం, కొన్నిటిని పాడుచేయడం జరిగింది.

రెండునెలల తర్వాత ప్యాంగ్ యాంగ్ చుట్టూవున్న బలమైన కేంద్రాలను జపాన్‌సేనలు పట్టుకున్నాయి. కొరియాకు సహాయంగా వచ్చిన మంచూసేనలు ట్సోపావ్-కూయి నాయకత్వాన ప్యాంగ్ యాంగ్ ద్వారంవద్ద నిలబడి తీవ్రంగా పోరాడాయి. వీరోచితంగా పోరాడినప్పటికీ అదనపు బలాల సహాయం రానందున ఓడిపోయాయి.

ప్యాంగ్ యాంగ్ పడిపోయిన వెంటనే ఎల్లో సముద్రంలో టాంటుంగ్ కా వద్ద నావికాయుద్ధం జరిగింది. జపాన్ నావికాసైన్యం ఈసారికూడ మోసం చేసింది. అమెరికా జెండాను ఎగురవేస్తూ జపాన్ నావలు చైనా తీరం దగ్గరకు చేరాయి. పీయాంగ్ నావికాదళాన్ని సమీపించాక జపాన్ జెండాను ఎగురవేసి దారుణమైన ఫిరంగి కాల్పులను ప్రారంభించాయి. గందరగోళంలో హడావుడిగా పోరాడవలసి వచ్చినందున పీయాంగ్ నావికాదళం దెబ్బతినడం మినహా మరో గత్యంతరం లేకపోయింది.

1895 వ సంవత్సరం జనవరిలో జపాన్ నావికా సైన్యం షాంటుంగ్ రాష్ట్రం వీహైవీ సమీపానికి వచ్చి, లియుకుంగ్ దీవివద్ద లంగరు వేసివున్న పియాంగ్ నావికా దళంపై ఫిరంగి కాల్పులు ప్రారంభించింది. శత్రువలయాన్ని ధ్వంసం చేసేందుకు చర్య తీసికోవాలని చైనా సైన్యంలో ఒకభాగం సాధారణ నావికులు వాదించారు కాని విదేశ సలహాదార్లు, మంచూ నావికా అధికారులు లొంగిపొమ్మన్నారు. లీ హుంగ్-చాంగ్ నావికా దళాన్ని భద్రంగా కాపాడమని అడ్మిరల్ టింగ్ జూ-చాంగ్‌కు ఉత్తరువిచ్చాడు. పోరాడవలదని హుకుం వున్నందున, లొంగిపోవడానికి తనకిష్టం లేనందున నావికా సేనాని ఆత్మహత్య చేసుకున్నాడు. పదహారు సంవత్సరాలుగా కృషిచేసి లీ హుంగ్-చాంగ్ నిర్మించిన నావికాదళం విదేశ సలహాదార్ల ఆధిపత్యం క్రింద ఇలా సిగ్గుచేటైన విధంగా అంతమొందింది.

## యుద్ధానంతరం పరిస్థితి

యుద్ధం జరుగుతుండగానే మంచూ ప్రభుత్వం త్వరగా పోరాటం ముగించుకోవాలని తాపత్రయ పడింది. రాజీ చేయమని ప్రాధేయపడినా అమెరికన్లు తృణీకరించారు. భూ నావికా సేనలు ఓడిపోయాక మంచూ ప్రభుత్వం మరల అమెరికన్లకు విజ్ఞప్తి చేసింది. యుద్ధం యింకా కొనసాగితే ఈసారి ఇతర ప్రభుత్వాలు జోక్యం కలిపించుకుంటాయనీ, చైనాలో తా ననుసరించుతున్న దురాక్రమణ విధానం విఫలమౌతుందనీ గుర్తించి అమెరికన్లు యుద్ధం చాలించమని జపానుకు సలహా యిచ్చారు. జపాను అంగీకరించింది.

1895 మార్చిలో లీ హుంగ్-చాంగ్ అమెరికన్ సలహాదార్లతోసహా జపాన్ లోని షిమోనొసెకీ వద్దకు వెళ్ళాడు.

షిమోనొసెకీ ఒడంబడికలోని అవమానకరమైన షరతుల ప్రకారం కొరియాలో తనకున్న హక్కులను చైనా వదలుకొంది: కొరియాపై జపాను "రక్షణాధికారాన్ని" గుర్తించింది. అంతేగాక లియోటుంగ్ ద్వీపకల్పాన్ని, తాయివాన్, పెంఘూ దీవులను జపాన్‌కు అర్పించడానికి మంచూ ప్రభుత్వం అంగీకరించింది. నష్టపరిహారం క్రింద 20 కోట్ల వెండి నాణాలను చెల్లించడానికి ఒప్పుకుంది: షాసీ, చుంగ్ కింగ్, సూచౌ, హాంగ్‌చౌ నగరాలను విదేశ వర్తకానికి తెరిచేందుకు అంగీకరించింది. చైనా గడ్డపై ఫ్యాక్టరీలను నిర్మించే హక్కును జపాన్ సంపాదించింది.

చైనాలో ఫ్యాక్టరీలను స్థాపించే హక్కును జపాను పొందడం, 'అత్యంతాభిమానం పొందే జాతిక్రింద' పరిగణించబడే హక్కును విదేశ ప్రభుత్వాలు సాధించడం వల్ల ఒక సంగతి స్పష్టమవుతుంది. పంధొమ్మిదో శతాబ్దం చివరిభాగంలో ప్రపంచ పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద దశలో ఉన్నతస్థాయికి చేరిందనీ, సరకులను ఎగుమతి చేయడమే ప్రధాన లక్ష్యంగావున్న దశనుండి పెట్టుబడిని ఎగుమతి చేయడం ప్రధాన లక్ష్యంగావుండే దశకు వచ్చిందనీ తేటతెల్లమవుతుంది. ప్రపంచాన్ని పంచుకోడానికి బలసాధిపతులమధ్య పోరాటం తీవ్రతంమవడం ఈ దశ ప్రత్యేక లక్షణమనికూడ ద్యోతకమయింది. 1894 లో చైనాపై జపాన్ దురాక్రమణ ప్రారంభించే సమయానికి జపాన్ దీవుల్లో పెట్టుబడిదారీ విధానం విపరీతంగా పెరిగింది. అందుచేత జపాన్ దురాక్రమణకు సామ్రాజ్యవాద యుద్ధ స్వభావం సహజంగావుంది.

చైనా-జపాన్ యుద్ధం తరువాత విదేశీపెట్టుబడి మరింత ఎక్కువగా చైనాలో ప్రవేశించింది; చైనా పరిస్థితి మరింతగా అర్ధవలసదేశ స్థాయికి దిగజారింది. చైనాలో స్థాపించబడిన విదేశ ఫ్యాక్టరీలకు ప్రత్యేక రాజకీయ సౌకర్యాలు కలిగించి నందున, ఎక్కువ పెట్టుబడి వున్నందున, దేశీయ పారిశ్రామిక సంస్థలు వాటితో పోటీగా నిలబడలేకపోయాయి. తమ స్వదేశాలలో కార్మికుల వేతనాలకంటే చైనాలో కార్మికులకిచ్చే వేతనాలు తక్కువగా వున్నందున, ముడిపదార్థాలకు తక్కువధర చెల్లించుతున్నందున విదేశ ఫ్యాక్టరీలలో తయారయ్యే సరుకుల వెల తక్కువగా వుండేది.

చైనా-జపాను యుద్ధఫలితం మరొకటి వుంది. చైనాపై దురాక్రమణచేసే వుద్దేశాలు అమెరికాకు వున్నాయని బయటపడింది. జపాన్‌దాడిని అమెరికా సామ్రాజ్యవాదులు బలపరచారు. అమెరికన్ 'సలహాదార్లు' షిమోనోసెకీ రాజీ సంప్రదింపులలో మంచూ ప్రభుత్వాన్ని మోసంచేసి, జపాన్‌కు తోడ్పడ్డారు.

షిమోనోసెకీ ఒడంబడిక ప్రకారం లియోటుంగ్ ద్వీపకల్పాన్ని జపానుకు ధారాదత్తం చేసినందువల్ల, ఈశాన్య చైనాను తానే కాజేయాలని చూస్తున్న జారిస్టు రష్యాకు దెబ్బతగిలింది. ఆ రోజుల్లో రష్యాకు మిత్రదేశంగా వున్న ఫ్రాంసు కూడ తాయివాన్, పెంఘూదీవులు జపాన్‌కు హస్తగతమవడం తమ సామ్రాజ్య విస్తరణకు ఆటంకమని ఎంచింది. అప్పటికింకా చిన్న పెట్టుబడిదారీ దేశంగా వున్న జర్మనీ కూడ చైనాను దోచుకోవడంలో జపాను సాధించిన విజయాల యెడల అసూయ పడింది: దూరప్రాచ్యంలో తానుకూడ సామ్రాజ్యం సంపాదించాలని ఆశించింది. స్వార్థ ప్రయోజనాల దృష్టితో రష్యా, ఫ్రాంసు, జర్మనీ దేశాలు మూడు ఏకమై 1895 ఏప్రిల్‌లో లియోటుంగ్ ద్వీపకల్పాన్ని తిరిగి చైనాకు యివ్వమని జపాన్‌ను హెచ్చరించాయి.

ఒక నెల తరువాత జపాన్‌ను బెదరించడానికి రష్యా సైన్యాలను సమీకరించింది. హాటుంగు రాష్ట్రంలోని చెఫూ రేవు ప్రాంతంలో నావికా ప్రదర్శనలు జరిపింది. బలమైన మూడు దేశాల కలయికను ఎదిరించే శక్తి లేదని గుర్తించి జపాన్ తాను సాధించిన హక్కును వదులుకుంది. మరో మూడు కోట్ల వెండి నాణాలను చైనావద్ద నష్టపరిహారంగా పుచ్చుకుని లియోటుంగ్ ద్వీపకల్పాన్నుంచి తన సేనలను జపాన్ ఖాళీ చేసింది.

## తాయివాన్ ప్రతిఘటన

మంచూ పరిపాలన ప్రారంభమైన తర్వాత తాయివాన్ దీవిలో గమనించదగిన ఆర్థిక సాంస్కృతిక అభివృద్ధి జరిగింది. కాని నల్లమందు యుద్ధం తదనంతరం విదేశీయుల ఆర్థిక జోక్యం ఫలితంగా పరిస్థితులలో తీవ్రమైన మార్పులు వచ్చాయి. విదేశాలనుండి దిగుమతయ్యే వస్త్రాలు, తదితర సరుకులు తాయివాన్ మార్కెట్టును ముంచివేశాయి. విదేశాలనుండి ధాన్యం దిగుమతులవల్ల స్థానికంగాపండే వడ్ల ధర పడిపోయింది. వడ్ల ధర పికుల్ 1 కి అర్థ వెండి నాణానికి తగ్గినా కొనేవాళ్ళు లేకుండా పోయింది. నల్లమందు దిగుమతి మరింత ప్రమాదకరమయింది. తాయిలాండ్ ప్రజల జీవిత పరిస్థితులు నానాటికి దిగజారిపోయాయి.

చైనా - ఫ్రెంచి యుద్ధం అనంతరం ఆగ్నేయ కోస్తా రక్షణలను బలపరచే దృష్టితో మంచూ ప్రభుత్వం తాయివాన్ దీవిని ఒక రాష్ట్రంగా నిర్మించింది. పంథొమ్మిదో శతాబ్దం రెండో భాగంలో నిర్మాణకృషి ముందుకు సాగింది. టెలిగ్రాఫ్ తీగలను వేసింది. తైపేనుంచి కీలుంగ్ వరకు, తైపేనుంచి హ్సిన్‌చూ వరకు రెండు రైల్వేలను నిర్మించింది. వివిధరకాల పాఠశాలలను తెరచింది.

తాయివాన్ ప్రజలకు ఎంతో విప్లవ చరిత్ర వుంది. తైపింగ్ విప్లవం పలుకుబడి క్రింద 1862 లో మంచూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ తిరుగుబాటు జరిగింది. విప్లవ సైన్యం 2 లక్షలవరకు పెరిగింది. తాయిలాండ్ ప్రజలు మూడు సంవత్సరాల వరకు పోరాడి, దీవిలో మంచూ ప్రభుత్వ పునాదులను ఊగించారు. విదేశ దురాక్రమణదారుల దాడులను అనేకసార్లు తిప్పికొట్టారు.

1895 లో జపాన్‌తో మంచూ ప్రభుత్వం చేసుకున్న షిమోనోసెకీ ఒడంబడికను చైనాజాతి అంతా వ్యతిరేకించింది. తమ దీవిని జపానుకు ధారాదత్తం చేసినందుకు తాయివాన్ ప్రజలు తీవ్రంగా అసహ్యించుకున్నారు. సర్వవ్యాపితమైన అసమ్మతి ప్రదర్శనలకు పిలుపు యిచ్చారు. చాలమంది ప్రజలు తాయివాన్ గవర్నరు ప్రాసాదంలోకి వచ్చి మంచూ పాలకులు దారుణంగా తమ మాతృభూమిని అమ్మినందుకు అసమ్మతి తెలిపారు. ప్రభుత్వ పరీక్షలలో పాల్గొనేందుకు దీవినుంచి వచ్చిన పండితులు, తాయివాన్‌దీవిని ధారాదత్తం చేయవద్దని మంచూ ప్రభుత్వానికి విజ్ఞప్తి పంపారు. చైనా ప్రధాన భూభాగంలో సోదర ప్రజలు చూపుతున్న దేశభక్తితో

ఉత్సాహంపొంది దీవిలోవున్న సైన్యాలు, పౌరులు చైనాలో భాగమైన తాయివాన్ రక్షణకొరకు ఆమరణాంతం పోరాడాలని కృత నిశ్చయులయ్యారు.

1895 సంవత్సరం మే నెలలో జపాన్ దురాక్రమణసేనలు కీలుంగ్ రేవులో దిగాయి. ఒకనెల తరువాత తైపేను ఆక్రమించుకున్నాయి. అచటినుంచి దక్షిణానవున్న హ్సిన్‌చూ వైపు దాడి చేస్తున్న జపాన్ సేనలను లియూ యుంగ్-ఫూ నాయకత్వాన "నల్లజెండా" వాలంటీర్లు వీరోచితంగా ప్రతిఘటించారు. ప్రజల తోడ్పాటుతో వాలంటీర్లు అనేక జపాన్ దాడులను తిప్పికొట్టారు. మందుగుండు యావత్తు ఖర్చయిన తర్వాతనే వారు హ్సిన్ చూను ఖాళీ చేశారు.

తాచియానది వెంట పురోగమించుతున్న జపాన్ సేనలపైన ఆకస్మికంగా దాడిచేసి, నల్లజెండా వాలంటీర్లు శత్రువును చెల్లాచెదరు చేశారు. తోట్రుబాటులో దురాక్రమణదారులు నదిని దాటుతున్నారు, ప్రవాహం మధ్యలో వుండగానే నదికి ఆవలివైపునుంచి మరో వాలంటీర్ల సైన్యం హ్సు హ్సియాంగ్ నాయకత్వాన దెబ్బ తీసింది; శత్రువుల్లో చాలమంది మరణించడమో, మునిగిపోవడమో జరిగింది. అదనపు జపాన్ బలగాలు చేరాక శత్రువులు పక్క దాడి చేసి తాచియా నదిని పట్టుకున్నారు.

మంచూ ప్రభుత్వం తాను తాయివాన్ రక్షణకు ఎలాంటి సహాయం పంపలేదు. పైగా సోదర తాయివాన్ ప్రజలకు సహాయం పంపనివ్వకుండా చైనా ప్రజలను నిషేధించింది. 1885 అక్టోబరులో జపాను దురాక్రమణదారుల చేతుల్లో తాయివాన్ పడిపోయింది.

195

45 వ అధ్యాయం

# చైనా జాతీయ సంక్షోభం

చైనా–జపాను యుద్ధానికి ముందు, తరువాత సంవత్సరాలలో కూడ బ్రిటన్, ఫ్రాంసు, జర్మనీ, జపాన్, జారిస్టు రష్యా, అమెరికా సంయుక్తరాష్ట్రాలు తమ దేశాలనుంచి పెట్టుబడులు చైనా దేశానికి ఎగుమతి చేయడం ప్రారంభించాయి: చైనాలో తమ తమ స్వంతబ్యాంకులను స్థాపించాయి. చైనాలోని విదేశబ్యాంకులు పశ్చిమదేశాల్లోని అలవాటు ప్రకారం తమ స్వంత బ్యాంకు నోటులను అచ్చువేయడం కూడ సాగించాయి. చైనాకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాద దురాక్రమణను సాగించడానికి అవి ప్రముఖ సాధనాలయ్యాయి.

చైనా–జపాను యుద్ధానంతరం సంధి షరతుల ననుసరించి నష్టపరిహారం చెల్లించేందుకుగాను మంచూ ప్రభుత్వం సామ్రాజ్యవాదులవద్ద అనేక ఋణాలను చేసింది. తదవకాశాన్ని వినియోగించుకుని సామ్రాజ్యవాదులు తమ పెట్టుబడులను కొత్త మార్కెట్టులలోనికి విస్తరించి, లాభాలను పిండటానికి సిద్ధంగా తయారయ్యారు. 1894–99 సంవత్సరాల మధ్యకాలంలో మంచూ ప్రభుత్వానికి మొత్తం 37 కోట్ల వెండి నాణాలను అప్పుగా యిచ్చారు. దేశీయ వనరులనుంచి మంచూ ప్రభుత్వ కోశాగారానికి ప్రతియేటా వచ్చే మొత్తం ఆదాయానికి ఈ ఋణం నాలుగున్నర రెట్లు వుంది.

తామిచ్చిన ఋణాలకు హామీగా మంచూ ప్రభుత్వం వద్దనుంచి సుంకాలు, ఉప్పు పన్ను వసూలుచేసే హక్కును సామ్రాజ్యవాదులు కాజేశారు. దీనివల్ల చైనా దేశ ఆర్థిక విధానంపై సామ్రాజ్యవాదుల పట్టు మరింత బిగిసింది. అప్పులివ్వడం ద్వారా చైనాదేశంలో తమ స్వార్థప్రయోజనాలను, స్వేచ్ఛాదోపిడిని మరింత ఎక్కువ చేసుకోవాలనే తృష్ణవల్ల సామ్రాజ్యవాద దేశాలమధ్య పోటీ తీవ్రరూపం దాల్చింది.

షిమోనొసెకీ సంధి అనంతరం జపాన్‌ను వుదాహరణగా తీసుకుని సామ్రాజ్యవాద దేశాలన్నీ "అత్యంతాభిమానం పొందిన జాతి" అనే క్లాజుక్రింద రేవు పట్టణాల్లో పరిశ్రమలను నిర్మించసాగారు. చైనా ముడిపదార్థాలను చౌకగా కాజేసి,

కార్మికుల శ్రమను చౌకగా వినియోగించుకొని చైనాదేశ ఆర్థిక వనరులను కొల్లగొట్టడానికి సామ్రాజ్యవాదుల దోపిడీ విధానంలో యిది మరొక మెట్టు.

1895,1896 సంవత్సరాలలో విదేశ పెట్టుబడిదారులు షాంఘై నగరంలో నిర్మించిన ముఖ్యమైన ఫ్యాక్టరీలివి : బ్రిటిష్‌వాళ్లు రెండు బట్టల మిల్లులను, ఒక పిండి మిల్లును నిర్మించారు. అమెరికన్లు, జర్మన్లు చెరొక బట్టల మిల్లును నిర్మించారు : జపాన్‌వాళ్ళు ఒక బట్టల మిల్లును, ఒకపిండి మిల్లును నిర్మించారు. విదేశ కంపెనీలకు ప్రత్యేక సౌకర్యాలుండటంవల్లనూ, జాతీయ పెట్టుబడిదారులకు ఎలాంటి రక్షణాలేకపోవడం వల్లనూ జాతీయ పారిశ్రామిక సంస్థలు దెబ్బతినిపోయాయి.

ఈ దశలోనే రైల్వేలకు పెట్టుబడిపెట్టే విషయంలో సామ్రాజ్యవాదుల మధ్య గుద్దులాట ప్రారంభమయింది. 1905 లో మంచూ ప్రభుత్వంనుంచి వివిధ సామ్రాజ్యవాదులు క్రింది రైల్వేలను నిర్మించే హక్కును బలవంతంగా సంపాదించారు. ఈశాన్య చైనాగుండా వ్లాడివాస్టక్ రేవును ట్రాన్స్ సైబీరియన్ రైల్వేతో కలిపేందుకు, చైనా తూర్పు రైల్వేను నిర్మించే హక్కును జారిస్టురష్యా పొందింది కియోచౌ-సినాన్ రైల్వేను నిర్మించే హక్కును జర్మనీ పొందింది; కాంటన్-హాంకౌ రైల్వేను నిర్మించే హక్కును అమెరికా పొందింది; షాంఘై-నాంకింగ్ రైల్వేను నిర్మించే హక్కును బ్రిటన్ పొందింది; ఆంటుంగ్ నుంచి షెన్యాంగ్ (ముక్డెన్) వరకు రైల్వేను నిర్మించే హక్కును జపాన్ పొందింది.

గనుల తవ్వకంలో ప్రత్యేక హక్కులను పొందడంలోకూడ సామ్రాజ్యవాదులు పోటీపడ్డారు. ఫూషాన్ బొగ్గు గనులను జారిస్టు రష్యా, కైలువాన్ బొగ్గు గనులను బ్రిటన్, టాయేహ్ ఇనపగనులను జపాన్ తవ్వే హక్కును సంపాదించాయి.

## సామ్రాజ్యవాదుల విభజనవల్ల ఏర్పడిన ప్రమాదం

షిమోనోసెకీ సంధి తర్వాత "కౌలు ప్రాంతాలను", "పలుకుబడి ప్రాంతాలను" సంపాదించడంలో సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ఒండొరులతో పోటీపడసాగాయి : తద్వారా చైనాదేశ విచ్ఛిత్తికి ప్రాతిపదిక వేశారు.

లియోటౌంగ్ ద్వీపకల్పాన్ని జపాను చేతుల్లోనుంచి తిరిగి చైనాకు యిప్పించినందుకు ప్రతిఫలంగా తనకు యున్నాన్, క్వాంగ్‌టుంగ్, క్వాంగ్సీ రాష్ట్రాలలో గనులు తవ్వుకునే హక్కును యివ్వమని ఫ్రాంసు పట్టుబట్టింది. ఇంతటితో సంతృప్తి చెందక 1897 లో మంచూ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి, హైనాన్ దీవిని ఏ యితర దేశానికి వదలనని ప్రకటన చేయించింది. మరుసటి సంవత్సరం క్వాంగ్‌చౌ అఖాతాన్ని ఫ్రాంసు కౌలుకు తీసికుంది.

1897 లో మంచూ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి యున్నాన్‌లోని ఏహ్‌జేన్ పర్వతభాగంపైన కౌలు హక్కును బ్రిటన్ పొందింది. వెస్ట్ నదిపై వున్న వూచౌ, షాంచీ రేవులపై వర్తక హక్కులను సంపాదించింది. మరుసటి సంవత్సరమే కౌలూన్

ద్వీపకల్పంలోని వీహైవీ రేవును, హాంకాంగ్ దీవులను, తైపాంగ్, షుంచిన్, సింధు శాఖలను బ్రిటన్ కాజేసింది.

అదే సంవత్సరంలో షాంటుంగ్ తీరంలోవున్న కియో చౌ సింధుశాఖను జర్మనీ పట్టుకుంది: మరుసటి సంవత్సరం మంచూ ప్రభుత్వంపై ఒత్తిడిచేసి, కియో చౌ సింధుశాఖను గురించిన సంధిపత్రంపై సంతకం చేయించింది. దీని ప్రకారం కియో చౌ సింధుశాఖపై కౌలు హక్కును, నావికా రేవుహక్కును జర్మనీ పొందింది: కియోచౌ-సినాన్ రైల్వేను నిర్మించేందుకు, రైల్వేకు రెండువైపులా పదిమైళ్ళ ప్రాంతంలో గనులను తవ్వేందుకు హక్కు సంపాదించింది.

లియో టింగ్ సమస్యలో తాను చేసిన సహాయానికి ఫ్రాంసు ప్రత్యేక హక్కులను గుంజుకున్న కొలదికాలానికే జారిస్టు రష్యాకూడ అదేవిధంగా మంచూ ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చింది. వ్లాడివాస్టాక్‌నుంచి కిరిన్, హీలుంగ్‌కియాంగ్‌ల మీదుగా తూర్పుచైనా రైల్వేను నిర్మించే హక్కును జారిస్టురష్యా గుంజుకుంది; 1897 లో లూషాన్ టాలీన్‌లను బలవంతంగా రష్యా పట్టుకుంది: ఆ మరుసటి సంవత్సరం మంచూ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి, ఆ రెండు రేవుల్లో ఒకదానిని నావికా కేంద్రంగానూ, మరోదానిని వర్తకరేవుగానూ కౌలుకిచ్చే పత్రంపై సంతకం పెట్టించింది.

తమ మధ్య తగాదాలను తగ్గించుకునే దృష్టితో సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ఒండొరుల పలుకుబడి క్రిందవున్న ప్రాంతాలను గుర్తించేందుకు తమలో తాము ఒప్పందాలు చేసుకున్నారు. ఈ విధంగా బ్రిటన్, ఫ్రాంసుల మధ్య, బ్రిటన్ జర్మనీల మధ్య, బ్రిటన్ రష్యాల మధ్య ఒడంబడికలు జరిగాయి. వీటిప్రకారం జీచివాన్ యుడ్జిన్ రాష్ట్రాలలో బ్రిటన్, ఫ్రాంసులకు సమానహక్కు లుంటాయి: టీన్‌స్టిన్ నుంచి దక్షిణ షాంటుంగ్‌కు రైల్వేను నిర్మించే హక్కు జర్మనీ కుంటుంది: దక్షిణ షాంటుంగ్‌నుంచి కియాంగ్సులోని చింకియాంగ్‌కు రైల్వేను నిర్మించే హక్కు బ్రిటన్ కుంటుంది: యాంగ్‌ట్సీనదీ లోయ బ్రిటిష్ ప్రభుత్వ పలుకుబడిక్రింద వుంటుంది: చైనా గోడకు ఉత్తరప్రాంతం జారిస్టు రష్యా పలుకుబడి క్రింద వుంటుంది.

ఈలోగా జపాన్ మంచూ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి, ఫూకీన్ రాష్ట్రాన్ని మరే మూడవ ప్రభుత్వానికి యివ్వనే ప్రకటన చేయించింది: తరువాత దానిని తన పలుకుబడిక్రింద వున్న ప్రాంతంగా ఆమోదముద్ర వేయించుకుంది.

విదేశ పెట్టుబడులు విపరీతంగా పెరగడం, "కౌలు ప్రాంతాలను" కాజేయడం, వివిధ సామ్రాజ్యవాదుల "పలుకుబడి ప్రాంతాలుగా" దేశాన్ని విభజించడంద్వారా చైనాదేశ ఆర్థిక వ్యవస్థ నంతటినీ కాళ్ళూ చేతులు బంధించిన స్థితికి సామ్రాజ్యవాద దురాక్రమణదారులు తెచ్చారు. చైనా సార్వభౌమాధికారాన్ని దారుణంగా విచ్ఛిన్నం చేశారు. జాతీయ సంక్షోభం ముంచుకొచ్చేందుకు సామ్రాజ్యవాదులు కారకులయ్యారు.

## అమెరికా దురాక్రమణ

1860 అంతర్యుద్ధం నాటికి అమెరికా సంయుక్త రాష్ట్రాలలో త్వరితగతిని పెట్టుబడిదారీ విధానం పెంపొందింది. తరువాత కొలది దశాబ్దాలలో వ్యవసాయ దేశంనుంచి పారిశ్రామికదేశంగా అభివృద్ధిచెంది, ప్రపంచ పారిశ్రామికదేశాల్లో ముఖ్యమైనదిగా రూపొందుతూంది. సామ్రాజ్యవాద దారి దోపిడి విధానం విచ్చల విడిగా సాగుతున్న దశలో, పారిశ్రామికదేశంగా రూపొందిన అమెరికా విదేశ మార్కెట్లుకోసం ముఖ్యంగా చైనా యెడల ప్రత్యేకశ్రద్ధ చూపడం మొదలెట్టింది.

చైనా - జపాన్ యుద్ధానికి (1894-'95) ముందు సంవత్సరాల్లోనే అమెరికా సంయుక్తరాష్ట్రాల ఆర్థికజోక్యం చైనాలో ప్రారంభమయింది. రాజకీయ మిలిటరీ దురాక్రమణ సంగతి అటుంచి ప్రధానంగా చైనా మార్కెట్లులను వస్తువులతో - ముఖ్యంగా బట్టలు, కిరోసిన్ వగైరాలతో - నింపడం మొదలెట్టింది. అంతేగాక నల్ల మందు వర్తకంలోకూడ అమెరికా పాల్గొంది. చైనా - జపాన్ యుద్ధానంతరం అమెరికా ఆర్థిక జోక్యం నూతనదశలో ప్రవేశించింది. షిమోనొసెకీ సంధిని వినియో గించుకుని చైనా రేవు పట్టణాల్లో విదేశ పెట్టుబడిదారులు ఫ్యాక్టరీలను నిర్మించు తున్నారనే సంగతి గుర్తించి అమెరికా పెట్టుబడిదారులు బట్టల మిల్లులను, కాగితాల మిల్లులను, పత్తి మరలను, సిగరెట్ ఫ్యాక్టరీలను స్థాపించడానికి పూనుకున్నారు.

అదే సమయంలో చర్చీలు, స్కూళ్ళు, ధర్మసంస్థల ముసుగులో సాంస్కృతి కంగా చైనాలో చొచ్చుకుపోవడానికి తన ప్రయత్నాలను అమెరికా యినుమడింప చేసింది. తద్వారా తనకు అనుకూలంగావుండే మేధావులను రూపొందించుకోవాలనీ, ఆర్థిక దోపిడిని కప్పిపుచ్చుకోవాలనీ, యితర ప్రభుత్వాల అహంకారపూరితమైన, నిర్దాక్షిణ్యమైన పద్ధతులతో పోల్చితే అమెరికా మెరుగని చైనా ప్రజలు ఎంచాలనీ అమెరికా ప్రయత్నించింది. 20వ శతాబ్దారంభానికి సంస్కృతి సంస్థల నిమిత్తం చైనాదేశంలో అమెరికా వినియోగించిన పెట్టుబడి మొత్తం 50 లక్షల డాలర్లదాకా వుంటుంది.

## స్వేచ్ఛావ్యాపారం

చైనా-జపాన్ యుద్ధానంతరం చైనా దేశంలో "కౌలు ప్రాంతాలను" "పలుకుబడి ప్రాంతాలను" చేజిక్కించుకోవడంలో సామ్రాజ్యవాదులు పరస్పరం పోటీపడ్డారని పైనచూశాం. ఈ సమయంలో ఫిలిప్పైన్సుతోసహా స్పెయిన్ వలసలను కాజేసేందుకు స్పెయిన్ దేశంతో అమెరికా యుద్ధం చేస్తోంది. అందుచేత చైనాదేశ దోపిడీలో ఇతర సామ్రాజ్యవాదులతో పాటు భాగం సంపాదించడంలో అమెరికా వెనుకబడింది. కాబట్టి 1899 సెప్టెంబర్‌లో అమెరికా "తలుపులు తెరచివుంచే" కొత్త రాజకీయ విధానాన్ని రూపొందించింది.

"తలు[illegible]చే పాలసీ" సారాంశ మిది :

చైనాదేశంలో ఏ యితర ప్రభుత్వానికీ “కౌలు”కుగాని లేదా “పలుకుబడి ప్రాంతం”గాని వుండరాదు.

తమ “పలుకుబడి ప్రాంతంలో” వున్న రేవుల్లో ఇటు రంటినీ యింకరసే ఓడలపై వేసే రేవు పన్నుకు మించి ఇతరదేశాల ఓడలపై వేయరాదు ఆంగ్రచాడు.

తాము నిర్మించిన రైల్వేలపై రవాణా అయ్యే తమ సరుకులపై వేసే రవాణా ఛార్జీలకంటే ఇతరదేశాల సరకులపై విధించరాదు.

ఇతర సామ్రాజ్యవాదులు ఇదివరకే కాజేసిన “పలుకుబడి ప్రాంతాల”నుంచి లభించే సౌకర్యాలలో తాముకూడ భాగం పొందాలనేదే అమెరికా “తలుపు తెరచివుంచే” రాజకీయపాలసీ లక్ష్యం. కలస రాజ్యాధిపత్యమనే చెడుపేరు పొందకుండానే, కలసలవల్ల వచ్చే లాభంలో భాగం పంచుకోవాలనేదే అమెరికా వుద్దేశ్యం. ఆ రోజుల్లో అమెరికా సెనేట్ సభ్యుడు బెవిరిడ్జి తన ప్రకటనలో ఫిలిప్పైన్స్ ఎల్లప్పుడూ అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వంక్రిందే వుంటుందనీ, దాని ప్రక్కనే బ్రహ్మాండమైన చైనా మార్కెటు వుందనీ చెప్పాడు. పై రెంటినీ అమెరికా కాపాడుకుంటుందని తమ వుద్దేశ్యాలను బహిరంగంగా స్పష్టపరచాడు. ద్వీప సముదాయం యెడల తన బాధ్యతను అమెరికా మరువజాలదనీ, దూరప్రాచ్యంలో తన భవిష్యత్ లాభాలను వదలుకోజాలదనీ వివరపరచాడు.

అమెరికా సూచించిన తలుపులు తెరచివుంచే పాలసీవల్ల ఒకవిధంగా అది వరకే చైనాలో ఇతర సామ్రాజ్యవాదులు కాజేసిన “పలుకుబడి ప్రాంతాలను” గుర్తించినట్లవుతుంది. అందువల్ల సామ్రాజ్యవాదుల మధ్యవున్న తగాదాలు, వైరుధ్యాలు కొంతవరకు తగ్గుతాయి. కాబట్టి ఇతర సామ్రాజ్యవాదులు కూడ అమెరికా సూచించిన విధానాన్ని అంగీకరించాయి. దీనితరువాత చైనాలో అమెరికా దురాక్రమణ చర్యలు రోజు రోజుకు ఎక్కువ కాజొచ్చాయి.

## 46 వ అధ్యాయం

# డా॥ సన్ యెట్ సేన్ విప్లవకృషి ప్రారంభం - సంస్కరణభావాల వ్యాపకం

మంచూ ప్రభుత్వ అవినీతిని, బలహీనతలను చైనా-జపాన్ యుద్ధం బట్టబయలు చేసింది. అభ్యుదయ భావాలుగల చైనావారంతా మంచూ పరిపాలన కొనసాగడమంటే చైనాదేశం సర్వనాశనం కావడమేనని ఎంచారు. ఈ సమయంలోనే గొప్ప ప్రజాస్వామిక విప్లవకారి డాక్టర్ సన్ యెట్ సేన్ రాజకీయరంగంలో ప్రవేశించారు. సన్ యెట్ సేన్ వృత్తిరీత్యా వైద్యులు; సన్ వెన్ అనికూడా ఆయన్ను పిలచేవారు. కాని తరువాత దేశభక్తిప్రేరితుడై ఆయన వైద్యవృత్తిని మానివేసి, విప్లవ కార్యక్రమంలో పాల్గొన్నాడు. 1894 లో లీ హుంగ్ - చాంగ్ తో సంభాషణలు సాగించేందుకు సన్ యెట్ సేన్ కాంటన్ నుంచి టీన్ స్టిన్ నగరానికి వెళ్లారు. లీహుంగ్ - చాంగ్ కృషిద్వారా రాజకీయ సంస్కరణలు సాధించవచ్చునని ఆయన ఆశించారు. కాని సన్ యెట్ సేన్ తో మాట్లాడేందుకే వీల్లేదని తిరస్కరించారు.

మంచూ పరిపాలనను కూలదోయనిదే, చైనాదేశం స్వాతంత్ర్యం పొందజాలదనీ, సౌభాగ్యవంతమైన బలమైన రాజ్యంగా అభివృద్ధి చెందలేదనీ డాక్టర్ సన్ క్రమంగా అవగాహన చేసుకున్నారు. అదేసంవత్సరం ఆయన హానోలూలూ వెళ్లి, అచటి చిన్న దుకాణదారులు, భూఖామందులు ఇరవైమంది చైనావారిని సమీకరించారు: "హ్సింగ్ చుంగ్ - హుయీ" (అనగా చైనా పునరుద్ధరణ సంఘం) అనే పేరుతో బూర్జువా విప్లవ సంస్థను ఏర్పరచారు. అదే సంవత్సరం చైనాకు తిరిగి వచ్చారు.

1895 లో 'కే లావో హుయీ' (అనగా పెద్దల సంఘం) అనే రహస్యసంస్థ సభ్యుల సహాయంతో సన్ యెట్ సేన్ కాంటన్ నగరంలో సాయుధ తిరుగుబాటును ప్రారంభించేందుకు కృషిచేశాడు. కాని రహస్యం ముందుగానే శత్రువుకు తెలిసినందున తిరుగుబాటు విఫలమైంది.



చైనా-జపాన్ యుద్ధానికి ముందు సంవత్సరాలలోనే పెట్టుబడిదారీ విధానానికి ప్రారంభదశ చైనా దేశంలో మొదలయింది. నూతనంగా ఆవిర్భవించిన చైనా పెట్టుబడిదారీవర్గ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే సంస్కరణవాద భావాలు రూపొందాయి. యుద్ధానంతరం చైనా జాతీయసంక్షోభం రోజురోజుకు తీవ్రతరం కాజొచ్చింది. నూతన బూర్జువావర్గానికి ప్రాతినిధ్యం వహించుతున్న మేధావులు జాతీయ స్వాతంత్ర్యం కావాలనీ, జాతీయ పరిశ్రమలను పెంపొందించాలనీ పిలుపిచ్చారు. దీని ఫలితంగా సంస్కరణోద్యమం పాలకవర్గ సభ్యులలో చొచ్చుకుపోయింది.

సంస్కరణవాదులలో కాంగ్ యూ - వీ ప్రముఖనాయకుడు పాశ్చాత్య దేశాల పెట్టుబడిదారీ భావాలచే ప్రేరితుడైన కాంగ్, జాతీయ పెట్టుబడిదారీ విధానం స్వేచ్ఛగా చైనాలో పెంపొందాలనీ, పరిశ్రమలలో యంత్రాలను వినియోగించాలనీ ప్రబోధించాడు. చైనా జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించాలనీ, రాజ్యాంగబద్ధమైన రాచరికం ఏర్పడాలనీ, ప్రభుత్వవ్యవహారాలలో పెట్టుబడిదారులు పాల్గొనాలనీ పిలుపిచ్చాడు.

కాంగ్ ముఖ్య అనుచరులుగా లియాంగ్ చి - చావ్, టాన్ జ్జే - టుంగ్ అనేవారుండేవారు. కాంగ్ కార్యక్రమానికి లియాంగ్ వివరణలు తయారు చేశాడు. చైనా జాతిని రక్షించాలనీ, నిరంకుశత్వాన్ని, నియంతృత్వాన్ని వ్యతిరేకించాలనీ ఆయన వాదించాడు. ఇంపీరియల్ సివిల్ సర్వీస్ పరీక్షలను రద్దుచేసి, ఆధునిక పాఠశాలలను స్థాపించాలనీ, ప్రభుత్వరూపాన్ని మార్చి ప్రాంతీయ స్వాతంత్ర్యాన్ని అమలు జరపాలనీ ప్రబోధించాడు.

టాన్ జే - టుంగ్ చాల బలమైన జాతీయభావాలు కలవాడు. దేశంలో కొనసాగుతున్న క్రూరపరిపాలనను, సామ్రాజ్యవాదదురాక్రమణను ఆయన తీవ్రంగా వ్యతిరేకించాడు. ఫ్యూడల్ సంకుచిత ఆలోచనా ధోరణికి, నిరంకుశ రాచరికానికి వ్యతిరేకంగా ఆందోళన చేశాడు. సంస్కరణవాదులలో తీవ్రమైన భావాలు వ్యక్తం చేసిన టాన్ ఆ దశలో కల్లా గొప్పమేధావి.

ఈ భావాలు దేశం నలుమూలలా వ్యాపించాయి. సంస్కరణోద్యమం పెంపొందింది.

ఈ దశలోనే ప్రముఖ చైనా పండితుడు, అనువాదకుడైన ఎన్ పూ జాతీయ దినపత్రికను (కువావెన్ పొ) స్థాపించాడు. దానిలో ఆర్థిక రాజకీయ సాంస్కృతిక విషయాలపై పాశ్చాత్యదేశాలలోని పెట్టుబడిదారీ ధోరణులను వివరించుతూ వ్యాసాలను ప్రకటించేవాడు. ఫ్యూడల్ సివిల్ సర్వీస్ పరీక్షలను, విద్యావిధానాన్ని రద్దు చేయాలనీ, అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాల్లోని ఆధునిక విజ్ఞానశాస్త్రాలను, టెక్నాలజీని చైనా నేర్చుకోవాలనీ సంస్కరణవాదుల ఆశయాలను ఎన్ ప్రచారం చేశాడు. సంస్కరణభావాలు త్వరగా వ్యాప్తి చెందడానికి ఎన్ ప్రచురణలు సహాయ పడినాయి.

# 1898 సంస్కరణోద్యమం

1895 షిమోనోసెకీ ఒడంబడికపై సంతకాలు జరుగుతున్న సమయంలో కాంగ్ యూ - వీ ఇంపీరియల్ సివిల్ సర్వీసు పరీక్షలో కూర్చుండేందుకు పెకింగ్ వచ్చాడు. చైనాదేశాన్ని ఎదుర్కుంటున్న తీవ్ర జాతీయ సంక్షోభాన్ని కాంగ్ గుర్తించాడు. రాష్ట్రపరీక్షలలో వుత్తీర్ణులై రాజధానిలో పరీక్షలకొరకు పెకింగ్ నగరానికి వచ్చిన వేయిమంది విద్యార్థులను సమీకరించి కాంగ్ విజ్ఞాపనపత్రంతో చక్రవర్తి కువాంగ్ హ్సూ వద్దకు వెళ్ళాడు. అవమానకరమైన ఒడంబడికపై సంతకం చేయవద్దనీ, తక్షణమే సంస్కరణలను అమలుజరపాలనీ మహజరులో అభ్యర్థించాడు. కాని రాజదర్బారులో తిష్టవేసిన ఫ్యూడల్ నిరంకుశోద్యోగులు ఆ మహజరును చక్రవర్తికి అందకుండా అరికట్టారు.

సంస్కరణోద్యమాన్ని ప్రజల్లో వ్యాప్తిచేయడానికి చుంగ్ వై వెన్ వావో (ప్రపంచ బులెటిన్) అనే దినపత్రికను పెకింగ్‌లో స్థాపించాడు. పెట్టుబడిదారీ భావాలను పరిచయం చేయడంతోపాటు ప్రపంచ పరిస్థితులను తెలిపే వార్తలను ప్రకటించేవాడు. అదే సమయంలో మంచూ ప్రభుత్వం క్రింద పనిచేసే వుద్యోగులు కొందరు, చియాంగ్ హ్సూయేహ్ (బలమైన సమాజాన్ని నిర్మించేందుకు నేర్చుకోండి) అను ఒక అధ్యయన గ్రూపును ఏర్పరచుకున్నారు. కాంగ్ ఆ గ్రూపులో చేరి, రాజకీయ సంస్కరణలను గురించి వరుసగా ఉపన్యసించాడు.

తరువాత కాంగ్ యూ-వీ షాంఘే నగరంలో అధ్యయన గ్రూపు శాఖను ఏర్పరచాడు. చియాంగ్ హ్సూయేహ్ పావో అనే పత్రికను స్థాపించాడు. కానిది స్వల్పకాలంలోనే అంతరించింది.

ఈ కాలంలోనే రాజకీయ సంస్కరణలను ప్రబోధించిన హువాంగ్ ట్సున్ - హ్సియేన్ అనే ప్రముఖుడు సమకాలీన వ్యవహారాలు (షీహ్ వూ పావ్) అనే దినపత్రికను ప్రకటించేవాడు. దీనికి సంపాదకుడుగా లియాంగ్ చీ - చావో పని చేశాడు. కొలది నెల్లలోనే ఈ పత్రిక ప్రచురణ పదివేలకు పెరిగింది. దేశమంతటా పాఠకులుండేవారు. ఆ రోజుల్లో ఇన్ని కాపీలు అమ్మకమవడం గొప్పసంగతే. ఇందువల్ల సంస్కరణభావాలు చాలా విస్తృతంగా ప్రచారమయ్యాయి.

1897 లో జర్మనీ సైన్యాలు కియోచౌ అఖాతాన్ని ఆక్రమించుకున్నాయి. చైనాదేశాన్ని జాతీయ సంక్షోభం ఎదుర్కొంది. సంస్కరణవాదులనేకమంది జాతీయ విమోచనకొరకు అధ్యయన తరగతులను ఏర్పరచసాగారు. దేశమంతటా ఇలాంటి సంస్థలు పుట్టగొడుగుల్లా వ్యాపించాయి. ఒక పెకింగ్ నగరంలోనే ఫూకీన్ సొసైటీ, షెన్సీ సొసైటీ, జెచువాన్ సొసైటీ, క్వాంగ్‌టుంగ్ సొసైటీ అనేవి పని చేస్తుండేవి. హునాన్‌లో దక్షిణ సొసైటీ పనిచేస్తుండేది.

కాంగ్ యూ - వీ మరొక మహజర్‌ను కువాంగ్ హ్సూ చక్రవర్తికి అందజేశాడు. ఈసారి మహజర్ చక్రవర్తికి అందింది. యువక చక్రవర్తి విశ్వాసం సంపా

డించి, మరుసటి సంవత్సరం ఆయన్ను కలుసుకున్నాడు. ఈలోగా "పావో హువాంగ్ హుయి" (దేశ విమోచన సొసైటీ) అనే సంస్థను కాంగ్ నిర్మించాడు. విమోచన ద్వారా జాతీయ జీవితాన్ని పునరుద్ధరించాలనీ, చైనా జాతిని రక్షించాలనీ నినాదా లిచ్చాడు. పెకింగ్‌లోనూ, షాంఘైలోనూ రెండు కేంద్రకార్యాలయాలను, రాష్ట్రాల్లోనూ, జిల్లాల్లోనూ, తాలూకాల్లోనూ, వాటిశాఖలను ఏర్పరిచారు. సంస్కరణోద్యమం వువృతంగా ముందుకు సాగింది. ఉన్నతవర్గ మేధావుల దేశభక్తి వుద్యమంగా పెంపొందింది.

1898 లో కువాంగ్ హ్సూ చక్రవర్తి సంస్కరణలను అమలుజరపాలని నిర్ణయించి, కాంగ్ యూ-వీ తో సంప్రదించాడు. చక్రవర్తి సలహాదారుగా కాంగ్ పనిచేశాడు. టాన్ జె - టుంగ్, యాంగ్ జుయి, లియూకువాంగ్ - టీ, లిన్ వుహ్సూ, మరికొందరు గ్రాండ్ కౌన్సిల్‌లో పనిచేశారు: ప్రభుత్వ ఉత్తరువులను, చట్టాలను తయారు చేయడంలో చక్రవర్తికి సహాయపడ్డారు. పుస్తకాలను అనువదించడానికి ఒక సంఘాన్ని ఏర్పరచే బాధ్యత లియాంగ్ చి-చావోకు అప్పగించబడింది.

రాజకీయ సంస్కరణలను అమలు జరిపేందుకు కువాంగ్ హ్సూ చక్రవర్తి వరుసగా కొన్ని ఉత్తరువులను జారీచేశాడు. ముఖ్యమైన వాటి సారాంశమిది :-

ప్రాచీన పరీక్షావిధానాన్ని రద్దుచేయడం, దేవాలయాలు వగైరా పాత విద్యాసంస్థలను ఆధునిక కళాశాలలుగానూ, ఉన్నతపాఠశాలలుగానూ మార్పుచేయడం; పచ్చజెండా సేనలను తగ్గించడం; ప్రభుత్వోద్యోగులను, పరివారాన్ని తగ్గించడం: జాతీయ బ్యాంకును స్థాపించడం; గనులను, రైల్వేలను నిర్వహించే సంస్థను, వ్యవసాయాన్ని పరిశ్రమలను వర్తకాన్ని పర్యవేక్షించే బ్యూరోను ఏర్పరచడం; పారిశ్రామికాభివృద్ధిని ప్రోత్సహించడం: వ్యక్తులు నిర్వహించే ఆయుధ ఫ్యాక్టరీలకు లైసెన్సు లివ్వడం; ఆర్థికవంరులను పరిశీలించి ప్రభుత్వ బడ్జెటును తయారుచేయడం; పెకింగ్ విశ్వవిద్యాలయాన్ని స్థాపించడం; కొత్తరచనలను, పరిశోధనలను ప్రోత్సహించడం; పుస్తకాలను అనువదించే బ్యూరోను స్థాపించడం; సైన్యాన్ని ఆధునిక పద్ధతిలో తర్ఫీదుచేయడ . పౌరులందరూ విన్నపాలను చక్రవర్తికి పంపుకునే అవకాశం కలిగించి, అందుకు అభ్యంతరాలు పెట్టకుండా వుద్యోగులను నిషేధించడం......

కాంగ్ యూ-వీ, లియాంగ్ చీ-చావో తదితర సంస్కరణవాదులు మార్పులు చేయడం చాల చిన్న విషయమని భ్రమపడ్డారు. చక్రవర్తి ఉత్తరువులు జారీచేయడంతోనే సంస్కరణలు అమలుజరుగుతా యనుకున్నారు. కాని వాస్తవానికి మంచూ ప్రభుత్వాధికారమంతా చక్రవర్తి పినతల్లి అయిన డవాగర్ మహారాణి ట్జూహ్సీ నాయకత్వంక్రింద వున్న ఫ్యూడల్ ముఠా చేతుల్లో వుంది. సంస్కరణల సూచన్నే ఆమె ఏవగించుకుంది; సంస్కరణల ఉత్తరువు లన్నిటికీ వ్యతిరేకంగా పట్టుదలతో పనిచేసింది.

మొదట ఎదురెత్తుగా మహారాణి తనకు నమ్మిన బంటైన జంగ్‌లూను చిహ్లీ రాష్ట్రంలో రాజప్రతినిధిగా టీన్‌ట్సీన్‌కు పంపింది. అచటవున్న సైన్యం పైనముఖ్యంగా ఆధునికంగా తర్ఫీదైన సేనలపైన ఆధిపత్యం సంపాదించడానికి మహారాణి పూనుకుంది. తరువాత ఆధునిక సేనలను తనిఖీచేసే సాకుతో యువక చక్రవర్తిని తనతోపాటు టీన్‌ట్సీన్‌కు తీసుకువెళ్లి, అచట బలవంతాన సింహాసనం వదలుకునేలా ఒత్తిడి చేయాలని మహారాణి తలపెట్టింది. ఈ కుట్రను తెలసికొని కువాంగ్ హ్సూ చక్రవర్తి కాంగ్ యూ - వీ తో సంప్రదించాడు. జంగ్‌లూక్రింద వుద్యోగిగానూ, ఆధునిక సేనలకు అధిపతిగానూ వున్న యువాన్ షీ కై తోడ్పాటును సంపాదించాలని చక్రవర్తికి కాంగ్ సలహా యిచ్చాడు. యువాన్‌ను కలసికొని, చక్రవర్తి కోర్కెను తెలిపేందుకు టాన్‌స్ట్ - టుంగ్‌ను టీన్‌స్టీన్ పంపారు. యువాన్ షీ-కై చక్రవర్తికి అనుకూలంగా వుంటానని తప్పుడు వాగ్దానంచేసి, ఈ సంగతినంతనూ జంగ్‌లూకు తెలియజేశాడు. ఇదంతా తెలిసిన వెంటనే మహారాణి కువాంగ్ హ్సూను ఇంట్లోనే బందీగా వుంచుతూ, సంస్కరణవాదులందరినీ అరెస్టుచేయమని ఉత్తరువు లిచ్చింది. కాంగ్ యూ - వీ, లియాంగ్ చీ - చౌలు విదేశాలకు పారిపోయారు. సంస్కరణ వాదులనేకమంది ఖైదులో బంధించబడ్డారు. టాన్‌స్జే-టుంగ్, లియూ కువాంగ్-టీ, లిన్‌హ్సూ, యాంగ్ జుయీ, యాంగ్ షెన్-హ్సూ, కాంగ్ కువాన్-జెన్‌లకు మరణ శిక్ష విధించబడింది.

## సంస్కరణోద్యమం చారిత్రక ప్రాముఖ్యత

పంథొమ్మిదవ శతాబ్దం చివర జాతీయపెట్టుబడిదారీ ఆర్థిక విధానం శైశవ దశలో కొంత పెరిగినప్పటికీ, బూర్జువావర్గం కొంత బలపడినప్పటికీ, సామ్రాజ్యవాద ప్రభుత్వాలు చైనాపై తమ దురాక్రమణను తీవ్రతరం చేశాయి. దాని ఫలితంగా దేశాన్ని ఎదుర్కొంటున్న సంక్షోభం మరింత తీవ్రమయింది. ఈ దశలోనే పైన వుదహరించిన ఉద్యమం కొనసాగింది. అప్పటికి వున్న చారిత్రక పరిస్థితుల్లో సంస్కరణోద్యమం అభ్యుదయకర పాత్రనే నిర్వహించింది.

బూర్జువా ప్రజాస్వామ్యభావాలు అపుడే పరిచయమై ప్రచారమయ్యాయి. వీటి ప్రభావం చాల కాలముంది. ఉదాహరణకు హక్స్‌లీవ్రాసిన పరిణామవాదం, తత్వశాస్త్రం, తదితర వ్యాసాలను ఎన్ ఫూ అనువదించాడు. చైనాప్రజల జాతీయ చైతన్యాన్ని పెంపొందించడానికి వీటి ప్రభావం ఎంతో వుంది.

సంస్కరణోద్యమం ఓడిపోయినప్పటికీ తరువాత మంచూ ప్రభుత్వం ప్రయివేటు పెట్టుబడిదారీ సంస్థలను చట్టబద్ధమైనవిగా గుర్తించవలసి వచ్చింది. ఇందువల్ల జాతీయపెట్టుబడిదారీ విధానం విస్తరించడానికి అవకాశమేర్పడింది.

నల్లమందు యుద్ధానంతరం ఉన్నతవర్గాల మేధావుల్లో వ్యాప్తిచెందిన సంస్కరణభావాలు ఫలితంగా వుత్పన్నమైన రాజకీయోద్యమమే సంస్కరణోద్యమం. కాంగ్ యూ - వీ, లీయాంగ్ చీ-చౌ వగైరా నాయకులు విశాలమైన ప్రజానీకంతో ఏర్పాటును సంపాదించనందువల్లనే, ఈ వుద్యమం ఓటమితో అంతమయింది. రాజకీయరంగంలో మొదటిసారి ప్రవేశించిన బూర్జువావర్గ బలహీనతయే 1898 సంస్కరణోద్యమం ఓడిపోవడానికి కారణం. ఐనప్పటికీ ఫ్యూడలిజంతో రాజీపైన ఆధారపడిన ఏ వుద్యమమైనా అపజయం పొందితీరుతుందనే విలువైన గుణపాఠాన్ని ఈ వుద్యమం ప్రజలకు నేర్పింది.

## 47 వ అధ్యాయం

# ఈహో టువాన్ ఉద్యమం

### చారిత్రకమైన పునాది

చైనా-జపాన్ యుద్ధానంతరం సామ్రాజ్యవాద ప్రభుత్వాలు చైనాలో రాజకీయ ఆర్థిక దురాక్రమణను తీవ్రతరం చేశాయి. వర్తకపు సరుకులను రోజు రోజుకు మరింత ఎక్కువగాదించి చైనా మార్కెటును ముంచెత్తారు. 1864 నుంచి 1899 వరకు 35 సంవత్సరాలకాలంలో చైనా దిగుమతుల విలువ 510 లక్షల వెండి నాణాలనుంచి 2640 లక్షలకు పెరిగింది. అంతకుముందు విదేశవర్తకం బ్యాలెన్సు చైనాకు అనుకూలంగా వుండేది. దిగుమతుల విలువకంటె ఎగుమతుల విలువ ఏడాదికి 20 లక్షల వెండినాణాలు ఎక్కువగా వుండేది. కాని తరువాత ఎగుమతుల విలువకంటే దిగుమతుల విలువ యేడాదికి 690 లక్షల వెండినాణాలు ఎక్కువయింది. అందుచేత చైనా వెండినిల్వలు పూర్తిగా తరిగిపోజొచ్చాయి.

మిల్లుబట్టలు, నూలు విపరీతంగా దిగుమతి కావడంవల్ల పట్టణాల్లోనూ, గ్రామాల్లోనూ చేతివృత్తులు తీవ్రంగా దెబ్బతిన్నాయి; ముఖ్యంగా కుటుంబ ప్రాతిపదికపై వున్న గృహపరిశ్రమలు దెబ్బతిన్నాయి. గ్రామాల్లోని కోట్లకొలదీ స్త్రీలకు, చేతివృత్తుల వాళ్ళకు జీవనోపాధి లేకుండా పోయింది. రైల్వేల నిర్మాణం, తంతితపాలా సర్వీసుల ఏర్పాటువల్ల పాతకాలపు చైనా రవాణా విధానం నిరుపయోగమై పోయింది.

షిమోనొసెకీ ఒడంబడిక ప్రకారం చెల్లించాలిసిన పెద్దమొత్తాలకొరకు మంచూ ప్రభుత్వం ప్రజలనుండి రెట్టింపు పన్నులను పిండసాగింది. 10 కోట్ల వెండి నాణాల రుణం చేయడమేగాక అన్నిరకాల పన్నులను ఎక్కువ చేసింది. భూమిశిస్తు, తలపన్ను నూటికి 7 వంతులు పెరిగింది. ఉప్పు పన్ను కాటీ 1కి నాలుగు రాగినాణాలకు పెరిగంది. దీనికితోడు కొత్తపన్నులు ప్రవేశపెట్టబడ్డాయి. ఉదాహరణకు పెకింగ్, షాంఘై, హాంకో తదితర నగరాలలో ఇళ్ళపన్ను విధించబడింది. కొన్ని నగరాలలో దుకాణాలపై [illegible]బడింది. అన్నిటికంటే దారుణమేమంటే మంచూ ప్రభుత్వ పన[illegible]కులు తమ జేబులు నింపుకోడానికి అక్ర

మంగా మరింత ఎక్కువగా పిండేవారు. ప్రభుత్వం విధించిన పన్నులకు నాలుగు రెట్లు దాకా ప్రజలనుండి గుంజడం అసాధారణ మేమీ కాదు.

చేతగానితనం, అవినీతి వెల్లివిరిసిన మంచూ ప్రభుత్వ పరిపాలనలో వరుసగా తీవ్రమైన సహజసిద్ధమైన సంక్షోభాలు సంభవించాయి. ఉదాహరణకు 1897 లో కియాంగ్సూ రాష్ట్రంలో పెద్దవరద వచ్చింది. వరద బాధితులకు ఆకుఅలం తినవలసిన గతిపట్టింది. అనేక వేలమంది తమ బిడ్డలను అమ్ముకున్నారు; పొలాలనువదలి దేశదిమ్మరులుగా తిరుగుతూ దారిద్ర్యమనుభవించారు. విశాలమైన ప్రాంతం వరదలో మునిగిపోయింది. అసంఖ్యాకమైన రైతుల యిళ్ళు కొట్టుకు పోయాయి. ఒక లక్షా డెబ్బయివేలమంది ప్రజలు బలయ్యారు.

తీవ్రతరమౌతున్న సామ్రాజ్యవాదుల దురాక్రమణ, ఫ్యూడల్ పరిపాలకుల నిరంకుశదోపిడిని భరించలేక ప్రజలు తిరుగుబాటు చేశారు. 1895 నుంచి వరుసగా దేశమంతటా తిరుగుబాట్లు వచ్చాయి. కియాంగ్సూ, ఆన్హ్వీయీ రాష్ట్రాలలో టాటావో హుయీ (పెద్దకత్తి సొసైటీ) అనే సంస్థ సాయుధ తిరుగుబాట్లను ప్రారంభించింది. చెకియాంగ్ రాష్ట్రంలో బియ్యపు దుకాణాలపై దాడులు జరిగాయి. షాంఘై, అమోయ్‌లలో విదేశీయుల ఆక్రమణప్రాంతాల విస్తరణకు వ్యతిరేకంగా స్థానిక ప్రజలు తీవ్రంగా పోరాడారు. యున్నాన్ రాష్ట్రంలో ఫ్రెంచి సామ్రాజ్య వాదుల దురాక్రమణకు వ్యతిరేకంగా దేశభక్తివుద్యమం ప్రారంభమైంది. ఫ్రెంచి మతాధికారుల దురంతాలకు వ్యతిరేకంగా జెచివాన్ రాష్ట్రంలో పోరాటాలు జరిగాయి.

నల్లమందు యుద్ధానంతరంనుంచీ సామ్రాజ్యవాద దురాక్రమణదారులకు వ్యతిరేకంగానూ, ఫ్యూడల్ పాలకులకు వ్యతిరేకంగానూ జెచివాన్ రాష్ట్రివాసులు వరుసగా అనేక పోరాటాలు జరిపారు. 1898 లో యూ టుం-గ్ చెన్ నాయకత్వాన జరిగిన తిరుగుబాటుకు ప్రత్యేక ప్రాముఖ్యత వుంది. "విదేశీ దురాక్రమణదారులతో పోరాడండి" అనే నినాదాలక్రింద విదేశ మతాధికారులపై దృష్టిని కేంద్రీకరించి పోరాటం జరిగింది.

సామ్రాజ్యవాదులకు బంటుగా తయారైన మంచూప్రభుత్వం తక్షణమే తన సైన్యాలను తిరుగుబాటును అణచేందుకు పంపింది. కాని ఘోర పరాజయం పొందాయి. ఈ దేశభక్తి వుద్యమానికి వెంటనే ప్రజల తోడ్పాటు లభించింది. రాష్ట్రమంతటా సామ్రాజ్యవాద వ్యతిరేక జెండాలను ప్రతిష్ఠించారు. పట్టణాల్లోనూ, పల్లెల్లోనూ ప్రతిచోటా యూటుంగ్ - చెన్ బొమ్మలు కన్పించేవి. చాలమంది విదేశ మతాధికారులు పల్లెలనుంచి పారిపోయి, చుంగ్‌కింగ్‌లో తలదాచుకున్నారు. తిరుగుబాటు ప్రభావం దూరానవున్న హ్యూపె వరకు వ్యాపించింది.

నల్లమందు యుద్ధానంతరం అసమాన ఒడంబడికల ఫలితంగా సామ్రాజ్య వాదులు తమ చైనాలో పచారం చేసే హక్కును సంపాదించారు. విదేశ మతాధి

కారులు చైనా రాజకీయ వ్యవహారాలను, సహజ సంపదలను గురించి తమ తమ ప్రభుత్వాల కవసరమైన సమాచారాన్ని బహిరంగంగానూ, చట్టబద్ధంగానూ సేకరించి పెట్టేవారు. దురాక్రమణకు సాధనంగా వినియోగించేవారు.

మిషనరీల పలుకుబడిని వినియోగించి, వారితో కలసి మంచూ వుద్యోగులు కుట్రచేసి రైతుల భూమిని కాజేసేవారు. అంతేగాక కొందరు మతాధికారులు తమ చర్చీలలో కోర్టులను పెట్టారు. తద్వారా రైతులను శిక్షించడానికికూడ ఏమాత్రం జంకేవారు కాదు. మంచూ వుద్యోగులుకూడ తాము చెప్పినట్లు ప్రవర్తించాలనే దాకా మతాధికారులు కొందరు తయారయ్యారు.

మంచూ ప్రభుత్వం తమకు లీగల్ అధికారం యిచ్చిందనే అహంకారంతో, తమ కెదురులేదనే ధోరణితో మతాధికారులు ప్రవర్తించుతూంటే వారిని వ్యతిరేకించగల దమ్ములు స్థానిక ప్రభుత్వోద్యోగులకు వుండేవి కాదు. చైనా పౌరులకు, చర్చిసభ్యులకు మధ్య జరిగే వ్యాజ్యాలలో స్థానికోద్యోగులు ఎల్లప్పుడూ రెండో వారినే బలపరచేవారు. చర్చీల మతాధికారుల దారుణమైన ప్రవర్తన, నిరంకుశత్వం ఫలితంగా ప్రజల్లో తీవ్రమైన అసంతృప్తినీ, వ్యతిరేకతనూ కలిగించాయి.

చైనా దేశాన్ని సామ్రాజ్యవాదులు కొల్లగొట్టడంవల్లనూ, ప్రజలను అవమాన పరచడంవల్లనూ ఈ హో టువాన్ వుద్యమం ప్రారంభమయింది.

## ఈ హో టువాన్ పుట్టుక, అభివృద్ధి

ఈ హో టువాన్ వుద్యమం ప్రారంభంలో ఈ హో చువాన్ (న్యాయం సమత్వం కొరకు పోరాడే పిడికిళ్ళ సంఘం) అని పిలువబడేది. దీనినే పాశ్చాత్యులు "బాక్సర్స్" (పిడికిళ్ళతో పోరాడేవారు) అని పిలిచేవారు. మంచూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడేందుకు షాంటుంగ్ రాష్ట్రంలోని రైతులు, చేతివృత్తులవారు నిర్మించుకున్న రహస్యసంస్థగా యిది బయలుదేరింది. పందొమ్మిదవ శతాబ్దారంభం నుంచీ మంచూ పాలనకు వ్యతిరేంగా ఈ హో చువాన్ పోరాటాలు నడిపింది. మూఢవిశ్వాసాల ఛాయలున్న వివిధ నిర్మాణరూపాలను యీ వుద్యమం అవలంబించింది.

పందొమ్మిదో శతాబ్దం చివరి కొచ్చేటప్పటికి షాంటుంగ్ లోని ఈ హో చువాన్ "మంచూ పాలన తుదముట్టించి, మింగ్ పాలన పునరుద్ధరించండి" అనే నినాదంతో సాయుధ తిరుగుబాటును నడిపింది. మంచూ సేనలను ఓడించింది. ఈ హో చువాన్‌ను లీగల్ సంస్థగా రాష్ట్ర గవర్నరు గుర్తించునట్లు ఒత్తిడిచేసింది. అపుడే పేరును ఈ హో టువాన్‌గా (న్యాయం, సమత్వం కొరకు సంఘం) మార్చు చేసుకుంది. సామ్రాజ్యవాదుల దురాక్రమణను ఎదిరించాలనే ప్రజావాంఛకు అనుగుణ్యంగా ఈ హో టువాన్ తన నినాదాన్ని మార్చుకుంది. మంచూ పాలన తొలగించాలనే నినాదానికి బదులు "పాలక వంశాన్ని జ్ఞాపకముంచుకొని విదేశీయులను తుద

ముట్టించండి" అనే నినాదమిచ్చింది. వెంటనే స్థానిక ప్రజాసామాన్యమందరి హృదయపూర్వక తోడ్పాటును సంపాదించింది. త్వరత్వరగా బలపడింది.

మొదటినుంచీ ఈ హో టువాన్ వుద్యమాన్ని శత్రువుగానే సామ్రాజ్య వాదులు పరిగణించారు. దాని సత్వరాభివృద్ధిగాంచి గాభరాపడ్డారు. అణచివేసే చర్యలు తీసుకోమ్మని మంచూ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేశారు. అదే ప్రకారం మంచూ ప్రభుత్వం షాంటుంగ్ రాష్ట్రగవర్నరుగావున్న యూహ్సిన్‌ను వెనుకకు రప్పించి, ఆ స్థానంలో యువాన్ షీ-కైను నియమించింది. యువాన్ పదవి స్వీకరించిన కొలది రోజుల్లోనే ఆధునిక తర్ఫీదు పొందిన సైన్యాన్ని షాంటుంగుకు రప్పించి, ఈహో టువాన్ అనుచరులపైన దారుణహింసాకాండను ప్రారంభించాడు. ఐనప్పటికీ సామ్రాజ్యవాద వ్యతిరేక రైతు వుద్యమాభివృద్ధిని యువాన్ అరికట్టలేకపోయాడు.

1900 సంవత్సరారంభంనాటికి ఈ హోటువాన్ సైనికశక్తిగా సంఘటిత మయింది. హోపే రాష్ట్రంలోకి చొరబడి త్వరలోనే రాష్ట్రమంతటా విప్లవ కార్య కలాపాలను వ్యాప్తిచేసింది. టీన్‌స్టిన్ - పావోటింగ్ రైల్వేను, పెకింగ్ - పావో టింగ్ రైల్వేను గండికొట్టి టీన్‌స్టీన్ పావోటింగ్ నగరాలను స్వాధీనం చేసుకుంది. ఈ హోటువాన్ తిరుగుబాట్లు షాన్సీ రాష్ట్రమంతటా, ఆగ్నేయ నైరుతి చైనాలో అనేకచోట్లా జరిగాయి. ఈ తిరుగుబాట్లు బ్రహ్మాండమైన వుద్యమంగా పెంపొందింది.

మంచూ ప్రభుత్వం తగుచర్యలు తీసుకుని ఉద్యమాన్ని తక్షణమే అణచివేయక పోతే, తాము సైన్యాలను పంపి జోక్యం కలిగించుకుంటామని సామ్రాజ్యవాద ప్రభుత్వాలు మంచూ ప్రభుత్వాన్ని హెచ్చరించడంలో ఏ మాత్రం ఆలస్యం చేయ లేదు. 1900 సంవత్సరం ఏప్రిల్ నెలలో ఈ హో టువాన్ దళాలు, విదేశీయులను తరిమివేయాలనే నినాదాలతో పెకింగ్ నగరంలో ప్రవేశించాయి. చర్చీల చుట్టూ నినాదాలను వ్రాసి, మతాధికారులపై దాడిచేశాయి. ఈలోగా బ్రిటన్, అమెరికా, జపాన్, ఇటలీ, జారిస్టురష్యా, జర్మనీ, ఫ్రాంసు ప్రభుత్వాలు తమ యుద్ధనావలతో టాకురేవు సమీపంలో ప్రదర్శనం చేస్తూ, అదేసమయంలో పెకింగ్ టీన్‌స్టిన్ నగరాల్లో తమ సేనలను దింపాయి. సామ్రాజ్యవాదుల సాయుధసేనలను ప్రతి ఘటించుతూ ఈ హో టువాన్ విప్లవదళాలు, మంచూ సైన్యాలు పోరాడాయి.

1898 కలహం తరువాత కువాంగ్ చక్రవర్తిని పదభ్రష్టుణ్ణి చేయాలని డొవాగర్ మహారాణి ప్రయత్నించింది. కాని సామ్రాజ్యవాద ప్రభుత్వాలు వ్యతిరేకించాయి. అందువల్ల సామ్రాజ్యవాదులపై ఆమెకు మనస్తాపం కలిగింది. ఈ హో టువాన్ దేశభక్తులు పెకింగ్‌లో ప్రవేశించినపుడు నగరవాసులు సైన్యంలో చేరడమేగాక మంచూ వుద్యోగుల తోడ్పాటును కూడ సంపాదించింది. డొవాగర్ మహారాణి చేతుల్లో వున్న మంచూ ప్రభుత్వం ఈ హో టువాన్ వుద్యమ బలాన్ని చూసి గాభరాపడింది. ఈ ప్రవాహాన్ని సామ్రాజ్యవాదులపైకి తిప్పడం మంచిదనే నిరయానికి వచ్చింది. వేరుమాటల్లో చెప్పాలంటే ఒక దెబ్బతో రెండు పిట్టలను

కోష్టాలని ప్రయత్నించింది. సామ్రాజ్యవాదులపై దెబ్బతీయడంవల్ల ఈ హో టువాన్ బలహీనపడుతుందని ఆశించింది. ఈ దృష్టితోనే ఈ హో టువాన్ నాయకులకు డొవాగర్ మహారాణి దర్శనమిచ్చి, "ధర్మబద్ధులనే" బిరుదును వారికిచ్చింది. వారి కార్యకలాపాలకు సహాయం చేస్తానని వాగ్దానం చేసింది.

1900 జూన్‌లో మంచూ ప్రభుత్వం సామ్రాజ్యవాదులపై యుద్ధం ప్రకటించింది. ఈహోటువాన్ దేశభక్తులతో కలసి, మంచూసేనలు పెకింగ్ నగరంలోవున్న విదేశీ ఆక్రమణప్రాంతాలపై దాడిచేశాయి. ముట్టడి ఐదురోజులు కొనసాగినా, శత్రువులు తలపడలేదు.

మంచూ ప్రభుత్వం పూర్తిగా ద్రోహం చేసింది. ఈహోటువాన్ ఉద్యమానికి తాను వ్యతిరేకమని విదేశ ప్రభుత్వాలకు హామీ యిచ్చింది. దురాక్రమణదారులకు సహాయపడింది. దేశభక్తులకు వ్యతిరేకంగా సైన్యాలను మరల్చేందుకు తోడ్పడమని విజ్ఞప్తిచేసింది.

## ఈ హో టువాన్ - సామ్రాజ్యవాదులు

1900 జూన్‌లో ఈ హో టువాన్ బలాలు మొదటిసారి టిన్‌ట్సిన్ సమీపంలో వున్న టులియుచేన్ వద్ద సామ్రాజ్యవాద దురాక్రమణదారులతో తలపడ్డాయి. అచట రష్యన్ అశ్వికసైన్యంతో యుద్ధంచేసింది. ఈలోగా బ్రిటిష్, అమెరికన్, రష్యన్, ఫ్రెంచి, జపాన్ విదేశసైనికులు రెండువేలమంది ఐక్య సైన్యంగా టీన్‌ట్సిన్‌లో ఏర్పడి, పెకింగ్ పైకి దాడివెడలారు. పెకింగ్ - టీన్‌ట్సిన్ రైలుమార్గంవెంట ఈ హో టువాన్ తన సైన్యాలతో వ్యూహం నిర్మించింది. రైలు పట్టాలను వూడపీకి, ముందుకు సాగుతున్న శత్రువును ఆటంకపరచింది. టీన్‌ట్సిన్‌కు నలభైమైళ్ళ దూరాన వున్న పాంగ్‌పాంగ్ వద్ద సామ్రాజ్యవాదుల సేనలను చుట్టుముట్టి,300 మంది దురాక్రమణదారులను తుడిచిపెట్టింది. అదే సమయంలో టీన్‌ట్సిన్‌లో విదేశస్తుల ఆక్రమణ ప్రాంతాలలోవున్న విదేశీసేనలపై ఈ హో టువాన్ దాడిచేసింది. కొన్ని మంచూ సైన్యాలుకూడ దాడిలో చేతులు కలిపాయి. సామ్రాజ్యవాదుల సేనలకు అపార నష్టాలను కలిగించాయి.

ఆగష్టులో బ్రిటన్, అమెరికా, జపాన్, జర్మనీ, జారిస్టులు రష్యా, ఫ్రాంసు, ఇటలీ, ఆస్ట్రియా ప్రభుత్వాలు కలసి, 30 వేల సైన్యాన్ని సమకూర్చాయి. ఈ సైన్యం గ్రాండ్ కెనాల్ వెంట టీన్‌ట్సిన్‌నుంచి పెకింగ్‌కు బయలుదేరింది. పీచాంగ్ వద్ద కెనాల్‌కు రెండువైపులా ఈ హో టువాన్ మంచూసేనలు కలసి రక్షణలను నిర్మించాయి. శత్రుసేనలు అందుబాటులోకి రాగానే ఫిరంగులు కాల్చి, వేయిమందికి పైగా హతమార్చాయి. ఐనప్పటికీ అదనపుబలాల సహాయం రానందున పీచాంగ్ రక్షకులు చివరకు యుద్ధంలో ఓడిపోయారు.

ఎనిమిది సామ్రాజ్యవాద ప్రభుత్వాల ఐక్యసేనలు పెకింగ్ చేరి, రాజధానిపై దాడి ప్రారంభించాయి. కొలదిరోజులు వీధిపోరాటం అనంతరం నగరం శత్రువుల వశమయింది.

టీన్‌ట్సీన్‌నుంచి పెకింగ్‌కు వెళ్ళే దారిపొడుగునా సామ్రాజ్యవాదులసేనలు అన్నిరకాల దుర్మార్గాలు - చిత్రవధలు, మానభంగాలు, దోపిళ్ళు, బందిపోట్లు వగైరా సాగించారు. మార్గంలోవున్న అనేక గ్రామాలను ధ్వంసం చేశారు. పెకింగ్‌లో ప్రవేశించాక సామ్రాజ్యవాదుల సేనలు ఆధునిక చరిత్రలో కనివిని ఎరుగని విధంగా సిగ్గుశరం విడచి దోపిడి సాగించారు. దోచుకోడమే గాకుండా దోచుకోబడినవారి చేతనే ఆ సరుకునంతనూ మోయించారు.

ధనికుల ఇళ్ళల్లో ప్రవేశించినపుడు, అచటవున్న అపరూపమైన ప్రాచీన పింగాణీ సామగ్రిని ఎత్తుకుపోవడమో లేక ధ్వంసం కావించడమో చేశారు. ఒక జాతి బందిపోటుదార్లు ఎత్తుకుపోయిన వస్తువులను వారిదగ్గరనుంచి మరోజాతి దోపిడిగాళ్లు కాజేసేవారు. దోపిళ్లు సాగించినవారిలో కేవలం సైనికులేగాక, వుద్యోగులు, కొందరు మంత్రులుకూడ వున్నారు. అపురూపమైన పుస్తకాలు, చిత్రాలు, చారిత్రక ప్రాముఖ్యతి కలిగిన అపూర్వవస్తువులను కూడ కొల్లగొట్టుకుపోయారు. ధ్వంసమైన వాటిని, ఎత్తుకుపోయినవాటిని విలువకట్టడం అసంభవం.

ఈ హో టువాన్ ఉపయోగించారన్న ప్రతి భవనాన్ని తగులబెట్టారు. ఈ హో టువాన్ వుద్యమ అనుచరుడని ఏమాత్రం అనుమానం కలిగినా చంపివేశారు. ఒక సందర్భంలో కాందిశీకుల సమూహాన్ని ఒక చీకటిసందులో మందవేసి, మర-ఫిరంగులతో కాల్చివేశారు.

ఉత్తరాన విదేశ దురాక్రమణదారులతో ఈ హో టువాన్ పోరాడుతున్న సమయంలో ఉద్యమం దక్షిణ చైనాకు ఆగ్నేయ చైనాకు, వ్యాప్తిచెందింది. ఆ ప్రాంతాలలోని సామ్రాజ్యవాదుల, వారి తాబేదార్ల ప్రయోజనాలకు ప్రమాదంగా తయారైంది. యాంగ్‌ట్సీ నదీలోయలో పెట్టుబడులను పెద్దగా పెట్టిన బ్రిటన్ అచటి భూస్వాములతోనూ, వుద్యోగులతోనూ, తాబేదార్లతోనూ సన్నిహిత సంబంధాలు కలిగివుంది. ఈ హో టువాన్ కార్యకలాపాలను దక్షిణానికి వ్యాపించకుండా అరికట్టేందుకు బ్రిటిష ప్రభుత్వం తాను యాంగ్‌ట్సీ నదీ ప్రాంతంలో శాంతి భద్రతలను కాపాడుతానని ప్రకటించింది. లియాంగ్ చియాంగ్ ప్రాంతమంతటికీ (కియాంగ్సూ, కియాంగ్సీ, అన్‌హ్వీయ రాష్ట్రాలకు) రాజప్రతినిధిగావున్న లియూకున్ ఈ అనుమతినీ, హుకూయాంగ్ ప్రాంతమంతటికీ (హునాన్, హూపే రాష్ట్రాలకు) రాజప్రతినిధిగా వున్న చాంగ్ చీ-టుంగ్ అనుమతినీ బ్రిటిష్ ప్రభుత్వం సంపాదించింది.

ఈలోగా పరస్పర రక్షణ ఒడంబడికపై సంతకాలు చేయడానికి సామ్రాజ్యవాద ప్రభుత్వాల ప్రతినిధులు, చైనా రాజప్రతినిధులు షాంఘైలో సంప్రదింపులు ప్రారంభించారు. షాంఘైలోని విదేశాక్రమణలను రక్షించేబాధ్యత సామ్రాజ్యవాద ప్రభుత్వాలదేననీ, యాంగ్‌ట్సీ నదీలోయ ప్రాంతాన్ని రక్షించే బాధ్యతను దక్షిణ, తూర్పు రాష్ట్రాల రాజప్రతినిధులు, గవర్నర్లు వహించాలనీ నిర్ణయించారు.

సామ్రాజ్యవాదులమధ్య కీచులాటల ఫలితంగా ఈ ఒడంబడికపై అధికార రీత్యా సంతకాలు జరుగలేదు. ఐనప్పటికీ సామ్రాజ్యవాదులతో చైనా భూస్వాములకు, సైనిక ప్రభువులకు, తాబేదార్లకు వున్న సన్నిహితసంబంధాలను యిది బట్టబయలు చేసింది.

చైనాదేశాన్ని కొల్లగొట్టేందుకు సామ్రాజ్యవాదులు రెండుముఠాలయ్యారు. బ్రిటన్ అమెరికా జపాన్లు ఒక ముఠాగానూ, రష్యా జర్మనీ ఫ్రాంసులు మరో ముఠాగానూ తయారయ్యాయి. సామ్రాజ్యవాదులు టీన్‌ట్సీన్ ఆక్రమించాక వెంటనే జారిస్టు రష్యా తనసేనలను ఈశాన్యదిశకు పంపింది. పెకింగ్‌ను ఆక్రమించి, ఈశాన్య చైనాపై పెత్తనం సంపాదించేందుకు ప్రయత్నించింది. బ్రిటన్‌కూడ తక్షణమే కార్యాచరణకు పూనుకుంది. పెకింగ్ నగరాన్ని పట్టుకుని, జారిస్టు రష్యా పన్నాగాన్ని అరికట్టేందుకు ప్రయత్నించింది. పెకింగ్‌పైకి దాడులు ప్రారంభమవడంతో సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యాలు తేటతెల్లమయ్యాయి. పరిస్థితులెంత విషమించాయంటే ఒకదశలో జపాన్, రష్యాసేనలు ఒండొరులపై కాల్పులు ప్రారంభించుతారా అనిపించింది. అలాగే అమెరికన్, ఫ్రెంచి సైనికులమధ్య శత్రుత్వముందా అనిపించింది.

## 1901 వ సంవత్సరపు ఒడంబడిక

1901 సెప్టెంబరు 7 వ తేదీన మంచూ ప్రభుత్వం తన రాయబారిగా లీ హుంగు-చాంగ్‌ను జర్మనీ, అమెరికా, ఫ్రాంసు, బ్రిటన్, జారిస్టురష్యా, జపాన్, ఇటలీ, ఆస్ట్రియా, బెల్జియం, స్పెయిన్, నెదర్లాండ్స్ ప్రభుత్వ ప్రతినిధులతో కలసికొని, అవమానకరమైన ఒడంబడిక చేసుకునేందుకు పంపింది.

ఈ ఒడంబడికను 1901 వ సంవత్సరపు 'ప్రోటోకోల్' అని పిలుస్తారు. దీని ప్రకారం చైనా 45 కోట్ల వెండి నాణాలను (వడ్డీతోసహా 39 యేళ్లలో యిది 98 కోట్లకు పెరిగింది) నష్టపరిహారంగా చెల్లించాలి. నష్టపరిహారానికి గ్యారంటీగా దిగుమతి సుంకాలను, దేశీయ సరుకులపై రేవులవద్దవేసే పన్నులను, ఉప్పుపన్నును తాకట్టు పెట్టింది.

విదేశస్తులకు వ్యతిరేక చర్యలన్నిటినీ మంచూ ప్రభుత్వం నిషేధించాలని ఒడంబడికలో నిర్దేశించబడింది. విదేశస్తులకు వ్యతిరేకంగా ఎలాంటి ఘటన జరిగినా మంచూ ప్రభుత్వం సైన్యాలను పంపి అణచివేయాలి. టాగూ దుర్గాలను ధ్వంసం చేసి వేయాలి. పెకింగ్ - టీన్‌ట్సీన్ - షాన్ హైకువాన్ రైల్వే పొడుగునా ముఖ్య కేంద్రాలలో సామ్రాజ్యవాదుల సైన్యాలను వుంచేందుకు అనుమతించాలి. పెకింగ్ నగరంలో విదేశరాయబార కార్యాలయాలకు ప్రత్యేకించిన ప్రాంతంలో తమ సైన్యాలను వుంచుకునేందుకు సామ్రాజ్యవాదులకు అనుమతి యివ్వబడింది. ఈ ప్రాంతంలోకి చైనా జాతీయులెవ్వరూ వెళ్ళరాదని నిషేధించబడ్డారు.

1901 ప్రోటోకోల్ (ఒడంబడిక) అనంతరం, దారిద్ర్యంతో బాధపడుతున్న చైనా ప్రజలు ప్రతి సంవత్సరం అదనంగా 2 కోట్ల వెండినాణాల భారం వహించ

వలసి వచ్చింది. అంతేగాక సామ్రాజ్యవాద ప్రభుత్వాల రాయబార కార్యాలయాలు తాముండే ప్రాంతంలో స్వంత సేనలతో, ప్రత్యేక హక్కులతో, చైనా ప్రభుత్వంపై అధికారం చెలాయించే సూపర్ గవర్న మెంటుగా తయారయ్యాయి సామ్రాజ్యవాదుల తాబేదారుగా వ్యవహరించడం కంటే మంచూ ప్రభుత్వం మరేపనిని నిర్వహించలేక పోయింది. చైనాదేశ సర్వం సహాధికార హక్కులు హరించిపోయాయి. అనేకమంది వలసాధిపతుల క్రింద అర్ధ వలసగా తయారయింది.

## తై హో టువాన్ చారిత్రక ప్రాముఖ్యత

ఈ హో టువాన్ ఉద్యమం ప్రజల దేశభక్తిపై - ముఖ్యంగా రైతు జన సామాన్యంయొక్క దేశభక్తిపై-ఆధారపడిన వుద్యమం. ఒకవైపున మంచూ ప్రభుత్వం మోసం దగా ద్రోహంవల్లనూ, రెండోవైపున సామ్రాజ్యవాదుల సాయుధ జోక్యం వల్లనూ ఈ ప్రజా వుద్యమం విషాదకరమైన అపజయం పొందింది. ఐనప్పటికీ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడటంలో చైనా రైతాంగంయొక్క మహత్తరశక్తిని ఈ వుద్యమం స్పష్టంగా నిరూపించింది ఈ హో టువాన్ వుద్యమశక్తిని గమనించిన తర్వాతనే చైనాను తమలోతాము పంచుకోవడం, లేదా పూర్తిగా విదేశీయుల ఆక్రమణక్రింద వుంచుకోవడం సాధ్యంకాదని సామ్రాజ్యవాద ప్రభుత్వాలు గుర్తించాయి. ఈ హో టువాన్ వుద్యమాన్ని అణచివేసిన వాన్ వాల్డర్ సే సైతం యిలా అంగీకరించక తప్పలేదు: "ప్రపంచ జనాభాలో నాలుగోవంతు నివశించుతున్న దేశాన్ని పరిపాలించగల మేధాశక్తి, సైనికబలం ఏ యూరోపియన్ జాతికిగాని అమెరికా లేక జపాన్ జాతికిగానిలేదు. అందుచేత చైనాను పంచుకోవడం ఏమాత్రం ఆచరణ సాధ్యంకాదు!"

ఓడిపోయినప్పటికీ ఈ హో టువాన్ వుద్యమం సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో చైనా ప్రజల అచంచల ధైర్యాన్ని నిరూపించింది: మంచూ ప్రభుత్వం సామ్రాజ్యవాదుల బంటుగా వ్యవహరించిందని ప్రతివారికీ తేట తెల్లమయింది.

48 వ అధ్యాయం

# ఈ హో టువాన్ వుద్యమం - తరువాత ఘటనలు

## బూర్జువా విప్లవోద్యమ ప్రారంభం

అదే సమయంలో ప్రతిఘాతుకమైన మంచూ ప్రభుత్వాన్ని కూలదోయకపోతే చైనా దేశం సామ్రాజ్యవాదుల నిరంకుశత్వాన్నుంచి విముక్తి పొందడం సాధ్యం కాదని ఈ హో టువాన్ వుద్యమం చైనా ప్రజలకు తేటతెల్లం చేసింది. దేశభక్తిచే ప్రోత్సాహితులైన పెట్టుబడిదారీ, పెటీబూర్జువా మేధావుల గ్రూపు క్రమంగా విప్లవ పద్ధతులను చేపట్టారు.

మింగ్ వంశ పతనంయొక్క 242వ వార్షికోత్సవం 1902వ సంవత్సరంలో వచ్చింది. జపాన్‌లో చదువుకుంటున్న చైనా విద్యార్థులు ఈ సందర్భంలో చాంగ్ పింగ్ - లిన్ సూచన ప్రకారం స్మారకసభను జరిపారు. మంచూ పరిపాలనను కూలదోయాలని ఘోషణా పత్రాన్ని ప్రకటించారు.

అదే సంవత్సరంలో విప్లవ భావాలను వ్యాప్తిచేసేందుకు మునుకుగా ట్సాయ్ యువాన్-పీ షాంఘైలో చైనా విద్యాసంఘాన్ని స్థాపించాడు. ఒక సంవత్సరం తరువాత జపాన్‌నుంచి తిరిగివచ్చిన విద్యార్థులూ, కొందరు చైనా విద్యాసంఘ సభ్యులూ కలసి షాంఘైలో కువాంగ్ ఫూ హూయి (పునరుద్ధరణ సమితి) అనే సంస్థను ప్రారంభించారు. కియాంగ్సూ, చెకియాంగ్ రాష్ట్రాలలో మంచూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవ కార్యకలాపాలను సాగించుతున్న రహస్య సంస్థలను సమీకరించడానికి పూనుకున్నారు.

1904 లో హువాంగ్ హ్సింగ్ మరికొందరు దేశభక్తులు కలసి హువా హ్సింగ్ హుయీ (చైనా పునరుద్ధరణ సమితి) అనే సంస్థను హ్యునాన్ రాష్ట్రంలో స్థాపించారు. "మంచూ ప్రభుత్వాన్ని కూలదోసి చైనాను పునరుద్ధరించాల"నే నినాద మిచ్చింది మరుసటి సంవత్సరం సాయుధ తిరుగుబాటుకు చాంగ్షాలో సన్నాహాలు చేసింది. కెలావో హుయి (పెద్దల సమితి) కి చెందిన అనేక వేలమంది

పొంగొస్నారు. ఐనప్పటికీ ముందుగానే రహస్యం బయటపడినందున ప్లాను విఫలమయింది.

ఈలోగా హ్యూపే రాష్ట్రానికి చెందిన యువక దేశభక్తులు జీ చీ హుయీ (రోజువారీ అధ్యయన సమితి) అనే విప్లవసంస్థను ఏర్పరచారు. ప్రపంచ వ్యవహారాలను ఎప్పటికప్పుడు ప్రజలకు తెలియజేయడం, జాతీయ సంక్షోభాన్ని ఎదుర్కొనేందుకు ప్రజలను ఐక్యపరచడం ఈ సమితి లక్ష్యాలుగా వుండేవి. త్వరలోనే విప్లవ కార్యకలాపాలకు కేంద్రంగా సమితి తయారయింది.

బూర్జువా విప్లవ సంస్థలు ఏర్పడటంతోపాటు బూర్జువా ప్రజాస్వామ్య భావాలుకూడ వ్యాప్తిచెందాయి. 1903 లో ట్సౌజంగ్ అనే యువక మేధావి "విప్లవ సైన్యం" అనే గ్రంథం వ్రాశాడు. దాన్లో మంచూ ప్రభుత్వం పరిపాలనలోని అవినీతిని బట్టబయలు చేశాడు. సుఖప్రదమైన జీవితాన్ని, స్వాతంత్ర్యాన్ని సమానత్వాన్ని అనుభవించాలంటే చైనాప్రజలు మొట్టమొదటగా మంచూ ప్రభుత్వ ఫ్యూడల్ పరిపాలన అంతమొందించాలనీ, బూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పరచుకోవాలనీ స్పష్టపరిచాడు. దేశభక్తితోనూ, స్వాతంత్ర్య కాంక్షతోనూ ప్రేరితుడైన ట్సౌ ప్రజాస్వామ్య భావాలను ఉత్సాహంగా ప్రచారం చేశాడు. ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాన్ని ప్రోత్సహించాడు. సామాజికాభ్యుదయానికి మూలకారణమైన విప్లవాన్ని కీర్తించాడు.

చెన్ టీన్ - హువా అనే మరొక మేధావి యువకుడు సులభమైన శైలిలో హృదయాన్ని కదల్చే విధంగా విప్లవభావాలను ప్రచారం చేశాడు. "చైనా ప్రజలకు హెచ్చరిక", "మేల్కొలుపు" అనే గ్రంథాలలో సామ్రాజ్యవాదుల పంపకమనే ప్రమాదం ప్రపంచాన్ని ఎదుర్కొంటూందనీ, చైనాదేశం స్వతంత్రజాతిగా మనుగడ సాగించడమో లేక మరణించడమో తేల్చుకోవలసిన సమయమాసన్నమైందని ఎలుగెత్తి చాటాడు. సంస్కరణ భావాలను చెన్ నిరశించాడు. విద్రోహకరమైన మంచూ ప్రభుత్వ నిరంకుశపాలనను కూలదోస్తే తప్ప సామ్రాజ్యవాద దురాక్రమణను తుదముట్టించాలనే చైనా ప్రజల ఆశ ఫలించదని నిరూపించాడు. ప్రజంతా ఉత్సాహంగా విప్లవ పోరాటంలోచేరి చైనా జాతీయ విముక్తిని సాధించాలని పిలుపిచ్చాడు. చెన్ టీన్ - హువా ప్రచురణలు విప్లవోద్యమ పురోగమనానికి చాలా తోడ్పడ్డాయి.

## రష్యా - జపాన్ యుద్ధం

1901 ఒడంబడిక (ప్రొటోకోల్) సామ్రాజ్యవాదులమధ్య వైరుధ్యాలను పరిష్కరించలేదు. ప్రొటోకోల్ అనంతరం సామ్రాజ్యవాద ప్రభుత్వాలు చైనాలో తమస్వార్థప్రయోజనాలను నెరవేర్చుకునే ప్రయత్నాలను కొనసాగించారు. ఈశాన్య భాగంనుంచి తన సేనలను ఉపసంహరించనని జారిస్టు రష్యా తృణీకరించింది. జపాన్

ఎంతో కాలంగా చైనా ఈశాన్య భాగాన్ని కాజేయాలని వేచివుంది: అమెరికాసైతం ఆ ప్రాంతానికి తన పలుకుబడిని విస్తరించుకోవాలని ఆశించుతోంది. అందుచేత రష్యాను ప్రతిఘటించేందుకు జపాన్‌కు అమెరికా సహాయపడింది. మరోసంగతి ఏమంటే దూరప్రాచ్యంలో రష్యా పలుకుబడి విస్తరించడం బ్రిటన్‌కు యిష్టం లేనందున అదికూడ జపాన్‌ను బలపరచింది. 1902 జనవరిలో బ్రిటన్ - జపాన్ల మధ్య ఒడంబడిక జరిగింది.

1902 ఏప్రిల్‌లో జారిస్టు రష్యా, మంచూ ప్రభుత్వం రస్సో-చైనా కన్వెన్షన్‌పై సంతకాలు చేశాయి. ఈ ఒడంబడిక ప్రకారం ఈశాన్య చైనానుంచి పద్దెనిమిది నెల్లలో మూడు దఫాలుగా తన సేనలను ఉపసంహరించుకోడానికి రష్యా అంగీకరించింది. 1903 లో రెండో దఫా సేనలను ఉపసంహరించుకుంటూ జారిస్టు రష్యా కొత్త డిమాండులను మంచూ ప్రభుత్వం ముందుంచింది. ఈశాన్య చైనాలోని మూడు రాష్ట్రాలలో ఏ ప్రాంతాన్నీ మూడవ ప్రభుత్వానికి కౌలుకుగాని, ధారాదత్తంగాగాని యివ్వరాదనీ, రష్యన్ సేనలున్న రేవులను స్వేచ్ఛావ్యాపార ప్రాంతాలుగా చేయరాదనీ పట్టుబట్టింది.

జారిస్టు రష్యా డిమాండులవల్ల ఈశాన్య చైనాను కాజేయాలనే జపాన్ ఆశలకు ఆటంక మేర్పడింది. దానిమీదట కొరియాలోనూ, ఈశాన్య చైనాలోనూ జపానుకున్న ప్రత్యేక ప్రయోజనాలను రష్యా గుర్తించాలని జపాన్ కోరింది: కాని ఎలాంటి సమాధానం రాలేదు. 1904 లో యుద్ధ ప్రకటన లేకుండానే జపాన్ నావికాసైన్యం లూషన్‌లోవున్న రష్యన్ నావికాదళంపై దాడి చేసింది. ఈ విధంగా రష్యా-జపాన్ దేశాలమధ్య యుద్ధం ప్రారంభమయింది.

రష్యా-జపాన్ యుద్ధం సామ్రాజ్యవాదులమధ్య జరిగినప్పటికీ, అది చైనా భూమిపై జరిగింది. చైనా దేశాన్ని కొల్లగొట్టాలనే స్వార్థమే ఉభయ పక్షాలను ప్రేరేపించిన ఏకైక లక్ష్యం. ఐనప్పటికీ మంచూ ప్రభుత్వం అవమానకరంగా తన తాటస్థ్యాన్ని ప్రకటించింది. చైనా భూమిని, సర్వంసహాధికారాన్ని రక్షించడానికి ఎలాంటి కృషీ చేయలేదు. యుద్ధం ఒక సంవత్సరం దాకా జరిగి, జపాన్ రష్యాను ఓడించింది.

1905 లో శాంతిసంధిపై రష్యా, జపాన్లు సంతకాలు చేశాయి. దీని ప్రకారం ఈశాన్య చైనాలో తాను సంపాదించిన ప్రత్యేక ప్రయోజనాల్లో ఒక భాగాన్ని జపానుకు బదిలీ చేయడానికి రష్యా అంగీకరించింది. ఈ విధంగా చైనా ఈశాన్యభాగంలోనికి జపాన్ చొరబడటం ప్రారంభమయింది.

రస్సో-జపాన్ యుద్ధానంతరం చైనాపై జపాన్ దురాక్రమణ పెచ్చు పెరిగింది. అమెరికా తన స్వప్రయోజనాలను విస్తరించుకొనే ప్రధాన లక్ష్యంతోనే రస్సో-జపాన్ యుద్ధంలో జపాన్‌కు తోడ్పడింది. ఐనప్పటికీ ఈశాన్య చైనాపై తన గుత్తాధికారాన్ని ఏర్పరచుకోవాలని జపాన్ కాంక్షించినందున, అమెరికా

అచట కాలూనడానికి సైతం జపాన్ అవకాశమివ్వలేదు. అందుచేత అప్పటినుంచి జపాన్-అమెరికాలమధ్య సంబంధాలు పాడయ్యాయి.

బ్రిటన్‌తో ఒడంబడికను కొనసాగించటంతోపాటు జపాన్ జారిస్టు రష్యాతో సంబంధాలను మెరుగుపరుచుకునేందుకు, ఫ్రాంసుతో తత్సంబంధాలను నెలకొల్పుకునేందుకు జపాన్ ప్రభుత్వం కృషిచేసింది. దీని ఫలితంగా 1907 లో ఫ్రాంకో-జపాన్ ఒడంబడిక రస్సో-జపాన్ ఒడంబడిక జరిగాయి. ఇందువల్ల జపాన్-అమెరికా ప్రభుత్వాలమధ్య సంబంధాలు మరింత చెడిపోయాయి.

ఈ సమయంలో తాను రాజకీయంగా వేరుపడిపోతున్నానని (డిప్లొమేటిక్ రాజకీయరంగలో ఒంటరిగా వుంటున్నానని) గుర్తించి అమెరికా జపానుతో రాజీ చేసుకుంది. ఐతే ఈశాన్య చైనాలో ప్రవేశించే లక్ష్యాన్ని మాత్రం వదలుకోలేదు. 1909 లో అమెరికా ప్రభుత్వం "మంచూరియన్ రైల్వేలను తాటస్థ్యంగా వుంచాలని" కోరుతూ ఒక ప్లానును తయారుచేసి, చైనా, జపాన్, బ్రిటన్, ఫ్రాంసు, జారిస్టు రష్యా, జర్మనీ ప్రభుత్వాలకు అందజేసింది. ఈశాన్య చైనాలోని రైల్వేలను, రైల్వే పెట్టుబడులను సామ్రాజ్యవాద ప్రభుత్వాల సంయుక్త యాజమాన్యం క్రింద వుంచాలనేదే అమెరికాప్లాను లక్ష్యం. దీనిని జపాన్, జారిస్టు రష్యా ప్రభుత్వాలు తీవ్రంగా వ్యతిరేకించినందున బుట్టదాఖలయింది.

నిరుత్సాహపడి అమెరికా మరొక చర్య తీసికుంది. 1910 లో బ్రిటన్ ఫ్రాంసు, జర్మనీలతో కలసి నాలుగురాజ్యాల కూటమిని ఏర్పరచింది. పెట్టుబడులను పెట్టడంద్వారా చైనాపై రాజకీయ ప్రాబల్యం సంపాదించడమే ఈ కూటమిలక్ష్యం.

1900 సంవత్సరం తరువాత జరిగిన సంఘటనలన్నిటినీ మొత్తంగా బేరీజు వేసి చూస్తే, చైనాపై తమ ప్రాబల్యాన్ని విస్తరించుకునేందుకు సామ్రాజ్యవాద ప్రభుత్వాలప్రయత్నాలు ద్విగుణీకృతమయ్యాయని స్పష్టంగాకన్పించుతుంది: తత్ఫలితంగా దేశవిభజన ప్రమాదం మరింత ఎక్కువయింది. చైనాలో విప్లవతుపాను చెలరేగడం కూడ ఈ దశలోనే ప్రారంభమయింది.

49 వ అధ్యాయం

# 1911 విప్లవానికి ముందున్న పరిస్థితులు

## టుంగ్ మెంగ్ హుయి : విప్లవోద్యమం

చైనా పునరుద్ధరణ సంఘం (హ్సింగ్ చుంగ్ హుయి), పునర్నిర్మాణ సమితి (కువాంగ్ ఫూ హుయి) చైనా పునరుద్ధరణ సమితి (హువా హ్సింగ్ హుయి) వగైరా సంస్థలు ఏర్పడిన తరువాత విప్లవోద్యమం తీవ్రమయింది. 1905 రష్యన్ విప్లవ ప్రభావం చైనా బూర్జువావర్గంపై పడింది. తమ లక్ష్యాలను సాధించాలంటే విప్లవపోరాటం తక్షణావసరమని గుర్తించింది. సాయుధపోరాటం ఆవశ్యకతను గుర్తించసాగింది. అందుచేత మంచూ పరిపాలనకు వ్యతిరేక ఉద్యమంలో చేరింది. వీటన్నిటి ఫలితంగా ఉరకలు పరుగులు వేసుకుంటూ విప్లవోద్యమం పురోగమించింది.

అదే సంవత్సరంలో డాక్టర్ సన్ యెట్ సేన్ యూరపునుంచి జపానుకు చేరుకున్నాడు. అచటువున్న చైనా దేశభక్తులంతా సుస్వాగతమిచ్చారు. విప్లవసంస్థలు వేర్వేరుగా వుండడంవల్ల విప్లవపోరాటాన్ని పెంపొందించడానికి జరిగే కృషి పూర్తిగా ఫలించడంలేదని గుర్తించారు : హ్సింగ్ చుంగ్ - హుయి, కువాంగ్ ఫూ హుయి, హువాహ్సింగ్ హుయిలను కలిపివేసి, మొదటి రెండు సంస్థల పునాదిపై ఏకైక విప్లవ పక్షాన్ని నిర్మించాలని విప్లవకారులు ప్రతిపాదించారు. డాక్టర్ సన్ జపాన్‌లో వుండగానే ఆ మూడు సంస్థలను కలిపి, టుంగ్ మెంగ్ హుయి (విప్లవసమితి) అనే పేరుతో నూతన నిర్మాణాన్ని ఏర్పరచాడు. ప్రారంభ సమావేశంలో డాక్టర్ సన్‌ను ఏకగ్రీవంగా అధ్యక్షునిగా ఎన్నుకున్నారు.

టుంగ్ మెంగ్ హుయి తన సంక్షిప్త కార్యక్రమాన్ని ఇలా ప్రకటించింది : "మంచూలను తరిమివేయండి; చైనాను పునరుద్ధరించండి; ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని స్థాపించండి; భూమి యాజమాన్యాన్ని సమంగా చేయండి" విప్లవ భావాలను ప్రచా[illegible] "మిన్ పావో" (పీపుల్స్ హెరాల్డ్) అనే పత్రికను స్థాపి[illegible] [illegible]ుంగ్ మెంగ్ హుయి" చైనాదేశ ప్రథమ బూర్జు[illegible] [illegible]పొందింది.

"మిన్ పావో" ప్రథమ సంచికలో సన్‌యెట్ సేన్-చైనా ప్రజల జాతీయత, ప్రజాస్వామ్యం, ప్రజలందరికి ఆహారం - అనే మూడు సూత్రాలను ప్రకటించాడు. చైనా దేశాన్ని ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించేందుకు ఈ మూడు సూత్రాలపైనే డాక్టర్ సన్ ఆధారపడ్డాడు.

1906 వ సంవత్సరంలో హునాన్ కియాంగ్సి రాష్ట్రాలలో కరువు కాటకాలొచ్చాయి. లియు యాంగ్, లిలింగ్, పింగ్ షియాంగ్, కౌంటీలు మరీ తీవ్రంగా దెబ్బతిన్నాయి. కెలావో హుయి నాయకత్వాన స్థానిక ప్రజలు ఆయుధాలతో తిరుగుబాటు చేశారు. పింగ్ సియాంగ్‌కు చెందిన అన్ యువాన్ గనుల్లో పనిచేసే కార్మికులు 6 వేల మంది తిరుగుబాటులో పాల్గొన్నారు. దీనికి విశేషంగా ప్రజల తోడ్పాటు లభ్యమయింది; అనేక వేలమంది పోరాటంలో భాగస్వాములయ్యారు. 'టుంగ్ మెంగ్ హుయి' సభ్యులుకూడ చాలమంది "ప్రజాస్వామ్యాన్ని స్థాపించండి; భూమి యాజమాన్యాన్ని సమంగా చేయండి" అనే నినాదాలతో పాల్గొన్నారు. ఐక్య నాయకత్వం లేనందున తిరుగుబాటు ఓడిపోయింది.

1907-1908 రెండు సంవత్సరాల్లోనూ డాక్టర్ సన్‌యెట్ సేన్ స్వయంగా క్వాంగ్‌టుంగ్ రాష్ట్రంలో ఆరు తిరుగుబాట్లను నిర్వహించాడు. ఆంకింగ్, అన్ హ్వాయి రాష్ట్రాలలో హుస్సాహీస్సా-లిన్, హీస్సయుంగ్ చెంగ్ - చీల నాయకత్వాన వరుసగా తిరుగుబాట్లు జరిగాయి. జపాన్లో విద్య నభ్యసించివచ్చిన విద్యార్థి హుస్సా ఆంకింగ్ పోలీసు అకాడమీకి సూపరింటెండెంటుగా వుండేవాడు. 1907లో అకాడమీ ప్రారంభోత్సవంలో పాల్గొంటున్న అన్‌హ్వాయి రాష్ట్ర గవర్నరును పొడిచేశాడు. విద్యార్థులను సమీకరించి ఆయుధాగారాన్ని ఆక్రమించుకున్నాడు. అతని ఆధిపత్యం క్రిందవున్న కొలదిమంది తిరుగుబాటుదార్లను త్వరలోనే మంచూ సేనలు అణచివేశాయి.

ఒక సంవత్సరం తరువాత *కొత్త సైన్యంలో వుద్యోగిగావున్న విప్లవకారుడు హీస్సయుంగ్ చెంగ్ - చీ నాయకత్వాన ఆంకింగ్‌లో వున్న ఫిరంగి పటాలం అశ్విక పటాలం తిరుగుబాటు చేశాయి. నగరపరిసరాలపై దాడి చేశాయి. ఈ తిరుగుబాటు కూడ విఫలమయింది.

1906 నుంచి 1908 వరకు హునాన్, క్వాంగ్‌టుంగ్, క్వాంగ్సి, యున్నాన్, జిచివాన్ రాష్ట్రాలలో అనేక సాయుధ తిరుగుబాట్లు జరిగాయి. వాటిలో ఎక్కువ భాగాన్ని టుంగ్ మెంగ్ హుయి సభ్యులే నిర్వహించారు. విశాలమైన ప్రజా సామాన్యంతో సన్నిహిత సంబంధం లేనందున ఈ తిరుగుబాట్లు వరుసగా ఓడిపోయాయి! ఐనప్పటికీ చాలమందిని విప్లవ పోరాటంలోనికి ఆకర్షించాయి; మంచూ ప్రభుత్వంపై విద్వేషాన్ని ప్రజలలో ఎక్కువ చేశాయి.

---

*విద్యార్థులనుంచి, మేధావులనుంచి మంచూ ప్రభుత్వం సమీకరించి, ఆధునిక ఆయుధాలతో తర్ఫీదైన సైన్యం.

## మంచూ ప్రభుత్వ ఎత్తుగడలు : విప్లవకారుల పోరాటం

1901 ప్రొటోకోల్ అనంతరం ఐదు సంవత్సరాలలో తమ పరిపాలనకు వ్యతిరేకంగా ప్రజలు మేల్కొంటున్నారని మంచూ ప్రభుత్వం గుర్తించింది. మంచూ వ్యతిరేక ప్రజా విద్వేషాన్ని తగ్గించడానికి, ప్రజలను మభ్యపరచడానికి వరుసగా కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టింది. విదేశ రాజ్యాంగాలను అధ్యయనం చేయడానికి 1905 లో ట్సాయి త్సే నాయకత్వాన ఒక కమిషన్ వెళ్ళింది. బాధ్యతాయుత ప్రభుత్వ రాజ్యాంగాన్ని తయారు చేస్తున్నామని మరుసటి సంవత్సరం ప్రకటించింది.

తీవ్రమవుతున్న విప్లవోద్యమాన్ని సంతృప్తిపరచాలనీ, పక్కదారులు పట్టించాలనే దృష్టితో 1908 లో మంచూ ప్రభుత్వం తొమ్మిది సంవత్సరాల రాజ్యాంగ సంస్కరణల కార్యక్రమాన్ని ప్రకటించింది.

అదే సంవత్సరంలో డవాగర్ మహారాణి, కువాంగ్ హ్సూ చక్రవర్తి చనిపోయారు. కువాంగ్ హ్సూకు వారసుడుగా అతని దాయాదియైన మూడేళ్ళ బాలుడు పీఈ, హ్సూవాన్ టుంగ్ అనే బిరుదుతో సింహాసనం అధిష్టించాడు. ప్రభుత్వాధికారం వాస్తవానికి బాలుని తండ్రియైన ట్సాయిఫెంగ్ చేతుల్లోకిపోయింది. సైన్యాధ్యక్ష పదవినికూడ ట్సాయిఫెంగ్ హస్తగతం చేసుకున్నాడు. నావికా సైన్య కార్యదర్శిగానూ, సైన్య సిబ్బంది ప్రధానాధికారిగానూ తన సోదరులిద్దరినీ నియమించుకున్నాడు. ఆవిధంగా సైన్యాధికారమంతా అభివృద్ధి నిరోధకులైన మంచూ రాజవంశీకుల చేతుల్లో కేంద్రీకృతమయింది.

విప్లవోద్యమం త్వరత్వరగా వ్యాపించుతోందని గుర్తించి మంచూ ప్రభుత్వం తాను తయారుచేస్తున్న రాజ్యాంగం స్వల్పకాలంలోనే పూర్తవుతుందని ప్రకటించింది. ప్రారంభంలో అనుకున్న దానికంటే త్వరగానే రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వాన్ని, పార్లమెంటును ఏర్పరుస్తామని చెప్పుకుంది. 1911 మే నెలలో మంత్రివర్గం ఏర్పడినపుడు అన్ని ముఖ్య పదవుల్లోనూ మంచూ ప్రభువులు, అధికార్లు తిష్టవేశారు. రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వమనే వాగ్దానంలోని మోసం పూర్తిగా బయటపడిపోయింది. అదివరకే మంచూ ప్రభుత్వంపై ప్రజలకున్న ఏవగింపు, విద్వేషం - అగ్నిలో ఆజ్యం పోసినట్లుగా యినుమడించాయి.

## రాజ్యాంగబద్ధమైన రాజరికం - విప్లవకారుల దృక్పథం

1898 తిరుగుబాటు అనంతరం కాంగ్ యు-వీ, లియాంగ్ చీ-చావో జపానుకు పారిపోయారు. రాజ్యాంగబద్ధమైన రాజరిక పాలన ఏర్పరచాలని అచటి నుంచి ఆందోళన కొనసాగించారు. మంచూ పరిపాలనను విప్లవంద్వారా కూలదోయడాన్ని వారు తీవ్రంగా వ్యతిరేకించారు. కాంగ్, లియాంగ్ లు జపానులో వుండగానే మంచూ ప్రభుత్వం రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వాన్ని ఏర్పరచబోతుందన్న



హువాంగ్ హుకాంగ్‌లోని 72 మంది మృతవీరుల స్మారక మందిరం

సంగతి విని చాల సంతోషించారు. 1908 లో లియాఁ చి 1906 లో చెంగ్ వెన్ షి (రాజకీయ సంఘాన్ని) స్థాపించాడు. వాద్దాన ఇరగెకజని రాజకీయ సంస్కరణలను బలపరచారు. ఈ సంఘ సభ్యులు చాలమంది చైనాకు తిరిగివచ్చారు. రాజ్యాంగ సంస్కరణల కార్యక్రమాన్ని బలపరుస్తూ చాలనగరాల్లో సభలు జరిపారు. కాని అభివృద్ధినిరోధక ఫ్యూడల్ దృక్పథం కలిగిన మంచూ ప్రభుత్వం, తనకు యిష్టం లేకపోయినా తప్పనిసరై తీసుకుంటున్న చర్యలయెడల, ఇంత ఉత్సాహం చూపడం సహించలేకపోయింది. చెంగ్ వెన్ షీ కార్యకలాపాలన్నిటినీ నిషేధించి, ఆ సంస్థను మూసివేయాలని ఉత్తరువు చేసింది.

చెంగ్ వెన్ షీ కార్యకలాపాలను నిషేధించినప్పటికీ బూర్జువా దృక్పథంగల భూస్వాములు, ప్రభువులు రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వంకొరకు ఆందోళన చేస్తూనే వచ్చారు. అదే తమ వర్గప్రయోజనాలకు అనుగుణ్యంగా వుంటుందని వారు ఎంచారు. రాజ్యాంగ సంస్కరణలను బలపరచే సంస్థలు అనేక రాష్ట్రాలలో బయలుదేరాయి. రాజ్యాంగ బద్ధమైన ప్రభుత్వాన్ని ఏర్పరచాలని కోరుతూ మంచూ ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపారు. వాస్తవానికి వారంతా రాజకీయంగా అభివృద్ధినిరోధక భావాలు గలవారే.

సన్ యెట్ సేన్ నాయకత్వానవున్న టుంగ్ మెంగ్ హుయి అనే విప్లవ సంస్థ ఖచ్చితంగా ఈ మోసాన్ని వ్యతిరేకించింది. కాంగ్ యు-వీ, లియాంగ్ చి-చావో కోరుతున్న రాజ్యాంగబద్ధమైన రాచరికం వట్టి బూటకమని నిరశించింది. మంచూ పాలకవర్గం అసలు జరుపుతున్నవిధంగా రాజ్యాంగబద్ధ ప్రభుత్వాన్ని ఏర్పరచడమంటే అభివృద్ధినిరోధకమైన మంచూ నిరంకుశత్వాన్ని కొనసాగించడమేననీ, చైనా ప్రజల కడగండ్లు ఎక్కువ కావడమేనని, టుంగ్ మెంగ్ హుయి సభ్యులు అభిప్రాయపడ్డారు.

మంచూ ప్రభుత్వాన్ని విప్లవంద్వారా కూలదోసేందుకు సన్నాహాలు చేయడంతోపాటు, రాచరికవాదుల గారడీని బయటపెట్టేందుకు ప్రజాస్వామ్య విప్లవ ఆశయాలనుకూడ టుంగ్ మెంగ్ హుయి ప్రచారం చేసేరు. వారి పార్టీ పత్రికయైన మిన్ పావోలో రాచరికవాదులు - విప్లవకారులమధ్య తీవ్రమైన చర్చలు కొనసాగాయి. విప్లవంలేకుండా నిజమైన రాజ్యాంగబద్ధ ప్రభుత్వం ఏర్పడే అవకాశం లేదని టుంగ్ మెంగ్ హుయి సభ్యులు తమ వాదనల ద్వారా నిరూపించారు. తద్వారా రాచరికవాదుల సంకుచిత రాజకీయభావాలు అభివృద్ధి నిరోధకమైనవని బట్టబయలు చేశారు.

## కాంటన్ తిరుగుబాట్లు

సాయుధ తిరుగుబాట్లకు సన్నాహాలు చేయడంతోపాటు టుంగ్ మెంగ్ హుయి సభ్యులనేకమంది సైన్యంలో చేరి రహస్యవిప్లవ కలాపాలను సాగించారు.

1910 లో కాంటన్ నగరం వద్దవున్న ఆధునిక సైన్యంలో ఒక గ్రూపు విశ్వాసాన్ని టుంగ్ మెంగ్ హుయీ సంపాదించింది. ప్లాను పూర్తిగాక ముందే ఆధునిక సైన్యంలోని కొందరు సైనికులు పోలీసులతో ఘర్షణపడ్డారు. స్థానిక మంచూ వుద్యోగులు జాగ్రత్త చర్యలు తీసుకుంటారనే భయంతో బాధ్యులైన టుంగ్ మెంగ్ హుయీ సభ్యులు, అదివరకు నిర్ణయించిన ప్లానుకంటే ముందుగానే తిరుగుబాటును ప్రారంభించారు. చాంద్రమాన సంవత్సరాదినాడు ఆధునిక సైన్యంలోని సైనికులు కొందరు టుంగ్ మెంగ్ హుయీ నాయకత్వాన కాంటన్ నగరంపై దాడిచేశారు. అధిక సంఖ్యాకులతో కలపడటంవల్ల తిరుగుబాటు విఫలమయింది.

తరువాత పింగ్ లాంగ్స్యావద్ద పెద్దయెత్తున తిరుగుబాటును నడపాలని డాక్టర్ సన్, హుయాంగ్ హీస్సింగ్ ప్లాను వేశారు. అందుకొరకు హుయాంగ్ హీస్సింగ్ నాయకత్వాన హాంకాంగ్‌లో ఒక ప్లానింగ్ శాఖను ఏర్పరచారు. ఈలోగా కాంటన్‌లో రాబోవు తిరుగుబాటుకు బలగాన్ని చేకూర్చేందుకు 30 రహస్య సంఘాలను ఏర్పరచారు.

1911 వసంతంలో అవసరమైన సన్నాహాలన్నీ చేశారు. ఏప్రిల్ 17 వ తేదీన హుయాంగ్ హీస్సింగ్ నాయకత్వాన అగ్రగాముల దళం రాజప్రతినిధి భవనంపై దాడిచేశాయి. కాని ఉత్తరువులను అనేకసార్లు మార్చినందువల్ల రావలసిన 10 దళాల్లో నాలుగు మాత్రమే రంగంలోకి వచ్చాయి. అందుచేత తిరుగుబాటు మరల విఫలమయింది. విప్లవవీరులు అనేకమంది ఆహుతయ్యారు. కాంటన్‌నగర ఉత్తర శివార్లలో హువాంగ్ హుకాంగ్ వద్ద వారిని భూస్థాపితం చేశారు. అచట డెబ్బది యిద్దరు అమరవీరుల స్మారకచిహ్నం నిర్మించబడింది.

## ఆకలి తిరుగుబాట్లు

1901 ప్రొటోకోల్ ప్రకారం పెద్ద మొత్తాలు నష్టపరిహారం చెల్లించాలినీ వచ్చినందున మంచూ ప్రభుత్వం ప్రజలపై పన్నుల భారం మరీ ఎక్కువ చేసింది. తరువాత రాజకీయ సంస్కరణలను అమలుజరుపుతామనే పేరుతో చాలా రకాల పన్నులను విధించింది. ఈ విధంగా అనేకవిధాల దోచుకోవడం ఫలితంగా ప్రజా సామాన్యం రోజురోజుకు దుర్భర దారిద్ర్యంలోకి దిగజారిపోయింది. పన్నులవ్యతిరేక పోరాటాలు, బియ్యంకొరకు ప్రజల దాడులు వరుసగా వాటంతటవే బ్రద్దలయ్యాయి.

1909 లో వరదలవల్ల హునాన్ రాష్ట్రం దెబ్బతింది. ప్రజలు చెట్ల బెరడును గడ్డివేళ్ళను తిని బ్రతికారు. భూస్వాములు, స్వార్థపరులైన వర్తకులు బియ్యం నిల్వ చేసి, అధిక లాభాలు సంపాదించారు. పికుల్ 1కి 2 వేల రాగి నాణాలనుంచి 9 వేల నాణాలవరకు బియ్యం ధర పెరిగింది. చైనాకంతటికీ ధాన్యం కేంద్రంగా ప్రసిద్ధి చెందిన చాంగ్షాలో కూడ కరువు వచ్చింది. కరువు పీడితులైన ప్రజలు హునాన్ రాజ ప్రతినిధివద్దకు వెళ్ళి బియ్యం ధరలు తగ్గించమని కోరారు. వారి విజ్ఞప్తిని

నిరాకరించడమేగాక రాజ ప్రతినిధి సైనికులచేత ప్రజలపై తుపాకులు కాల్పించాడు. డజన్లకొలదీ మరణించడం, గాయపడడం జరిగింది.

కోపోద్రేకులైన ప్రజలు బియ్యం గిడ్డంగులపై దాడులు చేశారు. వంద బియ్యపు దుకాణాలను ప్రజలు దోచుకున్నారు. తరువాత రాజ ప్రతినిధి భవనానికి, పోలీసు బ్యూరోకు, మంచూ బ్యాంకుకు నిప్పంటించటానికి ప్రజలు వెళ్ళారు. రాజ ప్రతినిధి భవనంతో పాటు విదేశీ చర్చిలను, వ్యాపారసంస్థలను, జపాన్ రాయబార కార్యాలయాన్ని తగులబెట్టారు. ప్రజా పోరాటాలను అణచివేయడానికి మంచూ ప్రభుత్వం పెద్ద సైన్యాన్ని సమీకరించింది. ప్రభుత్వ నిర్బంధవిధానానికి తోడ్పడేందుకు సామ్రాజ్యవాద ప్రభుత్వాలు యుద్ధనావలను పంపాయి. మంచూ ప్రభుత్వ సేనలు-విదేశీ ప్రభుత్వాల సాయుధబలాలు సంయుక్తంగా పనిచేసి ప్రజా పోరాటాలను అణచివేశాయి.

చాంగ్షాలో బియ్యంకొరకు ప్రజాపోరాటాలు కొనసాగుతున్న సమయంలోనే లైయాంగ్, షాంటుంగ్‌లలో పన్నుల నిరాకరణ పోరాటాలు ప్రారంభమయ్యాయి.

లైయాంగ్‌లో స్థానిక భూస్వాములు నిరంకుశ పెత్తందార్లతో కలసి మంచూ వుద్యోగులు, అదివరకే దారిద్ర్యంతో క్రుంగిపోతున్న ప్రజలపై అనేక అదనపు పన్నులు విధించారు. 1910 లో విపరీతంగా మంచు పడి లైయాంగ్‌లో పంటలు ఎక్కువభాగం ధ్వంసమైపోయాయి. ఐనప్పటికీ స్థానికోద్యోగులు పన్నులు వసూళ్ళను కొనసాగించారు. కరువుతో బాధపడుతున్న రైతులు తిరుగబడ్డారు: అవినీతిపరులైన వుద్యోగులకు, భూస్వాములకు, నిరంకుశ పెత్తందార్లకు వ్యతిరేకంగా పోరాటాలు వ్యాప్తి చెందాయి.

పోరాటం మొదలైనపుడు అనేకవేలమంది లైయాంగ్ కౌంటీ కేంద్రానికి సమీకరమయ్యారు. పన్నులను తగ్గించాలనీ, కరువు బాధితులకు సహాయపడాలనీ, కోరారు. తరువాత రైతులు, చేతిపనివాళ్ళు, చిన్న వర్తకులు కూడ 60 వేలమందిదాక పోరాటంలో పాల్గొన్నారు. కొన్ని నెలలవరకు పోరాటం కొనసాగింది. ప్రభుత్వం నిరంకుశంగా ప్రజా పోరాటాన్ని అణచివేసింది.

# 50 వ అధ్యాయం

# 1911 విప్లవం

చైనా రైల్వేలను నిర్మించేహక్కును కాజేయాలనే దృష్టితో సామ్రాజ్యవాద ప్రభుత్వాలు, రైల్వేలను జాతీయం చేయుటద్వారా అదివరకు రాష్ట్రాలలో రైల్వేలను నిర్మించుతున్న కంపెనీలకిచ్చిన అనుమతిని రద్దుచేయమని మంచూ ప్రభుత్వాన్ని ఆజ్ఞాపించాయి. ఇందుకు దేశమంతటా ఏకగ్రీవంగా అసమ్మతి తెలుపబడింది. ముఖ్యంగా ఈ ఉత్తరువు వర్తించే జెచివాన్, హునాన్, హూపే, క్వాంగ్ టుంగ్ రాష్ట్రాలలో తీవ్రమైనఅసంతృప్తి వెలువడింది. జెచివాన్ రాష్ట్ర రాజధాని చెంగ్టూలో పట్టణప్రజలు రైల్వే యాజమాన్యంలో తమకున్న హక్కులను రక్షించేందుకు ఒక సంఘాన్ని నిర్మించుకున్నారు. స్థానిక ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపారు : విద్యార్థుల, వర్తకుల, కార్మికుల సమ్మెలు నడిపారు. జెచివాన్ రాజప్రతినిధి రైల్వే షేరుహోల్డర్ల తరుఫున ప్రతినిధులుగా వచ్చిన వారందరినీ అరెస్టు చేయించాడు. పిటీసునర్లను చిత్రవధ చేయించాడు : దారుణమైన నిర్బంధ విధానాన్ని అమలుజరిపాడు.

చెంగ్టూ చిత్రవధలు జీచివాన్ రాష్ట్ర ప్రజలందరినీ కోపోద్రేకులను చేశాయి. రైల్వే హక్కులను రక్షించుకునే వుద్యమం తక్షణమే ఇతర పట్టణాలకు వ్యాపించింది. సాయుధ తిరుగుబాట్లను నడిపే సంస్థలను నిర్మించారు. హ్సిన్‌చిన్‌లో మొదటి తిరుగుబాటు ప్రారంభమయింది. ఇతర కౌంటీలలో కూడ అదే మార్గాన్ని అనుసరించాయి. హ్సిన్‌చిన్, జంగ్‌షీన్, పీయువాన్, చీన్‌వీ కౌంటీ కేంద్రాలను వెంటనే ప్రజలు స్వాధీనం చేసుకున్నారు. మంచూ ప్రభుత్వం ఆధునికసైన్య పటాలాలను హూపేనుంచి, ప్రజా వుద్యమాన్ని అణచివేసేందుకు జీచివాన్‌కు వురికించింది. ఆ సమయంలోనే వూ చాంగ్ తిరుగుబాటు చెలరేగింది.

## ఊ చాంగ్ తిరుగుబాటు

టుంగ్ మెంగ్ హుయీ దేశవ్యాపితంగా నడుపుతున్న సాయుధ తిరుగుబాట్లు, మంచూ ప్రభుత్వ వ్యతిరేకపోరాటాలు మొత్తం చైనాజాతి ప్రజలందరి హృదయాలను కదల్చి వేశాయి! విప్లవోద్యమానికి అవసరమైన ప్రజాబెల్లువను కలిగించాయి.

1911 లో జేచివాన్ రాష్ట్రంలో రైల్వేహక్కుల రక్షణ నిమిత్తం ఉద్యమం సాగుతున్న రోజులలోనే, హూపే రాష్ట్రంలో వెన్ హ్యూయేహా షే (సాహిత్య సమితి), కుంగ్ చిన్ హుయీ (ఐక్య పురోగమనసమితి) అనే రెండు విప్లవ సంస్థలు కలసి, సాయుధ పోరాటానికి సన్నాహాలు చేసేందుకు ఐక్య నిర్మాణాన్ని ఏర్పర చాయి. హుపేనుంచి ఆధునిక సైన్యంలో కొంతభాగాన్ని జేచివాన్‌కు పంపడం వల్ల ఊహాన్‌లో ప్రభుత్వ సేనలు బలహీనపడ్డాయి. విప్లవనాయకులు తక్షణమే ఈ సదవకాశాన్ని వినియోగించుకుని తిరుగుబాటుకు సిద్ధమయ్యారు.

కాని ఆధునిక సైన్యంలో తగినంతమంది సైనికులు విప్లవకారులుగా వున్నందున, హూపేనుంచి కొందరిని ఇతరచోట్లకు మార్చడంవల్ల విప్లవదళాల బలం చీలిపోతుందని విప్లవనాయకులు అభిప్రాయపడ్డారు. తిరుగుబాటుకు సన్నాహాలను త్వరితపరచారు. అక్టోబరు నెలారంభంలో తిరుగుబాటుదార్లు తయారు చేస్తున్న బాంబు యాదృచ్ఛికంగా ప్రేలినందున, అనుకోకుండానే రహస్యం బయటపడింది. మంచూ వుద్యోగులు సోదాలుచేసి, విప్లవ కారుల పట్టికను కనుగొన్నారు. ఊ చాంగ్‌లో విస్తృతమైన సోదాలు ప్రారంభించినందున పరిస్థితి క్లిష్టమయింది.

విప్లవనాయకుల పర్యవేక్షణ క్రింద ఊ చాంగ్‌లోని ఆధునిక సైన్యం అక్టోబరు 10 వ తేదీ రాత్రి తిరుగుబాటు చేసింది. ఆయుధాగారాలను ఆక్రమించుకొని, రాజ ప్రతినిధి భవనంపై దాడి చేసింది. మంచూ అధికారులు గందరగోళంలో పారి పోయారు. నగరం విప్లవకారుల స్వాధీనమయింది.

మరుసటి రోజున విప్లవకారులు సైనిక ప్రభుత్వాన్ని ఏర్పరచారు! ఆధునిక సైన్యంలో బ్రిగేడ్ కమాండరైన లీ యువాన్-హుంగ్‌ను రాజప్రతినిధిగా ఎన్ను కున్నారు. హ్యూన యువాన్ టుంగ్ చక్రవర్తి పరిపాలనను రద్దుచేసి, చైనా రిపబ్లిక్‌ను ఏర్పరుస్తూ లీ ప్రకటన చేశాడు. దేశమందలి ప్రజలంతా తిరుగుబాటుచేసి, చైనా రిపబ్లిక్‌ను బలపరచాలని పిలుపిచ్చాడు.

యాంగ్‌ట్సీ నదిని దాటి విప్లవకారులు హాన్‌యాంగ్, హాంకౌలను ఆక్రమించు కున్నారు.

ఊ చాంగ్ విప్లవం జయప్రదమయిందన్న వార్త చైనా దేశమంతటా ప్రజలను ఉత్సాహపరచింది. కార్మికులు, రైతులు, మాజీ సైనికులు విప్లవ సైన్యంలో వుధృతంగా చేరినందున, అది వురకలు పరుగులు వేసుకుంటూ పెద్ద సైన్యంగా తయారయింది. భుజం భుజం కలిపి పోరాడుతూ, త్వరలోనే స్థానిక మంచూ సేనలను ధ్వంసం చేసింది. కొలదివారాల్లోనే చాలా రాష్ట్రాలు తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించాయి.

విప్లవం త్వరితగతిని అభివృద్ధిచెందడంవల్ల ముఖ్యులలో కొందరి బుర్రలు తిరిగాయి. ప్రజలను సంఘటితపరచి, సమర్థులైన నాయకులను తయారుచేయడానికి కృషి చేయకుండా, త్వరలో పోరాటాన్ని ముగించాలని అభిలాషపడసాగారు.

మంచూ ప్రభుత్వం కూలిపోయే దశ ఆసన్నమైందని దేశం వివిధ ప్రాంతాలలోని రాజ్యాంగబద్ధమైన రాచరికం కావాలనేవారు, పెద్ద వుద్యోగులుసైతం గమనించారు. ఉదాహరణకు కియాంగ్సూ రాష్ట్రం రాజప్రతినిధి, ప్రతిరాష్ట్రం స్వతంత్రం ప్రకటించడం గమనించి, తానుకూడ మంచూ ప్రభుత్వ అధికార దుస్తులు వదలివేసి, తన భవనంయెదుట "మిలిటరీ ప్రభుత్వబల్లను" కట్టాడు. అభివృద్ధి నిరోధకులైన చాలమంది వుద్యోగులు విప్లవకారుల్లో చేరబడ్డారు.

## చైనా రిపబ్లిక్ సంస్థాపన

ఈ సమయంలో ఒకటి ఊచాంగ్ వద్ద, రెండోది షాంఘైవద్ద రెండు విప్లవ కేంద్రాలు ఏర్పడ్డాయి. నాయకత్వం కొరకు వాటిమధ్య పోటీపడింది. చర్చల అనంతరం ఊచాంగ్‌లో సదస్సుజరిపి తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచాలని నిర్ణయించారు. 1911 నవంబరులో వివిధ రాష్ట్రాలనుంచి ప్రతినిధులు ఊచాంగ్‌కు వచ్చారు. ఐనప్పటికీ హాన్‌యాంగ్‌ను మంచూ సేనలు పట్టుకోవడంవల్ల శత్రుఫిరంగుల పరిధిలో ఊచాంగ్ వున్నందున, సమావేశాన్ని అచటినుంచి హాన్‌కౌకు మార్చారు. విప్లవకారులు నాంకింగ్ నగరాన్ని స్వాధీనం చేసుకున్నందున చివరకు సమావేశాన్ని అచటికి మార్చారు.

1911 డిసెంబరు నెల చివరలో డాక్టర్ సన్‌యెట్‌సేన్ యూరపునుంచి షాంఘై నగరానికి చేరుకున్నాడు. చైనా రిపబ్లిక్‌కు తాత్కాలికాధ్యక్షునిగా ఆయనను ఎన్నుకున్నారు. 1912 వ సంవత్సరం చైనా రిపబ్లిక్ ప్రథమ సంవత్సరమని విప్లవ కారుల కన్వెన్షన్ ప్రకటించింది. తాత్కాలిక ప్రభుత్వాన్ని, జాతీయ ప్రతినిధి సభను కూడ సదస్సు ఏర్పరచింది.

1912 జనవరి 1 వ తేదీన నాంకింగ్‌లో డాక్టర్ సన్‌యట్‌సేన్ అధ్యక్షత క్రింద చైనా రిపబ్లిక్ సంస్థాపించబడింది.

తాత్కాలిక ప్రభుత్వంలో సంస్కరణవాదులు దేశీయ వ్యవహారాల, ఆర్థిక పరిశ్రమల, రవాణా మంత్రిత్వాలవంటి ముఖ్య పదవులను ఆక్రమించారు. ప్రభుత్వాధ్యక్షత మాత్రం విప్లవకారుల నాయకుడైన సన్‌యట్‌సేన్ చేతుల్లో వుంది.

కొత్తగా ఏర్పడిన తాత్కాలిక జాతీయ ప్రతినిధి సభ తాత్కాలిక రాజ్యాంగ ముసాయిదాను తయారు చేసింది. జాతి, వర్గ, మతాలతో నిమిత్తంలేకుండా చైనా రిపబ్లిక్ పౌరులంతా సమానులని నూతన రాజ్యాంగం ప్రకటించింది. పౌరులందరికీ తమ కిష్టమైనచోట నివశించడానికి, వెళ్ళడానికి స్వాతంత్ర్యముంది. ప్రకటనా స్వాతంత్ర్యం, వాక్సభా సంఘ నిర్మాణ హక్కులను పౌరులందరు అనుభవించే అవకాశముంది. మత స్వాతంత్ర్యం, ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపేహక్కు, ప్రభుత్వోద్యోగులపై వ్యాజ్యం వేసేహక్కు వుంది.

బూర్జువా ప్రజాస్వామిక రిపబ్లిక్‌ల రాజ్యాంగ శాసనాలను అనుసరించి వ్రాయబడిన తాత్కాలిక చైనా రిపబ్లిక్ రాజ్యాంగం ప్రజలకు కొన్ని హక్కులను ప్రసాదించింది. అప్పటి చారిత్రక పరిస్థితులనుబట్టి చూస్తే అది అభ్యుదయకరమైనది.

డాక్టర్ సన్ యెట్ సేన్ నాయకత్వాన జరిగిన 1911 విప్లవం బూర్జువా ప్రజాస్వామిక విప్లవ స్వభావం గలది. అనేక శతాబ్దాలుగా చైనాను పరిపాలించుచున్న ఫ్యూడల్ రాజరికాన్ని కూలదోసింది. చైనా రిపబ్లిక్‌ను స్థాపించింది: తాత్కాలిక రాజ్యాంగాన్ని తయారుచేసింది. ఆర్థికంగా 1911 విప్లవం చైనాలో జాతీయ పెట్టుబడి దారీ విధానం అభివృద్ధి చెందడానికి మార్గం సుగమం చేసింది. బూర్జువా ప్రజాతంత్ర భావాలు వ్యాప్తిచెందాయి. దానితో పాటు ప్రజల మనస్సులలో ప్రజాస్వామిక రిపబ్లిక్ భావాలను 1911 విప్లవం నాటింది.

ఐనప్పటికీ బూర్జువావర్గం స్వయంగా, బలహీనంగా వుండటంవల్ల అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగా ప్రజాసామాన్యాన్ని సమీకరించలేకపోయింది. ఫ్యూడల్ భూస్వామ్యశక్తుల పెత్తనం కొనసాగింది! సామ్రాజ్యవాదులు తమ స్వార్థ ప్రయోజనాలను నిలుపుకున్నారు! అందుచేత ప్రజాస్వామ్య లక్ష్యాలు పరిపూర్తి గాకుండా వుండిపోయాయి.

## 51 వ అధ్యాయం

# సైనిక ప్రభువుల క్రింద చైనాదేశ పరిపాలన

## యువాన్ షీ - కై విద్రోహం

1898 సంస్కరణోద్యమానికి ద్రోహం చేసినవాడు యువాన్ షీ - కై షాంటుంగ్ గవర్నరుగా వుంటున్నపుడు ఈ హోటువాన్ వుద్యమాన్ని దారుణంగా అణచివేసినవాడు ఇతడే. 1901 లో లీ హుంగ్-చాంగ్ చనిపోయేముందు చిహ్లీ రాజప్రతినిధిగానూ, ఉత్తరప్రాంతంలో విదేశ వ్యాపార మంత్రిగానూ యువాన్‌ను నియమించమని డొవాగర్ మహారాణికి సిఫార్సుచేశాడు. ఊ చాన్ తిరుగుబాటుకు ముందు మంచూ ప్రభుత్వం యువాన్‌ను పదవినుంచి తొలగించింది. కాని సైన్యంలో అతనిని బలపరచేవారు చాలమంది వున్నారు. మంచూ ప్రభుత్వసేనలలో అతని పలుకు బడి చాల లోతుగా వుంది. 1911 విప్లవం ప్రారంభమయ్యాక యువాన్‌ను తిరిగి వచ్చి, ప్రధానమంత్రిగా వుండమనీ, సైన్యాధిపత్యం వహించి విప్లవాన్ని అణచివేయు మనీ మంచూ ప్రభుత్వం కోరింది.

రాజకీయ మిలిటరీ అధికారాలను హస్తగతం చేసుకున్న తరువాత, యువాన్ ఊహాన్‌పై దాడిచేశాడు; హాన్యాంగ్‌ను ఆక్రమించుకున్నాడు. అదే సమయంలో చైనా ప్రభుత్వాన్ని నడుపగల వ్యక్తి యువాన్ ఒకడేనని సామ్రాజ్యవాదుల ప్రభుత్వాలు విస్తృతి ప్రచారం సాగించాయి. డాక్టర్ సన్‌యెట్‌సేన్ భావవాదనీ, విప్లవకారులు ఎందుకూ పనికిరానివారనీ నిందారోపణలు చేస్తూ అబద్ధప్రచారం సాగించింది.

సింహాసనం వదులుకునేలాగ చక్రవర్తిని యువాన్ షీ-కై ఒత్తిడి చేశాడు. అదేసమయంలో విప్లవ నాయకులను రాజీకి వచ్చేవిధంగా మంచూ సైన్యాన్ని ఉపయోగించి బెదరించాడు. 1911 నవంబరులో విప్లవకారులకు, యువాన్‌కు మధ్య రాజీ సంప్రదింపులు ప్రారంభమయ్యాయి.

విప్లవ శిబిరంలో చొరబడివున్న రాచరికవాదులు, భూస్వాములు, నిరంకుశాధి కారులు వెంటనే ద్రో[illegible]కు పూనుకున్నారు. యువాన్‌కు సైనికబలం, ఎక్కు

వుందని గమనించి, తమ వర్గప్రయోజనాలను, పదవులను కాపాడుకునేందుకు అతని పక్షానికి తిరిగారు. రాజీ సూచనలు అంగీకరించవలసిందిగా సన్ యెట్ సేన్ పై ఒత్తిడి తెచ్చారు. అదే సమయంలో అమెరికా, బ్రిటన్, జర్మనీ, ఫ్రాంసులు అప్పులిచ్చి, ఆర్థిక చిక్కులను అధిగమించడానికి యువాన్ కు తోడ్పడ్డాయి. రాజీ సంప్రదింపులు క్రమక్రమంగా యువాన్ కు అనుకూలంగా మారసాగాయి.

డాక్టర్ సన్ యెట్ సేన్ దేశ విచ్ఛిత్తి జరుగుతుందని భయపడ్డాడు. దేశ విభజనకు దారితీసే ఏ పనీ చేయరాదని అభిప్రాయపడ్డాడు. మంచూ ప్రభుత్వంతో సంబంధాలను యువాన్ తెగతెంపులు చేసుకున్నట్లయితే రిపబ్లిక్ను వ్యావహారపూర్వకంగా బలపరచినట్లయితే, తాత్కాలిక రాజ్యాంగ నిబంధనల అమలు జరిపేందుకు అంగీకరించినట్టయితే, తాను తాత్కాలికాధ్యక్ష పదవినుంచి విరమించి యువాన్ను బలపరచేందుకు సన్ యెట్ సేన్ నిర్ణయించాడు.

1912 ఫిబ్రవరిలో మంచూ ప్రభుత్వం రద్దయిపోయింది. తాత్కాలిక ప్రతినిధుల సభముందు సన్ యెట్ సేన్ రాజీనామా యిచ్చాడు. ప్రతినిధులసభ సన్ రాజీనామాను అంగీకరించి, యువాన్ను ఆస్థానంలోకి ఎన్నుకుంది. యువాన్ తనమోసపు ఎత్తుగడల ద్వారా మంచూ ప్రభుత్వ ప్రధానమంత్రిత్వంనుంచి ఒకదెబ్బలో రిపబ్లిక్ తాత్కాలికాధ్యక్షుడు కాగలిగాడు. 1911 విప్లవవిజయం సాధించిన ఫలితాలు యువాన్ హస్తగతమయ్యాయి.

యువాన్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత రాజ్యాంగబద్ధ రాజరికవాదులు, నిరంకుశాధికారులతోనూ, రాజకీయవేత్తలతోనూ, కొంతమంది టుంగ్ మెంగ్ హుయి సభ్యులతోనూ కలసి వరుసగా మూడు పార్టీలను నిర్మించారు. టుంగ్ ఈ టాంగ్ (యూనిఫికేషన్ పార్టీ), కుంగ్ హో టాంగ్ (రిపబ్లికన్ పార్టీ), మిన్ చూ టాంగ్ (డెమాక్రటిక్ పార్టీ, ఏర్పరచారు. 1912 ఆగస్టులో హువాంగ్ హిస్సింగ్, సుంగ్ చియావో-జెన్ మరికొందరు టుంగ్ మెంగ్ హుయి సభ్యులు తమ పార్టీని పునర్నిర్మించి, కొమింగిటాంగ్ పార్టీని ఏర్పరచారు.

తాత్కాలిక రాజ్యాంగానికి యువాన్ ప్రభుత్వం కట్టుబడి వుండాలనీ, జాతీయ ప్రతినిధుల సభకు బాధ్యత వహించాలనీ ఆందోళన చేయడమూ, అధికార దుర్వినియోగానికి వ్యతిరేకంగా పార్లమెంటరీ పోరాటాలను నడపడమూ కొత్తగా ఏర్పడిన కొమింగ్ టాంగ్ పార్టీ కార్యక్రమం. దీనికి ఎదురెత్తుగా యూనిఫికేషన్, రిపబ్లికన్, డెమాక్రటిక్ పార్టీలను ఏకంచేసి, యువాన్ తన స్వాతపార్టీగా చిన్ పూటాంగ్ (ప్రగతిపార్టీ) ను ఏర్పరచుకున్నాడు. తరువాత యువాన్ కుట్రపన్ని సుంగ్ చియావో-జెన్ను చంపించాడు. దీనితో సంక్షోభం తీవ్రమయింది.

# రెండో విప్లవం

1913 లో బ్రిటన్, ఫ్రాంసు, జర్మనీ, జపాన్, జారిస్టు రష్యాలు కలసి ఐదు రాజ్యాలకూటమిని ఏర్పరచి, అభివృద్ధి నిరోధక ప్రభుత్వానికి మద్దతుగా యువాన్ కు

పెద్దరుణాలను మంజూరుచేశాయి. పుచ్చుకున్న రుణాలకు తాకట్టుగా చైనా ఆర్థిక వ్యవహారాలను ఐదు రాజ్యాల కూటమికి అప్పగించడానికి యువాన్ అంగీకరించాడు. తన సైన్యాన్ని విస్తరించుకునేందుకు, దేశమంతటిపైనా తన పరిపాలనను స్థిరపరచుకునేందుకు ప్రధానంగా ఈ రుణాలను యువాన్ ఉపయోగించుకోసాగాడు.

యువాన్ నిజరంగు ఏమిటో అప్పటికి డాక్టరు సన్‌యెట్ సేన్ స్పష్టంగా గమనించాడు. యువాన్‌కు వ్యతిరేకంగా ఉద్యమాన్ని నడిపేందుకు నిశ్చయించుకున్నాడు.

రాచరికవాదుల తోడ్పాటును, సామ్రాజ్యవాదుల రుణాలను యువాన్ షీ-కై వినియోగించుకొని, దక్షిణ రాష్ట్రాలలో-ముఖ్యంగా కియాంగ్సీ, అన్‌హ్వాయి, క్వాంగ్‌టుంగ్ రాష్ట్రాలలో వున్న కొమిన్‌టాంగ్ సేనలను తుడిచిపెట్టాలని నిశ్చయించుకున్నాడు. 1913 జూన్‌లో మూడు రాష్ట్రాలకు గవర్నర్లుగావున్న కొమిన్‌టాంగ్ విప్లవకారులను ఆ పదవులనుంచి బర్తరఫ్ చేశాడు.

కియాంగ్సీ గవర్నరుగావున్న లీ లియేహ్ - చున్ తన పదవిని వదలనిరాకరించి తన సేనలతో హుకౌను ఆక్రమించాడు. ప్రత్యేక సైన్యాన్ని నిర్మించి, యువాన్‌పై తిరగబడమని దేశానికంతకూ విజ్ఞప్తిచేశాడు. కియాంగ్సూ, అన్‌హ్వాయి, క్వాంగ్‌టుంగ్, ఫూకీన్, హునాన్, జిచివాన్ రాష్ట్రాలు వెంటనే అందుకు పూనుకుని స్వాతంత్రం ప్రకటించాయి. లీ చున్ వద్ద ఎక్కువ సైన్యాలుండటం, చురుకుగా వ్యవహరించటంవల్ల అతడిపై యువాన్ దాడి కేంద్రీకరించబడింది. యువాన్ సేనలు కియాంగ్సీ రాష్ట్రంపైకి వెళ్ళి, హుకౌను ఆక్రమించాయి. తరువాత నాన్‌చాంగ్‌ను పట్టుకున్నాయి. లీ లీహ్ - చువాన్ ఘోరపరాజయం పొందాడు.

దీని ఫలితంగా కొన్ని రాష్ట్రాల గవర్నర్లు లొంగిపోయారు. రెండు నెల్లలో యువాన్ వ్యతిరేక సేనలు పూర్తిగా ఓడిపోయాయి. యువాన్‌కు వ్యతిరేకంగా జరిగిన ఈ పోరాటాన్ని రెండో విప్లవమని పిలుస్తారు.

రెండో విప్లవం ఓడిపోయిన తరువాత యువాన్ ఆశలు మితిమీరాయి. రాజ్యాంగాన్ని ముందు తయారుచేసి, తరువాత అధ్యక్షుని ఎన్నుకోవాలనే తాత్కాలిక రాజ్యాంగంలోని నిబంధనను బహిరంగంగా ఉల్లంఘించాడు. 1913 అక్టోబరు 6 వ తేదీన తన్ను అధ్యక్షునిగా ఎన్నుకోమని పార్లమెంటు సభ్యులను ఒత్తిడి చేశాడు. "పౌర సంఘం" పేరుతో వున్న తన స్వంతముఠా దుండగీడులు కొన్ని వేల మందితో ఎన్నికలరోజున పార్లమెంటు భవనాన్ని చుట్టుముట్టారు. అధ్యక్షుని ఎన్నుకుంటేగాని పార్లమెంటు సభ్యులను బయటికి వెళ్ళనివ్వమని ఈ గూండాలు భయపెట్టారు. ఇలాంటి నీచమైన ఎత్తుగడలద్వారా యువాన్ అధ్యక్షపదవిని ఆక్రమించాడు.

చైనా అధ్యక్షుడుగా యువాన్ ఎన్నుకోబడినట్లుగా ప్రకటన వెలువడిన వెంటనే అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వం గుర్తించింది. ఇతర సామ్రాజ్య

వాద ప్రభుత్వాలు అదే మార్గాన్ని అనుసరించాయి. యువాన్ అధికార దుర్వినియోగానికి అభ్యంతరంచెబుతూ కొందరు కొమిన్‌టాంగ్ పార్లమెంటు సభ్యులు, ప్రోగ్రసివ్ పార్టీ సభ్యులు కలసి రాజ్యాంగ నిబంధనలకు కట్టుబడి వుండాలని ఆక్షేపణను తెచ్చారు. అందుమీదట యువాన్ కొమిన్‌టాంగ్ పార్టీని రద్దుచేసి, పార్లమెంటునుంచి కొమిన్‌టాంగ్ సభ్యులను బర్తరఫ్ చేశాడు. నాన్‌కింగ్‌లో తాత్కాలిక ప్రభుత్వం తయారుచేసిన తాత్కాలిక రాజ్యాంగాన్ని రద్దుచేసి, 1914 మే నెలలో యువాన్ స్వంతరాజ్యాంగాన్ని ప్రకటించాడు. దీని ఫలితంగా 1911 బూర్జువా ప్రజాస్వామిక విప్లవం ఆఖరి చిహ్నాన్ని కూడ తుడిచిపెట్టాడు.

యువాన్ ప్రకటించిన రాజ్యాంగం ప్రకారం చక్రవర్తినుండి నియంతృత్వాధికారాలన్నీ అధ్యక్షునికి వుంటాయి. అధ్యక్షుని పదవి కాలపరిమితి లేకుండా యావజ్జీవం వుంటుంది. చనిపోయేముందు అధ్యక్షుడు, తనకు వారసుని నియమించే హక్కును కూడ కలిగివుంటాడు. ఈ రాజ్యాంగం ప్రకారం యువాన్ తాను యావజ్జీవం అధ్యక్షుడుగా వుండుటేగాక తదనంతరం అతని కొడుకే అధ్యక్షుడౌతాడు. వీటన్నిటి ద్వారా భూస్వాముల, పెట్టుబడిదారుల నియంతృత్వాన్ని యువాన్ జయప్రదంగా స్థాపించగలిగాడు.

## యువాన్ రాజరిక స్కీమ్

1914 జులైలో మొదటి ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధం యూరపులో ప్రారంభమయింది. తదవకాశాన్ని వినియోగించుకుని జపాన్ వెంటనే జర్మనీపై యుద్ధం ప్రకటించింది! షాంటుంగ్ కోస్తాలో సైన్యాలను దించి, జర్మనీచేతుల్లోనుంచి కియోచౌ-సినాన్ రైల్వేను, ట్సుంగ్ టావ్ ప్రాంతాన్ని ఆక్రమించుకుంది. ఆ సమయంలో రాచరిక ప్లానును పునరుద్ధరించాలనే ప్రయత్నాల్లో యువాన్ నిమగ్నుడై వున్నాడు. తన దురాశకు జపాన్ మద్దతు వున్నందున, చైనా భూభాగాన్ని జపాన్ కాజేస్తున్నప్పటికీ కనీస అసమ్మతిని కూడ యువాన్ కనబరచలేదు.

1915 జనవరిలో చైనా దేశాన్ని జపాను వలసగా మార్చుకునేందుకు వినియోగపడే 21 డిమాండులను జపాన్ ప్రభుత్వం ప్రకటించింది. తానే చక్రవర్తిగా ప్రకటించుకోవాలని యువాన్ వేసుకున్న స్కీముకు జపాన్ మద్దతు లభించాలంటే ఈ డిమాండులను అంగీకరించాలని పట్టుబట్టింది.

ఇరవై ఒక్క డిమాండులలో ముఖ్యమైనవి ఇవి :

షాంటుంగులో జర్మనీకున్న హక్కులను జపానుకిచ్చి, ముఖ్యరేవులు నగరాలన్నిటినీ జపాన్ వర్తకానికి తెరవాలి;

లియోనింగ్, కిరిన్, ఇన్నర్ మంగోలియా తూర్పు భాగంలోనూ జపాన్ ప్రత్యేక హక్కులను గుర్తించాలి;

హూపే రాష్ట్రింలో హాన్యేపింగ్ వద్ద వున్న ఇనుము, ఉక్కు పరిశ్రమను, కియాంగ్సి రాష్ట్రిలోవున్న పింగ్ షియాంగ్ బొగ్గు పరిశ్రమను జపాన్‌తో కలసి ఉమ్మడిగా నిర్వహించాలి;

చైనా సముద్రతీరంలోని ఏ రేవునుగాని, అఖాతాన్నిగాని, దీవినిగాని జపాన్‌కు తప్ప మరే విదేశ ప్రభుత్వానికి కౌలుకు యివ్వరాదు;

రాజకీయ, ఆర్థిక, సైనిక సలహాదార్లుగా జపానువాళ్ళను నియమించాలి;

చైనా ముఖ్య నగరాల్లోని పోలీసుశాఖను ఉమ్మడి పరిపాలనక్రింద వుంచాలి;

చైనా ఆయుధాగారాలను ఉమ్మడి యాజమాన్యంక్రింద వుంచాలి

ఊ చాంగ్ నుంచి నాన్ చాంగ్‌కు, నాన్ చాంగ్ నుంచి హాంగ్ చౌకు, నాన్‌చాంగ్‌నుంచి చావో చౌకు మధ్య వున్న రైల్వేలకు పెట్టుబడులు పెట్టే హక్కు జపాను కివ్వాలి.

ఫ్యూకీన్ రాష్ట్రింలో రైల్వేలను నిర్మించే హక్కును, ఖనిజాలను తవ్వే హక్కును జపాను కివ్వాలి.

దాదాపు జపాన్ కోర్కెలన్నిటినీ యువాన్ షీ-కై అంగీకరించాడు. దీంతో జపాన్ సామ్రాజ్యవాదులకు, యువాన్ ప్రభుత్వ దేశ ద్రోహానికి వ్యతిరేకంగా ప్రజలంతా తీవ్ర అసమ్మతిని ప్రకటించారు. జపాన్ వస్తు బహిష్కరణోద్యమం దేశమంతటా వ్యాపించింది. జపాన్ దురాక్రమణను దృఢనిశ్చయంతో చైనాప్రజలు ఎదిరించుతారని స్పష్టపడింది.

జపాన్ సామ్రాజ్యవాదులు తనను బలపరుస్తారనే విశ్వాసంతో రాజరికాన్ని పునరుద్ధరించడానికి యువాన్ చర్యలు తీసుకోసాగాడు. ఫ్రాంక్ జె. గూడ్నౌ అనే అమెరికన్ సలహాదారును చైనా పరిస్థితులకు రిపబ్లిక్ కంటే రాచరికం అనుగుణ్యంగా వుంటుందని వ్యాసాలు వ్రాయమని కోరాడు. యువాన్ అధీనంక్రింద వుండేలాగ "పౌరసదస్సును" పిలచి, దానిలో తమ స్కీమును ఆమోదింప చేసుకున్నారు. తద్వారా రిపబ్లిక్‌ను రాజరికంగా మార్చి, యువాన్‌ను చక్రవర్తిగా ప్రకటించుకున్నారు.

యువాన్ రాచరిక స్కీమును వ్యతిరేకించుతూ చైనా దేశమంతటా ప్రజావెల్లువ విజృంభించింది. అప్పటికి జపాన్‌లో వున్న డాక్టర్ సన్‌యెట్ సేన్ చైనా విప్లవ విమోచనంకొరకు సహచరులందరినీ సమీకరించాడు. 1914 లో చుంగ్ హువా కేమింగ్ టాంగ్ (చైనా విప్లవపార్టీ) ని టోకియోలో ఏర్పరచాడు. యువాన్ పరిపాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటుకు సన్నాహాలు ప్రారంభించాడు. కాని కొత్తగా ఏర్పడిన పార్టీ విస్తృత పునాదులపై ప్రజలను సంఘటితపరచలేక పోయింది.

ప్రోగ్రెసివ్ పార్టీలోని కొందరు సభ్యులు యువాన్‌కు వ్యతిరేకంగా ప్రజల ద్వేషాన్ని గుర్తించి, వెంటనే జాతీయ విమోచనావుద్యమాన్ని ప్రారంభించారు. 1915 వ సంవత్సరం చివరలో యున్నాన్ సైన్యాధిపతిగా వున్న ట్సాయ్ ఓ స్వతంత్రం ప్రకటించి, యువాన్‌ను శిక్షించేందుకు జాతీయ విమోచనా సైన్యాన్ని నిర్మించాడు.

తిరుగుబాటు వెంటనే ఇతర రాష్ట్రాల్లో కూడా వ్యాపించింది. ఈ పరిస్థితులలో యువాన్‌కు యిచ్చే తోడ్పాటును సామ్రాజ్యవాద శక్తులు మానుకున్నాయి. సింహాసనం అధిష్టించుతూ తాను చేసిన ప్రకటనను 1916లో యువాన్ రద్దుచేసుకోవడం తప్పనిసరయింది. యువాన్ వ్యతిరేక తిరుగుబాట్లు వృద్ధిఅవుతుండగానే ఆశలతోపాటు యువాన్ కూడ మరణించాడు.

## టువాన్ చీ - జుయీ ప్రభుత్వం

యువాన్ మరణాంతరం లీ యువాన్ - హుంగ్ అధ్యక్షుడుగానూ, టువాన్ చీ - జుయీ ప్రధానమంత్రిగానూ అధికారం చేపట్టారు. తాత్కాలిక రాజ్యాంగాన్ని మరల కొంతకాలం పునరుద్ధరించారు.

టువాన్ అంతకుముందు యువాన్ షీ - కై క్రింద పలుకుబడిగల సేనానిగా వుండేవాడు. యువాన్ అధ్యక్షుడుగా వున్నప్పుడు వరుసగా అనేకదఫాలు టువాన్ సైన్యాధిపతిగా వున్నాడు. యువాన్ మరణానంతరం నిజమైన ప్రభుత్వాధికారం టువాన్ హస్తగతమయింది.

1917 వసంతంలో జపాన్ సూచనల ప్రకారం టువాన్ చీ - జుయి ప్రభుత్వం జర్మనీతో రాజకీయ సంబంధాలను తెగతెంపులు చేసుకుంది: యూరపులో జరుగుతున్న సామ్రాజ్యవాద యుద్ధంలో పాల్గొనడానికి సిద్ధపడింది. చైనాపై ఆధిపత్యం సంపాదించడానికి జపానతో పోటీపడుతున్న అమెరికా ప్రభుత్వం ప్రపంచ యుద్ధంలోకి చైనాను దించవలదని అధ్యక్షుడు లీ యువాన్ - హుంగ్‌కు సలహాయిచ్చి టువాన్‌ను వ్యతిరేకించమని ప్రోత్సహించింది. పార్లమెంటు తోడ్పాటుతో అధ్యక్షుడు లీ ప్రధానమంత్రి పదవినుండి టువాన్‌ను తొలగించాడు. టువాన్ లొంగలేదు. పార్లమెంటును రద్దుచేసేలా అధ్యక్షునిపై ఒత్తిడి తేవాలని వివిధ రాష్ట్రాలలోని సైనికప్రభువులను రెచ్చగొట్టాడు.

ఈలోగా చాంగ్-హ్స్యున్ అనే సైనికప్రభువు తన సైన్యంతో పెకింగ్‌పై దాడిచేశాడు; లీయువాన్-హుంగ్‌ను అధికారంలోనుంచి పారదోలాడు: మంచూ రాజవంశీకుడైన హ్సువాన్ టుంగ్ అనే బాలుణ్ణి సింహాసనం ఎక్కించేందుకు ప్రయత్నించాడు. ఈపరిస్థితులను అవకాశంగా తీసుకుని టువాన్ తన సైన్యంతో చాంగ్ హ్స్యున్‌పై దాడిచేసి, రిపబ్లిక్‌ను రక్షించానని చెప్పుకుంటూ ప్రధానమంత్రి పదవిని తిరిగి హస్తగతం చేసుకున్నాడు. జర్మనీ, ఆస్ట్రియాలపై యుద్ధం ప్రకటించాడు.

ఆ సమయంలో జర్మనీతో జీవన్మరణ పోరాటంలో నిమగ్నమై వున్నందువల్ల యూరోపియన్ సామ్రాజ్యవాదులు చైనా వ్యవహారాలలో జోక్యంకలిగించుకోలేకపోయాయి. ఈ సదవకాశాన్ని జపాన్ పూర్తిగా వినియోగించుకుంది; అప్పులివ్వడం ద్వారా టువాన్ ప్రభుత్వాన్ని తన అధీనంలో జపాన్ వుంచుకుంది. అప్పులిచ్చినందుకు ప్రతిఫలంగా టువాన్ రైల్వేలను, గనులను, బ్యాంకులను జపానుకు

అమ్మాడు. చైనాపై ఆధిపత్యం సంపాదించేందుకు జపాన్ సామ్రాజ్యవాదుల పన్నాగంలో సాధనంగా యువాన్ షీ-కై వలెనే టువాన్ కూడ వినియోగపడ్డాడు.

## రాజ్యాంగాన్ని కాపాడే వుద్యమం

టువాన్ తన ప్రధాన మంత్రిత్వాన్ని తిరిగి సంపాదించాక రిపబ్లిక్ తాత్కాలిక రాజ్యాంగాన్ని రద్దు చేశాడు. పార్లమెంటును ఏర్పరచే పద్ధతిని, ఎన్నికల చట్టాన్ని మార్చి వేశాడు. తన ఆధీనంలో వుండే కొత్త పార్లమెంటును సృష్టించుకున్నాడు. దీనికి వ్యతిరేకంగా నైరుతి రాష్ట్రాలు అసమ్మతి తెలిపాయి. క్వాంగ్‌టుంగ్, క్వాంగ్సీ, యున్నాన్ నాయకులు తమ రాష్ట్రాల స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు.

అప్పుడు షాంఘైలో వుంటున్న డాక్టర్ సన్‌యెట్‌సేన్ టువాన్ ప్రభుత్వాన్ని కూలదోసేందుకు సన్నాహాలు ప్రారంభించాడు. నావికా మంత్రిగావున్న చెంగ్ పి-కువాంగ్ సన్‌యెట్ సేన్‌కు తోడ్పడతానని తెలియజేశాడు. 1917 జూలైలో సన్ నావికాదళంతో క్వాంగ్‌టుంగ్‌కు వెళ్ళి, దక్షిణ రాష్ట్రాల నాయకులను సమీకరించాడు. సన్ ఆధిపత్యంక్రింద మిలిటరీ ప్రభుత్వం ఏర్పడింది. ఈ ప్రయత్నాన్ని రాజ్యాంగాన్ని కాపాడే వుద్యమం అనే పేరుతో చరిత్రకారులు పిలుస్తున్నారు.

డాక్టర్ సన్‌యెట్‌సేన్ ఈ పోరాటంలో దక్షిణరాష్ట్రాల సైనిక ప్రభువులపై ఆశ పెట్టుకున్నాడు. కాని వారికి రాజ్యాంగరక్షణ యెడల ఆసక్తిలేదు. అధికారం హస్తగతం చేసుకోవడమే వారి లక్ష్యం. త్వరలోనే సన్‌యెట్‌సేన్‌ను వదలివేశారు; ఆయన వుద్యమం విఫలమయింది.

235

52 వ అధ్యాయం

# జాతీయ పెట్టుబడిదారీ విధానం సత్వరాభివృద్ధి

మొదటి ప్రపంచయుద్ధకాలంలో యూరోపియన్ ప్రభుత్వాలు యుద్ధంలో నిమగ్నమై వుండటంవల్ల తాత్కాలికంగా చైనాలో తమ కార్యకలాపాలను నడిపించ వలసివచ్చింది. దాని ఫలితంగా చైనాలో జాతీయ పెట్టుబడిదారీ విధానం త్వరగా విస్తరించింది. 1913-1919 సంవత్సరాల మధ్య చైనా జాతీయుల యాజమాన్యంక్రింద వున్న బట్టలమిల్లులలో కదురులు 6,50,000 నుంచి 11,70,000 లకు పెరిగాయి: అంటే నూటికి 80 వంతులు పెరిగాయి. మగ్గాలు 4,600 నుంచి 9,400 లకు అనగా నూటికి 105 వంతులు పెరిగాయి. అదే విధంగా చాల పిండిమిల్లులు స్థాపించబడ్డాయి. అదివరకు పిండిని దిగుమతి చేసుకుంటున్న చైనాదేశం 1919 వ సంవత్సరంలో పిండి ఎగుమతి ప్రారంభించింది. ముడి పట్టు, సిగరెట్లు, నిప్పుపెట్టెలు, రంగులు, తదితర పరిశ్రమల్లోకూడ అంతకు ముందున్న పరిస్థితితో పోల్చినపుడు యుద్ధకాలంలో ఎక్కువ అభివృద్ధిని సాధించింది.

ఐనప్పటికి జపాన్, అమెరికా ప్రభుత్వాలు మాత్రం అప్పుడుకూడ తమ ఆర్థిక దురాక్రమణను కొనసాగించుతూనే వచ్చాయి. 1914-19 సంవత్సరాల మధ్యకాలంలో జపానీయుల యాజమాన్యం క్రిందవున్న బట్టలమిల్లులలో కదుళ్ళసంఖ్య 2,30,000 నుంచి 4,50,000 లకు అంటే నూటికి 95 వంతులు పెరిగాయి. మగ్గాలసంఖ్య 3,500 నుంచి 4,300 లకు అంటే నూటికి 23 వంతులు పెరిగాయి.

ఐతే జాతీయ పరిశ్రమల అభివృద్ధి హెచ్చు తగ్గులుగా మాత్రమే జరిగింది. వినిమయ వస్తువులను తయారుచేసే పరిశ్రమలు (లైట్ ఇండస్ట్రీస్) మాత్రమే సత్వరాభివృద్ధి చెందాయి. ముఖ్యంగా షాంఘై, టీన్‌ట్సిన్, ట్సింగ్‌టావ్, ఊహాన్ వంటి పెద్ద నగరాల్లో కేంద్రీకరింపబడ్డాయి.

## చైనా కార్మికవర్గం పెరుగుదల

జాతీయ పెట్టుబడిదారీ విధానంతోపాటు అదే సమయంలో చైనా కార్మిక వర్గం కూడ త్వరితగతిని పెంపొందింది. జాతీయులేగాని విదేశీయులేగాని స్థాపించిన

ప్రతి కొత్త ఫ్యాక్టరీతోపాటు చైనా కార్మికుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. 1913 నుంచి 1919 నాటికి మొత్తం చైనా కార్మికుల సంఖ్య 6,50,000 నుంచి 20 లక్షలకు పెరిగింది. సామ్రాజ్యవాదుల సంకెళ్ళు, ఫ్యూడల్ పరిపాలన, పెట్టుబడిదారీ ఆర్థికదోపిడీవల్ల-మూడు రకాల భారాన్ని-కార్మికులు మోయవలసి వచ్చింది. కనీస బ్రతుకుతెరువుకు సైతం రోజూ ఎక్కువగంటలు పని చేయవలసివచ్చేది. నివసించే ఇళ్ళ పరిస్థితి దారుణంగా వుండేది. స్త్రీలు, పిల్లలచేత తక్కువ వేతనాలకు పని చేయించుకోవడం సర్వ సాధారణంగా జరిగిపోయేది. పెట్టుబడిదారులు కార్మికులను కొట్టడం, జరిమానాల పేరుతో వేతనాలలో కోతలుపెట్టడం జరిగేది. శ్రామిక ప్రజలను దోచుకోవడంలో సామ్రాజ్యవాదులు, చైనా పాలకవర్గం ఒకే విధానం అవలంబించేవారు. ఉభయులూ చేతులు కలిపి, కార్మికుల అసమ్మతి ప్రదర్శనాలను హింసా కాండతో అణచివేసేవారు.

తమ జీవితపరిస్థితులను బాగుచేసుకునేందుకు చైనా కార్మికులు తమ చరిత్ర ప్రారంభమైనప్పటినుంచీ పోరాటాలు సాగించారు. 1911 విప్లవానికి ముందుకూడ కియాంగ్సీలో అన్‌యువాన్ బొగ్గుగనుల కార్మికులు సాయుధ పోరాటాలలో పాల్గొన్నారు. 1913 లో హాన్‌యాంగ్ ఆయుధాగార కార్మికులు జీతాల తగ్గింపుకు వ్యతిరేకంగా సమ్మె చేశారు. 1915 తరువాత సమ్మెలసంఖ్య త్వరత్వరగా పెరిగింది. ఒక 1919 వ సంవత్సరంలోనే 66 సమ్మెలు జరిగి చాల ఎక్కువమంది కార్మికులు పాల్గొన్నారు. కాని అప్పటికింకా మార్క్సిస్టు-లెనినిస్టు భావాలు కార్మికులలో వ్యాప్తి చెందలేదు. విప్లవ సిద్ధాంతాల ప్రభావం యింకా కార్మికులపై లేనందున, కార్మికుల పోరాటాలు ఆర్థిక స్వభావం కలిగివుండేవి. వాటంతటవి బ్రద్దలయ్యేవి.

కార్మికవర్గం పెరగడంవల్ల శ్రామికుల విప్లవపార్టీయైన చైనా కమ్యూనిస్టు పార్టీ సంస్థాపనకు మార్గ మేర్పడింది.

53 వ అధ్యాయం

# చైనా ప్రజా విప్లవానికి నూతనదశ ప్రారంభం

## నూతన సంస్కృతీఉద్యమం

మొదటి ప్రపంచయుద్ధ కాలంలో జాతీయ పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందడంతోపాటు బూర్జువా రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాలుకూడ ప్రజల్లో ఎక్కువ ప్రచారమయ్యాయి. తత్ఫలితంగా ఫ్యూడల్ విధానాన్ని ప్రజలు తీవ్రంగా వ్యతిరేకించసాగారు. ప్రజల చైతన్యానికి అనుగుణంగా నూతన సంస్కృతీ పుద్యమం ప్రారంభమయింది.

1915 లో నూతనభావాలను ప్రచారం చేసేందుకు కొందరు మధ్యతరగతి (పెటీ బూర్జువా) మేధావులు హ్సిన్ చింగ్ నీన్ (నవయువక) అనే పత్రికను ప్రకటించసాగారు. మొత్తంమీద ఈ గ్రూపు ప్రజాస్వామ్య భావాలను, శాస్త్రీయ విజ్ఞానాన్ని ప్రచారం చేసింది. ఫ్యూడల్ నిరంకుశత్వాన్ని, ఫ్యూడల్ కర్మకాండలను నీతులను, ఫ్యూడలిజానికి సాధనంగా వినియోగపడే కన్ఫ్యూషియన్ సిద్ధాంతాలను ఖండించేది. మూఢవిశ్వాసాలను, శాస్త్రీయ విజ్ఞానానికి విరుద్ధమైన భావాలను, ఆచారాలనుకూడ వ్యతిరేకించేది.

నూతన విప్లవభావాలను ప్రచారం చేసేందుకు ఈ గ్రూపు నవ్యసాహిత్యాన్ని, కొత్తరచనావిధానాన్ని ప్రోత్సహించింది. ఫ్యూడల్ సాహిత్యాన్ని, గ్రాంధిక రచనా విధానాన్ని వ్యతిరేకించింది. ఈ ఉద్యమగమనంలో అభ్యుదయపరులైన కొందరు మేధావులు సజీవమైన శైలిలో వ్యావహారిక భాషలో వ్యాసాలు వ్రాశారు. చైనా యువకులు తమను తాము సంస్కరించుకోవాలనీ, ప్రపంచం యెడల అభ్యుదయ దృక్పథం అలవరచుకోవాలనీ, చెడుసంప్రదాయాల సంకెళ్ళను బద్దలుచేయాలనీ, ఫ్యూడల్ ప్రభుత్వంక్రింద క్రుంగుతున్న జాతిని ప్రజాస్వామ్యజాతిగా రూపొందించుకోవాలనీ ప్రబోధించింది.

నూతన సంస్కృతీ పుద్యమం మేధావులలో అత్యంత ఎక్కువ ప్రభావం కలిగించింది. తత్ఫలితంగా ఫ్యూడల్ బంధనాలను తెంచివేయాలనీ, విజ్ఞాన శాస్త్రీ

లను, పాశ్చాత్య జీవితాన్ని గురించి తీవ్రంగా అధ్యయనం చేయాలనే ఆకాంక్ష యువకులలో వ్యాప్తిచెందింది.

నూతన సంస్కృతీ వుద్యమ సంస్థాపకులలో ఒకరైన చెన్‌టూ-హ్సియూ చైనా ఫ్యూడల్ సామాజికవిధానాన్ని, ఫ్యూడల్ సంస్కృతినీ ధైర్యంగా వ్యతిరేకించాడు. పాశ్చాత్య ప్రజాస్వామ్యాన్ని, విజ్ఞాన శాస్త్రాలను గురించి పట్టుదలతో ప్రచారం చేశాడు. ఆయన కృషి ప్రభావం మేధావివర్గాలపై చాలా వుంది. సంకుచిత భావాలను నిస్తబ్ధతను వదలాలనీ, దూరదృష్టిని, అభ్యుదయకరమైన శాస్త్రీయ దృక్పథాన్ని అలవరచుకోవాలనీ ఆయన చైనా యువకులను ప్రబోధించాడు. ఆయన ఫ్యూడల్ నిరంకుశత్వాన్ని, సైనిక ప్రభువుల పరిపాలనను వ్యతిరేకించాడు. చైనాలో బూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడాలని కాంక్షించాడు కాని విప్లవంలో పాల్గొనేందుకు ప్రజాసామాన్యాన్ని సమీకరించడానికి చెన్ టూ-హ్సియూ పూనుకోలేదు. ఎలాంటి వర్గపోరాటాలు లేకుండానే చైనా బూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని స్థాపించవచ్చని ఆయన భ్రమపడ్డాడు.

లూహ్సున్ వాస్తవిక దృక్పథం గల రచయిత; ఇరవైయవ శతాబ్దపు చైనా సాహిత్యవేత్తలందరిలోకి ప్రముఖుడు. మహోన్నత భావాలుగల విప్లవకారుడు. 1911 విప్లవం ప్రారంభం గాకముందు డాక్టర్ సన్‌యెట్‌సేన్ నడుపుతున్న బూర్జువా ప్రజాస్వామ్య విప్లవోద్యమంలో లూహ్సూన్ పాల్గొన్నాడు. 1918 లో "పిచ్చివాని డైరీ" అనే గ్రంథాన్ని ఆయన వ్రాశాడు. చైనా సాహిత్యం ఆధునిక పద్ధతిలో వ్రాసిన మొదటి కథ అదే. ఫ్యూడల్ సామాజిక విధానాన్ని రచయిత నిశితంగా దాన్లో అవహేళన చేశాడు. కొన్ని వేల సంవత్సరాల ఫ్యూడల్ చైనా చరిత్ర కేవలం పాలకవర్గాలు జనసామాన్యంపై సాగించిన దారుణ హింసాకాండ చరిత్రేనని లూహ్సూన్ ధైర్యంగా నిరూపించాడు. అందుచేత ఫ్యూడల్ సామాజిక విధానానికి వ్యతిరేకంగా ప్రజలు తిరుగబడాలని ప్రబోధించాడు. చైనా ప్రజలను మేల్కొల్పడంలో లూహ్సూన్ తీవ్రవుద్యమానికి ప్రముఖ పాత్ర వుంది.

నూతన సంస్కృతీ వుద్యమంలో మరొక నాయకుడైన లీటా-చావో సమగ్రమైన విప్లవ ప్రతిపాదనను ప్రజలముందుంచాడు. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని, ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాలను సమన్వయంచేయాలని ప్రబోధించాడు. ప్రపంచ ప్రజలందరికీ సామ్రాజ్యవాదం పరమ శత్రువని లీ ఎలుగెత్తి చాటాడు. ప్రపంచంపై సామ్రాజ్యవాదుల ఆధిపత్యాన్ని కూలదోయనిదే నిజమైన ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పరచడం సాధ్యంకాదని నిరూపించాడు. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంతో ఫ్యూడలిజానికి వ్యతిరేక పోరాటాన్ని సమన్వయపరచినందున లీ టా-చావోకు చారిత్రక ప్రాముఖ్యత వుంది.

# మహోన్నతమైన సోషలిస్టు విప్లవం

1917 నవంబరులో (రష్యన్ పాత పంచాంగం ప్రకారం అక్టోబరులో) రష్యన్ కార్మికులు, రైతులు, బోల్షివిక్‌ల నాయకత్వం క్రింద మహోన్నతమైన సోషలిస్టు విప్లవంలో జయం పొందారు. పెట్టుబడిదారుల, భూస్వాముల పరిపాలనను కూలద్రోసి, ప్రపంచంలోకల్లా మొట్టమొదటిసారి సోవియట్ యూనియన్‌లో శ్రామిక నియంతృత్వాన్ని స్థాపించారు.

మానవజాతి చరిత్రలో అక్టోబర్ విప్లవం నూతన శకాన్ని ప్రారంభించింది. అక్టోబరు విప్లవం విజయం గాంచడంవల్ల మానవజాతి భవిష్యద్గమనంలోనే ప్రధానమైన మూలమలుపు వచ్చింది. పాత బూర్జువా డెమాక్రటిక్ విప్లవాల దశ అంతమై, కొత్త శ్రామిక సోషలిస్టు ప్రపంచ విప్లవం ప్రారంభమయింది.

అక్టోబరు విప్లవం జయంపొందిన వెంటనే సోవియట్ ప్రభుత్వం జారిస్టు రష్యాకు-చైనాకు మధ్య జరిగిన అసమాన ఒడంబడికలన్నిటినీ రద్దుచేసింది. జారిస్టు సామ్రాజ్యవాదులు దురాక్రమణద్వారా చైనాలో సంపాదించిన ప్రత్యేక సౌకర్యాలన్నిటినీ వదలివేసింది. దానితోపాటు జాతీయ స్వాతంత్ర్యంకొరకు జరుగుతున్న చైనా వుద్యమాన్ని సోవియట్ ప్రభుత్వం బలపరచింది. స్నేహపూర్వకమైన ఈ చర్యలవల్ల సోవియట్ ప్రభుత్వం వెంటనే చైనా ప్రజల మైత్రిని సంపాదించ గలిగింది.

అక్టోబరు విప్లవం సాధించిన విజయాలవల్ల, పాశ్చాత్యదేశాలనుండి చైనా చాలా నేర్చుకోవలసివుందనే ఉత్సాహం ఒక వైపున అంతమొంది మరోవైపున సోషలిస్టుభావాలు చైనా మేధావులలో వ్యాపించసాగాయి. నూతన సంస్కృతీ ఉద్యమ నాయకులలో చాలమంది మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతాలను అంగీకరించసాగారు. రష్యన్ విప్లవాన్నుంచి, రష్యన్ పంథానుంచి గుణపాఠాలను నేర్చుకోసాగారు.

1918 లో లీటా-చావో "సామాన్య ప్రజల విజయం", "బోల్షివిజం విజయం" అను గ్రంథాలను ప్రకటించాడు. రెండో పుస్తకంలో ఆయన ఇలా ఎలుగెత్తి చాటారు :

"1917 రష్యన్ విప్లవం ఇరవయ్యవ శతాబ్దంలో రానున్న ప్రపంచ విప్లవానికి నాంది లాంటిది. ప్రపంచం యావత్తు భవిష్యత్తులో ఎర్రజెండా ప్రపంచం కాబోతూంది."

అక్టోబరు విప్లవం సాధించిన మహత్తర విజయాల ఫలితంగా మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాలు చైనాలో వ్యాపించాయి. మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాలు ప్రపంచమంతటికీ అనువర్తించే ప్రపంచ సత్యాలని చైనా ప్రజలు అవగాహన చేసుకోసాగారు. దీనితో చైనా ప్రజల దృక్పథంలో మార్పు వచ్చింది. పాత

బూర్జువా డెమొక్రాటిక్ విప్లవ దశనుంచి కార్మికవర్గ నాయకత్వాన జరిగే నూతన ప్రజాస్వామిక విప్లవదశలోకి చైనా ప్రజలు ప్రవేశించారు.

1840 నల్లమందు యుద్ధం నాటినుంచి 1919 సంవత్సరంలో జరిగిన మే 4 వుద్యమానికి సంవత్సరం ముందువరకు చైనా చరిత్రలో ఒక ప్రత్యేక దశ. ఈ కాలంలో సామ్రాజ్యవాదుల దురాక్రమణ, ఫ్యూడల్ పరిపాలకుల లొంగుబాటు ఫలితంగా చైనా అర్ధవలస, అర్ధ ఫ్యూడల్ దేశంగా దిగజారిపోయింది. ఈ చారిత్రక దశలో చైనా ప్రజలు దేదీప్యమానమైన విప్లవ సంప్రదాయాన్ని కొనసాగించారు. విదేశ సామ్రాజ్యవాదుల దురంతాలకు, దేశీయ ఫ్యూడల్ పాలకవర్గ క్రూరత్వానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటాల్లో చైనా ప్రజలు అకుంఠిత ధైర్య సాహసాలను ప్రదర్శించారు.

54 వ అధ్యాయం

# మే 4 ఉద్యమం

1918 లో మొదటి ప్రపంచసామ్రాజ్యవాద యుద్ధం అంతమయింది. మరుసటి సంవత్సరం విజేతలైన బ్రిటన్, ఫ్రాంసు, అమెరికా సంయుక్తరాష్ట్రాలు, జపాన్, తదితర ప్రభుత్వాలు పారిస్‌లో సమావేశమయ్యాయి. యుద్ధంలో కొల్లగొట్టిన దోపిడు లను తమలో తాము పంచుకునేందుకు సామ్రాజ్యవాదదేశాలు పారిస్ శాంతి సమావేశంలో బేరాలు సాగించాయి.

అమెరికా, జపాన్ సామ్రాజ్యవాదుల బంటుగా తయారైన టువాన్ చీ-జుయి నాయకత్వం క్రింద వున్న పెకింగ్ సైనిక ప్రభువుల ప్రభుత్వం చైనా దేశాన్ని యుద్ధంలోకి ఈడ్చినందున చైనా ప్రతినిధివర్గం కూడ పారిస్ శాంతి సమావేశానికి వెళ్ళింది. ప్రజా వత్తిడి ఫలితంగా చైనా ప్రతినిధివర్గం సమావేశంముందు తన జాతీయ వాంఛలను పునరుద్ఘాటించింది. షాంటుంగ్‌లో ఇదివరకు జర్మనీ అనుభవించుతున్న ప్రత్యేక హక్కులను యుద్ధకాలంలో జపాన్ కాజేసిన వాటిని తిరిగి చైనాకు యివ్వాలని కోరింది. యువాన్ షీ-కై ప్రభుత్వానికి జపాన్‌కు మధ్య జరిగిన 21 డిమాండుల ఒడంబడికను రద్దుచేయాలని కోరింది. చైనా దేశంలో సామ్రాజ్యవాదదేశాలు కాజేసిన ప్రత్యేక హక్కులను రద్దుచేయాలని డిమాండు చేసింది. సామ్రాజ్యవాదుల చెప్పుచేతల్లో వున్న పారిస్ సమావేశం చైనా డిమాండు లను బుట్టదాఖలు చేసింది.

ఈ వార్తలు చైనాకు చేరిన వెంటనే దేశమంతటా తీవ్ర వ్యతిరేకత తెలుపుతూ ఆందోళన జరిగింది. మే నెల 4వ తేదీన పెకింగ్ విద్యార్థులు, పౌరులు టీయెన్ అన్ మెన్ (ప్రభుత్వ భవనం) ముందు ప్రదర్శనం జరిపారు. దేశభక్తి పతాకాన్ని ఎగరవేస్తూ "చైనా సర్వసహాధికారాన్ని రక్షించండి! దేశద్రోహులను శిక్షించండి!" అనే నినాదాలను ఎలుగెత్తి చాటారు "ట్సింగ్ టావోను తిరిగి స్వాధీనం చేసుకునేందుకు శపథం చేదాం!" "వెర్సైల్స్ సంధిలో సంతకం చేయవద్దు!" "21 డిమాండుల ఒడంబడికను రద్దుచేయండి!" "జపాన్ వస్తువులను బహిష్కరించండి" అనే నినాదాలు ప్రతిధ్వనించాయి.

దేశద్రోహులు ముగ్గురిని శిక్షించాలని ప్రదర్శకులు కోరారు. యువాన్ షీ-కై ప్రభుత్వంలో విదేశాంగశాఖ ఉపమంత్రిగా వుండి 21 డిమాండుల ఒడంబడికపై సంతకం చేసిన రవాణామంత్రి ట్సావో జు-లిన్‌ను, ఆ సంధి జరిగినపుడు జపాన్‌లో చైనా రాయబారిగా వుండిన లీ ట్సుంగ్-యూను జపానుకు రైల్వేహక్కులను అమ్మివేసిన చాంగ్ ట్సుంగ్ హ్సియాంగ్‌ను శిక్షించాలని ప్రదర్శకులు నినాదాలిచ్చారు. సైనికుల సాయుధ పోలీసుల వలయాన్ని బద్దలు చేసుకుని ట్సావో జు-లీన్ నివాసంపైకి ప్రదర్శకులు వెళ్ళారు. అచట దాక్కున్న చాంగ్ ట్సుంగ్-హ్సియాంగ్‌ను పట్టుకుని మర్దించారు. చివరకు ఆ భవనానికి నిప్పంటించారు.

ప్రదర్శకులను అణచివేయుడానికి పెకింగ్ సైనిక ప్రభువుల ప్రభుత్వం ఎక్కువ సైన్యాలను ప్రయోగించింది. చాలమంది విద్యార్థులను అరెస్టు చేసింది. ఇందుకు అసమ్మతిగా పెకింగ్ విద్యార్థులు మరునాడు సర్వవ్యాపిత సమ్మెకు పిలుపు ఇచ్చారు. నగరంలోని వివిధ కాలేజీలను, విశ్వవిద్యాలయాలను, ఉన్నత పాఠశాలలను కలుపుతూ విద్యార్థి ఫెడరేషన్‌ను తక్షణమే నిర్మించారు. జాతి అంతా తిరుగబడాలని ప్రబోధించుతూ కరపత్రాలను పంచారు.

టీన్‌ట్సిన్, షాంఘై, నాంకింగ్, ఊహాన్, కాంటన్ తదితర నగరాల్లోని విద్యార్థులు వెంటనే ఈ పిలుపును అందుకున్నారు. బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిపారు.

ట్సినాన్, షాంటుంగులలో వేలాది కార్మికులు సమావేశమై జపాన్ వస్తువులను బహిష్కరించాలని తీర్మానించారు. దేశభక్తి జ్వాలలు ఉవ్వెత్తుగా లేచి దేశమంతటా వ్యాపించి జాతిని మేల్కొల్పాయి.

సైనిక ప్రభువుల ప్రభుత్వం విద్యార్థులను విపరీతంగా అరెస్టు చేయుసాగింది. దీనివల్ల ప్రజలు మరింత వుద్రేకితులయ్యారు. జూన్ 3 వ తేదీన షాంఘై నగరంలో ప్రజలు బహ్మాండమైన ప్రదర్శనం జరిపి, హర్తాళ్‌కు సర్వవ్యాపిత సమ్మెకు పిలుపిచ్చారు. రెండురోజుల తర్వాత జపాన్‌వాళ్ళ యాజమాన్యం క్రింద వున్నవాటితో సహా చాల పరిశ్రమలలోని కార్మికులు 20 వేలమంది సమ్మెచేశారు. తరువాత బట్టల మిల్లులు, అచ్చు పరిశ్రమలోను, ట్రామ్, బస్సు, నావికా సర్వీసుల్లోను పనిచేసే కార్మికుల సమ్మెలు జరిగాయి. షాంఘై కార్మికుల పోరాటం దేశవ్యాపితంగా ప్రజలలో పోరాటపటిమను ఇనుమడింప చేసింది.

ఈ దశలో టాంగ్ షాన్, చాంగ్ హ్సిన్ టీన్, టీన్ ట్సిన్ నగరాల్లోని కార్మికుల పోరాటాలుకూడ జరిగాయి. నాంకింగ్, హాంగ్‌చౌ, కియూకియాంగ్, ఊహాన్, అమోయ్, ట్సినాన్, ఆంకింగ్ నగరాల్లో హర్తాళ్ జరిగి దుకాణాలన్నీ మూసివేశారు. షాంటుంగ్, హోపే, షాన్సీ, కియాంగ్సు, హ్యూపే తదితర రాష్ట్రాల నుంచి ప్రతినిధివర్గాలు పెకింగ్ నగరానికి వచ్చాయి. దేశద్రోహకరమైన "21 డిమాండుల ఒడంబడిక"ను రద్దుచేయాలనీ, వాక్ సమావేశ స్వాతంత్ర్యాలను యివ్వాలనీ

విజ్ఞప్తి చేశాయి. చైనా కార్మికులు నడిపిన రాజకీయ సమ్మెల ఫలితంగా మే 4 ఉద్యమం మేధావుల దేశభక్తి పోరాటంనుంచి విస్తృతమైన ప్రజా వుద్యమంగా కొంపొందింది. ఉద్యమ విజయానికి యిది చాల ముఖ్యమైనది.

సామ్రాజ్య వ్యతిరేక ప్రజాపోరాటం విరామంలేకుండా కొనసాగింది. బ్రహ్మాండమైన ప్రజావత్తిడికి పెకింగ్‌లోని సైనిక ప్రభువుల ప్రభుత్వా లొంగక తప్పలేదు. అరెస్టు కాబడిన విద్యార్థులందరినీ విడుదలచేసింది. దేశ ద్రోహులైన ట్సావో జు-విన్, లూ ట్సుంగ్-యు చాంగ్ ట్సుంగ్-హ్సియాంగ్‌లను బర్తరఫ్ చేసింది. పారిస్ శాంతి సమావేశానికి వెళ్ళిన చైనా ప్రతినిధివర్గం జర్మనీతో సంధి పత్రంపై సంతకం చేయ నిరాకరించక తప్పలేదు. ప్రపంచాన్నే కదలించిన మే 4 దేశభక్తి వుద్యమం ఫలితంగా, చైనా ప్రజల సామ్రాజ్య వ్యతిరేక పోరాటచరిత్రలో మహోన్నతమైన నూతనదశ ప్రారంభమయింది.

## నూతన సంస్కృతీ వుద్యమ పురోగమనం

అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం ప్రభావం చైనాలోని నూతన సంస్కృతీ వుద్యమ నాయకులలో ఒక భాగంపైపడింది. వారు మార్క్సిజంలోని సత్యాన్ని గ్రహించగలిగారు. చైనా మేధావులలో కొంతమంది కమ్యూనిస్టు భావాలను తెలిసి కొని, ఆ లక్ష్యాలకొరకు పనిచేయడానికి ప్రారంభించడంవల్ల ఈ వుద్యమం క్రమంగా అభివృద్ధిచెందింది.

ప్రథమ చైనా మార్క్సిస్టులలోనూ, చైనా కమ్యూనిస్టుపార్టీ సంస్థాపకుల్లోనూ ఒకడైన లీటా-చావో మొదటి ప్రపంచయుద్ధ స్వభావాన్ని గురించి సరైనపరిశీలన చేయగలిగాడు. తమ తమ దేశాల్లోని పెట్టుబడదారుల వర్గ ప్రయోజనాల నిమిత్తం సామ్రాజ్యవాద ప్రభుత్వాలు తెచ్చిపెట్టిన అన్యాయయుద్ధమని నిరూపించాడు. మొదటి ప్రపంచయుద్ధ పర్యవసానంగా సామ్రాజ్యవాద ప్రభుత్వాలు జయాన్ని సంపాదించలేదనీ, శాంతి సోషలిజం శక్తులే మొత్తంపై విజయం సాధించాయనీ అభిప్రాయపడ్డాడు. లీటా-చావో ప్రకటించిన సిద్ధాంతాలు చైనా మేధావులలో తుపాను లేవదీశాయి.

మార్క్సిజాన్ని ప్రజల్లో ప్రచారం చేయడానికి "నవయువక్" అనే పత్రికలో చెన్ టూ-హ్సియు తదితరులతో పాటు లీ టా-చావో వరుసగా వ్యాసాలు వ్రాసే వాడు. 1918 చివరలో 'వార సమీక్ష' అనే పత్రికను స్వయంగా స్థాపించాడు. సోవియట్ యూనియన్ నూతన రాజ్యాంగాన్ని చైనా ప్రజలకు ఈ పత్రిక ఎరుక పరచింది. సోవియట్ ప్రభుత్వ వ్యవసాయ చట్టాన్ని, వివాహ చట్టాన్ని గురించి, విప్లవానుభవాలను గురించి తెలియజేసింది.

1919 మే లో "నవయువక్" పత్రిక మార్క్సిజంపై ప్రత్యేక సంచికను ప్రకటించింది. దాన్లో లీ టా-చావో "మార్క్సిజంగురించిన అవగాహన" అనే శీర్షి

కతో మార్క్సిస్టు సిద్ధాంతాలను స్పష్టంగా తెలియజేశాడు. మార్క్సిజాన్ని ప్రచారం చేయడంలో ఈ పత్రిక చాల పలుకుబడి సంపాదించింది.

మే 4 వుద్యమం ఫలితంగా నూతన సాంస్కృతీవుద్యమం, దేశభక్తియుతమైన ప్రజాపోరాటం అనే రెండు ప్రవాహాలు సంలీనమయ్యాయి. నూతన సంస్కృతి దినదినాభివృద్ధి చెందింది. దేశమంతటా ప్రచురణాలయాలు పుట్టగొడుగుల్లాగా విస్తృతంగా బయలుదేరాయి. హునాన్ నుంచి మావో సేటుంగ్, హ్సియాంగ్ చియాంగ్ రివ్యూ అనే పత్రికను, టీన్‌ట్సీన్ నుంచి చౌ ఎన్ లై విద్యార్థి ఫెడరేషన్ బులెటిన్‌ను ప్రకటించసాగారు. పెకింగ్ నుంచి యంగ్ చైనా, న్యూ కరెంటు అనే పత్రికను, షాంఘై నుంచి సన్ డే రివ్యూ, హాంగ్ చౌ నుంచి చెకియాంగ్ రివ్యూ, చెంగ్ టూ నుంచి సన్ డే అను పత్రికలు ప్రకటించబడుతుండేవి.

మే 4 దేశభక్తి వుద్యమంతో పాటు మార్క్సిజం కూడ వ్యాప్తిచెందింది. చైనాలో మార్క్సిస్టు గ్రంథాల ప్రచురణ ప్రారంభమయింది. కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక, ఊహాజనిత శాస్త్రీయ సోషలిజం చైనా భాషలో ఈ దశలోనే ప్రకటించబడ్డాయి. మార్క్సిజం అనే విజ్ఞానజ్యోతి వెలుగు ఫలితంగా నూతన సంస్కృతీ వుద్యమం మరో వున్నతస్థాయికి అభివృద్ధి చెందింది.

## మే 4 వుద్యమ చారిత్రక ప్రాముఖ్యత

మే 4 దేశభక్తి వుద్యమం సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా రాజీలేని జాతీయ ఉద్యమం. ఫ్యూడలిజానికి కూడ వ్యతిరేకంగా రాజీలేని ఉద్యమం.

అక్టోబరు సోషలిస్టు విప్లవం విజయం పొందడంవల్ల మానవజాతి చరిత్ర గమనమే మారిపోయింది. ప్రపంచ శ్రామికవర్గ సోషలిస్టు విప్లవంలో అంతర్భాగంగా చైనా విప్లవం రూపొందింది. మే 4 వుద్యమ కాలంలో చైనా కార్మికవర్గం రాజకీయరంగంలో పోరాటశక్తిగా ప్రవేశించింది. మే 4 వుద్యమం చైనా దేశ చరిత్రను మూలమలుపువంటిది. చైనా విప్లవం, పాతరకపు బూర్జువా డిమాక్రటిక్ విప్లవంనుంచి నూతన ప్రజాస్వామ్య విప్లవంగా, ఈ మూలమలుపులోనే మార్పు చెందింది.

మే 4 వుద్యమం విప్లవయుతమైన సంస్కృతీ వుద్యమాన్ని బలపరచింది. మార్క్సిస్టు దృక్పథం అలవరచుకోవడంద్వారా చైనా సంస్కృతి ప్రపంచ శ్రామిక సోషలిస్టు సంస్కృతిలో భాగమయింది. చైనాలో సోషలిస్టు ఆలోచనా ప్రవాహం బయలుదేరి చైనా సామాజిక స్వరూపాన్ని ప్రజలు అర్థంచేసుకునేందుకు సహాయపడింది. రాజకీయ పరిస్థితులను సరిగా అవగాహన చేసుకుని విమోచనకు మార్గాన్ని రూపొందించుకోగలిగింది. కార్మికోద్యమం సోషలిస్టు ఆలోచనా ధోరణితో సమన్వయం పొందుటద్వారా కొలది కాలంలోనే చైనా కార్మికవర్గ పార్టీయైన చైనా కమ్యూనిస్టుపార్టీ రూపొందింది.

245

55 వ అధ్యాయం

# చైనా కమ్యూనిస్టుపార్టీ పుట్టుక

మే 4 ఉద్యమానంతరం కార్మికవర్గం రోజురోజుకు బలపడింది. 1919 నుంచి 1922 వరకు ఈ మూడు సంవత్సరాల్లోనూ దేశమంతటా 170 సమ్మెలు జరిగాయి. వాటిలో 2 లక్షల 50 వేల కంటే ఎక్కువమంది కార్మికులు పాల్గొన్నారు.

1920 మే నెలలో షాంఘై నగరంలో మొదటి చైనా కమ్యూనిస్టు గ్రూపును చెన్ టూ హ్సియూ తదితరులు కలసి నిర్మించారు. అదే సంవత్సరం ఆగస్టులో చైనా సోషలిస్టు యూత్ లీగ్ ఏర్పడింది. కొలదికాలం తరువాత లీ టా-చావో పెకింగ్ నగరంలో మరొక కమ్యూనిస్టు గ్రూపును ఏర్పరచాడు. హ్యూపేలో మరొక గ్రూపు టుంగ్ పీ-వూ నాయకత్వాన ఏర్పడింది. తదనంతరం ట్సినాన్, టీన్ట్సీన్, హాంగ్ చౌ, కాంటన్ వగైరా చోట్ల కమ్యూనిస్టు గ్రూపులు ఏర్పడ్డాయి.

1921 ఫిబ్రవరిలో ఫ్రాంసులో చదువుకుంటున్న చైనా విద్యార్థులు కూడ చైనా సోషలిస్టు యూత్ లీగ్‌ను స్థాపించారు. అదే విధంగా జపాన్‌లోనూ, సోవియట్ రష్యాలోనూ చదువుకొంటున్న విద్యార్థులు కూడ కమ్యూనిస్టు గ్రూపులను స్థాపించారు.

హూనాన్‌లో మావో సే-టుంగ్ చైనా సోషలిస్టు యూత్ లీగ్‌ను స్థాపించాడు. కార్మికులలో మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాలను ప్రచారం చేశాడు. ఆ రాష్ట్రంలో కమ్యూనిస్టుపార్టీ నిర్మాణానికి గట్టి పునాదులు వేశాడు.

షాంఘై నగరంలో మొదటి చైనా కమ్యూనిస్టు గ్రూపు ఏర్పడిన తరువాత కార్మికుల రాత్రి పాఠశాలలు, మిల్లు పనివారి అచ్చుపనివారి ఫెడరేషన్లను లీయో షావ్-చీ తదితరులు కలసి నిర్మించారు. పెకింగ్‌లోని కమ్యూనిస్టు గ్రూపు చాంగ్ షీన్ టిన్ కార్మికులకు పాఠశాల నడిపారు. రైల్వే కార్మికులలో పనిచేశారు. హాంకౌలోని విదేశీయుల ఆక్రమిత ప్రాంతంలో అద్దె పెంపుదలను వ్యతిరేకించుతూ రిక్షాపనివారి సమ్మెను హ్యూపే కమ్యూనిస్టు గ్రూపు నడిపింది. ఇతర ప్రాంతాల్లోని కమ్యూనిస్టు గ్రూపులు కూడ కార్మికోద్యమాన్ని సంఘటిత పరచడంలో ప్రముఖపాత్ర వహించాయి.

మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాలను ప్రచారం చేసేందుకు, కార్మికుల విప్లవ పోరాటాలను నడిపేందుకు వేర్వేరు ప్రాంతాల్లోని కమ్యూనిస్టు గ్రూపులు అనేక పత్రికలను ప్రకటించాయి. మార్క్సిజం-లెనినిజాన్ని చైనా కార్మికులు అవగాహన చేసుకునేందుకు, మార్క్సిజం-లెనినిజంతో కార్మికోద్యమం సాన్నిహిత్యం పొందేందుకు ఈ పత్రికలు ఎంతో తోడ్పడ్డాయి. తద్వారా చైనా కమ్యూనిస్టుపార్టీని స్థాపించేందుకు అవసరమైన పరిస్థితులు రూపొందాయి.

అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ సహాయముతో 1921 జూలై 1 వ తేదీన షాంఘై నగరంలో చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రథమ మహాసభ జరిగింది. వివిధ ప్రాంతాలనుంచి ప్రతినిధులు వచ్చారు. హ్యూనాన్ రాష్ట్రంలోని పార్టీ నిర్మాణాల ప్రతినిధిగా మావో సే-టుంగ్ మహాసభలో పాల్గొన్నాడు.

రష్యన్ బోల్షివిక్ పార్టీ పద్ధతి ననుసరించి, మార్క్సిజం-లెనినిజం పునాదుల పైన చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడింది. పార్టీ నిబంధనావళిని ఆమోదించి, మహాసభ పార్టీ నాయకత్వ కమిటీలను ఎన్నుకుంది. అప్పటినుంచి చైనా విప్లవంలో ప్రధానమైన మార్పు ప్రారంభమయింది.

56 వ అధ్యాయం

# కమ్యూనిస్టు నాయకత్వాన కార్మికోద్యమ ప్రారంభం

## సామ్రాజ్యవాదుల దురాక్రమణవల్ల చైనా పరిశ్రమల అధోగతి

మొదటి ప్రపంచయుద్ధం ముగిసిన తర్వాత సామ్రాజ్యవాద ప్రభుత్వాలు మరల చైనాపై ఆర్థిక దురాక్రమణను తీవ్రతరం చేశాయి. చైనా దేశానికి పెట్టుబడులను ఎగుమతి చేయుడంలో బ్రిటిన్, అమెరికా, జపాన్ సామ్రాజ్యవాదుల మధ్య పోటీ తిరిగి కొనసాగింది. బ్యాంకులను, ఫ్యాక్టరీలను స్థాపించేందుకు, రైల్వేలను, గనులను నిర్మించే హక్కులను గుంజుకునేందుకు సామ్రాజ్యవాదుల పన్నాగం కొనసాగింది. సరకులను విపరీతంగా ఎగుమతిచేసి చైనా మార్కెటులను ముంచివేశారు. అమెరికా ఛేజ్ బ్యాంక్ శాఖలను తెరచింది. చైనా సైనిక ప్రభువుల ప్రభుత్వాన్ని లోబరచుకుని వైర్లెస్ సమాచారశాఖపై గుత్తాధికారాన్ని అమెరికా సంపాదించింది. జపాన్ మరిన్ని బట్టల మిల్లులను స్థాపించింది: 1918 నుంచి 1921 నాటికి వాటిలో కదుర్ల్ళసంఖ్య 2,90,000 నుంచి 8,60,000 కి, అనగా మూడు రెట్లు పెరిగింది. చైనా జాతీయ పరిశ్రమలు దెబ్బతిని మూలబడ్డాయి.

ప్రపంచ సామ్రాజ్యయుద్ధంలో పొందిన నష్టాలను పూడదీసుకోడానికి, తదనంతరం వచ్చిన ఆర్థికసంక్షోభాన్నుండి రక్షించుకోడానికి, చైనాలో తాము నిర్మించిన పరిశ్రమలనుండి అత్యధిక లాభాలను పిండడానికి విదేశపెట్టుబడిదారులు తీవ్రంగా ప్రయత్నించారు. చైనా కార్మికులచేత ఎక్కువ గంటలు శ్రమచేయించుట ద్వారా వేతనాలు తగ్గించుటద్వారా ఆర్థిక దోపిడీని తీవ్రతరం చేయడానికి సామ్రాజ్యవాద యజమాన్లు కృషిచేశారు. ఈ దోపిడీకి వ్యతిరేకంగా, కనీస జీవితావసరాల కొరకు పోరాడవలసి వచ్చింది.

## సైనిక ప్రభువుల కూటాలమధ్య యుద్ధాలు

1916 తరువాత ఉత్తర చైనాలోని సైనిక ప్రభువులు రెండు ముఠాలుగా చీలారు. ఫెంగ్ కువో-చాంగ్, ట్సావొ కున్, ఊ పీ-ఫూ అనేవారి నాయకత్వం

క్రిందవున్న చిహ్లీ (హోపీ) ముఠా ఒకటి; టువాన్ చీ-జుయి నాయకత్వంక్రింద వున్న అన్‌హ్వీయీ ముఠా మరొకటి. మొదటిది ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకు బంటుగానూ, రెండోది జపాన్ సామ్రాజ్యవాదుల బంటుగానూ వ్యవహరించేవి. వెనుకనుంచి సామ్రాజ్యవాదులు మద్దతు చేస్తుంటే, చిహ్లీ అన్‌హ్వీయి ముఠాలు పోరాడుతుండేవి. వీటికితోడు ఈశాన్య చైనాలో జపాన్ తాబేదారైన చాంగ్ ట్సో-లిన్ నాయకత్వాన వున్న ఫెంగ్‌టిన్ సైనిక ప్రభువుల ముఠా వుండేది.

పెకింగ్ ప్రభుత్వాన్ని టువాన్‌చీ - జుయి హస్తగతం చేసుకొన్న తర్వాతనే జపాన్ సామ్రాజ్యవాదులు చైనాలో తమ పలుకుబడి ప్రాంతాలను విస్తరించుకోగలిగారు. ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల దురాశలు నెరవేరడంలేదు. ఈ ప్రమాదాన్ని గ్రహించి, అన్‌హ్వీయీ ముఠాపై యుద్ధానికి చిహ్లీ ముఠాను ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రోత్సహించారు. చిహ్లీ - అన్‌హ్వీయి ముఠాలమధ్య యుద్ధం 1920 చివరకు అన్‌హ్వీయి ముఠా పరాజయంతో అంతమయింది. ఉత్తర చైనాపైనా, యాంగ్‌ట్సీ లోయపైన పెత్తనాన్ని చిహ్లీ ముఠా సైనిక ప్రభువులు హస్తగతం చేసుకున్నారు. ఈ విధంగా ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు చైనాలో తమతమ పలుకుబడి ప్రాంతాలను విస్తరించుకోగలిగారు.

చిహ్లీ - అన్‌హ్వీయీ ముఠాలమధ్య యుద్ధంలో అన్‌హ్వీయీ ముఠా ఓడిపోతున్నదని గ్రహించి జపాన్ సామ్రాజ్యవాదులు ఈశాన్య చైనాలోని ఫెంగ్‌టీన్ ముఠాను ప్రోత్సహించింది. ఈ ముఠా తన సేనలను చైనాగోడకు దక్షిణంగా నడిపించి, పెకింగ్ నగరంపైకి దాడిచేసింది. తద్వారా చిహ్లీ ముఠాతోపాటు ప్రభుత్వాధికారంలో భాగం పంచుకోగలిగింది. కాని త్వరలోనే చిహ్లీ - ఫెంగ్‌టీన్ సైనిక ప్రభువుల ముఠాలమధ్య తగాదాలువచ్చి, చివరకు యుద్ధానికి దారితీసింది. ఈ యుద్ధంలో చిహ్లీ ముఠా గెలుపొంది, పెకింగ్ ప్రభుత్వంపై సర్వాధికారం సంపాదించింది.

వెనుకనుంచి సామ్రాజ్యవాదులు రెచ్చగొడుతూంటే సైనిక ప్రభువుల ముఠాల మధ్య యుద్ధాలు కొనసాగడంవల్ల చైనా ప్రజలపై పన్నులభారం విపరీతంగా పెరిగాయి 1923లో పెకింగ్ ప్రభుత్వ మొత్తం బడ్జెటులో నూటికి 64 వంతులు సైన్యానికి ఖర్చయింది రాష్ట్రప్రభుత్వాల మొత్తం బడ్జెటులో నూటికి 80 వంతులు సైన్యానికి ఖర్చయింది. ఈ భారమంతా చివరకు శ్రామిక ప్రజల భుజాలపైనే పడేది. యుద్ధ ఖర్చులకు ప్రత్యక్ష పరోక్ష పన్నులతో ప్రజాసామాన్యాన్ని వేధించడమేగాక శరీరపుష్టిగల వారందరినీ సైన్యంలోకి లాక్కుపోవడం ప్రజలందరిచేత వెట్టిచాకిరీ చేయించడంద్వారా దోచుకునేవారు. అంతేగాక యుద్ధాలు జరిగే ప్రాంతాలలో భూములను దున్నేవారులేక పడావుగా పడివుండేది. వ్యవసాయోత్పత్తి దెబ్బతినేది. నగరాలలో మధ్యతరగతులలో చాలమంది, పారిశ్రామికులు, వ్యాపారస్తులు దివాళా తీశారు.

ఈ పరిస్థితులన్నీ సరైన నాయకత్వం క్రింద పోరాటం అవసరమని గుర్తు చేస్తున్నాయి. అలాంటి సమయంలో చైనా కమ్యూనిస్టుపార్టీ రంగంలో ప్రవేశించింది.

## సామ్రాజ్యవాదాన్ని, ఫ్యూడలిజాన్ని కూల్చదోయడానికి కమ్యూనిస్టుపార్టీ పిలుపు

1922 జులైలో చైనా కమ్యూనిస్టుపార్టీ రెండవ మహాసభ షాంఘైలో జరిగింది. అంతర్జాతీయ పరిస్థితులను పరిశీలించింది. చైనా సామాజిక వ్యవస్థ స్వభావాన్ని గురించి చర్చించి, చైనా విప్లవానికి కార్యక్రమాన్ని తయారుచేసింది. మహాసభ ఆమోదించిన ప్రణాళికలో కమ్యూనిస్టుపార్టీ అంతిమలక్ష్యం చైనాలో కమ్యూనిజాన్ని స్థాపించడమేనని స్పష్టపరచబడింది. ఈ దశలో పరిస్థితులకు అనుగుణంగా తక్షణ కార్యక్రమం రూపొందించబడింది. సామ్రాజ్యవాదుల దురాక్రమణను అంతమొందించి, సైనిక ప్రభువుల పెత్తనాన్ని కూలదోసి, నిజమైన ప్రజాస్వామిక రిపబ్లిక్‌ను స్థాపించడమే కమ్యూనిస్టుపార్టీ తక్షణ కర్తవ్యమని నిరూపించింది. తద్వారా చైనా చరిత్రలో మొట్టమొదటిసారి పూర్తిగా విప్లవయుతమైన ప్రజాస్వామిక కార్యక్రమాన్ని ప్రజలముందుంచింది. సామ్రాజ్యవాదానికి ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా తీవ్రపోరాటం సాగించమని ప్రజలందరికీ విజ్ఞప్తి చేసింది.

## కార్మిక వర్గ పోరాటాలు

కార్మికోద్యమ నాయకత్వాన్ని బలపరచేందుకు ట్రేడ్‌యూనియన్ సెక్రటేరియట్‌ను కమ్యూనిస్టుపార్టీ ఏర్పరచింది. వివిధ ప్రాంతాలలో కార్మికసంఘాల నిర్మాణానికి సెక్రటేరియట్ పూనుకుంది. కార్మిక పోరాటాలను నడిపేందుకు లేబర్ వీక్లీ అనే పత్రికను కూడ ప్రకటించసాగింది. సెక్రటేరియట్ ప్రత్యక్ష నాయకత్వంక్రింద దేశవ్యాపిత పోరాటాలు ప్రారంభంమయ్యాయి. 1922 జనవరి నుంచి 1923 నాటికి 3 లక్షలకు మించిన కార్మికులు మొత్తం 100 సమ్మెలలో పాల్గొన్నారు. సామ్రాజ్యవాదుల, ఫ్యూడల్ సైనిక ప్రభువుల ప్రభుత్వ పునాదులను కదల్చివేసింది.

సామ్రాజ్యవాదుల ప్రత్యక్ష నిరంకుశత్వం, దోపిడిక్రింద హాంకాంగ్‌లో క్రమగ్గుతున్న చైనా నావికుల బ్రతుకే భారంగా వుంటోంది. మొదటి ప్రపంచ యుద్ధానంతరం సాగుతున్న విప్లవప్రవాహంలో నావికుల వర్గచైతన్యం పెరిగింది. కమ్యూనిస్టుల పలుకుబడిలోవున్న హాంకాంగ్‌లోని చైనా నావికుల ఫెడరేషన్ ...నల్ కౌన్సిల్ బ్రిటిష్ ఓడ యజమానులనుండి ఎక్కువ వేతనాలకొరకు సమ్మె ...మని పిలుపు యిచ్చింది. చైనా కార్మికోద్యమంలో వున్న వెల్లువకు హాంకాంగ్ ...కుల సమ్మె నిదర్శనమని ఎంచవచ్చు.

ఉద్వేత్తుగా సాగిన ఈ పోరాటంలో 30,000 నావికులు, హాంకాంగ్‌లోని ...పనివారు పాల్గొన్నందున ఓడలన్నీ బందయ్యాయి. సమ్మెను విచ్ఛిన్నం

చేయడానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు శాయశక్తులా ప్రయత్నించారు: కాని కార్మికుల అకుంఠిత దీక్షవల్ల అవన్నీ విఫలమయ్యాయి.

అదే సంవత్సరం ఫిబ్రవరిలో హాంకాంగ్‌లోని కార్మికులు సర్వవ్యాపిత సమ్మెను ప్రకటించారు. 60 వేలమంది కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు. భాగ్యవంతమైన బ్రిటిష్ వలసలో పనులన్నీ సమ్మెవల్ల స్తంభించిపోయాయి. హాంకాంగును వదిలివేసి కాంటన్‌కు వెళ్ళాలని సమ్మెదార్లు నిర్ణయించుకున్నారు: కాని వారు కౌలాన్ సమీపంలోని షాటిన్ చేరునప్పటికి బ్రిటిష్ సేనలు తుపాకులు కాల్చాయి: వందలకొలదీ కార్మికులు మరణించడం, గాయపడటం జరిగింది. ఈ హత్యాకాండ కార్మికులను వుద్రేకపరచింది: పోరాటం వ్యాపించింది.

చైనా కమ్యూనిస్టు పార్టీ పిలుపుననుసరించి హాంకాంగు సమ్మెకు తోడ్పాటుగా ఉత్తర చైనాలో రైల్వే కార్మికుల సహాయక కమిటీలను ఏర్పరచారు. "హాంకాంగ్ నావికులను బలపరచండి" అనే నినాదాలున్న పతాకాలను పెకింగ్ - హాంకౌ మధ్య తిరిగే రైలుబండ్లపై ఎగరవేశారు. విదేశాల్లోవున్న చైనా పౌరులు సమ్మెచేస్తున్న నావికులకు సహాయంగా విరాళాలు పంపారు. విదేశాల కార్మికసంఘాలనుంచి సమ్మెదారులను బలపరుస్తూ జాబులవర్షం కురిసింది.

హాంకాంగ్ నావికుల సమ్మె ఎనిమిది వారాలదాకా సాగింది. గత్యంతరంలేక కార్మికుల కోర్కెలను బ్రిటిష్ ఓడయజమానులు ఒప్పుకున్నారు. ఈ పోరాటంవల్ల చైనా కార్మికవర్గ బలం ఇనుమడించింది.

కార్మికవర్గ పోరాటాలు విజృంభించడం ఫలితంగా కార్మికుల రాయకీయ చైతన్యం క్రమంగా పెరిగింది: పెకింగ్ - హాంకౌ రైలుమార్గం పొడుగునా స్టేషన్లవద్ద వరుసగా కార్మిక సంఘాలు నిర్మాణమయ్యాయి. వీటిని ఐక్యపరచడానికి పెకింగ్ - హాంకౌ రైల్వే కంతటికీ జనరల్ కార్మిక సంఘాన్ని నిర్మించేందుకు సన్నాహాలు జరిగాయి. కాని చిహ్లీ సైనిక ప్రభువులముఠా ఈ ప్రయత్నాన్ని నిషేధించింది. అందుకు అసమ్మతిగా రైల్వే కార్మికులు రాజకీయ సమ్మెలో సమాధానమిచ్చారు. 1923 ఫిబ్రవరి 4 తేదీనుంచి సమ్మె ప్రారంభమయింది.

సమ్మె మొదలైన మూడు గంటల్లోనే పెకింగ్ - హాంకౌ రైల్వేపై నడచే ప్రయాణీకుల బళ్ళు, గూడ్సు వాగన్లు, మిలటరీ కార్లు అన్నీ బందయ్యాయి. "స్వాతంత్ర్యం కొరకు, మానవహక్కుల కొరకు పోరాటం!" అనే నినాదాన్ని సమ్మెదార్లు ప్రకటించారు.

చిహ్లీ సైనిక ప్రభువుల ముఠా నాయకుడైన ఊ పీ-ఫూ సైన్యాలను ప[illegible] బలవంతాన కార్మికులచే పని చేయించాలని ప్రయత్నించాడు. కార్మికులు నిరాకరించారు. ఫిబ్రవరి 7 వ తేదీన శాంతియుతంగా పికెటింగ్ చేస్తున్న కార్మికులపై ఊ పీ-ఫూ సేనలు దాడిచేశాయి. చాలమంది సమ్మెదార్లను అరెస్టు చేశారు. పెకింగ్-హాంకౌ రైల్వే పొడుగునా కార్మికులపై దాడిచేసి, చిత్రవధలు చేశారు.

హాంకౌవద్ద సైనిక ప్రభువులు కార్మిక నాయకుల్లో ఒకరైన లిన్ హ్సియాంగ్-చీన్‌ను అరెస్టు చేశారు. కార్మికులను తిరిగి పనిలోకి పంపవలసిందిగా లిన్‌ను ఆజ్ఞాపించారు.

"నా తల తీసినాసరే, నేను మాత్రం సమ్మెను ఉపసంహరించను" అంటూ లిన్ నిరాకరించాడు.

సైనిక ప్రభువుల కసాయి చేతుల్లో లిన్ హతవీరుడయ్యాడు. చైనా కార్మిక వర్గం అజేయమని లిన్ హ్సియాంగ్ - చీన్ వీరత్వం నిరూపించింది.

పెకింగ్ - హాంకౌ రైల్వే కార్మికుల సమ్మె దేశమంతటినుంచీ కార్మికుల సహాయాన్ని సంపాదించింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ ఈ సమ్మెను బలపరుస్తూ ప్రకటన చేసింది. జపాన్ కొరియా దేశాలనుంచి కార్మికులు సోదరచైనా కార్మికుల పోరాటానికి సానుభూతి సహాయాలను అందజేస్తూ సందేశాలను కేబిల్ ద్వారా పంపారు.

కార్మికవర్గ బలాన్ని కూడదీసుకునేందుకు, మరింత పెద్దపోరాటాలకు సన్నాహాలు చేసేందుకు పెకింగ్ - హాంకౌ రైల్వే కార్మికుల జనరల్ ట్రేడ్‌యూనియన్ సమ్మెను ఉపసంహరించింది. పనిలోకి వెళ్ళమని కార్మికులకు విజ్ఞప్తి చేసింది.

ఫిబ్రవరి 7 రాజకీయ సమ్మె కమ్యూనిస్టుపార్టీకి, కార్మికులకు ఒక గుణపాఠం నేర్పింది. విప్లవంలో జయం పొందాలంటే కార్మికవర్గానికి బలమైన మిత్రులుండాలనీ, స్వంత సాయుధదళాలుండాలనీ నిరూపించింది. ఈ సంఘటన తర్వాత కమ్యూనిస్టు పార్టీ, డాక్టర్ సన్‌యెట్ సేన్ నాయకత్వాన వున్న కొమింటాంగ్‌తో విప్లవ ఐక్య సంఘటనను నిర్మించింది. సామ్రాజ్యవాదానికి, ఫ్యూడల్ సైనిక ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవ పోరాటాన్ని విస్తృతరూపంలో పెంపొందించడానికి కృషిచేసింది.

57 వ అధ్యాయం

# విప్లవ ఐక్యసంఘటన నిర్మాణం: విప్లవోద్యమం అభివృద్ధి

## కమ్యూనిస్టు - కొమింటాంగ్ సహకారం

ఉత్తర చైనా సైనిక ప్రభువులు ఆంతరంగిక తగాదాలలో నిమగ్నమైవుండగా డాక్టర్ సన్‌యెట్‌సేన్ షాంఘైనుంచి కాంటన్‌కు వెళ్ళాడు. అచట క్వాంగ్‌టుంగ్ సైనిక ప్రభువు చెన్ చియుంగ్-మింగ్ తోడ్పాటుపై ఆధారపడి, రిపబ్లిక్ తాత్కాలిక అధ్యక్షపదవిని సన్ స్వీకరించాడు. ఉత్తరదేశ జైత్రయాత్రకు సన్నాహాలు చేశాడు. కాని తర్వాత చెన్ చియుంగ్-మింగ్‌ను సామ్రాజ్యవాదులు కొని వేశారు. చిల్లి సైనిక ప్రభువులు తిరుగుబాటు చేశారు. అందుచేత సన్‌యెట్ సేన్ క్వాంగ్‌టుంగ్‌ను వదలి వెళ్ళవలసివచ్చింది.

అదే సమయంలో సోవియట్ యూనియన్, చైనా కమ్యూనిస్టుపార్టీ స్నేహపూర్వకంగా డాక్టర్ సన్‌కు చేయూతనిచ్చాయి. ప్రజాస్వామిక విప్లవం కొరకు ఆయన అకుంఠితదీక్షను కొనియాడి, ప్రజాసామాన్యంపై ఆధారపడకపోవడం పొరపాటని గుర్తుచేశాయి. కార్మికులను రైతులను ఐక్యపరచే పార్టీ ఏర్పరచాలనీ, మిలిటరీ అకాడమీని స్థాపించమనీ సోవియట్ యూనియన్ డాక్టర్ సన్‌యెట్‌సేన్‌కు సలహా యిచ్చింది.

సోవియట్ యూనియన్, చైనా కమ్యూనిస్టు పార్టీ సహాయంతో 1922 సెప్టెంబరులో కొమింగ్‌టాంగ్ పునర్నిర్మాణాన్ని గురించి చర్చించేందుకు షాంఘై నగరంలో సమావేశం ఏర్పాటు చేశాడు. ఈ సమావేశానికి కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధులు కూడ హాజరయ్యారు. 1923 లో అసమాన ఒడంబడికలను మార్చాలని వాదిస్తూ సన్‌యెట్‌సేన్ కొమింగ్‌టాంగ్ ప్రణాళికను తయారుచేశాడు. సమాన ప్రతిపత్తిపై ఆధారపడిన చైనా - సోవియట్ సంబంధాలను ఏర్పరుస్తూ సోవియట్ ప్రతినిధితో కలసి సన్ సంయుక్త ప్రకటన చేశాడు.

తదనంతరం సన్ యెట్ సేన్ వెంటనే కాంటన్ నగరానికి తిరిగి వచ్చాడు. విప్లవ ప్రభుత్వంయొక్క సైన్యాధ్యక్ష కార్యాలయాన్ని అచట ఏర్పరచాడు; కొమింగ్ టాంగ్ తాత్కాలిక సెంట్రల్ కమిటీని నిర్మించాడు. అందులో కొందరు కమ్యూనిస్టు నాయకులు కూడ సభ్యులుగా వున్నారు. తరువాత తన మూడు ప్రధాన పాలసీలను సన్ యెట్ సేన్ ఇలా నిర్వచించాడు: సోవియట్ రష్యాతో స్నేహ సంబంధాలు; కమ్యూనిస్టుపార్టీతో సహకారం; కార్మికులకు, రైతులకు సహాయం.

1923 జూన్‌లో చైనా కమ్యూనిస్టుపార్టీ మూడవ జాతీయ మహాసభ కాంటన్‌లో జరిగింది. దాన్లో విప్లవ ఐక్యసంఘటన ఏర్పరచే సమస్యను చర్చించారు. ప్రజాస్వామిక విప్లవానికి సన్ యెట్ సేన్ కృషిని గుర్తించారు. కొమింటాంగ్‌ను పునర్నిర్మించడంలో ఆయనకు తోడ్పడాలనీ, కమ్యూనిస్టుపార్టీ - కొమింగ్ టాంగ్ పార్టీల మధ్య సహకారాన్ని సంస్థాపించాలనీ నిర్ణయించారు.

కొమింగ్ టాంగ్ పార్టీ ప్రథమ జాతీయ మహాసభను డాక్టర్ సన్ యెట్ సేన్ 1924 జనవరిలో కాంటన్ నగరంలో జరిపాడు. ఈ మహాసభకు హాజరైన కమ్యూనిస్టులలో మావో త్సే-టుంగు, లీ టా-చావో, లిన్ పో-చూ, చూ చీయు పాయ్ వగైరా వున్నారు. కమ్యూనిస్టుపార్టీ ప్రతిపాదించిన సామ్రాజ్యవాద వ్యతిరేక ఫ్యూడల్ వ్యతిరేక పాలసీని కొమింగ్ టాంగ్ మహాసభ ఆమోదించింది! కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు యూత్ లీగ్ సభ్యులను వ్యక్తులుగా కొమింగ్ టాంగ్‌లో చేర్చుకోడానికి మహాసభ అంగీకరించింది. కార్మికుల, రైతుల, మధ్య తరగతుల, జాతీయ పెట్టుబడిదారులను ఐక్యపరచే విప్లవ సంస్థగా కొమింగ్ టాంగ్‌ను పునర్నిర్మించాలని నిర్ణయించింది. ఈ విధంగా కమ్యూనిస్టులు కొమింగ్ టాంగ్ సంస్థలో చేరడంవల్ల నూతన రక్తం ఎక్కించినట్లయింది. విప్లవంయెడల సన్ యెట్ సేన్ కున్న అవగాహన, విశ్వాసం ఎక్కువయింది. తద్వారా విప్లవోద్యమం బలపడింది.

కొమింగ్ టాంగ్ ప్రథమ జాతీయ మహాసభ ఆమోదించిన ప్రణాళికలో డాక్టర్ సన్ యెట్ సేన్ తన మూడు ప్రజాసూత్రాలను తిరిగి నిర్వచించాడు. వాటిని ఇలా విశదపరచాడు. సోవియట్ రష్యాతో స్నేహసంబంధాలను కలిగివుంటటం, కమ్యూనిస్టుపార్టీతో సహకరించడం, కార్మికులకు రైతులకు సహాయం చేయడం; సామ్రాజ్యవాదాన్ని ఫ్యూడల్ సైనిక ప్రభువులను వ్యతిరేకించడం, జాతీయతకొరకు ప్రజాస్వామిక సమానత్వం కొరకు కృషిచేయడం; భూమి యాజమాన్యాన్ని సమాన స్థాయికి తేవడం పెట్టుబడిని కంట్రోలు చేయడం.

పాతవాటితో కొత్తగా రూపొందిన ప్రజల మూడుసూత్రాలను పోల్చితే ఎంతోమార్పు కనిపించుతుంది. ఈ మధ్యకాలంలో సన్ యెట్ సేన్ ఆలోచనల్లో చాలా అభ్యుదయ కరమైన మార్పువచ్చిందని ఈ ప్రణాళిక నిరూపించుతుంది.

కొమింగ్ టాంగ్ పార్టీ పునర్నిర్మాణం తరువాత డాక్టర్ సన్ యెట్ సేన్ కాంటన్ నగరసమీపంలో వాంపోవా మిలిటరీ అకాడమీని సోవియట్

యూనియన్, చైనా కమ్యూనిస్టుపార్టీ సహాయపడ్డాయి. చౌ ఎన్-లై, ఏహ్ చీన్-ఇంగ్ తదితర కమ్యూనిస్టులు అకాడమీలో ముఖ్యమైన పదవులు నిర్వహించారు. మిలిటరీ అకాడమీలో తర్ఫీదు పొందిన సైనికోద్యోగుల్లో చాలమంది కమ్యూనిస్టులు, సోషలిస్టు యూత్ లీగ్ సభ్యులు వున్నారు. సోవియట్ సలహాదార్లు ఎర్రసైన్య నిర్మాణ విధానాలను, సిద్ధాంతాలను ప్రవేశపెట్టారు. వీటన్నిటి ఫలితంగా వాంపోవా మిలిటరీ అకాడమీ త్వరలోనే విప్లవ సైన్యాలను తయారు చేసే సంస్థగా రూపొందింది.

కమ్యూనిస్టు పార్టీ అవలంబించిన ఐక్య సంఘటన విధానం ఫలితంగా విప్లవ గమనం వేగంగా అభివృద్ధి చెందింది: కార్మిక రైతు ఉద్యమాలు ఉధృతంగా పురోగమించాయి. ఫిబ్రవరి 7 రాజకీయ సమ్మె కాలంలో ధ్వంసం చేయబడిన కార్మిక సంఘాలు పునరుద్ధరించబడ్డాయి. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం క్రింద కార్మికవర్గం నిలదొక్కుకుని, విప్లవపంథాలో ముందుకు సాగిపోయింది.

చైనాలో విప్లవోద్యమం త్వరగా అభివృద్ధి చెందడం సామ్రాజ్య వాదులకు ఫ్యూడల్ శక్తులకు కంటకంగావుంది. 1924 అక్టోబరులో పెట్టుబడిదారీ భూస్వామ్య తాబేదార్ల సాయుధ నిర్మాణమైన కాంటన్ వర్తక వాలంటీర్లు చెన్ లిమ్-పాక్ నాయకత్వం క్రింద, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో కాంటన్ విప్లవ ప్రభుత్వాన్ని కూలదోయడానికి, సాయుధ తిరుగుబాటు ప్రారంభించారు. విప్లవ ప్రభుత్వం వాంపోవా మిలటరీ అకాడమీ అభ్యర్థులను, విప్లవ సైన్యాలలో ఒక భాగాన్ని సమీకరించింది. కార్మికుల, రైతుల తోడ్పాటుతో తిరుగుబాటును అణచి వేసింది.

పెకింగ్ ప్రభుత్వంపై చిహ్లీ సైనిక ప్రభువులు పూర్తిపెత్తనం సంపాదించాక, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రాబల్యం పెరిగింది. ఈ పరిస్థితి జపాన్ సామ్రాజ్యవాదులకు ఆందోళన కలిగించింది. 1924 సెప్టెంబరులో వారు ఫెంగ్‌టిన్-ఆన్‌హ్వాయి సైనిక ప్రభువులను ప్రోత్సహించి చిహ్లీ ముఠాకు వ్యతిరేకంగా రెండవ యుద్ధాన్ని రెచ్చగొట్టింది. ఈసారి చిహ్లీ సైనిక ప్రభువుల ముఠా ఓడిపోయింది. ఆన్‌హ్వాయి ముఠా నాయకుడైన టువాన్‌చీ-జుయి పెకింగ్ ప్రభుత్వంపై పెత్తనం సంపాదించి, పరిపాలక మంత్రివర్గాన్ని ఏర్పరచాడు.

ఆ సమయంలో జాతీయ అసెంబ్లీని సమావేశపరచాలనీ, రాజ్యాంగాన్ని ఏర్పరచాలనీ, ప్రజాస్వామిక రిపబ్లిక్ స్థాపించాలనీ, ప్రజలు కోరుతున్నారు. కమ్యూనిస్టు పార్టీ విజ్ఞప్తి ననుసరించి, షాంఘై, చెకియాంగ్, క్వాంగ్‌టుంగ్, హూనాన్, హూపేలలో ప్రజా కమిటీలు ఏర్పడి, జాతీయ అసెంబ్లీని తక్షణం సమావేశ పరచాలని ఆందోళన చేశాయి.

ప్రజల ఒత్తిడివల్ల సైనిక ప్రభువుల ప్రభుత్వం రాయబారాలనిమిత్తం రాజధానికి రావలసిందిగా డాక్టర్ సన్ యెట్ సేన్‌ను ఆహ్వానించింది. జాతీయ అసెంబ్లీని

త్వరలో సమావేశపరచే మార్గం కనుగొనేందుకు, విప్లవాశయాలను ప్రచారం చేసేందుకు, కమ్యూనిస్టుపార్టీ సహాయంతో సన్ యెట్ సేన్ పెకింగ్ కు వెళ్ళాడు. "ఉత్తర యాత్ర"ను గురించిన ప్రణాళికలో సామ్రాజ్యవాదానికి ఫ్యూడలిజానికి వ్యతిరేకతను సన్ యెట్ సేన్ పునరుద్ఘాటించాడు. ఈ పోరాటంలో ప్రజలంతా తోడ్పడాలని ఆయన విజ్ఞప్తి చేశాడు.

పెకింగుకు చేరాక సన్ యెట్ సేన్‌ను మార్చాలని సైనిక ప్రభువుల ప్రభుత్వం ప్రయత్నించింది. సోవియట్ రష్యాతో స్నేహాన్ని వదలుకోవాలనీ, సైనిక ప్రభువులతో రాజీపడాలనీ కోరింది. కాని డాక్టర్ సన్ యెట్ సేన్ తన విప్లవ పంథాపై ఖచ్చితంగా నిలబడ్డాడు. భ్రమలపై ఆధారపడిన సైనిక ప్రభువుల ఆశలు పటాపంచలయ్యాయి.

1925 మార్చి 12 వ తేదీన సన్ యెట్ సేన్ పెకింగ్ నగరంలో కీర్తిశేషులయ్యారు. మహోన్నత విప్లవకారుడు, గొప్ప ప్రజాస్వామికవాది మరణానికి చైనా జాతి యావత్తు దుఃఖించింది. ఈ విషాద ప్రదర్శనాలలో రాజకీయ ప్రచారం విస్తృతంగా జరిగింది.

మరణశయ్యపై వుండగా చైనా ప్రజలకు సోవియట్ మిత్రుల యెడలవున్న సుహృద్భావాలను వ్యక్తం చేస్తూ సన్ యెట్ సేన్ తన చివరిలేఖను సోవియట్ ప్రభుత్వానికి వ్రాశాడు. ఈ జాబులో క్రింది భాగాలున్నాయి :

"అమరజీవి లెనిన్ పీడిత ప్రజలకు ప్రసాదించిన నిజమైన వారసత్వంగా వున్న స్వతంత్ర రిపబ్లిక్‌ల సమాఖ్యకు మీ ప్రభుత్వం ఆధిపత్యం వహించుతోంది. సామ్రాజ్యవాదులచేత పీడించబడుతున్న బాధితులు మీ సహాయంతో బానిసత్వం, యుద్ధాలు, అన్యాయాలకు కారణభూతమైన అంతర్జాతీయవిధానంనుండి విమోచనం పొందుతారనీ, స్వాతంత్ర్యం రక్షించుకోగలుగుతారనీ ఆశించుతున్నాను.........

"ప్రస్తుతం మంచి స్నేహితుడుగానూ, సహచరుడుగానూ వున్న సోవియట్ యూనియన్ శీఘ్రకాలంలోనే మహాశక్తివంతమైన స్వతంత్ర చైనాను ఆహ్వానించే శుభసమయం ఆసన్నమౌతుంది. ఉభయ మిత్రులూ చేతులుకలిపి ప్రపంచ పీడిత ప్రజలను విముక్తిచేసే పోరాటంలో విజయ పరంపరలను సాధించగలుగుతాయని ఆశించుతున్నాను."

చైనా ప్రజలూ, సోవియట్ ప్రజలూకలసి ఉభయులమధ్య చారిత్రకంగా నిర్మించుకున్న స్నేహసంబంధాలకు, సంవత్సరాల తరబడిగా పరస్పర సహాయంతో అభివృద్ధి చెందుతూన్న అవిచ్ఛిన్న మైత్రికి డాక్టర్ సన్ యెట్ సేన్ ఆఖరి మాటలు సూత్రప్రాయమైనవి.

## మే 30 ఉద్యమం

సామ్రాజ్యవాదులు తమ దోపిడిని మరింత తీవ్రంగా సాగించి చైనాసంపదను కాజేసేందుకు మరిన్ని ఫ్యాక్టరీలను స్థాపించారు. ప్రజలను మరింత పీడించసాగారు.

జపాన్ యాజమాన్యం క్రిందవున్న బట్టల మిల్లులలో యిది మరింత దారుణంగా వుండేది. 1925 నాటికి చైనా యాజమాన్యం క్రిందవున్న మొత్తం మిల్లులలో మూడింట రెండు వంతులు జపాన్ పెట్టుబడితో నడిచే బట్టల మిల్లులుగా వుండేవి. పెరోజనులకు ఎక్కువ వేతనాలివ్వాలిసి వస్తుందని, తమ ఫ్యాక్టరీలలో ఎక్కువగా బాల కార్మికులను సామ్రాజ్యవాదులు వినియోగించుకునేవారు. కొరడాదెబ్బల ప్రమాదాన్ని బర్తరఫ్ చేస్తారనే ఆర్థిక ప్రమాదాన్ని నిత్యం ఎగురుచూస్తూ చైనా కార్మికులు శ్రమపడేవారు. తమకున్న ఆర్థిక ప్రాబల్యంతో సామ్రాజ్యవాదులు చైనా మార్కెటును అధీనంలో వుంచుకొనేవారు: వారితో పోటీచేయలేక జాతీయ పారిశ్రామికులు నానాఅవస్థలూ పడేవారు.

షాంఘైలో జపాన్ యాజమాన్యంక్రిందివున్న బట్టల మిల్లులనుంచి కొందరు చైనా కార్మికులను తొలగించినందుకు అసమ్మతిగా 1925 మే 14 వ తేదీన కార్మికులు సమ్మె చేశారు. సమ్మె రెండో రోజున జపాన్ పెట్టుబడిదారుల ఏజెంట్లు కార్మికులపై తుపాకులు కాల్చి, 'ఒక డజనుమందిని చంపడం, గాయపరచడం జరిగింది. దానితో నగరంలోని కార్మికులు, విద్యార్థులు, ప్రజా సామాన్యం మండిపోయారు. ఆందోళన అసమ్మతి విస్తృతరూపంలో వ్యక్తమయింది.

కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ సమావేశమై కార్మికులపై ఆధారపడిన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని నూతన స్థాయికి పెంపొందించాలని తీర్మానించింది.

మే 30 వ తేదీన షాంఘై విద్యార్థులు చదువుమానేసి, సామ్రాజ్యవాదులు చైనా ప్రజలను చంపినందుకు అసమ్మతి తెలుపుతూ కరపత్రాలను పంచారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు పోలీసుదళాలను పంపి, నాంకింగ్ రోడ్డుపై ప్రదర్శనలు జరుపుతున్న చాలమంది విద్యార్థులను అరెస్టు చేయించారు. దీనివల్ల ప్రజల క్రోధాగ్నిపై ఆజ్యం పోసినట్లయింది. "సామ్రాజ్యవాదం నశించాలి", "చైనా ప్రజలంతా ఏకం కావాలి" అనే నినాదాలతో వేలకొలదీ ప్రజలు నాంకింగ్ రోడ్డుపై గుమికూడారు. బ్రిటిష్ పోలీసులు జనసమూహంపై తుపాకులు కాల్చి, నాంకింగ్ రోడ్డును రక్తంతో ముంచారు. ఈ సంఘటన "మే 30 చిత్రవధ"గా ప్రసిద్ధమయింది.

ఈ హింసాకాండ అనంతరం అసమ్మతిగా షాంఘై కార్మికులు, వర్తకులు, విద్యార్థులు సమ్మెచేయాలని కమ్యూనిస్టుపార్టీ విజ్ఞప్తిచేసింది.

జూన్ 1వ తేదీన పోరాటం తుపానువలె ప్రారంభమయింది. కార్మికవర్గ నాయకత్వం క్రింద షాంఘై ప్రజలు కార్మికుల, వర్తకుల, విద్యార్థుల ఐక్య సమితులను ఏర్పరచింది. కార్మికులు పని మానివేశారు. విద్యార్థులు పాఠశాలలనుండి బయటికొచ్చారు. వర్తకులు దుకాణాలను మూసివేశారు. బ్రిటన్, అమెరికా, జపానులు తమ యుద్ధనావలను వాంగ్ పూ నదిలోనికి తెచ్చి, సైన్యాలను దించి ప్రదర్శకులను బెదరించారు. కాని కృతనిశ్చయులైన ప్రజలు ఏమాత్రం జంకలేదు. ప్రజాపోరాటం

వ్యాపించింది. "సామ్రాజ్యవాదులను వ్యతిరేకించా"లనే నినాదం ప్రతిచోటా మార్మోగింది.

బలప్రదర్శనంతో ప్రజలు బెదిరి లొంగిపోయే దశలో లేరని గుర్తించాక, సామ్రాజ్యవాదులు తమ ఎత్తుగడలను మార్చారు: తమకు బంట్లుగా తయారైన పెట్టుబడిదారుల సేవను షాంఘైలో వినియోగించుకున్నారు. బెదిరింపులు, ఆశల ద్వారా జాతీయ బూర్జువావర్గంపై ఒత్తిడి తెచ్చి, ఐక్యసంఘటనను బద్దలు చేశారు. సైనిక ప్రభువులతో కుట్రపన్ని వివిధ ప్రాంతాల వుద్యమాన్ని అణచివేసేందుకు పూనుకున్నారు. కార్మికవర్గ బలాన్ని కూడదీసుకునేందుకు కార్మికుల ఆర్థికహక్కులను అంగీకరించితే సమ్మెను ఉపసంహరించడానికి కమ్యూనిస్టుపార్టీ ఆమోదించింది. ఆగస్టులో అన్ని వృత్తుల కార్మికులు పనికి వెళ్ళడం ప్రారంభించారు.

మే 30 వుద్యమానంతరం సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా దేశమంతటా తుపాను చెలరేగింది.

ఈ దశలో జరిగిన అత్యంత తీవ్రమైన పోరాటాల్లో, కాంటన్ - హాంకాంగ్ సమ్మె ముఖ్యమైనది.

షాంఘై ప్రజా పోరాటాన్ని బలపరుస్తూ 1925 జూన్ 19 వ తేదీన హాంకాంగ్‌లో లక్ష మంది కార్మికుల సమ్మెకు నాయకత్వం వహించి కమ్యూనిస్టుపార్టీ నడిపింది. ఈ పరిస్థితులను ఎదుర్కోడానికి హాంకాంగ్‌లోని బ్రిటిష్ అధికారులు సైనిక శాసనం ప్రకటించి, హాంకాంగ్ చుట్టూ వలయాన్ని నిర్మించారు. ఐనప్పటికీ లెక్కచేయకుండా హాంకాంగ్‌ను వదలి చైనా కార్మికులనేకమంది కాంటన్‌కు వెళ్లిపోయారు. జూన్ 23 వ తేదీన కాంటన్ నగరంలో హాంకాంగ్‌నుంచి వచ్చిన సమ్మెదారులతోసహా కార్మికులు, రైతులు, సైనికులు విద్యార్థులు మొత్తం లక్షమంది ప్రదర్శనం జరిగింది. బ్రిటిష్, ఫ్రెంచి యుద్ధనావలు షాకీవద్ద ప్రజా ప్రదర్శనంపై ఫిరంగులు కాల్చాయి. ఈ సంఘటన ఫలితంగా యాభై మరణాలు సంభవించాయి. షాకీ హత్యాకాండ అనే పేరుతో యిది ప్రసిద్ధమయింది.

షాకీ దారుణచర్యతో కాంటన్, హాంకాంగ్ ప్రజలలో తీవ్రక్రోధానలం చెలరేగింది. సూ చావో - చెంగ్, టెంగ్ చుంగ్ - హ్సియా అను కమ్యూనిస్టుల నాయకత్వాన హాంకాంగ్‌లో మరల 2 లక్షల మంది కార్మికులు సమ్మెచేశారు. సమ్మెదార్లు శ్మశానాన్ని వదలినట్లుగా హాంకాంగ్‌ను వదలి కాంటన్ నగరానికి వచ్చివేయడం కొనసాగింది.

జూలై మొదలారంభంలో సమ్మెదారులు సాయుధ దళాలుగా సంఘటితమై స్వాటౌ - పాఖోయిల మధ్య సముద్రతీరం చుట్టూ ముట్టడివేశారు. దీనివల్ల బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు తీవ్రనష్టం కలిగింది.

కాంటన్ హాంకాంగ్ సమ్మె 16 నెలల వరకు కొనసాగింది. ప్రపంచ కార్మికోద్యమ చరిత్రలో అత్యంత దీర్ఘకాల సమ్మెలలో ఒకటైన దీనివల్ల కాంటన్‌లోని విప్లవ ప్రభుత్వం చాల బలపడింది.

# క్వాంగ్‌టుంగ్ విప్లవకేంద్రం బలపరచే కృషి

కాంటన్‌లో విప్లవ ప్రభుత్వాన్ని ఏర్పరచిన తరువాత క్వాంగ్‌టుంగ్‌లోని వైచౌ, చావోచౌ, స్వాటౌ లలో సైనిక ప్రభువు చెన్ చుయుంగ్-మింగ్ తన సేనలను కేంద్రీకరించి, కాంటన్‌పై దాడిచేయాలని కుట్రపన్నాడు. విప్లవ పరిపాలనను సుస్థిరపరచేందుకు కాంటన్ ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీ సహాయంతో 1925 ఫిబ్రవరి 1 వ తేదీన మొదటి తూర్పు జైత్రయాత్రను ప్రారంభించింది.

తూర్పు జైత్రయాత్ర సైన్యంలో ముఖ్యభాగం వాంపోవా మిలిటరీ అకాడమీలో తర్ఫీదుపొందిన కాడెట్ దళాలే. వాటి సంఖ్య తక్కువగా వున్నప్పటికీ కాడెట్ దళాలు ధైర్యంగానూ, చాకచక్యంగాను పోరాడాయి. రెండు నెలల స్వల్ప కాలంలోనే తూర్పు క్వాంగ్‌టుంగ్‌లోని చెన్ చియుంగ్-మింగ్ సైన్యాలలో ఎక్కువభాగాన్ని తుడిచిపెట్టాయి.

జూలై ప్రారంభంలో కాంటన్ విప్లవ ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీ సూచనపై జాతీయ ప్రభుత్వంగా పునర్నిర్మింపబడింది. తరువాత వాంపోవా కాడెట్‌లను వెన్నెముకగా చేసుకుని జాతీయ విప్లవ సైన్యాన్ని నిర్మించడానికి పూనుకుంది. సోవియట్ మిలిటరీ పద్ధతిలో జాతీయ విప్లవ సైన్యంలోకూడ కొమింగ్‌టాంగ్ ప్రతినిధులున్నారు. రాజకీయశాఖ లున్నాయి. విప్లవ ధోరణిని బలపరచేదృష్టితో కొమింగ్‌టాంగ్‌లో చేరిన చాలమంది కమ్యూనిస్టులు కొమింగ్‌టాంగ్ ప్రతినిధులుగా సైన్యంలో చేరారు. రాజకీయ శాఖ వివిధ స్థాయిల్లో డైరెక్టర్లుగా నియమించబడ్డారు. అందుచేతనే జాతీయ విప్లవసైన్యం పోరాటశక్తిగల కొత్తరకపు విప్లవ సైన్యంగా రూపొందింది.

ఎంతో కాలంగాక ముందే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో విప్లవ ప్రతిఘాతక సేనలను సమీకరించుకుని చెన్ చుయుంగ్ - మింగ్ మరోదాడికి పూనుకున్నాడు. జాతీయ విప్లవ సైన్యం రెండవ తూర్పు జైత్రయాత్రను ప్రారంభించింది. శత్రు ప్రాంతంలోని కీలకప్రాంతానికి చొచ్చుకుపోయి, మింగ్ సైన్యాలను పూర్తిగా ఓడించాయి.

కార్మికోద్యమాభివృద్ధితోపాటు రైతాంగంలోకూడ వుద్యమం పెంపొందింది. కార్మికులు, రైతులు కలసి, సామ్రాజ్యవ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంలో, అత్యంత బలమైన శక్తిగా రూపొందాయి.

క్వాంగ్ టుంగ్‌లో రైతు వుద్యమం 1925 లో త్వరితగతిని అభివృద్ధి చెందింది. గ్రామాలలో రైతు సంఘాల పలుకుబడి పెరిగింది. 1926 నాటికి రైతుసంఘాల సభ్యత్వం 6 లక్షలకు వృద్ధయింది. రైతులుకూడ ఆత్మరక్షణ దళాలను నిర్మించుకుని కాంటన్ - హాంకాంగ్ సమ్మెకు చాల తోడ్పడ్డారు.

పెంగ్ పాయి అనే కమ్యూనిస్టు నాయకత్వాన రైతు వుద్యమం హైఫెంగ్ లూఫెంగ్ క్వాంగ్‌టుంగ్‌లలో చాల శక్తివంతమైన సంఘటిత వుద్యమంగా పెం

పొందింది. రెండవ తూర్పు దైత్రయాత్ర సమయంలో సైనిక ప్రభువుల పాలనను తుదముట్టించడంలో జాతీయ విప్లవ సైన్యానికి తోడ్పడింది. అప్పుడు హైఫింగ్ లూఫెంగ్‌ల చుట్టూ వున్న రైతులందరినీ రైతు సంఘాల నాయకత్వాన కార్యరంగంలోకి తెచ్చి, మక్తాల తగ్గింపుకోరకు, లెవీలకు భూస్వాముల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాటం ప్రారంభమయింది.

క్వాంగ్ టుంగ్‌లోని చైతన్యపూర్వకమైన రైతు వుద్యమం విప్లవ ప్రభుత్వానికి విశ్వాసపాత్రమైన శక్తిగా నిలబడింది. ఆ రాష్ట్రంలోని విప్లవ కేంద్రాలను రక్షించడంలో బలమైన తోడ్పాటు నిచ్చింది.

కమ్యూనిస్టు - కొమింగ్‌టాంగ్ పార్టీల మధ్య సహకారం గమనించి, సామ్రాజ్యవాద ఫ్యూడల్ శక్తులు గాభరాపడ్డాయి. విప్లవ ఐక్యసంఘటనను, క్వాంగ్‌టుంగ్‌లోని విప్లవ కేంద్రాన్ని విచ్ఛిన్నం చేసేందుకు కుట్రపన్నారు. లాలోచీపడే (కాంప్రాడార్) బూర్జువావర్గ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించుతున్న కొమింగ్‌టాంగ్‌లోని అభివృద్ధినిరోధక శక్తులద్వారా వారు ప్రయత్నించారు. అలాంటి ప్రతీఘాతుకశక్తు లన్నిటికీ చియాంగ్ కై-షేక్ నాయకత్వం వహించాడు. 1911 విప్లవ సమయంలో చియాంగ్ కై-షేక్ షాంఘైలో స్టాక్ మార్కెట్ బ్రోకర్‌గా పనిచేస్తుండేవాడు. స్టాక్ మార్కెట్ వ్యాపారంలో విఫలమయ్యాడు. తరువాత డాక్టర్ సన్ యెట్ సేన్‌తో కలసి, నక్క-జిత్తులద్వారా ఆయన అభిమానాన్ని పొందాడు. తరువాత క్రమంగా వాంపోవా మిలిటరీ అకాడమీ అధ్యక్షపదవికి ఎగబ్రాకాడు. సామ్రాజ్యవాదులు, ఫ్యూడల్ వర్గాలూ చియాంగ్ కై-షేక్‌ను "తమ మనిషి"గా త్వరలోనే గుర్తించారు. విప్లవ శిబిరంలో వారి ఏజెంటుగా అప్పటినుంచి చియాంగ్ పనిచేస్తూ వచ్చాడు.

1926 మార్చి 18 తేదీన వాంపోవా మిలటరీ అకాడమీ కాంటన్ ఆఫీసు పేరుతో చియాంగ్ కై-షేక్ ఉత్తరువు జారీచేశాడు. నావికాబ్యూరో తాత్కాలిక డైరెక్టరుగా పనిచేస్తున్న లీచీహ - లుంగ్ అనే కమ్యూనిస్టుకు, చుంగ్‌షాన్ అనే యుద్ధనావను వాంపోవాకు పంపమని కోరాడు. ఆ ప్రకారం యుద్ధనావ గమ్యస్థానంచేరిన వెంటనే చియాంగ్ కై - షేక్ అరెస్టులు ప్రారంభించాడు. మిలటరీ అకాడమీలోనూ, జాతీయ విప్లవ సైన్యంలోనూ పనిచేస్తున్న కమ్యూనిస్టులను, చుంగ్‌షాన్ సహాయంతో తిరుగుబాటు చేసేందుకు కుట్ర చేస్తున్నారనే అసత్యారోపణలతో ఈ అరెస్టులకు ఉపక్రమించాడు. "క్రూయిజర్ చుంగ్‌షాన్ సంఘటన" అని దీన్ని పిలుస్తారు.

చుంగ్‌షాన్ సంఘటన తర్వాత చియాంగ్ కై-షేక్ కొమింటాంగ్ కేంద్ర కార్యనిర్వాహకవర్గంలో "పార్టీ వ్యవహారాలను బాగుపరచే తీర్మానాన్ని" ప్రవేశపెట్టాడు. కొమింటాంగ్‌లో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వ స్థానాన్ని సంకుచితపరచేందుకు ధ్వంసంచేసేందుకు చర్యలు తీసికున్నాడు. కొమింటాంగ్‌లో సభ్యులుగా

వున్న కమ్యూనిస్టుల పట్టికను కేంద్ర కార్య నిర్వాహకవర్గ అధ్యక్షునికి యివ్వాలనీ, కొమింటాంగ్ ఉన్నతస్థాయి కమిటీల కార్యనిర్వాహకవర్గ సభ్యులలో మూడోవంతు కంటే కమ్యూనిస్టులు వుండరాదనీ, కొమింటాంగ్ కేంద్రశాఖలలో దేనికీ డైరక్టర్లుగా కమ్యూనిస్టులను నియమించరాదనీ, కొమింటాంగ్ సభ్యులెవ్వరూ కమ్యూనిస్టు పార్టీలో చేరకూడదనీ ఈ తీర్మానం ఆదేశించుతూంది. ఐనప్పటికీ, ఆ సమయంలో కమ్యూనిస్టుపార్టీ బలంగా వుండటంవల్ల బహిరంగంగా తెగతెంపులు చేసుకోవడానికి చియాంగ్ కై-షేక్ ధైర్యం వహించలేదు. విప్లవ శిబిరంలోనే వుంటూ, విప్లవ వ్యతిరేక కార్యకలాపాలనూ తన విద్రోహ చర్యలనూ కొనసాగించాడు.

261

## 58 వ అధ్యాయం

# ప్రథమ విప్లవ అంతర్యుద్ధం

## జాతీయ విప్లవ సైన్యం ఉత్తర జైత్రయాత్ర

జాతీయ విప్లవసైన్యం క్వాంగ్ టుంగ్‌లో సాధించిన విజయాలు దేశమంతటా ప్రజల పోరాటదీక్షను పెంపొందించింది. సామ్రాజ్యవాదాన్ని ఉత్తర సైనిక ప్రభువుల పరిపాలనను కూలద్రోయాలనేది సర్వజనవాంఛ అయింది. కమ్యూనిస్టుపార్టీ ప్రోత్సాహంతో కాంటన్ జాతీయ ప్రభుత్వం 1926 జులైలో "ఉత్తర జైత్రయాత్రను" గురించి ప్రకటన చేసింది. జాతీయ విప్లవసైన్యం ఉత్తరదేశ జైత్రయాత్రను ప్రారంభించింది.

జాతీయ విప్లవసైన్యానికి చెందిన నాలుగవసేనలోని స్వతంత్ర రెజిమెంటుకు సేనానిగా ఎహ్ టింగ్ అనే కమ్యూనిస్టు నియమితుడయ్యాడు. అతడు తన సేనతో హునాన్‌పై దాడిచేశాడు. చాంగ్‌షా, యూహ్‌చౌలను స్వాధీనం చేసుకుని, హూనాన్‌లోని చిహ్లీ సైనిక ప్రభువుల ముఠా పునాదులను స్వతంత్ర రెజిమెంటు ధ్వంసం చేసింది. ఉత్తర జైత్రయాత్ర సైన్యాల పురోగమనానికి మార్గం సుగమం చేశాడు.

ఆగస్టు చివరలో ఉత్తర జైత్రయాత్ర సైన్యం హ్యూపేవైపు బయలుదేరింది. కాంటన్-హాంకౌ రైల్వేపై కీలకస్థానమైన టీన్‌జీచియావో కేంద్రాన్ని రక్షించుతున్న చిహ్లీ సైనిక ప్రభువుల సేనతో తలపడింది. మూడువైపుల నీరు, ఒకవైపున పర్వతాలతో టింగ్‌జీచియావో పట్టణాన్ని పట్టుకోవడ మసాధ్యమన్నట్లు కన్పించుతోంది. ఉత్తర సైన్యం పన్నెండుసార్లు దాడిచేసి విఫలమయింది. కాని స్థానిక రైతుల సహాయంతో స్వతంత్ర రెజిమెంటు శత్రువును చుట్టుముట్టి పట్టణాన్ని పట్టుకుంది.

అక్టోబరులో ఉత్తర జైత్రయాత్ర సైన్యం వూ చాంగ్‌పై పెద్దయెత్తున దాడి చేసింది. స్వతంత్ర రెజిమెంటులోని వీరులు తాటి నిచ్చెనల సాయంతో నగర గోడల పైకి పాకివెళ్ళి విజయధ్వజాన్ని ప్రతిష్ఠించారు. నగరాన్ని పట్టుకున్నారు.

ఇతర రంగాల్లో కూడా ఉత్తర జైత్రయాత్ర సైన్యం విజయాలు సాధించింది. 1927 మార్చిలో నాంకింగ్‌ను పట్టుకుని, యాంగ్‌ట్సీలోయపై అధికారాన్ని విప్లవ

సైన్యం స్థాపించింది. ఉత్తర జైత్రయాత్ర సైన్యాల విజయం దేశమంతటినీ ఉత్తేజ పరచింది.

ఉత్తర జైత్రయాత్ర ప్రారంభమైనపుడు కాంటన్ - హాంకాంగ్ సమ్మెలో పాల్గొన్న కార్మికులు రవాణాను, ప్రచారాన్ని, ప్రథమ చికిత్సాదళాలను ఏర్పాటు చేశారు. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన హునాన్, హ్యూపేరాష్ట్రాల్లోని కార్మికులు రైతులు తిరుగుబాటుచేసి ఉత్తర జైత్రయాత్రకు తోడ్పడ్డారు. చాంగ్‌షా కొరకు జరిగిన యుద్ధంలో వెయ్యిమంది హునాన్ కార్మికులు సాయుధదళాలను ఏర్పరచి సైన్యంతో సహకరించారు. అదే రాష్ట్రంలో రైతులు పలుగులు, కత్తులు, కావటి బద్దలు పుచ్చుకుని, సైనికులతో భుజం భుజంకలిపి పోరాడారు. కార్మిక రైతు జన సామాన్యం ఆహారం నీళ్ళు అందించుట ద్వారాను, మందుగుండు తదితర సప్లయిలు అందజేయడం ద్వారాను సైన్యానికి తోడ్పడ్డారు. ప్రజల సహకారంవల్ల విప్లవసైనికుల ధైర్యోత్సాహాలు ఇనుమడించాయి.

ఈ దశలో కార్మిక సమ్మెల వుద్యమం తీవ్రతరమయింది. 1926 అక్టోబరు నుంచి 1927 ఏప్రిల్ నాటికి ఊహాన్ కార్మికులు 300 సమ్మెలకు పైగా నడిపారు. ఆర్థిక దోపిడికి, నిర్బంధ విధానానికి వ్యతిరేకంగాను రాజకీయార్థిక హక్కులకొరకు వారు పోరాడారు. పోస్టల్ టెలికమ్యూనికేషన్ల శాఖలకు, అచ్చు, బట్టల, పొగాకు, ఫ్యాక్టరీలకు, బ్యాంకులకు, చేతివృత్తుల కర్మాగారాలకు వ్యాపారసంస్థలకు ఈ సమ్మెలు విస్తరించాయి. ఉత్తర జైత్రయాత్ర సైన్యానికి తోడ్పడేందుకు, విప్లవ వ్యతిరేకులను అణచివేసేందుకు కార్మికులు సాయుధ దళాలను ఏర్పరచుకున్నారు.

ఉత్తర జైత్రయాత్ర సైన్యం పురోగమించిన ప్రాంతాల్లోని పల్లెటూర్లలో రైతు వుద్యమం తుఫాన్‌వలె వ్యాపించింది. హునాన్‌లో మావో ట్సే - టుంగ్ ఆధ్వర్యాన జరిగిన శక్తివంతమైన రైతు పోరాటం ప్రత్యేకంగా వుదహరించ దగినది. భూస్వాములు బలవంతాన మక్తాలను వడ్డీరేటులను తగ్గించుకోవలసి వచ్చింది. అక్రమ పన్నులు, అవసరపు వసూళ్ళు రద్దుఅయ్యాయి. స్థానిక భూస్వాములు, నిరంకుశ పెత్తం దార్లు తీవ్రమైన దెబ్బతిన్నారు. శతాబ్దాల నుంచి పేరుకున్న ఫ్యూడల్ పాలన వెన్నెముక విరిగిపోయింది. 1927 సంవత్సరం మధ్య నాటికి హునాన్‌లోని రైతు సంఘాల సభ్యత్వం 20 లక్షలకు పెరిగింది.

నగరాలలో కార్మికులు, పల్లెప్రాంతాలలో రైతులు, ఫ్యూడల్ వర్గాలకు వ్యతిరేకంగా పోరాడి తీవ్రంగా దెబ్బతీయడంవల్ల ఉత్తర జైత్రయాత్ర కర్తవ్యాన్ని నిర్వహించడం సులభ తరమయింది.

## షాంఘై కార్మికుల సాయుధ తిరుగుబాట్లు

ఉత్తర జైత్రయాత్ర విజయాన్ని సామ్రాజ్యవాద ప్రభుత్వాలు వెంటనే తమకు తీరని ప్రమాదంగా గుర్తించాయి. ఉత్తర సైనిక ప్రభువులకు మద్దతుగా

వుండుటతోపాటు బహిరంగంగా సాయుధచర్యలను రెచ్చగొట్టేందుకు పూనుకున్నారు.

ఉత్తర జైత్రయాత్ర సైన్యం ఊహాన్ నగరంలో ప్రవేశించినపుడు స్థానిక ప్రజలు ఘనస్వాగతమిచ్చారు. 1927 జనవరి 3 వ తేదీన విజయోత్సవం నాడు బ్రహ్మాండమైన ప్రజాప్రదర్శనం జరిగింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ సైన్యాలను పంపి, ప్రజల్లో భీతావహం కలిగించాలని ప్రయత్నించారు. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన ఊహాన్ నగరంలోని వివిధరంగాలకు చెందిన ప్రజా ప్రతినిధులు సమావేశమై బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా తీవ్ర అసమ్మతిని తెలియజేశారు. ప్రజల ఒత్తిడికి జంకి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తిరోగమించారు.

జనవరి 5 వ తేదీన ప్రజావాంఛను గుర్తించి, జాతీయ ప్రభుత్వం హాంకౌలోని బ్రిటిష్ ఆక్రమణను స్వాధీనం చేసుకుంది. తదనంతరం కియుకియాంగ్, కియాంగ్సీల లోని బ్రిటిష్ ఆక్రమణలను జాతీయ ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది.

దీర్ఘకాలంగా బ్రిటిష్ ఆక్రమణలోవున్న హాంకౌ, కియుకియాంగ్ ప్రాంతాలను చైనా ప్రజలు తమ స్వంత బలంతో స్వాధీనం చేసుకోగలిగారన్న సంగతి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరుగుతున్న చైనా ప్రజాపోరాటానికి ఘన విజయం.

ఉత్తర జైత్రయాత్ర సైన్యం ఊహాన్ నగరాన్ని స్వాధీనం చేసుకున్నాక, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన షాంఘై కార్మికులు మూడు సార్లు సాయుధ తిరుగుబాటు చేసి, సైన్య జైత్రయాత్రకు తోడ్పడ్డారు.

1926 అక్టోబరులో మొదటి సాయుధ తిరుగుబాటు జరిగింది. కాని తగినంత సన్నాహాలను చేయనందున విఫలమయింది.

1927 ఉత్తర జైత్రయాత్ర సైన్యం హాంగ్‌చౌను స్వాధీనం చేసుకున్నపుడు షాంఘై కార్మికుల సాయుధ తిరుగుబాటును నడపాలని కమ్యూనిస్టుపార్టీ నిర్ణయించింది. "సైన్యం జైత్రయాత్రకు తోడ్పాటుగా దెబ్బతీయండి!" "కార్మికుల స్వాతంత్ర్యం వర్ధిల్లాలి!" "కార్మికుల ఐక్యత వర్ధిల్లాలి!" అనే నినాదాలతో అన్ని వృత్తుల కార్మికులు మొత్తం 3 లక్షల 60 వేల మంది జనరల్ సమ్మెలో పాల్గొన్నారు.

సమ్మె ప్రారంభమవడంతోనే సామ్రాజ్యవాదులు, చైనా అభివృద్ధి నిరోధకులు చేతులు కలిపి, కార్మికులను హతమార్చడానికి కుట్రపన్నారు. అభివృద్ధి నిరోధక సేనల, పోలీసులపైన ఆకస్మికంగా దాడిచేసి, వారినుంచి ఆయుధాలను కార్మికులు గుంజుకున్నారు. వాటితో సాయుధులై తిరుగుబాటు చేశారు. కాని ఉత్తర జైత్రయాత్ర జరుపుతున్న సైన్యంతో సన్నిహిత సంబంధాలు లేనందున రెండో ప్రయత్నం కూడ విఫలమయింది.

రెండు అపజయాల అనంతరం కమ్యూనిస్టు పార్టీ ప్రజలలో విస్తృతంగా రాజకీయ ప్రచారాన్ని, నిర్మాణ కృషిని సాగించింది. మూడోసారి సాయుధ పోరాటానికి సన్నాహాలు చేసింది.

1927 మార్చి 21 తేదీన ఉత్తర దైత్రయాత్ర సైన్యం నగరపరిసరాలకు చేరినపుడు, మరల షాంఘే కార్మికులు జనరల్ సమ్మె చేశారు. 8 లక్షల కార్మికులు పాల్గొన్న యీ సమ్మెతోపాటుగా మూడోసారి సాయుధ తిరుగుబాటు ప్రారంభ మయింది. రైల్వే మార్గాలకు కార్మికులు గండ్లుకొట్టారు. జ్యేఫోను కేంద్రాన్ని స్వాధీనం చేసుకున్నారు. అభివృద్ధినిరోధక సైన్యాలను, పోలీసులను నిరాయుధుల్ని చేశారు. షాంఘే రైల్వే స్టేషన్ పట్టుకున్నారు. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం కృషివల్లనూ, కార్మికుల వీరోచిత పోరాటం ఫలితంగానూ చివరకు షాంఘేనగరం ప్రజల హస్తగతమయింది. ప్రజలు తమ ప్రతినిధులను ఎన్నుకొని, షాంఘే మున్సిపల్ ప్రజా ప్రభుత్వాన్ని ఏర్పరచారు.

## చియాంగ్‌కై - షేక్ ద్రోహం

ఉత్తర దైత్రయాత్ర సాధించిన మెరుపులాంటి విజయాలవల్ల ప్రజానీకపు విప్లవ దీక్ష మరింత ఉన్నత స్థాయికి పెరిగింది.

విప్లవ నిరంతర పురోగమనంవల్ల భీతిచెందిన సామ్రాజ్యవాదులు, విప్లవ శిబిరంలో దాగివున్న ప్రతీఘాతక శక్తులతో రాజీపడ్డారు. తద్వారా విప్లవ విజయం సాధించిన ఫలితాలు ప్రజలకు అందకుండా దోచుకున్నారు.

ఆ సమయంలో కమ్యూనిస్టుపార్టీ నాయకుడుగావున్న చెన్ టూ - హ్స్యు కమ్యూనిస్టు - కొమింటాంగ్ సహకారం యెడల బలహీన దృక్పథం అవలంబించాడు. కమ్యూనిస్టుపార్టీ స్వతంత్ర పాత్రను, చొరవను వదలి వేశాడు. ఉత్తర దైత్ర యాత్ర నాయకత్వ విషయంలో లొంగిపోయాడు. ఉత్తర దైత్రయాత్ర సైన్యంలో నిజమైన అధికారం, విప్లవ శిబిరంలో దాగివున్న ప్రతీఘాతకుల నాయకుడైన చియాంగ్‌కై-షేక్ చేతుల్లోకి పోయింది. అందుచేత విప్లవం గట్టిగా నిలబడే పునాదులపై నిర్మించ బడలేదు.

తత్ఫలితంగా కంట్రోలు, అధికారం చియాంగ్‌కైషేక్ హస్తగతమయింది. 1927 ఏప్రిల్ 12 వ తేదీన చియాంగ్‌కై-షేక్ సాయుధ గుండాల ముఠాను ప్రయోగించాడు. వారు కార్మికుల వేషాలు ధరించి, షాంఘే నగరంలోని చాలా జిల్లాలలోని కార్మిక సంఘాలపై దాడి చేశారు. అచటవున్న కార్మిక వాలంటీర్లపై, "కార్మికుల మధ్య అంతర్గత తగాదాలను రెచ్చగొడుతున్నారనే" నిందలను ఆరోపించి, వారిని నిరాయుధుల్ని చేశారు. మరుసటి రోజున షాంఘే కార్మికులు గొప్ప ప్రదర్శన జరిపి, తమ వాలంటీర్లవద్దనుంచి లాక్కున్న ఆయుధాలను తిరిగి యివ్వాలనీ, గుండాలను,

ప్రతీఘాతకులను అణచివేయాలనీ కోరారు. ప్రదర్శనం తరువాత ఉత్తర జైత్రయాత్ర సైన్యం కేంద్ర ఆఫీసుకు తమ విజ్ఞప్తిపత్రాన్ని సమర్పించుకునేందుకు కార్మికులు వెళ్లారు. పావుషాన్ రోడ్డుకు చేరునప్పటికీ, వారిపై కాల్పులని చియాంగ్‌కైషేక్ తన సేనలకు ఉత్తరువు లిచ్చాడు. కాల్పులవల్ల చాలమంది మరణించారు. ఆ ప్రదేశమంతా రక్తప్రవాహంతో తడిసిపోయింది.

షాంఘై హత్యాకాండ అనంతరం దేశమంతటా క్రూరనిర్బంధ విధానం అమలు జరిగింది. కమ్యూనిస్టులను విప్లవకారులైన ప్రజలను ప్రతిచోటా అరెస్టుచేసి, శిక్షించడానికి అభివృద్ధినిరోధకులు పూనుకున్నారు. చైనాజాతి అనుంగుపుత్రులను పుత్రికలను ఎందరినో హతమార్చిన చియాంగ్ కై-షేక్ రక్తసిక్త హస్తాలతో ఇపుడు బహిరంగంగానే సామ్రాజ్యవాద-భూస్వామ్య శక్తుల ప్రతినిధిగా వ్యవహరించాడు.

షాంఘై హత్యాకాండ అనంతరం దక్షిణ చైనాలో రెండు పోటీ ప్రభుత్వాలు కొనసాగాయి. ఊహాన్ రాజధానిగా వున్న విప్లవ ప్రభుత్వ మొకటి. నాంకింగ్ రాజధానిగా వున్న విప్లవద్రోహి చియాంగ్ కై-షేక్ ప్రభుత్వం మరొకటి.

చియాంగ్ కై-షేక్ ద్రోహం చేశాడన్న వార్త ఊహాన్‌కు చేరగానే, నగరంలోని కొమింగ్‌టాంగ్ పార్టీ చియాంగ్‌ను పార్టీనుంచి తొలగించింది. విప్లవ ప్రభుత్వం అన్ని పదవులనుంచి బర్తరఫ్ చేసింది. కాని ఈ సమయంలోనే ఊహాన్ ప్రభుత్వంలో భాగమైన వాంగ్ చింగ్-వీ ఆధ్వర్యాన వున్న ప్రతీఘాతుకముఠా తలయెత్తసాగింది.

సామ్రాజ్యవాదుల మద్దతుతో చియాంగ్ కై-షేక్ ఆర్థిక దిగ్బంధనం సైనిక వలయంతో చుట్టుముట్టుతానని ఊహాన్ ప్రభుత్వాన్ని బెదరించాడు. తన కుట్రలను సాగించడంలో నిమిషం కూడ ఏమరపాటు చూపలేదు.

1927 మేలో ఊహాన్ ప్రభుత్వం క్రిందవున్న ప్రతీఘాతుక వుద్యోగి హ్సియా టో - ఇన్ తిరుగుబాటు లేవదీశాడు. తిరుగుబాటుదార్లపై చర్యతీసుకునేందుకు విప్లవ ప్రభుత్వం ఏహ్ - టింగ్ ఆధిపత్యం క్రింద సేనను పంపి ఓడించింది. ఇది ముగిసిన వెంటనే హ్యూకె-హ్సియాంగ్ అనే మరో ప్రతీఘాతుక వుద్యోగి హునాన్ రాష్ట్రంలోని చాంగ్షానగరంలో విప్లవ ప్రజానీకంపై హత్యాకాండ ప్రారంభించాడు. అలాంటి క్లిష్టసమయంలో కమ్యూనిస్టు నాయకుడుగావున్న చెన్ టూ - హ్సియు కార్మికులను, రైతులను సమీకరించి విప్లవాన్ని రక్షించడానికి పూనుకోలేదు. అంతేగాక ప్రతీఘాతుక ముఠా బెదరింపులకు లొంగిపోయాడు. రైతు వుద్యమాన్ని నిషేధించాడు. కార్మికులను నిరాయుధుల్ని చేశాడు. తద్వారా ప్రజాపోరాటాన్నంతటినీ కొమింటాంగ్ అధీనంలో వుంచాడు. ఈ లొంగుబాటు ధోరణివల్ల విప్లవ వ్యతిరేకులు బలపడ్డారు. విప్లవశక్తులు బలహీనపడ్డాయి. పరిస్థితి నానాటికి మరింత క్లిష్టమవసాగింది.

ఊహాన్ ప్రభుత్వంలో భాగంగావున్న ప్రతీఘాతుక శక్తుల ముఠా విప్లవానికి ద్రోహం చేసింది. వాంగ్ చింగ్-వీ ముఠా అమ్ముడు పోవడమే ఇందుకు నిదర్శనం. జులై 15 తేదీన వాంగ్ చింగ్-వీ అతడి అనుచరులు సమావేశమై కమ్యూనిస్టుపార్టీతో తెగతెంపులు చేసుకోవాలని నిర్ణయించారు. కమ్యూనిస్టుపార్టీకి తనవ్యతిరేకతను అతడు బహిరంగంగా ప్రకటించాడు. కార్మిక సంఘాలను రైతుసంఘాలను మూసివేయాలని ఉత్తరువు లిచ్చాడు. కమ్యూనిస్టులను, విప్లవ కారులను హత్యగావించాడు. తుఫానువలె ప్రారంభమైన మొదటి విప్లవ అంతర్యుద్ధం విషాదకరమైన ఓటమితో అంత మయింది.

59 వ అధ్యాయం

# సాహిత్య విప్లవారంభం - పెరుగుదల

1917 లో నవయువక (న్యూ యూత్) అనే పత్రికలో పాత ఫ్యూడల్ పద్ధతిలో చైనా సాహిత్య రచన అంతమొందాలనీ, ప్రజా జీవితాన్ని, సామాజిక పరిస్థితులను వాస్తవికంగా చిత్రించుతూ సజీవమైన వ్యావహారిక భాషలో నూతన సాహిత్యం వెలువడాలనీ చాలా వ్యాసాలు ప్రకటించబడ్డాయి. ఆధునిక చైనాలో సాహిత్య విప్లవానికి యిదే నాంది. "పిచ్చివాని డైరీ" అనే లీహ్సూన్ వ్రాసిన చిన్న కథ మొదటి సృజనాత్మక రచన, సాహిత్య విప్లవానికి ఎంతో తోడ్పడింది.

మే 4 ఉద్యమానంతరం అభివృద్ధి చెందిన నూతన సంస్కృతీ ఉద్యమం ఫలితంగా చైనా భాషలో అనేక వార్తా పత్రికలు వెలిశాయి! కొత్తరకపు సాహిత్య రచన ప్రారంభమయింది. సాహిత్య విప్లవానికి దేశవ్యాపిత ప్రజా పునాది ఏర్పడింది. చైనా కమ్యూనిస్టుపార్టీ ఆవిర్భవించడం, విప్లవ తుఫాను చెలరేగడం ఫలితంగా సాహిత్య విప్లవానికి నూతన బలం చేకూరింది. ప్రజా వెల్లువ ప్రభావంవల్ల అనేకమంది పెటీ బూర్జువా (మధ్యతరగతి) మేధావులు సాహిత్య విప్లవంలో పాల్గొన్నారు. పాత సమాజంలోని చెడుగులను వివిధ కళారూపాలలో చిత్రించుట ద్వారా తమ హృదయావేదనను, బాధను వ్యక్తంచేయ సాగారు. 1921 తరువాత ఆరు సంవత్సరాలలో దేశమంతటా నూతన సాహిత్యాన్ని, కళలను ప్రోత్సహించే సంస్థలు 130 కి పైగా నిర్మించబడ్డాయి. వాటి తరఫున దాదాపు 300 పత్రికలు ప్రకటించబడేవి.

కొత్తరకపు సాహిత్య సంస్థలలో మొట్టమొదటి వాటిలో సాహిత్య పరిశోధక మండలి, సృజనాత్మక సాహిత్య సమితి ముఖ్యమైనవి. షెన్ ఎన్ - పింగ్ (మావో టున్) చెంగ్ చెన్ - టు, ఎహ్ షెంగ్ - టావో తదితరుల నిరంతర కృషివల్ల సాహిత్య పరిశోధక మండలి, ఆ రోజుల్లో చైనా సమాజ పరిస్థితులను ప్రతిబింబించే అనేక రచనలను ప్రకటించ గలిగింది. ఆధునిక చైనా సాహిత్య అభివృద్ధిపై దీని ప్రభావం చాలవుంది. సృజనాత్మక సాహిత్య సమితి సభ్యులలో కూమో - జో, యుటా - ఫూ, చెంగ్ ఫాంగ్ - వూ అత్యంత ప్రముఖ పాత్ర నిర్వహించారు.

శిథిలమౌతున్న ఫ్యూడల్ శక్తులకు వ్యతిరేకంగా జరిగే ప్రతిఘటనను కీర్తించుతూ వారు వ్రాసిన రచనలు, తమ మాతృభూమికి దివ్యమైన భవిష్యత్తును ఆశించే యువక మేధావులందరినీ ఆకర్షించాయి.

1924 లో పెకింగ్ నగరంలో స్థాపించబడిన 'టాట్లర్ సొసైటీ' (వదరుబోతుల సమితి)లో లూహ్సూన్ సభ్యుడుగా వుండేవారు. మరుసటి సంవత్సరం లూహ్సూన్ కొంతమంది యువకులతో కలసి "విల్డర్ నెస్ సొసైటీ (కాటి సమితి) ని స్థాపించాడు. అకుంఠిత దీక్షతోనూ, రచనా సామర్థ్యం ద్వారాను సాహిత్య రంగంలో నూతన శక్తుల ప్రాదుర్భావానికి లూహ్సూన్ కారకుడయ్యాడు.

మే 30 వుద్యమం చెలరేపిన విప్లవతుఫాన్‌లో చాలమంది రచయితలు పోరాటం లోకి వచ్చారు. ఇందువల్ల కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన వృద్ధిపొందుతున్న విప్లవోద్యమంతో సాహిత్య విప్లవానికి సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి.

1918 - 1925 సంవత్సరాల మధ్య లూహ్సూన్ 20 కథలకుపైగా వ్రాశాడు. అవి "ఆయుధాలకు పిలుపు," "తిరుగుడు" అనే పేర్లతో రెండు సంపుటాలుగా ప్రకటించబడ్డాయి.

మొదటి సంపుటిలోవున్న "ఎహ్‌క్యూ నిజమైన కథ" లూహ్సూన్ కృషికి ప్రాతినిధ్యం వహించే చక్కని రచన. 1911 విప్లవ సంఘటనలను ఆధారంగా చేసుకుని, కాందిశీకుడుగా తిరుగుతున్న అలసిపోయిన రైతు జీవితాన్ని యీ కథలో చిత్రించాడు. అర్ధవలస అర్ధభానిస సమాజంలో రైతులు అనుభవించే బానిసత్వం దారిద్ర్యాలను వర్ణించాడు. భూస్వామ్యవర్గ క్రూరత్వాన్ని కుళ్ళుకంపును బట్టబయలు చేశాడు. 1911 విప్లవంలో తగుసన్నాహాలు జరుగనందుకు విమర్శించాడు.

"ఆయుధాలకు పిలుపు" "తిరుగుడు" అనే రెండు సంపుటాలలోని లూహ్సూన్ రచనలు ఆధునిక చైనాలో వాస్తవిక సాహిత్యానికి పునాదులువేశాయి.

1921 లో కూమో-జో వ్రాసిన పద్యాలు "దేవతలు" అనే పేరుతో ఒక సంపుటిగా మొదటిసారి ప్రకటితమయ్యాయి. మాతృభూమి యెడల కవి ప్రేమాదరాలను ఈ సంపుటంలోని పద్యాలు పూర్తిగా వ్యక్తంచేస్తాయి.

## 60 వ అధ్యాయం

# రెండవ విప్లవ అంతర్యుద్ధం

## విప్లవకేంద్రాల నిర్మాణం

మొదటి విప్లవ అంతర్యుద్ధానికి ద్రోహం జరిగాక కొమింటాంగ్ పార్టీ ఆంతరంగిక వైరుధ్యాలతో సతమతమయింది. సామ్రాజ్యవాదులు తెరవెనుకనుంచి ప్రోత్సహించుతుంటే పార్టీలోని వివిధ ముఠాలు అధికారంకోసం పెనగులాడటం ప్రారంభించారు. 1927 అనంతరం మూడు సంవత్సరాలవరకు దేశంలో హెచ్చు భాగంలో సాయుధ ఘర్షణలు కొనసాగుతూ వచ్చాయి. ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల మద్దతుతో చియాంగ్ కై-షేక్ జాతీయ ప్రభుత్వం, కొమింటాంగ్ పార్టీ కేంద్ర కార్యనిర్వాహకవర్గం పేరుతో తన ప్రత్యర్థులందరినీ ఓడించాడు. ఇతర శక్తివంతమైన ముఠాలతో రాజీపడి, ఫెంగ్ టీన్ సైనిక ప్రభువులకు వ్యతిరేకంగా ఉత్తర దండయాత్రను నడిపాడు. వారు లొంగిపోయి చివరకు ఈశాన్య చైనాపై కొమింటాంగ్ అధికారాన్ని గుర్తించారు. తద్వారా నాంకింగ్ అభివృద్ధి నిరోధక ప్రభుత్వం దేశమంతటిపైన నామకః అధికారం వహించింది.

కొమింటాంగ్ అభివృద్ధి నిరోధక పరిపాలనలో శ్రామిక ప్రజలు విప్లవదశలో తాము సంపాదించుకున్న రాజకీయ ఆర్థిక హక్కులన్నిటినీ కోల్పోయారు. విప్లవ కార్మిక సంఘాలు, రైతు సంఘాలు ధ్వంసం చేయబడ్డాయి. కార్మిక రైతు ఉద్యమాల నాయకులు క్రూరమైన నిర్బంధ విధానానికి గురైయ్యారు. దుర్భర పరిస్థితులలో కరువు వేతనాలతో కార్మికులు శ్రమపడవలసి వచ్చింది. మక్తాల, పన్నుల భారంతో నలిగిపోతూ, యుద్ధాలు, ప్రకృతి ప్రమాదాలతో వేసారిపోయి రైతులనేక మంది తమ యిళ్లను వదలివేసి బ్రతుకుతెరువుకొరకు దేశద్రిమ్మరులయ్యారు.

కొమింటాంగ్ ప్రభుత్వం కమ్యూనిస్టులపైన ఇతర విప్లవకారులపైన దారుణ హింసాకాండను అమలు జరిపింది. 1927-1932 మధ్యకాలంలో పదిలక్షల మందికిపైగా ప్రజలు కొమింటాంగ్ చేత చంపబడ్డారని అసంపూర్తి లెక్కలవల్ల తెలుస్తూంది.

విప్లవ ప్రతిఘాతుకుల నిర్బంధ విధానం ఎంత దారుణంగా వున్నప్పటికి చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రజలు ఓటమిని అంగీకరించలేదు. విప్లవం యెడల అచంచల విశ్వాసంతో వారు పనిచేయసాగారు.

1927 ఆగస్టు 1 తేదీ వుదయం కియాంగ్సీలోని నాన్‌చాంగ్‌వద్ద సాయుధ తిరుగుబాటు జరిగింది. దీన్లో కార్మికులు, రైతులు, ఉత్తర దండయాత్ర సైన్యంలో కమ్యూనిస్టు పలుకుబడిక్రిందవున్న సైనికులు మొత్తం 30 వేల మంది పాల్గొన్నారు. కమ్యూనిస్టులైన చౌ ఎన్ - లై, చూ టేహ్, ఎహ్ టింగ్, హోలుంగ్ తదితరులతో విప్లవసమితి ఏర్పడి, తిరుగుబాటును నడిపించింది. మూడు గంటల పోరాటం తరువాత విప్లవ సైన్యాలు నాన్‌చాంగ్‌ను పట్టుకున్నాయి.

ఆగస్టు 1 తేదీని విప్లవ సాయుధసేనల జన్మదిన వార్షికోత్సవంగా చైనా ప్రజలు ప్రతిసంవత్సరం జరుపుకొంటున్నారు. ఈ సంఘటనతో చైనా కమ్యూనిస్టు పార్టీ స్వతంత్ర నాయకత్వంక్రింద సాయుధ విప్లవం ప్రారంభమయింది.

ఆగస్టు 5 తేదీన విప్లవ సైన్యాలు నాన్‌చాంగ్ నుంచి దక్షిణంగా కాంటన్ నగరం స్వాధీనం చేసుకొని, విప్లవ బలగాలన్నిటినీ ఒకేచోట సమీకరించాలనే లక్ష్యంతో బయలుదేరాయి. కొమింటాంగ్ సైన్యాలు పెడుతున్న ఆటంకాలను ఓడించుతూ, విప్లవసేనలు కియాంగ్సీ నుంచి ఫూకీన్‌కు వెళ్ళి, అచటినుంచి క్వాంగ్‌టుంగ్‌లో ప్రవేశించాయి. కాని రైతు ఉద్యమంతో సన్నిహిత సంబంధాలు కొరవడినందున విప్లవ సైన్యానికి బలమైన ప్రజల తోడ్పాటు లభ్యంకాలేదు. అదే సంవత్సరం అక్టోబరు ప్రారంభంలో తూర్పు క్వాంగ్‌టుంగ్‌లో జరిగిన యుద్ధాలలో విప్లవ సైన్యం ముఖ్య భాగాన్ని కోల్పోయింది. మిగిలినదాంట్లో ఒక భాగం హైఫెంగ్ లూఫెంగ్ రైతు వుద్యమంలో లీనమైపోయింది. తక్కిన భాగం చూటే నాయకత్వాన దక్షిణ హునాన్‌కు తరలివెళ్ళింది.

విప్లవాన్ని రక్షించేందుకు, 1927 ఆగస్టులో కమ్యూనిస్టు పార్టీ ఆకురాలు కాలం పంటల తిరుణంలో వివిధ ప్రాంతాలలో సాయుధ తిరుగుబాటులు నడపాలని పిలుపునిచ్చింది. ఆ సంవత్సరం ఆకురాలు కాలంనుంచి మరుసటి సంవత్సరం వసంతం వరకు దేశమంతటా అనేక సాయుధ తిరుగుబాట్లు జరిగాయి. కమ్యూనిస్టు పార్టీ పలుకుబడి పల్లెప్రాంతాలలో వ్యాపించింది.

హునాన్ ఉత్తర కియాంగ్సీ రాష్ట్రాల మధ్యప్రాంతంలో మావుత్సే-టుంగ్ నాయకత్వాన ఆకురాలు కాలంలో సాయుధ తిరుగుబాటు జరిగింది. బొగ్గు కార్మికులను, రైతులను, ఉత్తర దండయాత్ర సైన్యంలోని కొందరు సైనికులను సమీకరించి, కార్మిక-కర్షక విప్లవ సైన్యాన్ని నిర్మించాడు. తిరుగుబాటు ఉధృతాన్ని చూసి, రాష్ట్ర రాజధాని చాంగ్షాలోని విప్లవ వ్యతిరేకులు సైతం గాభరాపడ్డారు. ఐనప్పటికీ ముఖాముఖి యుద్ధానికి పరిస్థితులు అనుగుణ్యంగా లేనందున మావుట్సే-టుంగ్ తన సాయుధ దళాలను చింగ్‌కాంగ్‌షాన్ పర్వతాల్లోకి నడిపించాడు. అచట విప్లవ కేంద్రాన్ని స్థాపించాడు.

కియాంగ్సీ-హునాన్ రాష్ట్రాలమధ్య 500 మీల ప్రాంతంలో చింగ్ కాంగ్ షాన్ పర్వతాలు విస్తరించి వున్నాయి. ఆ ప్రాంతమంటికీ సెలయేళ్ళు ప్రవహించడం మీర్పడిన ఐదు సన్నని కనుమలు మాత్రమే వున్నందున, దానికి చాల ప్రాముఖ్యత వుంది. 1921 అక్టోబరులో మావో త్సే-టుంగ్ తన సాయుధ దళాలను చింగ్ కాంగ్ షాన్ పర్వత ప్రాంతానికి నడిపించి, అచట కార్మిక - కర్షక ప్రభుత్వాన్ని స్థాపించాడు. ఆయన విప్లవ దళంలో వేయిమంది సాయుధులు మాత్రమే వున్నప్పటికీ అనేక శత్రుదాడులను తిప్పికొట్టగలిగాయి. చింగ్ కాంగ్ షాన్ పర్వతాలపై ఎర్రజెండాను ఎగురవేశాయి. చైనాలో ప్రథమ విప్లవ కేంద్రాన్ని స్థాపించగలిగాయి.

నాన్‌చాంగ్ తిరుగుబాటులో పాల్గొని, చూటేహ్ నాయకత్వాన విప్లవసైన్యం 1928 ప్రారంభంలో క్వాంగ్‌టుంగ్‌నుంచి దక్షిణ హునాన్‌కు తరలి వచ్చింది. అచట విస్తృతమైన రైతు తిరుగుబాట్లను ప్రోత్సహించింది. చాలమంది రైతులు విప్లవ సైన్యంలో చేరారు. అదే సంవత్సరం ఏప్రిల్‌లో చూటేహ్ తన సేనలను చింగ్ కాంగ్ షాన్ పర్వతప్రాంతానికి నడిపించాడు. అచట మావో త్సే టుంగ్ నాయకత్వానవున్న సైన్యంతో కలిశాడు. చరిత్రాత్మకమైన ఈ కలయిక అనంతరం మావో త్సే టుంగ్, చూటేహ్‌లు తమ సేనలను చైనా కార్మిక-కర్షక ఎర్రసైన్యంగా, చైనాలో కొత్తరకపు విప్లవ సైన్యంగా పునర్నిర్మించారు.

కార్మిక - కర్షక ఎర్ర సైన్యానికి విద్య గరపడం విషయమై మావో త్సే టుంగ్ చూటేహ్‌లు ప్రత్యేక శ్రద్ధవహించారు. వారి రాజకీయ కృషి ఫలితంగా ఎర్ర సైన్యం ధైర్యోత్సాహాలతో వుంటూ ప్రజలతో సన్నిహితసంబంధాలను స్థాపించుకుంది. ఆరోజుల్లో విప్లవ కేంద్రమున్న ప్రాంతం చిన్నదిగా వుండేది. ఎర్ర సైన్యానికి, ఆహారం మందులు కొరతగా వుండేవి. సైనికులకు చలికాలంలో వెచ్చని దుస్తులు తరుచుగా లభ్యమయ్యేవి కావు. వర్ణింపశక్యంగాని ఇబ్బందులున్నప్పటికీ ఎర్ర సైన్యం అకుంఠిత దీక్షతో పోరాటం సాగించింది. స్థానిక ప్రజల సహాయంతో గెరిల్లా యుద్ధ ఎత్తుగడలను చాకచక్యంగా వినియోగించి, చియాంగ్ కై - షేక్ పంపిన అభివృద్ధినిరోధక సేనల దండయాత్రలను వరుసగా ఓడించారు. చైనాలో కమ్యూనిస్టు రాజకీయాధికారానికి ప్రథమ పునాది ఐన విప్లవకేంద్రాన్ని బలపరుచుకొని, విస్తృత పరుచుకున్నారు.

1928 ఆరురాలుకాలంలో పోంగ్ టెహ్-హుయి తదితరులు కలసి, హునాన్-హ్యూపే-కియాంగ్సీ సరిహద్దులలో ఒక విప్లవ కేంద్రాన్ని నిర్మించారు. ఆ సంవత్సరాంతానికి ఆయనకూడ తనసేనలను చింగ్ కాంగ్ షాన్ పర్వత ప్రాంతానికి తరలించి, అచట మావో చూటేలు నిర్మించిన ఎర్రసైన్యంలో కలిపివేశారు. 1929 లో ఎర్ర సైన్యం దక్షిణ కియాంగ్సీ, పశ్చిమ ఫూకీన్, ప్రాంతాలలో రెండు విప్లవ కేంద్రాలను స్థాపించింది. తరువాత కొలదికాలానికే ఈ రెండు కేంద్రాలను కలిపి, జూయిచిన్ రాజధానిగా సెంట్రల్ విప్లవ కేంద్రాన్ని స్థాపించింది.

అదే కాలంలో కియాంగ్సీ, ఫ్యూకీన్, హునాన్, హుపే, క్వాంగ్సీ, షెన్‌సీ వగైరా చోట్ల కూడ కొన్ని విప్లవకేంద్రాలు ఏర్పడ్డాయి. ఈ కేంద్రాల స్థాపనతో పాటు ఎర్రసైన్యం పెరిగింది. 1930 నాటికే 15 విప్లవ కేంద్రాలున్నాయి. ఎర్ర సైన్యం 60 వేలదాకా పెరిగింది.

# వ్యవసాయ విప్లవం

చింగ్ కాంగ్ షాన్ పర్వతాలలో విప్లవ కేంద్రాన్ని స్థాపించడంతో పాటు మావో త్సే టుంగ్ వ్యవసాయ విప్లవంలో రైతులకు నాయకత్వం వహించి నడిపాడు. 1930 నాటికి ఎర్రసైన్యాధీనంలోవున్న 15 ప్రాంతాలలోనే గాక ఎర్రసైన్యం కాలిడిన ప్రాంతాలన్నిటిలోనూ వ్యవసాయ విప్లవ జ్వాలలు అలముకున్నాయి.

విప్లవం అంతకుముందు దశలో గడించిన అనుభవంతో మావో త్సే-టుంగ్ వ్యవసాయ విప్లవ కార్యక్రమాన్ని రూపొందించాడు: బీద రైతులు వ్యవసాయ కార్మికులపై ఆధారపడి, మధ్యతరగతి రైతులను కూడదీసుకుని, ధనిక రైతులను పరిమితంచేసి, మధ్యరకపు చిన్న పారిశ్రామికులకు, వ్యాపారులకు రక్షణయిస్తూ, భూస్వామ్యవస్థాన్ని రద్దుచేయడమే వ్యవసాయ విప్లవ గమ్యస్థానం. ఈ లక్ష్యంతో విప్లవ కేంద్రాలలోని ప్రజాసామాన్యాన్ని సమీకరించి, చైనా సమాజ వ్యవస్థను వేల కొలదీ సంవత్సరాలుగా బంధించిన ఫ్యూడల్ ఉత్పత్తి సంబంధాలను బ్రద్దలు చేశారు. భూస్వాములవద్దనుంచి తీసుకున్న భూమిని బీద రైతులకు, వ్యవసాయ కూలీలకు పంచారు. రైతులకు బంధనంగా తయారై - వారిని పీడించుతున్న అధిక వడ్డీలను రద్దుచేశారు. కార్మిక - కర్షక ప్రజాస్వామ్య ప్రభుత్వానికి పునాది గాను, ప్రధాన అండగానువుంటూ, రైతాంగం ప్రజలలోని ఈ రెండు భాగాలు వ్యవసాయ విప్లవానికి కీలకంగా పనిజేశాయి. మధ్యరకపు రైతుల్లో అధిక సంఖ్యాకులు కూడ అదనపు భూమి సంపాదించారు. విప్లవ ప్రభుత్వాధికారాన్ని బలపరచారు. మధ్యరకపు చిన్న పారిశ్రామికులపైన, వ్యాపారస్థులపైన అదివరకున్న విపరీత పన్నులభారాన్ని, రకరకాల పన్నులను తొలగించడం జరిగింది.

బాగా కృషిచేయాలనీ, ఎక్కువ పండించాలనే ఉత్సాహాన్ని రైతులలో వ్యవసాయ విప్లవం కలిగించింది. అదివరకు పాడుపడిన పొలాలను తిరిగి సాగు చేయడం, బంజర్లను పంటపొలాలుగా మార్చడం జరిగింది. విప్లవ కేంద్రాల ప్రాంతంలో ఉత్పత్తి బాగా పెరిగింది.

వ్యవసాయ విప్లవం ఫలితంగా యీకేంద్రాలున్న ప్రాంతాలలో భూస్వాముల పెత్తనం అంతరించింది. విప్లవ వ్యతిరేకులను అణచివేసి, కమ్యూనిస్టు ప్రభుత్వ రాజకీయాధికారం బలపరచడం జరిగింది. అంతేగాక ఎర్రసైన్యంలో అదనంగా చాలమంది చేరడం, కమ్యూనిస్టుపార్టీ బలపడటం జరిగింది.

# విప్లవ కేంద్రాలపై చియాంగ్ దాడులు

విప్లవ కేంద్రాలు, కార్మిక కర్షక ఎర్రసైన్యం బలపడటం చూసి కొమింటాంగ్ ప్రభుత్వం గాభరా పడింది. 1930 చివరకు చియాంగ్ కై-షేక్ లక్ష సైన్యాన్ని సమీకరించి, ముఖ్య విప్లవ కేంద్రం చుట్టూ వలయం పన్నేందుకు పూనుకున్నాడు. ఆ సమయంలో ముఖ్య విప్లవ కేంద్రంలో వున్న ఎర్రసైన్యం 40 వేలకు తక్కువగానే వుంది. మావో త్సేటుంగ్ నాయకత్వాన ఎర్రసైన్యం సింగ్టూ వద్దనున్న శత్రు సైన్యంపై ఆకస్మికంగా దాడిచేసింది. 9 వేల శత్రు సైన్యాన్ని ఉద్యోగులతో సహా ఖైదీలుగా పట్టుకుంది. తరువాత పారిపోతున్న శత్రువు వెంటబడి తరిమివేసి, విప్లవ కేంద్రాన్ని చుట్టుముట్టాలనే శత్రు పన్నాగాన్ని ధ్వంసం చేసింది.

1931 ఫిబ్రవరిలో చియాంగ్ కై - షేక్ 2 లక్షల సైన్యాన్ని సమీకరించి, ముఖ్య విప్లవ కేంద్రాన్ని చుట్టుముట్టేందుకు రెండోసారి దాడికి పంపించాడు. మే నెలలో ఎర్రసైన్యం కియాంగ్సీలోని చియాన్‌కు-ఫూకీన్‌లోని చియెన్నింగ్‌కు మధ్యవున్న 800 లీల ప్రాంతాలన్ని తుడిచిపెట్టింది. ఒక పక్షం రోజుల్లో శత్రువును ఓడించి, పూర్తి విజయాన్ని సాధించింది.

కాని యుద్ధంలో ఎర్రసైన్యం కూడ నష్టపడింది. దానిబలం 30 వేలకుతగ్గింది. విరామం తీసుకుని, తిరిగి పుంజుకునే లోపలనే చియాంగ్ కై - షేక్ ఈసారి 3 లక్షల సైన్యాన్ని సమీకరించి, మరల చుట్టుముట్టే దాడిని ప్రారంభించాడు. 1931 జులైలో ప్రారంభమైన ఈ దాడిలో చియాంగ్ కై - షేక్ స్వయంగా సైన్యాధిపత్యం వహించాడు. బ్రిటిష్, జపాన్, జర్మన్ మిలటరీల సలహాదార్లను సహాయం తీసుకున్నాడు. శత్రుప్రధాన సైన్యాన్ని ముందుకు సాగనిచ్చి, వెనుక భాగంలో వస్తున్న బలహీనమైన సేనలపైన కియాంగ్సీలోని హ్సింగ్‌కువో వద్ద ఎర్ర సైన్యం దెబ్బతీసింది. ఇలా నేర్పుతో కూడిన ఎత్తుగడలను అవలంబించుటద్వారా జరగిన మూడు యుద్ధాలలోనూ జయించింది. 30 వేల మందికి పైగా కొమింటాంగ్ సేనలను తుడిచిపెట్టింది. ఎర్రసైన్యం దెబ్బలకు తట్టుకోలేక తక్కిన శత్రుసైన్యం గాభరాగా పారిపోయింది. విప్లవ కేంద్రాలను చుట్టుముట్టాలనే మూడవ ప్రయత్నంకూడ ఈ విధంగా ఓటమితో అంతమయింది.

274

61వ అధ్యాయం

# ఈశాన్య చైనా, షాంఘైలపై జపాన్ దురాక్రమణ

## జపాన్ ఆక్రమణకు వ్యతిరేకంగా చైనా ప్రజల ప్రతిఘటన

జపాన్ సామ్రాజ్యవాదులు ఎంతో కాలంగా చైనా దేశాన్ని తమ వలసగా చేసుకోవాలని కలలుగంటూ వచ్చారు. ఈ దురాశను సాధించుకునే ప్రయత్నంలో ఈశాన్య చైనాపై జపాన్ దాడి ఒక ముఖ్యఘట్టం.

1931 సెప్టెంబరు 18వ తేదీ రాత్రివేళ జపాన్ సైన్యాలు ఆకస్మికంగా షెన్యాంగ్ (ముక్డెన్) వద్ద వున్న చైనా సైన్యాలపై దాడిచేసింది. ముక్డెన్ ఘటన అని పిలువబడుతున్న ఈ దాడితో జపాన్ సామ్రాజ్యవాదులు చైనాపై యుద్ధం ప్రారంభించారు.

షెన్యాంగ్‌పై దాడికి చాల కాలానికి ముందుగానే జపాన్ సామ్రాజ్యవాదుల పన్నాగమేదో తేటతెల్లమయింది. ఐనప్పటికీ చియాంగ్ కై-షేక్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన వున్న విప్లవ కేంద్రాలను తుడిచివేయడంపై దృష్టిని కేంద్రీకరించి వున్నందున, జపాన్ దురాక్రమణను ఎదిరించడానికి ఏ విధమైన ప్రయత్నమూ చేయలేదు.

ముక్డెన్ ఘటనకు కొలది రోజులకు ముందు, కమ్యూనిస్టులకు విజయం రానిచ్చే కంటే చైనాను సామ్రాజ్యవాదులు ఆక్రమించడమే మెరుగని, చియాంగ్ కై-షేక్ బహిరంగంగానే చెప్పాడు. ముక్డెన్ ఘటన తర్వాత కూడ అదేవిధంగా జపాన్ దురాక్రమణను ప్రతిఘటించవలదని, ఈశాన్య చైనాలోవున్న తన సైన్యాలకు ఉత్తరవులిచ్చాడు.

ప్రతిఘటించవలదన్న చియాంగ్ కై-షేక్ పాలసీ ఫలితంగా జపాన్ దురాక్రమణ సేనలు సెప్టెంబరు 19 తేదీన షెన్యాంగ్‌ను ఆక్రమించాయి. తరువాత వరుసగా యెనింగ్, కిరిన్, హీలుంగ్‌కియంగ్ తదితర ప్రాంతాలను ఆక్రమించారు.

1932 ప్రారంభానికి ఈశాన్య చైనాలోని మూడు రాష్ట్రాలు జపాన్ సామ్రాజ్య వాదుల హస్తగత మయ్యాయి.

ముక్డెన్ సంఘటన జరిగినవెంటనే సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా చైనా ప్రజలంతా జాతీయ పోరాటాన్ని సాగించాలని కమ్యూనిస్టుపార్టీ ప్రకటించింది. జపాన్ దురాక్రమణకు వ్యతిరేకంగా ఈశాన్యప్రాంతంలో గెరిల్లా యుద్ధం సాగించాలని విజ్ఞప్తి చేసింది. ఈ ప్రకటన చైనా దేశప్రజలందరి జాతీయవాంఛను వ్యక్తంచేసింది.

1931 అక్టోబరు 10 వ తేదీన దేశమంతటా 1911 విప్లవ 20 వ వార్షికోత్సవాన్ని ప్రజలు బ్రహ్మాండమైన దేశభక్తి ప్రదర్శనలుగా జరిపారు.

ప్రతిఘటన వలదంటూ చియాంగ్ కై-షేక్ అవలంబిచుతున్న అవమానకర పాలసీని అన్ని తరగతుల ప్రజలూ వ్యతిరేకించారు. షాంఘై, పెకింగ్ నగరాల్లోని కార్మికులు "జపాన్ ప్రతిఘటన - చైనా రక్షణ" సంఘాలను ఏర్పరచారు. సాయుధ వాలంటీర్ దళాలను, ప్రచార దళాలను నిర్మించారు. జపాన్ దురాక్రమణకు వ్యతిరేకంగా అన్నిరకాల పోరాటపద్ధతులను అవలంబించారు. దేశం వివిధ ప్రాంతాల నుంచి విద్యార్థులు నాంకింగ్ కు వెళ్ళి, జపాన్ను ప్రతిఘటించాలని, కొమింటాంగ్ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేశారు. పారిశ్రామిక వ్యాపార రంగాలకు చెందినవారు, ఇతర

ఈశాన్య చైనాలో కిమ్ ఇల్ సుంగ్ నాయకత్వాన కొరియా దేశభక్తులుకూడా సాయుధగెరిల్లా దళాలు ఏర్పరచుకున్నారు. చైనా గెరిల్లాలతో భుజంభుజంకలిపి కొరియాగెరిల్లాలు జపాన్ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా పోరాడారు.

1931 నవంబరులో హీలుంగ్‌కియాంగ్‌లోని ట్సిట్సిహార్ వద్ద నున్‌కియాంగ్ నదివంతెనపై జపాన్‌వాళ్ళు దాడిచేశారు వారిని తీవ్రంగా ప్రతిఘటించుతూ మాచాన్ - షాన్ నాయకత్వానవున్న చైనాసైన్య విభాగం పోరాడింది. తీవ్రమైన పోరాటానంతరం మాసేన తిరోగమించవలసి వచ్చినప్పటికీ, నున్‌కియాంగ్ బ్రిడ్జి రక్షణ కొరకు జరిగిన పోరాటంవల్ల ప్రజల్లో ఉత్సాహం ప్రబలింది. ఎంతో కాలం గడువకముందే చైనాసైన్యంలోని దేశభక్తి శక్తులు, స్థానికసాయుధ దళాలుకలసి చాలా వాలంటీరు సైన్యాలు ఏర్పడ్డాయి. వాటిలో మొత్తం 3 లక్షలు దాకా వుండేవారు. కమ్యూనిస్టు పార్టీ, ప్రజలంతా హృదయపూర్వకంగా వాటికి చేయూత నిచ్చేవారు. 1932 లో ఈ వాలంటీరు దళాలు, లియొనింగ్ కిరిన్ రాష్ట్రాల్లోని శత్రు కేంద్రాలపై దాడిచేశాయి. షెన్యాంగ్, చిన్‌చౌ వంటి పెద్దనగరాలపై దాడిచేసి, రైల్వే రవాణాను తెగకొట్టి, శత్రువులు దుర్భేద్యస్థానా లనుకున్న వాటినిగజగజలాడించాయి. కాని కొమింటాంగ్ ప్రభుత్వం సప్లయిలు అందజేయ నిరాకరించినందున, వివిధ ప్రాంతాలమధ్య ఐక్య నిర్మాణం సుస్థిరనాయకత్వం లేనందున ఈశాన్య చైనాలోని వాలంటీరు సైన్య క్రమ [illegible]

జరిగింది. 19 వ రూట్ సైన్యం షాంఘై ఆఫీసునిండా అన్ని తరగతుల ప్రజలు పంపిన బహుమానాలు ప్రోగుపడివున్నాయి.

షాంఘై రక్షణ నిమిత్తం పోరాడుతున్న సైన్యానికి పౌరులకు ఇతర ప్రాంతాల లోని ప్రజలు, విదేశాల్లోని చైనావారు ధన సహాయం పంపారు.

ప్రజల తోడ్పాటువల్ల ఉత్సాహంపొంది 19 వ రూట్ సైన్యం అకుంఠిత దీక్షతో పోరాడింది. సైన్యాధ్యక్షుడైన చియాంగ్ కువాంగ్-నై, ట్సాయి టింగ్-కై సేనాని యుద్ధరంగంలోవుండి స్వయంగా పోరాటాన్ని నడిపించారు. పరిస్థితులు క్లిష్టంగా వున్నాయని గమనించి, జనవరి చివరనుంచి మార్చి నెలారంభానికి జపాన్ తన నావికా భూసైన్యాలలో మూడోవంతును, విమానదళ రిజర్వులనుకూడ సమీకరించింది. షాంఘైలో జపాన్ సైన్యాల సంఖ్యను లక్షకు పెంచింది. సేనానులను నాలుగుసార్లు మార్చింది. రెండోవైపున 19 వ రూట్ సైన్యం 40 వేల బలాన్ని మాత్రమే కలిగివుంది. ఐనప్పటికీ, శత్రువును నిలవరించి, షాంఘై రక్షణను జయప్రదంగా నిర్వహించింది.

షాంఘైలో సైన్యం, ప్రజలు సాధించిన విజయాలను కొమింటాంగ్ ప్రభుత్వం అమ్ముకేసింది. 19 వ రూట్ సైన్యానికి అవసరమైన అదనపు బలాలను ఆయుధ సామగ్రిని అందచేయ నిరాకరించింది. స్థానిక వాలంటీరు దళాలను రద్దుచేసింది. షాంఘై రక్షణకు ప్రజలు అందజేసిన నిధుల్లో కొంతభాగాన్ని కాజేసింది.

మార్చి నెలారంభంలో కొమింటాంగ్ అందజేసిన సమాచారం వినియోగించుకుని, ఊసుంగ్ కు పశ్చిమోత్తరంగా జపాన్ ప్రభుత్వం అదనపు సేనలను జయప్రదంగా దించగలిగింది చుట్టుముట్టబడే ప్రమాదాన్ని గ్రహించి 19 వ రూట్ సైన్యం షాంఘైకు పడమరగా తిరోగమించవలసివచ్చింది. అచటినుంచి ప్రతిఘటన కొనసాగించింది.

మే నెల 5 వ తేదీన కొమింటాంగ్ ప్రభుత్వం జపాన్ సామ్రాజ్యవాదులతో షాంఘై శాంతి ఒడంబడికపై సంతకం చేసింది. దీనిప్రకారం షాంఘైలోనూ, పరిసర ప్రాంతాల్లోను జపాన్ సైన్యాలను వుంచుకోవచ్చు. చైనాకుమాత్రం తన సేనలను నగరంలోవుంచే హక్కు లేకపోవడమేగాక, జపాన్ వ్యతిరేక కార్యకలాపాలన్నిటినీ నిషేధించడానికి చియాంగ్ ప్రభుత్వం అంగీకరించింది. షాంఘై సైన్యం, ప్రజలు రక్తం ధారబోసి సాధించిన విజయాలన్నిటినీ అభివృద్ధి నిరోధక కొమింటాంగ్ ముఠా దారుణంగా అమ్మివేసింది.

1933 ఫిబ్రవరిలో జపాన్ దురాక్రమణశక్తులు జెహాల్ పై దాడి చేశారు. తరువాత ఉత్తర చైనాలోకి చొచ్చుకు పోయారు. పెకింగ్, టీన్ట్సీన్ నగరాలను చుట్టుముట్టారు.

ఆ సమయంలో చైనా గొప్ప గోడ వెంటనూ, పెకింగ్-టీన్ట్సీన్ ప్రాంతాల లోనూ వున్న చైనా సేనలు, దురాక్రమణ సేనలకంటే పది రెట్లున్నాయి. కాని

ప్రజా విప్లవాన్ని అణచివేయడమే లక్ష్యంగా పెట్టుకున్న చియాంగ్ కై-షేక్ ప్రతిఘటనను నిషేధించుతూ చైనా సేనలకు ఉత్తరువులు పంపాడు. మే నెలలో కొమింటాంగ్ ప్రభుత్వం దేశద్రోహకరమైన టాంగ్‌కూ ఒడంబడికపై సంతకం చేసింది. ఈశాన్య చైనాలోని మూడు రాష్ట్రాలను, జెహాల్ రాష్ట్రాన్ని జపాన్ ఆక్రమించడాన్ని గుర్తించింది. తూర్పు హోపేను నిరాయుధీకరణ ప్రాంతంగానూ అచట చైనా సేనలను వుంచరనీ అంగీకరించింది.

కొలది రోజుల తర్వాత జపాన్ సామ్రాజ్యవాదులు చాహార్ రాష్ట్రంలోనికి తమ సైన్యాలతో చొరబడ్డారు.

అంతర్యుద్ధాన్ని ఆపుచేసి, మాతృదేశ సంరక్షణకు అన్ని శక్తులూ కలసి ఐక్య పోరాటం సాగించాలని కమ్యూనిస్టుపార్టీ ఖచ్చితంగా నిలబడింది. జాతీయ సంక్షోభం రోజురోజుకు తీవ్రతరమౌతోందని గుర్తించి, కొమింటాంగ్‌లో దేశభక్తిగలవారు క్రమంగా కమ్యూనిస్టుపార్టీ పాలసీ వైపు మొగ్గసాగారు. చాహార్ రాష్ట్రంలో ఫెంగ్ యూ-హ్సియాంగ్, ఫాంగ్-చెన్-వూ అనే కొమింటాంగ్ సేనానులు చి హుంగ్-చాంగ్ అను కమ్యూనిస్టుతో కలసి, జపాన్ వ్యతిరేక సైన్యాన్ని నిర్మించారు. ఈ సైన్యం త్వరలోనే దురాక్రమణకు గురైన చాహార్ రాష్ట్ర భాగాలను తిరిగి స్వాధీనం చేసుకున్నారు. షాంఘైలో జరిగిన జపాన్ వ్యతిరేక యుద్ధంలో వీరోచితంగా పోరాడిన 19 వ రూట్ సైన్యాన్ని, దేశద్రోహకరమైన ఒడంబడికలో సంతకం చేశాక చియాంగ్ ప్రభుత్వం ఫూకీన్ రాష్ట్రానికి బదిలీచేసింది. అచట 19 రూట్ సైన్య నాయకులు,లీ చీ - షెన్‌ను, కొమింటాంగ్‌లోని తదితర దేశభక్తులను కలుపుకొని, చైనా రిపబ్లిక్ యొక్క విప్లవ ప్రజాప్రభుత్వాన్ని స్థాపించారు. జపాన్ దురాక్రమణను, కొమిం టాంగ్ దేశద్రోహులను ఎదిరించడంలో కార్మిక కర్షక ఎర్ర సైన్యంతో సహకరించాలని నిర్ణయించుకున్నారు.

జపాన్ వ్యతిరేక శక్తుల్లోని రెండు అంతర్భాగాలు - జపాన్ వ్యతిరేక చాహార్ ప్రజాసైన్యం, ఫూకీన్ విప్లవ ప్రజాప్రభుత్వం - కొలది కాలం మాత్రమే మనగలిగాయి. జపాన్ సామ్రాజ్యవాదులతో చేతులుకలపి, చియాంగ్ ప్రభుత్వం వాటిని అణచివేసింది.

# 62 వ అధ్యాయం

# చైనా కార్మిక-కర్షకుల ఎర్రసైన్యం సుదీర్ఘయాత్ర

## విప్లవ కేంద్రాలలో నిర్మాణ కృషి

విప్లవ కేంద్రాల చుట్టూ వలయం పన్నాలని చియాంగ్ కై-షేక్ పంపిన మూడు దండయాత్రలను ఓడించాక, ముఖ్య విప్లవ కేంద్రాన్ని పరిసరాల్లో వున్న కేంద్రాలను బలపరచి విస్తృత పరచారు. వాటిమధ్య సన్నిహిత సంబంధాలను ఏర్పరచుకున్నారు. 1931 నవంబరు 7 వ తేదీన కార్మిక-కర్షకుల ప్రథమ జాతీయ కాంగ్రెసు కియాంగ్సీలోని జుయిచిన్‌లో జరిగింది. ఈ మహాసభ కార్మిక-కర్షకుల ప్రజాస్వామ్య కేంద్ర ప్రభుత్వాన్ని ఏర్పరచింది. కార్యనిర్వాహక కౌన్సిల్ అధ్యక్షుడుగా మావో ట్సే-టుంగ్‌ను ఎన్నుకుంది.

ఆ సమయంలో కొమింటాంగ్ అనుసరించుతున్న ప్రతిఘటన వ్యతిరేక పాలసీ వల్ల జపాన్ దురాక్రమణదారులు స్వేచ్ఛగా ఈశాన్య చైనాను దోచుకుంటున్నారు. కేంద్ర కార్మిక-కర్షక ప్రజాస్వామ్య ప్రభుత్వం సామ్రాజ్యవాదుల దురాక్రమణకు తన వ్యతిరేకతను నిర్దిష్టంగా ప్రకటించింది. కొమింటాంగ్ ప్రతీఘాతకుల దేశద్రోహ చర్యలను ఖండించింది. జాతీయ స్వాతంత్ర్యాన్ని కాపాడుకునేందుకు ప్రజలు సాయుధులు కావాలని పిలుపిచ్చింది. 1932 లో జపాన్ వ్యతిరేక యుద్ధంలో నిమగ్నులైన చైనా సేనలకు, షాంఘై ప్రజలకు కొమింటాంగ్ ద్రోహం చేసినపుడు కేంద్ర కార్మిక-కర్షక ప్రజాస్వామ్య ప్రభుత్వం జపాన్‌పై యుద్ధం ప్రకటించింది. జపాన్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ప్రతిఘటన యుద్ధాన్ని ప్రారంభించింది.

చైనాను ఎదుర్కొన్న తీవ్ర జాతీయ సంక్షోభాన్ని లెక్కచేయకుండా కొమింటాంగ్ ప్రభుత్వం విప్లవ కేంద్రాలపై నాలుగవదాడి ప్రారంభించింది. 1932 జూన్‌లో 5 లక్షల సైన్యాన్ని సమీకరించి, చియాంగ్ కై-షేక్ మొదట హూపే లోని విప్లవ కేంద్రాలపైన, తరువాత ముఖ్య విప్లవ కేంద్రంపైన దాడి చేశాడు.

తొమ్మిది నెలలపాటా యుద్ధం జరిగింది. కొమింటాంగ్ సేనలను ఇహువాంగ్, కియాంగ్సీ వద్ద జరిగిన యుద్ధాలలో ఎర్రసైన్యం తిప్పికొట్టింది. విప్లవ కేంద్రాలను చుట్టుముట్టాలనే శత్రుపన్నాగాన్ని పటాపంచలు చేసింది.

విప్లవ కేంద్రాలను చుట్టుముట్టేందుకు వరుసగా దాడులు చేయడంతోపాటు విప్లవ ప్రాంతాలపై ఆర్థిక దిగ్బంధనం అమలు జరిపేందుకుకూడ కొమింటాంగ్ ప్రభుత్వం ప్రయత్నించింది. తద్వారా కార్మిక, కర్షకుల రాజకీయాధికారం వెంపొందకుండా గొంతు నులమాలని తాపత్రయపడింది.

కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన విప్లవ కేంద్రాల్లోని సైన్యం ప్రజలు ఒక వైపున యుద్ధంచేస్తూనే, రెండో వైపున ఆర్థిక పోరాటం కొనసాగించారు.

ఆర్థికకృషి ప్రధానంగా వ్యవసాయాన్ని అభివృద్ధిచేయడంపై కేంద్రీకరించారు. తద్వారా ప్రజలకు, ఎర్రసైన్యానికి అవసరమైన ఆహారధాన్యాలను, బట్టల తదితర పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలను పండించేందుకు కృషిచేశారు. రైతులను పరస్పరసహాయక గ్రూపులగాను, దుక్కి దళాలను నిర్మించారు. తమ వద్దవున్న దుక్కి-పశువులను, లేదా ఉమ్మడి నిధులతో కొన్నవాటిని వినియోగించుకునేందుకు ఒకరకమైన సహకార వ్యవసాయాన్ని అమలు జరిపారు. పరస్పరసహాయం, సహకారంవల్ల పల్లెప్రాంతాలలో నవీననోత్సాహం కొత్త వాతావరణం వ్యాపించింది. వ్యవసాయోత్పత్తి పెరిగింది.

కార్మిక కర్షక ప్రజాస్వామ్య ప్రభుత్వం పారిశ్రామిక సంస్థలను ప్రభుత్వ యాజమాన్యం క్రింద స్థాపించింది. చేతివృత్తులవారికి సహకార సంఘాలను నిర్మించింది. కాగితపరిశ్రమను, బట్టల పరిశ్రమను, పంచదార పరిశ్రమను, వ్యవసాయ పరికరాల పరిశ్రమను పునరుద్ధరించి అభివృద్ధిచేసింది. వర్తకం కూడ వెంపొందింది. ఆర్థిక దిగ్బంధనం లెక్కచేయకుండా కార్మిక కర్షక ప్రభుత్వం ధాన్యం, ముడిఖనిజాలను ఎగుమతిచేసి, బయటనుంచి ఉప్పు, బట్టలను దిగుమతి చేసుకొనేది.

ఆర్థిక విజయాలవల్ల ఎర్రసైన్యానికి అవసరమైన సప్లయిలు అందించడం సాధ్యమయింది. ఆ ప్రాంతంలో నివసించే ప్రజల జీవన పరిస్థితులుకూడ బాగుపడ్డాయి. పూర్వపు రోజుల్లో ఆకలి, దారిద్ర్యంతో బాధపడే రైతులు ఇపుడు సుఖంగా జీవించగలుగుతున్నారు. ఇందువల్లనే ఎర్ర సైన్యానికి, ప్రజాస్వామిక ప్రభుత్వానికి ప్రజలనుండి బలమైన తోడ్పాటు లభ్యమయింది. ఉదాహరణకు ఫూకీన్ రాష్ట్రం, షాంగ్‌హాంగ్ కౌంటీలోని ట్సాయ్‌హీస పట్టణ యువకులు నూటికి 88 మంది ఎర్రసైన్యంలో చేరడానికి తయారయ్యారు.

ప్రజాస్వామిక ప్రభుత్వా ప్రజలందరికీ ఉచితవిద్యా సౌకర్యాలు కల్గించింది. వివిధ రకాల పాఠశాలలను ఏర్పరచింది. వృద్ధిపొందుతున్న పాఠకులకు వివిధరకాల వార్తా పత్రికలు స్థాపించబడ్డాయి. సైనిక సంస్థల్లోనూ, గ్రామాల్లోనూ కళా ప్రదర్శనలు, ఆటపాటల కార్యక్రమాలు నిత్యజీవితంలో ఒక భాగమయ్యాయి. సైనికడ్యూటీ నుంచి సెలవుమీద వచ్చినవారు, వ్యవసాయపని లేని విరామకాలంలో రైతులు

స్థానిక నాట్యసంఘాలకు, తాలింఖానాలకు విరివిగా వచ్చేవారు. కార్మిక-కర్షక ప్రజాస్వామ్య ప్రభుత్వకేంద్రం గోర్కీ నాట్య పాఠశాలను నడిపింది. దీనిలో తరిఫీదు పొందిన నటులు, కళాకారులు వేయిమందికి పైగా వుండేవారు. యుద్ధ రంగాల్లోనూ, సంతలు, మార్కెట్ల సమీపంలోనూ, గ్రామాల్లోనూ ప్రదర్శనాలిస్తూ పర్యటించేవారు. సృజనాత్మక కళకు అవసరమైన ఇతివృత్తాలను ప్రజా జీవితాన్నుంచి సేకరించుకునేవారు. తద్వారా నూతన సంస్కృతీ వుద్యమానికి సైనికులతోనూ, రైతులతోనూ సన్నిహితసంబంధం ఏర్పడింది. మే 4 వ తేదీ వుద్యమం అనంతరం విప్లవ సాహిత్యం అభివృద్ధి చెందడానికి ఇదెంతో దోహదం చేసింది.

విప్లవ కేంద్రాన్ని చుట్టుముట్టే దృష్టితో జరిగిన నాలుగు దాడులు విఫల మయ్యాక, కొమింటాంగ్ ప్రతీఘాతకులు ఐదవ దండయాత్రకు మరల సన్నాహాలు చేయసాగారు. యుద్ధ ఖర్చుల నిమిత్తం ప్రజలపై భారం ఎక్కువచేసి, దోపిడీని తీవ్రతరం చేశారు. అమెరికా, జపాన్ సామ్రాజ్యవాదులనుండి పెద్ద మొత్తాలను రుణంగా తీసికొన్నారు. చియాంగ్ కై-షేక్ తన చుట్టూ జర్మన్, అమెరికన్, జపాన్, ఫ్రెంచి మిలిటరీ సలహాదార్లను పోగుచేసుకున్నాడు.

1933 అక్టోబరులో 10 లక్షల సైన్యంతో ఐదవ దండయాత్రను చియాంగ్ ప్రారంభించాడు. అంతకుముందు దాడులన్నింటికంటే ఉధృతంగా సాగించిన ఈ దండయాత్రలో కొమింటాంగ్ సైన్యం, విప్లవ కేంద్రాల చుట్టూ దుర్గాలను (బ్లాంక్ హౌసులను) నిర్మించింది. తద్వారా క్రమంగా వలయాన్ని బిగించుకుంటూ వచ్చింది. ఇలాంటి క్లిష్టసమయంలో అపుడు కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో వున్న ముఖ్యులు కేవలం దెబ్బకాచుకునే రక్షణవిధానాన్ని, తప్పుడు పోరాట ఎత్తుగడలను అవలంబించారు. మావో త్సే-టుంగ్ రూపొందించిన గెరిల్లా యుద్ధ సూత్రాలను - శత్రువును బాగా లోపలికి రానివ్వడం, తరువాత ఎక్కువ బలాన్ని సేకరించి శత్రు బలహీన కేంద్రంపై దెబ్బతియ్యడం, శత్రుబలగాలను ఒక్కొక్కదాన్నే తుడిచి వేయడం—విరుద్ధంగా వ్యవహరించారు. తప్పుడు మిలిటరీ విధానం అనుసరించడంవల్ల విప్లవ ప్రభుత్వాధీనంలోవున్న ప్రాంతాలు క్రమంగా కుంచుకుపోవడం జరిగింది. ఒక సంవత్సరకాలం జరిగిన యుద్ధంలో ఎర్ర సైన్యం చాలా నష్టపడింది.

## దీర్ఘ యాత్ర (The long March)

మిగిలిన బలాన్ని రక్షించుకునేందుకు, జపాన్ దురాక్రమణను ప్రతిఘటించి జాతీయ స్వాతంత్ర్య రక్షణ కర్తవ్యాన్ని నిర్వహించేందుకు, చైనా కార్మిక-కర్షక ఎర్రసైన్యం దీర్ఘయాత్రను ప్రారంభించి, చరిత్రలో కనివిని యెరుగని వీరత్వాన్ని ప్రదర్శించింది.

1934 అక్టోబరులో ప్రధాన విప్లవ కేంద్రంలోవున్న ఎర్రసైన్య ప్రధాన భాగం శత్రువలయాన్ని జుయిచిన్‌వద్ద బద్దలుచేసి, వెనుక కొన్ని గెరిల్లా దళాలను మాత్రం వదలి, ముందుకు సాగిపోయింది. తరలిపోతున్న ఎర్రసైన్యాన్ని దారిలో

దెబ్బకొట్టేందుకు చియాంగ్ కై-షేక్ నాలుగు బలమైన సైన్యాలను ప్రయోగించాడు. ఈ ఆటంకాలను పటాపంచలు చేస్తూ ఎర్రసైన్యం కియాంగ్సి, ఫూకీన్ రాష్ట్రాలనుంచి క్వాంగ్‌టుంగ్, హునాన్, క్వాంగ్సీ రాష్ట్రాలగుండా పర్వత ప్రాంతాలకు వెళ్లింది. అచట నివసించే మియావో యావో జాతుల ప్రజల మైత్రిని సంపాదించి క్వీచౌలోని వూచియాంగ్ నదిని చేరుకుంది వడిగా పరుగులిడుతున్న ఈ నదీ ప్రవాహం అంచున వున్న పర్వతాలపైనుంచి ప్రతిఘాతుక సేనలు కాపలావున్నాయి. కాని తెల్లవారు ఝామున బాగా చలివేస్తున్న సమయంలో ఎర్రసైన్యం నదిని దాటివెళ్ళి, ట్సున్ యీని ఆక్రమించింది.

1935 జనవరిలో చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశం ట్సున్‌యీలో జరిగింది. అంతకు ముందు తప్పుడు ఎత్తుగడలను అవలంబించిన కేంద్ర కమిటీ నాయకత్వాన్ని తొలగించి, ఈ సమావేశం మావో త్సే - టుంగ్ ఆధిపత్యం క్రింద కొత్తకేంద్ర నాయకత్వాన్ని ఎన్నుకుంది. ఈ కొత్త నాయకత్వమే చైనా విప్లవాన్ని జయప్రదంగా నిర్వహించగలిగింది.

ట్సున్‌యీ సమావేశానంతరం ఎర్రసైన్యం ఉత్తర దిశగా తన యాత్రను సాగించింది. అనేక లక్షల బలగంకలిగిన శత్రుసైన్యాలకు దూరంగా వుండటానికి ఎర్రసైన్యం చిన్‌షానదినిదాటి యున్నాన్ రాష్ట్రం నుంచి సికాంగ్ రాష్ట్రానికి చేరింది.

సికాంగ్ రాష్ట్రం ఆగ్నేయ ప్రాంతంలో నుంచి ఎర్రసైన్యం పర్వతాల మధ్య సుళ్ళు తిరుగుతూ ప్రవహించుతున్న టాటునదిని చేరుకుంది. కొమింటాంగ్ దళాలు కొన్ని టాటునది వెంట ఎర్రసైన్యం కొరకు కాపలా కాస్తున్నాయి. నదిని సమీపించేలోపల ఎర్రసైన్యాన్ని తుడిచివేయగలమనే ధీమాతో వెనుకనుంచి ప్రతీఘాతకులు పెద్ద సైన్యాలతో తరుముకు వస్తున్నారు. టాటునది ఒడ్డునవున్న చిన్న పట్టణం అన్‌షున్‌చాంగ్ వద్ద నదిలోవున్న ఒకేఒక ప్రయాణీకుల పడవను ఎర్ర సైన్యం స్వాధీనం చేసుకుంది. శత్రుకాల్పులను లెక్కచేయకుండా ఎర్రసైన్యదళ మొకటి నదిని దాటింది. ఆకలి, అలసటా లెక్కచేయకుండా మరోదళం మెలికలు తిరిగే సన్నని కొండదారివెంట ఆ శిఖరంపైకివెళ్ళి, ఇనుపగొలుసులతో నిర్మించిన లూటింగ్ బ్రిడ్జి మొగకు చేరుకున్నారు. ఎర్రసైన్యాన్ని అపుజేసేందుకు వంతెన మొగలోవున్న బ్లాక్‌హౌస్‌కు (దుర్గానికి) శత్రువులు నిప్పంటించారు. కాని ఎర్ర సైన్యం వీరులు మంటలగుండావెళ్ళి వంతెన మొగను స్వాధీనం చేసుకున్నారు. యాత్రలో ఎర్రసైన్యం సాధించిన అత్యంత వీరోచిత కార్యాలలో యిదొకటి. పారిపోతున్న శత్రు సైన్యాలను తరుముతూ ఎర్రసైన్యం మావుత్సే-టుంగ్ నాయకత్వాన టాటునదిని దాటి, ఉత్తరదిశగా సాగిపోయింది.

తరువాత ప్రకృతి సిద్ధమైన మరో ఆటంకం, జేచివాన్-సికాంగ్ సరిహద్దున వున్న పెద్ద మంచు పర్వతాలు, ఎర్రసైన్యాన్ని ఎదుర్కొన్నాయి. మంచుతో కప్ప



ట్సున్సీసమావేశస్థలం

బడిన ఈ పర్వత శిఖరాలపై గాలి చాల పలచగా వున్నందున వూపిరిసలుపడమే కష్టం. ఐనప్పటికీ ఎర్రసైన్యం ఈ పర్వతాలను అధిరోహించింది. రెండో వైపున విశాలమైన పచ్చిక బైళ్ళను, వూబి నేలలను ఎర్రసైన్యం ఎదుర్కోవలసి వచ్చింది. ఈ పసిరిక భూములలో చాల పలచగా మాత్రమే ప్రజలు నివసించుతున్నారు. ప్రతిచోటా బురదా, మధ్యమధ్య వూబి ప్రాంతాలు వున్నాయి: వర్షపు తుపాన్లు వడగళ్ల వానలు తరచుగా కురుస్తుంటాయి. సన్నని దారిని వెదుతూ, కాస్త పక్కకు అడుగిడితేచాలు, ప్రమాదకరమైన వూబిలో దిగబడిపోతారు. సామానుమోయడానికి యాక్ (కొండలపై వుండే ఎద్దు)లను ఎర్రసైన్యం వినియోగించింది. ఆహారం దొరకనపుడు అడవి ఆకులను, యాక్ మాంసాన్ని తినవలసివచ్చింది. ఈ కష్టాలన్నిటినీ అధిగమించి, చాల నష్టాలుపడి, తమ గమ్యాన్ని చేరాలనే అకుంఠిత దీక్షతో ఎర్రసైన్య వీరులు విశాలమైన పసిరిక భూములను దాటి వెళ్ళగలిగారు. మంచు పర్వతాలను, పసిరిక మైదానాలను దాటడంలో అచట నివసించుతున్న టిబెటన్ ప్రజలు ఎర్రసైన్యానికి సహాయపడ్డారు.

1935 అక్టోబరు నెలలో చివరకు ఎర్రసైన్యం ఉత్తర షెన్సీకి చేరుకుంది. అచట లియూ చిహ్-టాన్ నాయకత్వంక్రింద విప్లవ కేంద్రాన్ని నిర్మించిన దళంతో కలసింది. చైనా కార్మిక కర్షకుల ఎర్రసైన్యం ఈ విధంగా ఒక సంవత్సర కాలంలో ఎన్నో యుద్ధాలు చేసి, చాల నష్టాలు పడి, విపరీత కష్టాలను ప్రమాదాలను అధిగమించి, కని విని యెరుగని వీరత్వంతో 25 వేల లీల దీర్ఘయాత్రను ఎర్రసైన్యం జయప్రదంగా పూర్తి చేసింది.

జెన్ పి-షిహ్, హో లుంగ్ హ్స్యా, హ్సియాంగ్-చీన్ నాయకత్వంక్రింద ఎర్రసైన్యం, ఇతర దళాలుకూడ యాంగ్‌ట్సీ నదికి ఉత్తర-దక్షిణ ప్రాంతాలనుంచి బయలుదేరి, దీర్ఘప్రయాణంలో అనేక చిక్కులను అధిగమించి ఉత్తర షెన్సీకి చేరుకున్నాయి.

చైనా కార్మికుల, కర్షకుల ఎర్రసైన్యం జయప్రదంగా నిర్వహించిన సుదీర్ఘ యాత్ర ప్రపంచానికంతటికీ చైనా కమ్యూనిస్టుపార్టీ, ఎర్రసైన్యం అజేయమని చాటింది. ఎర్రసైన్యం తరలివెళ్ళిన దారిపొడుగునా నివసించుతున్న 20 కోట్ల ప్రజలకు విమోచనకు మార్గమేదో నిరూపించింది. పదకొండు రాష్ట్రాలలో విప్లవ బీజాలను నాటింది. ఫూకీన్, కియాంగ్సీ, క్వాంగ్‌టుంగ్, హునాన్, క్వాంగ్సీ, క్వీచౌ, జిచువాన్, యున్నాన్, సియాంగ్, కంసూ, షెన్సీ రాష్ట్రాల ప్రజలకు విప్లవ సందేశం అందించింది. సుదీర్ఘ యాత్రను జయప్రదంగా నిర్వహించడం ఫలితంగా చైనా విప్లవం దాన్నెదుర్కొన్న సంక్షోభాన్ని అధిగమించింది. నూతన దశకు అభివృద్ధి చెందింది.

63 వ అధ్యాయం

# జపాన్ ప్రతిఘటన, జాతి రక్షణకొరకు ప్రజా ఉద్యమం

## నాలుగు పెద్ద కుటుంబాలు

అధికారం హస్తగతం చేసుకున్నాక కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులు ఒక వైపున ప్రజలను నిర్దాక్షిణ్యంగా దోచుకోవడం, రెండో వైపున సామ్రాజ్యవాదులకు జాతీయ ప్రయోజనాలను అమ్మివేయడం ప్రారంభించారు. తద్వారా వారు వ్యక్తిగతంగా విపరీతధనాన్ని పోగుచేసుకున్నారు. అంతర్యుద్ధాన్ని సాగించేందుకు నిధులను సమకూర్చారు. చియాంగ్ కై-షేక్, టి. వి. సూంగ్, హెచ్ హెచ్ కుంగ్, చెన్ సోదరులు (చెన్ కో-ఫూ, చెన్ లీ-ఫూ) ఈ నాలుగు పెద్ద కుటుంబాలు అవినీతి, దేశద్రోహం ద్వారా క్రమ క్రమంగా ప్రజలముందు పూర్తిగా అపఖ్యాతి పాలయ్యాయి. ఈ నాలుగు పెద్ద కుటుంబాలు దేశ ఆర్థిక విధానానికి కీలకమైన నాలుగు ప్రభుత్వ బ్యాంకులను-చైనా సెంట్రల్ బ్యాంకు, చైనా బ్యాంకు, చైనా రవాణాబ్యాంకు చైనారైతుల బ్యాంకు-తమ పిడికిళ్లో వుంచుకున్నారు. దేశంలో వున్న బ్యాంకింగ్ సంస్థలన్నిటినీ ఈ నాలుగు బ్యాంకులే కంట్రోలు చేసేవి. కొమింటాంగ్ ప్రభుత్వ కోశాగారమంతా వీటి అధీనంలోనే వుండేది. ప్రభుత్వ ద్రవ్య విధానాన్ని యివే కంట్రోలు చేసేవి. 1927 తరువాత తొమ్మిది సంవత్సరాల్లోనూ అంతకుముందు ఉత్తర సైనిక ప్రభువుల ప్రభుత్వం 15 సంవత్సరాల్లో జారీ చేసిన బాండులకంటే, 1927 తరువాత తొమ్మిదేళ్ళలోనూ కొమింటాంగ్ ప్రభుత్వం నాలుగురెట్లు బాండులను జారీ చేసింది. 1935 లో కొమింటాంగ్ ప్రభుత్వం "ద్రవ్య సంస్కరణ"ను ప్రవేశపెట్టింది. దీని ప్రకారం చైనా సెంట్రల్ బ్యాంక్, బ్యాంక్ ఆఫ్ చైనా, రవాణా బ్యాంకు జారీచేసే నోట్లు దేశమంతటా చట్టబద్ధమైన ద్రవ్యంగా చెలామణీ కావాలని ప్రభుత్వం ఉత్తరువు జారీచేసింది; దేశంలో చెలామణిలో వున్న వెండి నాణాలన్నిటినీ ఉపసంహరించుకుంది. తద్వారా దేశంలోని వెండి లోహమంతా ఈ బ్యాంకుల హస్తగత

దేశంలోని దూది, బియ్యం, తదితర జీవితావసర వస్తువుల వ్యాపారమంతటి పైన ఈ నాలుగు కుటుంబాలు గుత్తాధికారం సంపాదించాయి. సామ్రాజ్యవాదుల సహకారంతో ఉక్కు ఉత్పత్తి, ఇంజనీరింగ్ తదితర పరిశ్రమలపై పూర్తికంట్రోలును హస్తగతం చేసుకున్నాయి. జాతీయ పెట్టుబడిదారుల పరిశ్రమలు మనగలగడమే కష్టసాధ్యమయింది. చాలా జాతీయపరిశ్రమలు దివాళాతీసాయి. పల్లెప్రాంతాలలో నాలుగు పెద్దకుటుంబాలు విశాలమైన భూములను హక్కుభుక్తం చేసుకున్నాయి. రైతులనుండి భారమైన పన్నులను బలవంతాన వసూలు చేసేవారు. వెట్టిచాకిరీ చేయించుకునేవారు. వ్యవసాయ పంటలను అతిచౌక ధరలకు కాజేసేవారు. అధిక వడ్డీలకు ఋణాలిచ్చేవారు. వీటన్నిటివల్లా రైతులకు జీవితం గడవడమే కష్టసాధ్యమయ్యేది.

నాలుగు పెద్ద కుటుంబాలతో ఒడంబడికలు చేసుకుని, సామ్రాజ్యవాదులు చైనాలో ఆర్థిక దురాక్రమణను మరింత విస్తృతంగా సాగించారు. 1933 నాటికి చైనా బొగ్గు ఉత్పత్తిలో నూటికి 76 వంతులు, దాదాపు ఇనుము పరిశ్రమంతా సామ్రాజ్యవాదుల అధీనమయింది. 1936 నాటికి నౌకలు, విద్యుచ్ఛక్తి, బట్టల పరిశ్రమల్లో ప్రబల స్థానాన్ని సామ్రాజ్యవాదులు సంపాదించారు. చైనాలోని సామ్రాజ్యవాదుల బ్యాంకులకు చాలా ప్రాబల్యముండేది. నాలుగు పెద్ద కుటుంబాలు తమ అస్తిత్వానికి సామ్రాజ్యవాదుల మద్దతుపై ఆధారపడుతూ, సామ్రాజ్యవాదుల తాబేదార్లుగా వ్యవహరించాయి.

కొమింటాంగ్ పరిపాలన అంటే వాస్తవంలో నాలుగు పెద్ద కుటుంబాల పరిపాలనే. అది సామ్రాజ్యవాదులతో లాలూచిపడిన ఫ్యూడల్ నియంతృత్వాధికారం. వారి పాలనవల్ల అర్థ వలస, అర్థ ఫ్యూడల్ చైనా మరింత అధోగతి పాలయింది. దేశాన్ని నిరంతర అంతర్యుద్ధంలో ముంచివేసింది. నాలుగు పెద్ద కుటుంబాల పరిపాలనలో తాము కరువు బాధలనుండి, నిరంతర ఫ్యూడల్ వలస బానిసత్వాన్నుంచి బయటపడాలంటేనూ, సర్వ నాశనాన్నుండి జాతిని రక్షించుకోవాలంటేనూ, శ్రామికజనానికి విప్లవంలో పునృతంగా పాల్గొనడంకంటే మరో గత్యంతరం లేనేలేదు. జాతీయ పరిశ్రమలకు తీవ్రమైన దెబ్బలు తగలడంవల్ల జాతీయ పెట్టుబడిదారీవర్గం భ్రమలనుండి బయటపడుతున్నారు. అంతర్యుద్ధాన్ని ఆపుజేయాలనీ, రాజకీయ సంస్కరణలను ప్రవేశపెట్టాలని వారుకూడ కోరుతున్నారు.

## ఈశాన్య చైనాలో జపాన్ సామ్రాజ్యవాదుల వలసపాలన

చైనాలో ఎక్కువభాగం నాలుగు పెద్ద కుటుంబాల పాలనక్రింద క్రమక్రమంగా మరింత ఎక్కువ వలస దోపిడికి గురౌతూవుంటే, ఈశాన్య చైనా అప్పటికే పూర్తిగా జపాన్ సామ్రాజ్యవాదుల వలసగా తయారయింది.

జపానువాళ్ళు ముక్డెన్ ఘటన అనంతరం మంచుకో కీలుబొమ్మ ప్రభుత్వాన్ని ఏర్పరచి, సర్వాధికారాలు వాస్తవంలో తమ చేతుల్లోనే వుంచుకున్నారు. చైనా

కార్మికులను నిర్దాక్షిణ్యంగా బానిసలుగాచేసి బలవంతాన ఆ ప్రాంతంలోని ఖనిజ సంపదను తవ్వించుకున్నారు. జపాన్ పరిశ్రమల కవసరమైన ముడిపదార్థాలను దోచుకుపోయారు. సైన్యంలోనుంచి విడుదలయిన జపాన్ సైనికులు ఈశాన్య చైనాకు వలసవచ్చి, చైనా రైతుల భూమిని, ఇళ్ళను కాజేశారు. పదునాల్గు యేళ్ళ నుంచి నలుబది సంవత్సరాల్లోపు వున్న మగవాళ్ళంతా మంచూ కీలుబొమ్మ సైన్యంలో చేరి తీరాలని జపాన్‌వాళ్ళు శాసించారు. చైనావారు లందరినీ పావో-చియా (Tithing ) విధానం క్రింద పడేసి కుటుంబాలను గ్రూపులుగా నిర్మించారు. ఒక్క గ్రూపులో ఎవరైనా నేరం చేస్తేగాని, దురాక్రమణదారుల శాసనాలను ఉల్లంఘించితేగాని ఆ గ్రూపులోని పది కుటుంబాలను శిక్షించే పద్ధతిని అమలు జరిపారు. పాఠశాల లన్నిటిలోను బానిస విద్యాబోధన సాగించారు. ఒకచోట ప్రజాపోరాటం జరిగిందంటే ఆ ప్రాంత మంతటినీ దోచుకోవడం, తగలబెట్టడం, చిత్రవధలు సాగించడం జపాన్‌వాళ్ళ సమాధానంగా వుండేది. హింసించబడిన చైనా ప్రజల నెత్తురు కన్నీరుతో ఈశాన్య చైనా యావత్తూ తడిసిపోయింది.

1935 లో ఈశాన్య చైనాలోని గెరిల్లా దళాలన్నీ కలసి, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన జపాన్ వ్యతిరేక ఐక్యసైన్యంగా నిర్మించబడింది. యాంగ్ చింగ్-యు, చావ్ షాంగ్ - చీ, చౌ పావ్ - చుంగ్ అనే సేనానులు దీనికి ఆధిపత్యవహించి నడిపారు. కిమ్ ఇల్ సుంగ్ నాయకత్వానవున్న కొరియన్ గెరిల్లా దళాలు కూడ జపాన్ వ్యతిరేక ఐక్యసైన్యంతో కలిసాయి.

ఈశాన్య చైనాలో జపాన్ వ్యతిరేక ఐక్యసేనలను విస్తృతంగా గెరిల్లా యుద్ధాలు చేశాయి. ఎర్రసైన్యం అనుభవపూర్వకంగా రూపొందించిన ఎత్తుగడలను చాకచక్యంగా వినియోగించి రైల్వేలపై దృష్టిని కేంద్రీకరించింది. స్టేషన్లపై దాడి చేయుడం, రైలుమార్గాన్ని ధ్వంసం చేయడం, దురాక్రమణ సైన్యాల రవాణా సౌకర్యాలను స్తంభింపజేసింది. ఈశాన్య చైనా ప్రజలు హృదయపూర్వకంగా జపాన్ వ్యతిరేక సైన్యాలకు తోడ్పడ్డారు. జపాన్ బానిసత్వంనుంచి తాము విముక్తి పొందడం జపాన్ వ్యతిరేక సేనల పోరాటంపైనే ఆధారపడివుందని వారు గ్రహించారు.

1937 సంవత్సరం నాటికి ఈ సైన్యం 45 వేలకు పెరిగింది.

దీనిని అణచివేయుడానికి జపాన్ సామ్రాజ్యవాదులు పెద్ద సైన్యాలను పంపారు. 1938 లో 7 లక్షల జపాన్ సైన్యాలను, మంచూ కీలుబొమ్మ ప్రభుత్వ సేనలు 3 లక్షలను వినియోగించి, గెరిల్లా పోరాటాన్ని తుడిచివేయాలని ప్రయత్నించారు. దురాక్రమణ దారుల అత్యధిక సంఖ్యాబలంవల్ల జపాన్ వ్యతిరేక ఐక్య సైన్యం వీరోచితంగా పోరాడినప్పటికి తీవ్ర నష్టాలు పొందింది. ఈవిధంగా బలహీన పడినందున పర్వత ప్రాంతాల్లోకి, అడవుల్లోకి తిరోగమించింది. అచటనుండి చాటు దెబ్బలు కొడుతూ జపానువాళ్ళను చీకాకుపరుస్తూవుంది. సోవియట్ ఎర్రసైన్యం 1945 లో

జపాన్ సేనలను ధ్వంసంచేసి, ఈ ప్రాంతాన్ని విముక్తిచేసేవరకు పోరాటం కొన సాగించింది.

## డిసెంబరు 9 ఉద్యమం

టాంగ్కూ ఒడంబడిక అనంతరం రెండు సంవత్సరాలకు 1935 జూన్‌లో జపాన్ సామ్రాజ్యవాదుల ఒత్తిడికి కొమింటాంగ్ ప్రభుత్వం తలవొంచింది. వరుసగా రెండు రహస్య ఒడంబడికలపై సంతకం చేసింది. వీటిప్రకారం హోపీ రాష్ట్రంనుంచి, చాహార్‌లో ఎక్కువ భాగాన్నుంచి చైనా సేనలను ఉపసంహరించు కోడానికి, జపాన్ వ్యతిరేక ప్రజా సంస్థలను నిషేధించడానికి కొమింటాంగ్ ప్రభుత్వం అంగీకరించింది. చైనా-జపాన్ మైత్రిని పెంపొందించాలనీ, జపాన్ సామ్రాజ్యవాదులను ఇరుగుపొరుగున వున్న మిత్రులుగా చైనా ప్రజలు ఎంచాలనీ ఉత్తరువు జారీచేసింది. జపాన్ వ్యతిరేక ఉపన్యాసాలను, చర్యలను నిషేధించింది.

కొమింగ్‌టాంగ్ అణకువ ధోరణివల్ల ఉత్సాహంపొంది, జపాన్ సామ్రాజ్య వాదులు ఉత్తర చైనాపై దురాక్రమణ కొనసాగించారు. జాతీయ విద్రోహులను ప్రోత్సహించి, ఉత్తర చైనాలోని ఐదు రాష్ట్రాలకు "స్వపరిపాలన" కొరకు ఉద్యమాన్ని ప్రారంభింపచేసింది. హోపే, షాంటుంగ్, షాన్సీ, చాహార్, సుయివాన్ రాష్ట్రాలను "స్వపరిపాలన" ముసుగుతో జపాన్ వలసగా చేసుకోవాలని కుట్రపన్నింది. దీని ఫలితంగా తూర్పుహోపే, కమ్యూనిస్టు వ్యతిరేక ప్రభుత్వం - జపాన్ తాబేదారీ ప్రభుత్వం - పెకింగ్ సమీపంలోవున్న టుంగ్‌హ్సిన్ కౌంటీవద్ద స్థాపించబడింది. పెకింగ్, టీన్‌ట్సీన్ నగరాలలో ఈజాతి విద్రోహులు ప్రదర్శనాలు చేసి, తమ దురహంకారాన్ని నిరూపించుకున్నారు. జపాన్ విమానాలు రెండు నగరాలపై ఎగురుతూవుంటే, రైలు స్టేషన్లపైన టీన్‌ట్సీన్ రేవుపైన జపాన్ జెండాలు ఎగురవేసి, శత్రుసేనలను మోసుకువస్తున్న ట్రెయిన్లను, సరుకుల ఓడలను ఆహ్వా నించారు. ద్రోహులతోడ్పాటుతో జపాన్ పోలీసులు చైనా దేశభక్తులందరినీ అరెస్టుచేశారు.

1935 ఆగస్టు 1వ తేదీన చైనా కమ్యూనిస్టుపార్టీ "జపాన్ దురాక్రమణను ప్రతిఘటించాలనీ, జాతీయ విమోచనం సాధించాలనీ" దేశప్రజలందరికీ విజ్ఞప్తి చేసింది. జపాన్ వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనను నిర్మించాలని స్పష్టపరచింది. అన్ని రాజ కీయ పార్టీలు, ప్రజాసంస్థలు, ప్రభుత్వ శాఖలు వ్యక్తులు కలసి, జపాన్‌తో పోరా డేందుకు జాతీయ రక్షణ ప్రభుత్వాన్ని ఏర్పరచాలని పిలుపు యిచ్చింది. జపాన్ దురాక్రమణను ప్రతిఘటించడానికి సిద్ధంగావున్న సైనిక దళాలన్నీ ఏకమై, జపాన్ వ్యతిరేక ఐక్య సైన్యాన్ని నిర్మించాలని విజ్ఞప్తి చేసింది. జపాన్ ప్రతిఘటన జాతీయ రక్షణ వుద్యమాన్ని దేశ ప్రజలంతా కలసి నిర్మించాలనీ, ఈ పవిత్ర ధర్మాన్ని నెర వేర్చడంలో తమ సర్వస్వం ధారబోయాలనీ ఎలుగెత్తి చాటింది.

పార్టీ విజ్ఞప్తి, దానితోపాటు సుదీర్ఘయాత్రను ఎర్రసైన్యం జయప్రదంగా నిర్వహించిందన్న వార్త ప్రజలకు ధైర్యాన్నిచ్చింది. కమ్యూనిస్టుపార్టీ ప్రత్యక్ష నాయకత్వాన పెకింగ్ విద్యార్థులు మొట్టమొదట కార్యరంగంలోకి ఉరికారు.

డిసెంబరు 9 వ తేదీన ఎముకలు కొరికే చలిని లెక్కచేయకుండా పెకింగ్ కళాశాలలు విశ్వవిద్యాలయాల్లోని విద్యార్థులు, ఉన్నత పాఠశాలల విద్యార్థులు అన్ని వైపులనుంచి పోగయ్యారు. యువక గాయకుడు నీహ్ ఎరహ్ రచియించిన వాలంటీర్ల తరలింపు గేయం పాడుతూ ముందుకు సాగారు :

లేవండోయ్! బానిసత్వాన్ని
నిరసించే వారంతా లేవండోయ్!
మన రక్తమాంసాలతో మరొక
మహత్తర గోడను నిర్మిద్దాం!

ఈ పాటతో పాటు "జపాన్ సామ్రాజ్యవాదులు నశించాలి!", "ఉత్తర చైనా సాయుధరక్షణకు పూనుకోండి" అనే నినాదాలు దిక్కులు పిక్కటిల్లే విధంగా ప్రతిధ్వనించాయి. కొమింటాంగ్ ప్రభుత్వానికి విజ్ఞాపనపత్రాన్ని అంద జేయాలని విద్యార్థులు ప్రయత్నించారు. కాని ప్రభుత్వం తృణీకరించినందున కోపంతో విద్యార్థులు ప్రదర్శనలు జరిపారు.

నగర పరిసరాల్లో చదువుతున్న విద్యార్థులను నగరంలోకి రాకుండా అరి కట్టేందుకు కొమింటాంగ్ నగరద్వారాలను మూసివేసింది. నగరంలోపల ప్రతీఘాత కుల సైన్యాలు, పోలీసు కత్తులతోనూ, నీటి గొట్టాలతోనూ విద్యార్థి ప్రదర్శకులపైన దాడిచేశారు. నీళ్ళు, రక్తం మిళితమై చలికి భూమిపై పేరుకుపోయింది.

మరుసటి రోజున అన్ని పాఠశాలల విద్యార్థులు సర్వవ్యాపిత సమ్మెకు పిలుపు యిచ్చారు.

ఇంకా గొప్పపోరాటాలను నడిపేందుకు పరిస్థితులు అప్పటికే పక్వమై వున్నాయి. డిశంబరు 16 వ తేదీన పెకింగ్ విద్యార్థులు, పౌరులూ కలసి నగర దక్షిణ ప్రాంతంలో వున్న "స్వర్గంయొక్క వంతెన" వద్ద 10 వేల మంది బహిరంగసభ జరిపారు. చైనా ప్రజలు చివరిబొట్టువరకు తమ రక్తం ధారబోసి జపాన్ సామ్రాజ్య వాదులను ఎదిరించుతారని తీర్మానించారు. సభానంతరం గొప్ప వూరేగింపు జరిగింది. వూరేగింపులోవున్న విద్యార్థులపై కొమింటాంగ్ సైన్యాలు, పోలీసులు ఆయుధాలతో విరుచుకుపడ్డారు. ఎంతోమంది గాయపడినా, రక్తం ప్రవహించినా రాత్రి చాలా పొద్దుపోయే వరకు పోరాటాన్ని విద్యార్థులు కొనసాగించారు.

పెకింగ్ విద్యార్థుల వీరోచిత పోరాట ప్రభావం దేశమంతటా వ్యాపించింది. ఊహాన్, కాంటన్, నాంకింగ్, షాంఘై, సియాన్, చెంగ్టూ వగైరా చాలా నగరాల్లో విద్యార్థులు సభలు జరిపారు. క్లాసులకు వెళ్ళడం మానివేసి, వీధుల్లో ప్రదర్శనలు చేశారు. దురాక్రమణ దారులను ప్రతిఘటించితీరాలని అన్ని తరగతుల

ప్రజలు కోరారు. డిశెంబరు 9 వుద్యమం జపాన్ దురాక్రమణ వ్యతిరేక ప్రతిఘటన, జాతీయ స్వాతంత్ర్యంకోరకు దేశమంతటా వ్యాపించిన ప్రజావెల్లువకు చిహ్నం అయింది.

1936 ప్రారంభంలో పెకింగ్, టీన్‌ట్సీన్ విద్యార్థులు మూడువేలమందితో ప్రచారకదళాలను నిర్మించారు. అవి పెకింగ్-హాంకౌ రైల్వేవెంట దక్షిణానికి ప్రయాణంచేసి, రైతుల్లోనూ, నగరవాసుల్లోనూ, రైల్వే కార్మికుల్లోనూ జపాన్‌ను ప్రతిఘటించి చైనా స్వాతంత్ర్యాన్ని రక్షించాలనే భావాలను ప్రచారం చేశారు. ఈ ప్రచారాన్ని భగ్నంచేయాలని కొమింటాంగ్ శాయశక్తులా ప్రయత్నించింది. ఈ విద్యార్థులు పెకింగ్, టీన్‌ట్సీన్ నగరాలకు తిరిగివచ్చాక, చైనా జాతీయ విమోచనకు అగ్రగాములు అనే సంస్థను నిర్మించారు. దేశమంతటా యువక దేశభక్తుల అగ్రగామి సంస్థగా త్వరలోనే అభివృద్ధి చెందింది. ఈ విధంగా విద్యార్థి వుద్యమం, కార్మికులు రైతులవలెనే పోరాట పంథాను స్వీకరించింది.

డిసెంబరు 9 వుద్యమం ప్రభావంవల్ల దేశం నలుమూలలకు జపాన్‌ను ప్రతిఘటించాలనీ, జాతిని రక్షించాలనే వుద్యమం వ్యాపించింది. ప్రజా వెల్లువగా రూపొందింది.

1936 ఫిబ్రవరిలో ఎర్రసైన్యం ఏర్పరచిన జపాన్ వ్యతిరేక అగ్రగామి ప్రజా సైన్యం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన, షెన్సీ రాష్ట్రంలో ఎల్లోనదిని దాటింది. జపాన్ దురాక్రమణదారులతో పోరాడటానికి తూర్పు దిశగా తరలివెళ్ళింది. దీనిని పెద్ద కొమింటాంగ్ సైన్యాలు ఆటంకపరచుటతోపాటు అదే సమయంలో షెన్సీ, కాన్సు రాష్ట్రాలలోని విప్లవ కేంద్రాలపై దాడిచేశాయి. జాతీయ రక్షణ సేనలు నష్టపడటాన్ని తప్పించేందుకు, జపాన్ వ్యతిరేక అగ్రగామి సైన్యం ఎల్లోనది పడమర వైపుకు ఉపసంహరించుకుంది. తద్వారా అంతర్యుద్ధాన్ని ఆపుజేయాలని కమ్యూనిస్టు పార్టీ కోరుతూందన్న సంగతిని, తన నిజాయితీని ప్రజలందరకు నిరూపించుకుంది. ఇందువల్ల జపాన్ ప్రతిఘటనకు, జాతీయ స్వాతంత్ర్య రక్షణకు ప్రారంభమైన ఉద్యమానికి మరింత ప్రోత్సాహం లభించింది.

లియుషావ్-చీ తదితరుల నాయకత్వాన, కొమింటాంగ్ అధీనంలోవున్న ప్రాంతంలో కమ్యూనిస్టుపార్టీ కృషి మరింత తీవ్రంగా కొనసాగింది. పార్టీ పిలుపు నందుకొని కార్మికవర్గం జపాన్ వ్యతిరేక సమ్మెలను చేసింది. 1936 చివరలో షాంఘై నగర బట్టలమిల్లు కార్మికులు జరిపిన జపాన్ వ్యతిరేక సమ్మెలో 45 వేల మంది పాల్గొన్నారు. తదనంతరం జపాన్ యాజమాన్యంక్రింద వున్న ట్సింగ్‌టావ్‌లోని బట్టలమిల్లుల కార్మికులు సమ్మెచేశారు.

అన్ని తరగతుల ప్రజలు జాతీయ విమోచనాసంస్థలను దేశమంతటా స్థాపించారు. సముద్రాంతర చైనా జాతీయులుకూడ అలాంటి సంస్థలను ఏర్పరచారు; జపాన్ ప్రతిఘటనను, చైనా విమోచనకు ప్రజలను సమీకరించేందుకు పూను

ఉన్నాయి. 1936 మే నెలలో అఖిల చైనా జాతీయ విమోచనసంస్థ షాంఘై నగరంలో స్థాపించబడింది.

కమ్యూనిస్టు పార్టీ విధానాన్ని ఈ సంస్థ బలపరచింది. దేశభక్తి ప్రేరితులైన అనేకమంది ప్రజలను ఈ సంస్థ సమీకరించింది.

జాతీయ విమోచనోద్యమాన్ని ప్రోత్సహించుతూ కొలదికాలంలోనే వేల కొలదీ పత్రికలు ప్రకటితమయ్యాయి. షాంఘై నగరంలోనే మహిళా జీవితం, ప్రపంచ సంస్కృతి వగైరాతో సహా వందపత్రికలు ప్రకటించబడేవి. వీటిని లక్షలకొలదీ ప్రజలు, ముఖ్యంగా యువకులు చదివేవారు

కొమింటాంగ్ సైన్యంలో కూడ జపాన్ వ్యతిరేక భావాలు ఉధృతంగా పెరిగాయి. నవంబరులో సుయివాన్ వద్ద వున్న కొమింటాంగ్ సేనలు తిరుగుబాటు చేసి, జపాన్ దురాక్రమణదారులను ప్రతిఘటించాయి. ప్రస్తుత హూహేహాట్‌కు పశ్చిమోత్తరంగా వుండే కీలక పట్టణమైన పైలింగ్ మియోను విముక్తిచేశాయి. ఈ విజయంతో సంతోష భరితులైన ప్రజలు దేశమంతటా సుయివాన్ సైన్యానికి సహాయనిధిని వసూలు చేసేందుకు పెద్దయెత్తున ఉద్యమం ప్రారంభించారు. ఎర్ర సైన్యంపై దాడిచేసేందుకు చియాంగ్ కై - షేక్ పంపించిన ఈశాన్య నైరుతి సైన్యాలు తమంతట తామే అంతర్యుద్ధాన్ని ఆపు జేశాయి. జపాన్ వ్యతిరేక ప్రజాపుద్యమ ప్రభావం, ఎర్రసైన్యం పలుకుబడి ఈసైన్యాలపై పడటమే యిందుకు కారణం. పరస్పరం ప్రతినిధివర్గాలను పంపి, ఉభయులమధ్య స్నేహ సంబంధాలను ఏర్పరచుకున్నాయి. ఇళ్ళకు తిరిగిపోయేందుకు పోరాడాలని హృదయపూర్వకంగా కోరుతున్న ఈశాన్య సైన్యంలోని సైనికులు ఎర్రసైన్యంతో కలసి ఐక్య సంఘాలను నిర్మించుకున్నారు.

## సియాన్ సంఘటన

ప్రజల జాతీయ విమోచనోద్యమాన్ని ఏవగించుకుంటున్న కొమింటాంగ్ ప్రభుత్వం వుద్యమాన్ని అణచివేసేందుకు ఉత్తరువులు జారీ చేసింది. చాలమంది దేశ భక్తులను అరెస్టు చేసింది. అఖిల చైనా జాతీయ విమోచనా సమితి నాయకులైన షెన్ చున్-జూ తదితర నాయకులు ఆరుగురిని జైదులో వుంచింది. కమ్యూనిస్టు పార్టీ అనేకసార్లు జపాన్‌కు వ్యతిరేకంగా ఐక్యతను నిర్మించుదామని హృదయపూర్వకంగా కోరినా కొమింటాంగ్ ఖాతరు చేయలేదు. విప్లవ సైన్యాలను చుట్టుముట్టేందుకు ప్రతీఘాతకులు తమ సన్నాహాలను తీవ్రతరం చేశారు.

కాని కొమింటాలగ్ విధ్వంసక వైఖరియెడల ప్రజలలో క్రోధాగ్ని పెరిగి పోయింది. ఎర్రసైన్యంపై దాడి చేసితీరాలని ఈశాన్య-నైరుతి సైన్యాలను ఒత్తిడి చేసేందుకు చియాంగ్ కై-షేక్ 1936 డిశెంబరు ప్రారంభంలో సియాన్‌కు వచ్చాడు. సియాన్ విద్యార్థులు ఆ సమయంలో డిశెంబరు 9 వుద్యమ ప్రథమ వార్షికోత్సవాన్ని జరుపుతున్నారు. ఊరేగింపుగా వెళ్ళి జపాన్ దురాక్రమణను

ప్రతిఘటించాలని చియాంగ్ కై-షేక్‌ను కోరారు. దేశభక్తి ప్రేరితులైన యువకు లను చిత్రవధ చేయమని చియాంగ్ హుకుం జారీ చేశాడు. కాని ఈశాన్య నైరుతి సైన్యాలు చియాంగ్ ఆజ్ఞలను పాటించలేదు. బలమైన జాతీయోద్యమ ప్రభావంవల్ల ఈ సైన్యాలు జపాన్ దురాక్రమణను ప్రతిఘటించాలనే దీక్షతో వున్నాయి.

దేశభక్తిప్రేరితులైన ఈ రెండు సైన్యాల సేనాధిపతులైన చాంగ్ హ్స్యూయేహ్-లియాంగ్, యాంగ్ హు-చెంగ్ జపాన్‌తో పోరాడేందుకు బలవంతాన చియాంగ్ కై-షేక్‌ను ఒప్పించాలని నిశ్చయించుకున్నారు. డిసెంబరు 12 వ తేదీన చియాంగ్ కై-షేక్‌ను అరెస్టు చేసేందుకు సైన్యాలను పంపారు. దీనినే సియాన్ సంఘటన అని పిలుస్తారు.

సియాన్ సంఘటన జరిగిన వెంటనే కొమింటాంగ్‌లోని జపాన్ తాబేదారులు నైరుతి చైనాపై పెద్ద యెత్తున దాడి ప్రారంభించాలని, జపాన్ సామ్రాజ్యవాదులను ప్రోత్సహించారు. కమ్యూనిస్టుపార్టీ దూరదృష్టితో ఈ సంఘటనను శాంతియుతంగా పరిష్కరించాలని నిర్ణయించింది. అంతర్యుద్ధాన్ని ఆపుజేసేందుకు, జపాన్ దురాక్ర మణదారులకు వ్యతిరేకంగా దేశంలో జాతీయైక్యతను నిర్మించేందుకు చియాంగ్ కై-షేక్‌ను ఒప్పించాలని నిర్ణయించుకుంది. మధ్యవర్తులుగా వ్యవహరించేందుకు చౌ ఎన్-లై, తదితరులను సియాన్‌కు పంపింది. అదే సమయంలో రెండోవైపున అంతర్యుద్ధాన్ని విస్తరింపజేయాలని ప్రయత్నించుతున్న జపాన్ అనుకూలముఠా కుట్రను భగ్నం చేసేందుకు, ఈశాన్య నైరుతి సైన్యాలతోపాటు ఎర్రసైన్యంలో ముఖ్యభాగం సంసిద్ధంగా వుంది.

ఎర్రసైన్యంతో కలసి జపాన్‌తో పోరాడేందుకు, ప్రజల స్వాతంత్ర్యాన్ని పౌరహక్కులను గ్యారంటీ చేసేందుకు అంగీకరించిన తరువాతనే చియాంగ్ కై-షేక్ విడుదలయ్యాడు.

పదేళ్లుగా సాగించిన అంతర్యుద్ధాన్ని, ప్రజలపై నియంతృత్వపాలనను, జపాన్ ప్రతిఘటన నిరాకరించే విధానాన్ని వదులుకోవడం మినహా కొమింటాంగ్‌కు వేరే గత్యంతరం లేకుండాపోయింది. జపాన్ దురాక్రమణను ప్రతిఘటించేందుకు కమ్యూ నిస్టుపార్టీతో సహకరించడం తప్పనిసరయింది.

## 64వ అధ్యాయం

# వామపక్ష సాహిత్యోద్యమం

మొదటి విప్లవ అంతర్యుద్ధం తరువాత సాహిత్యోద్యమం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన అభివృద్ధి చెందింది. అప్పుడు చైనాలోని రచయితలు, కళాకారుల్లో రెండు గ్రూపులు వుండేవి. ఎర్రసైన్యంతోపాటు విప్లవ కేంద్రాలలోని ప్రజలలో వుండి పనిచేసేవారు ఒక గ్రూపు. కొమింటాంగ్ ప్రాంతాలలో లూహ్సూన్ నాయకత్వాన పనిజేసే వామపక్ష రచయితల సంఘం రెండోది.

చైనా వామపక్ష రచయితల సంఘం 1930 మార్చిలో షాంఘై నగరంలో స్థాపించబడింది. దీనిలో లూహ్సూన్, మావో టున్‌లతోసహా 50 మందికిపైగా విప్లవ రచయితలు సభ్యులుగా వుండేవారు. ఈ సంఘ ప్రారంభ సమావేశంలో "సిద్ధాంత కార్యక్రమా"న్ని ఆమోదించింది. శ్రామిక ప్రజల విమోచనానికి తోడ్పడటం విధ్యుక్త కర్తవ్యంగా స్వీకరించాలని యిందులో స్పష్టంగా ప్రకటించింది. సంస్కృతీ విప్లవంలో యిది మరొక ముందడుగును యిది ద్యోతికం చేస్తుంది.

కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన వామపక్ష రచయితలు లూహ్సూన్ చుట్టూ సమీకరించబడి, తమ కార్యక్రమానికి అనుగుణంగా పోరాటాన్ని పెంపొందించారు. జపాన్ దురాక్రమణ ప్రతిఘటన కొరకు, ప్రజాస్వామ్యం కొరకు జరిగే ప్రజా వుద్యమంలో రచయితల సంఘం పాల్గొన్నది. కళలు, సాహిత్యాన్ని గురించి మార్క్సిస్టు సిద్ధాంతాలు ఏమి చెబుతున్నాయో అధ్యయనం చేయడానికి గ్రూపులను ఏర్పరచింది. సాహిత్యదీపిక (గైడ్ టు లిటరేచర్), స్ప్రౌట్స్ (మొలకలు), పయినీర్స్, లోడ్ స్టార్ (ధ్రువతార) వగైరా సాహిత్యపత్రికలనునడిపారు. వరుసగా నవలలను, గేయాలను, నాటకాలను ప్రకటించారు. యువక రచయితలను చాలమందిని తర్ఫీదు చేశారు.

వామపక్ష రచయితల సంఘం కొమింటాంగ్ ప్రభుత్వ నిర్బంధ విధానానికి గురయింది. సంస్కృతీ కార్యకలాపాలలో విప్లవ కృషిని కించపరచడానికి కొమింటాంగ్ శాయశక్తులా ప్రయత్నించింది. సంఘం ప్రకటించే పత్రికలను అప్పజేయవలసిందిగా అధికారులు ఉత్తరువులిచ్చారు. వామపక్ష రచయితల గ్రంథాలను

నిషేధించారు. చాలమంది విప్లవ రచయితలను నిర్బంధంలో వుంచారు. మరికొందరిని రహస్యంగా చంపారు. లోహ్సున్ చివరి సంవత్సరాలలో అరెస్టు చేసే ప్రమాదమో చంపే ప్రమాదమో సంభవించుతుందని ఎదురుచూస్తూ ప్రతిరోజూ గడుపవలసి వచ్చింది.

ఐనప్పటికీ రచయితల సంఘం పోరాటాన్ని సాగించింది. సభ్యుల సంఖ్యను పెంచుకోగలిగింది. శ్రామిక విప్లవ సాహిత్యాన్ని అభివృద్ధి చేసింది.

1936 లో కమ్యూనిస్టుపార్టీ పిలుపునందుకుని, ఈ సంఘం తనంతట తానే స్వయంగా రద్దు చేసుకుంది. తన సహచరులందరినీ కలుపుకొని, జపాన్ వ్యతిరేక జాతీయ ఐక్య సంఘటన ఉద్యమాన్ని బలపరచింది.

## లూ హ్సున్

మొదటి విప్లవ అంతర్యుద్ధం అనుభవాలు లూహ్సున్ కళ్ళు తెరచాయి. శ్రామిక విమోచనం యెడల ఆయన విశ్వాసం బలపడింది. ప్రజాతంత్ర విప్లవకారుడు త్వరలో కమ్యూనిస్టు వీరుడుగా మార్పుచెందాడు.

తన పోరాటంలో లూహ్సున్‌కు కమ్యూనిస్టుపార్టీ తోడ్పాటు వుంది. 1931 లో చు చియు-పాయ్ అను ప్రముఖ విప్లవకారుడు, సాహిత్యవేత్త, కమ్యూనిస్టు షాంఘై నగరం చేరాడు. వామపక్ష రచయితల సంఘాన్ని ఎలా నడపాలో లూహ్సున్ ఆయనతో చర్చించాడు. రచనలు సాగించడంలోనూ, విదేశ సాహిత్య గ్రంథాలను అనువదించడంలోనూ చూ సహకారం తీసుకున్నాడు. వారుభయులూ పరస్పరం సహాయం చేసుకున్నారు. ఇద్దరిమధ్య గొప్ప గాఢమైన స్నేహం ఏర్పడింది.

కమ్యూనిస్టుపార్టీ తోడ్పాటుతో లూహ్సున్ బలం సమీకరించుకున్నాడు. ప్రతీఘాతుక పరిపాలనక్రింద కటికి చీకటి రోజుల్లో ప్రాణాపాయం యెదురౌతున్నప్పటికీ విప్లవ సాహిత్య జెండా ప్రతిష్ఠను కాపాడాడు. కొమింటాంగ్ పరిపాలనను నిశితంగా విమర్శించుతూ వ్యాసాలు వ్రాశాడు. సోవియట్ యూనియన్ సాధించిన విజయాలను ప్రశంసించాడు. సృజనాత్మక రచనల్లోనూ, పోరాటంలోనూ యువ రచయితలు మార్గదర్శిగా సహాయపడేవారు. 1928 నుంచి 1936 వరకు లూ హ్సున్ వ్రాసిన అనేక వ్యాసాలు తొమ్మిది సంపుటాలుగా ప్రకటించబడ్డాయి.

ఆ దశలో కమ్యూనిస్టుపార్టీ చొరవతో జరిగిన రాజకీయ పోరాటాల్లో లూహ్సున్ ఆతురతతో పాల్గొన్నాడు. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని చేసరతుగా బలపరచేవాడు. చైనా విప్లవ విజయంపై పూర్తి విశ్వాసం ఆయనకు వుంది. సుదీర్ఘయాత్రను పూర్తిచేసి ఎర్రసైన్యం ఉత్తర షెన్సీకి చేరినపుడు ఆయన వెంటనే తన అభివందనాలను తంతిద్వారా మావో ట్సే టుంగ్‌కు పంపాడు.

1936 అక్టోబరు 19 వ తేదీన షాంఘైలో లూ హ్సున్ మరణించినపుడు చైనా ప్రజలు చాలా విచారపడ్డారు. చైనా జాతీయ సంస్కృతికి యుగపురుషుడైన

ఆయనకు అన్ని తరగతుల ప్రజలు జోహారు లర్పించారు. "జాతి అంతరాత్మ" అనే శీర్షికతో కీర్తిశేషుని శవపేటికను అలంకరించారు.

వామపక్ష రచయితల సంఘ సృజనాత్మక కృషికి, మావో టున్ రచించిన "అర్ధరాత్రి" అనే నవల ప్రాతినిధ్యం వహించుతుంది. 1932 లో పూర్తయిన ఈ నవల్లో షాంఘైలో నివసించుతున్న జాతీయ పెట్టుబడిదారు యితివృత్తానికంతటికీ కేంద్రపాత్రగా వుంటుంది. సామ్రాజ్యవాదుల దురాక్రమణ ఫలితంగానూ, అర్థవలస అర్థఫ్యూడల్ పరిస్థితులవల్లనూ చైనాదేశం పెట్టుబడిదారీ పద్ధతిలో అభివృద్ధి చెందడంలేదనీ, క్రమక్రమంగా మరింత వలస బానిసత్వంలోకి దిగజారిపోతూందనీ, జాతీయ పెట్టుబడిదారీ వర్గాన్ని అంధకారబంధురమైన భవిష్యత్తు ఎదుర్కొంటూందనీ రచయిత నిరూపించాడు. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన కార్మికులు, రైతులు, సామ్రాజ్యవాదాన్ని ఫ్యూడలిజాన్ని, ఓడించి, చైనా విప్లవ విజయాన్ని సాధించి తీరుతారనీ నవల ద్వారా మావోటున్ నిరూపించ గలిగాడు.

65 వ అధ్యాయం

# జపాన్ దురాక్రమణను ప్రతిఘటించుతూ యుద్ధం!

1937 జులై తేదీన పెకింగ్‌కు నైరుతి దిశగా వున్న లుకోచియావో (మార్కో-పోలో బ్రిడ్జి) పై జపాన్ సైన్యాలుదాడి ప్రారంభించాయి. అచ్చటవున్న చైనా సైన్యాలు తీవ్రంగా ప్రతిఘటించాయి.

జులై 8 వ తేదీన కమ్యూనిస్టు పార్టీ తన ప్రకటనలో జపాన్ దురాక్రమణను ప్రతిఘటించేందుకు సర్వశక్తులూ వినియోగించాలని జాతికంతకూ విజ్ఞప్తి చేసింది. దేశభక్తి ప్రేరితమైన ఈ విజ్ఞప్తి దేశమంతటా వున్న అన్ని వర్గాల ప్రజలనూ ఉత్తేజపరచింది. తప్పనిసరై కొమింటాంగ్ ప్రభుత్వం జపాన్‌కు వ్యతిరేకంగా యుద్ధం చేయడానికి అంగీకరించింది. ఐనప్పటికీ తరువాత కూడ కాళ్ళీడ్చుకుంటూ నీరసంగా వ్యవహరించింది. జపాన్ పెట్టిన అవమానకర షరతులకు తలవొంచడానికి చాటుగా ప్రయత్నించింది.

తమకున్న బలాధిక్యతను చూసుకుని అహంకారంతోనూ, ప్రత్యర్థి శక్తుల నూతన కలయిక ఎడల ఏవగింపుతోనూ జపాన్ సామ్రాజ్యవాదులు కొమింటాంగ్ మంతనాలను ఖాతరు చేయలేదు. ఆగస్టు 13 వ తేదీన షాంఘునగరంపై దాడి చేశారు. నాలుగు పెద్ద కుటుంబాల ప్రముఖ స్థానానికి, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు ఇపుడు తీవ్రప్రమాదం ఏర్పడింది. అందుచేత జపాన్‌తో వారి సంబంధాలు చెడిశాయి. కొమింటాంగ్ ప్రభుత్వానికి తన సైన్యాలను సమీకరించడం తప్ప వేరే గత్యంతరం లేకుండా పోయింది.

కమ్యూనిస్టుపార్టీ, జనసామాన్యమంతటి కృషి ఫలితంగా కొమింటాంగ్ ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని చట్టబద్ధమైనదిగా గుర్తించవలసి వచ్చింది. పశ్చిమోత్తర ప్రాంతంలో నిలదొక్కుకున్న ఎర్రసైన్యం ముఖ్యభాగాన్ని, జాతీయ విప్లవ సైన్యం యొక్క ఎనిమిదవ రూట్ సైన్యంగాను చూ టేహ్ సేనాధిపతిగానూ పెంగ్ టేహ్ హుయి ఉపసేనానిగానూ గుర్తించక తప్పలేదు. ఈ విధంగా జపాన్‌కు వ్యతిరే

కంగా ప్రతిఘటన యుద్ధం సాగించేందుకు జాతీయ ఐక్యసంఘటన ఆచరణలో నిర్మించబడింది.

షెన్సీలో వున్న ఎనిమిదవ రూట్ సైన్యం 30 వేల మంది ఆగస్టు చివరిలో జపాన్ వ్యతిరేక యుద్ధరంగానికి వెళ్ళినపుడు స్థానిక ప్రజలు ఉత్తేజ పూర్వకమైన వీడ్కోలు యిచ్చారు.

పెకింగ్ - సూయువాన్ రైల్వేపై వున్న టాటుంగ్, క్వేసుయి (ప్రస్తుత హు హోహాట్)ను ఆక్రమించిన తరువాత జపాన్‌వాళ్ళు దక్షిణంగా దాడిచేసి, షాన్సీ రాష్ట్ర రాజధాని యాంగ్‌చూ (తైయువాన్)ను పట్టుకోవాలని ప్రయత్నించారు. ముందుకు చొచ్చుకువస్తున్న జపాన్‌వాళ్ళను ప్రతిఘటించకుండా కోమింటాంగ్ సేనలు పారిపోయాయి. ఆ సమయంలో లిన్‌పియో నీహ్ జంగ్-చెన్ నాయకత్వాన ఎర్రసైన్యం ఉత్తర షెన్సీలోని పింగ్‌సింగ్‌కువాన్ కనుమవద్దకు వెళ్ళింది.

సెప్టెంబరు 24 వ తేదీ రాత్రివేళ వర్షం కురుస్తుండగా ఎర్రసైన్యం పింగ్ సింగ్‌కువాన్ కనుమకు తూర్పున శత్రువుపై దెబ్బతీయడానికి వేచివుంది. కొండల మధ్యగా వెళుతున్న రోడ్డుకు ఇరువైపులావున్న పర్వతాలపై రక్షణ స్థానాలు ఏర్పరచుకొంది. జపాన్‌సైన్యం ప్రొద్దుటే రోడ్డువెంట ముందుకు వెళుతూంది. ఆ సమయంలో ఆకస్మికంగా ఎర్రసైన్యం దెబ్బతీసి, శత్రుసేనలను చిందరవందర చేసింది. జపాన్‌వాళ్ళ ట్రక్కులు ఒకదానికొకటి గుద్దుకొని తలక్రిందులయ్యాయి. చేతి బాంబులు (గ్రెనేడ్స్) వర్షంలా కురిశాయి. ఎర్రసైన్యం బాహాబాహి యుద్ధానికి జపాన్‌వాళ్ళు భీతావహులయ్యారు. ఒకరోజంతా సంకుల సమరం జరిగి, జపాన్ సైన్యం ధ్వంసమయింది.

పింగ్‌సింగ్ కువాన్ వద్ద ఎర్రసైన్యం (ఎనిమిదవ రూట్ సైన్యం) సాధించిన విజయం చైనా జాతినంతనూ ఉత్తేజపరచింది. దేశభక్తి వుద్యమం వెల్లువలా విజృంభించింది.

పింగ్‌సింగ్ కువాన్ యుద్ధానంతరం ఎర్రసైన్యం ఒకవైపున షాన్సీలో శత్రు దురాక్రమణను ప్రతిఘటించుతూ వుంది. అదే సమయంలో శత్రు ఆక్రమిత ప్రాంతాలలోకి బాగా చొచ్చుకుపోయి జపాన్ వ్యతిరేక కేంద్రాలను నిర్మించింది. ఒక సంవత్సరంలో ఈ విధంగా రైతు జనసామాన్యం సహాయంతో షాన్సీ, చాహార్, హోపీ, సూయివాన్, షాంటుంగ్, హోనాన్, తదితరరాష్ట్రాలలో వరుసగా జపాన్ వ్యతిరేక కేంద్రాలను ఎర్రసైన్యం నిర్మించింది.

ఎర్రసైన్యం దీర్ఘయాత్ర బయలుదేరినపుడు యాంగ్‌ట్సీ నది ఉత్తర దక్షిణ ప్రాంతాలలో ఆగిపోయిన ఎర్రసైన్య భాగాలు ఈ లోగా చాలా చిక్కు పరిస్థితులలో పోరాటం కొనసాగించాయి. ప్రతిఘటన యుద్ధం ప్రారంభమయ్యాక జాతీయ విప్లవ సైన్యంలో భాగమైన నవీన నాలుగవ రూట్ సైన్యంగా వీటిని గుర్తించారు దీనికి ఏహ్ టింగ్ సేనానిగానూ, హ్సియాంగ్ ఇంగ్ ఉపసేనానిగానూ'

పని చేశారు. 1938 లో నవీన నాల్గవ రూట్ సైన్యం రెండు భాగాలు మొత్తం 12 వేలమంది యుద్ధరంగానికి తరలివెళ్ళాయి. ఒకటి శత్రు ఆక్రమిత ప్రాంతం దక్షిణ కియాంగ్సూలోనికి, రెండోది అన్‌హ్వాయిలోని చావ్‌హూ సరస్సు దగ్గరకు చొచ్చుకుపోయాయి. చాల పాత కాలపు ఆయుధాలు మాత్రమే వున్నప్పటికీ నవీన ఎర్రసైన్యం (నాల్గవరూట్ ఆర్మీ అనేక చోట్ల ఆధునిక జపాన్ సైన్యాలపై దెబ్బతీసింది. 1939 లో కియాంగ్సూ, అన్‌హ్వాయి రాష్ట్రాలలో అనేక జపాన్ వ్యతిరేక కేంద్రాలను నిర్మించింది.

క్వాంగ్ టుంగ్ లోని టుంగ్ చియాంగ్ నదీలోయ ప్రాంతంలోనూ, హైనాన్ దీవిలోనూకూడ జపాన్ వ్యతిరేక కేంద్రాలను కమ్యూనిస్టు నాయకత్వానవున్న చైనా సైన్యాలు ఏర్పరచాయి.

అలాంటి కేంద్రాలన్నిటిలోనూ కమ్యూనిస్టుపార్టీ ప్రజలకు నాయకత్వం వహించి, ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని నెలకొల్పింది. మక్తాలను, వడ్డీ రేటును తగ్గించింది. ప్రజలనుండి సాయుధ దళాలను సమీకరించింది. ప్రజల తోడ్పాటుతో ఎనిమిదవ రూట్ సైన్యం, నాల్గవ రూట్ సైన్యం త్వరగా పెంపొందాయి. శత్రు సేనలకు వెనుకభాగంలో యుద్ధరంగాలను స్థాపించి, ప్రతిఘటన యుద్ధంలో ప్రధాన పాత్ర వహించాయి.

## ప్రతిఘటన యుద్ధంలో రెండు ప్రత్యేక విధానాలు

ప్రతిఘటన యుద్ధం ప్రారంభమైనప్పటినుంచీకమ్యూనిస్టు పార్టీ అన్నివిధాల శత్రువును ప్రతిఘటించాలని, ప్రజా యుద్ధపాలసీని అనుసరించాలనినిశ్చయించుకుంది. శత్రువుకు వెనుకభాగంలో చాల ప్రతిఘటన కేంద్రాలను ఏర్పరచి గెరిల్లా యుద్ధాన్ని కొనసాగించుతూ, ముఖాముఖిగా జరిగే యుద్ధానికి తోడ్పడేందుకు సర్వశక్తులూ వినియోగించింది. కొమింటాంగ్ ప్రాంతాలలో కూడప్రజలను ఉత్సాహపరచేవారు. ప్రజలందరినీ - ముఖ్యంగా రైతాంగాన్ని - యుద్ధంలో పాల్గొనేటట్లు చేసేందుకు, వారి రాజకీయ, ఆర్థిక హక్కులను రక్షించేందుకు కమ్యూనిస్టుపార్టీ పూనుకుంది. ప్రాథమికచర్యగా జపాన్ వ్యతిరేక కేంద్రాలున్న ప్రాంతంలో మక్తాలను, వడ్డీరేటును తగ్గించింది. సర్వవిధ ప్రతిఘటన పాలసీని అమలుజరపడంలో కార్మికులు, రైతులు, పట్టణ మధ్య తరగతులు, జాతీయ పెట్టుబడిదారులు, చివరకు భూస్వాములవర్గంలో రాజకీయ చైతన్యంగలవారు సైతం సహాయపడ్డారు.

ప్రజా ఒత్తిడివల్ల కొమింటాంగ్ శత్రు ప్రతిఘటనకు పూనుకున్నప్పటికీ ప్రజాబలం పెంపొందుతుందేమోనన్న భీతి దానిని వెన్నాడుతున్నందున, కేవలం పాక్షిక ప్రతిఘటనావిధానాన్ని మాత్రమే అవలంబించుతూ వచ్చింది. ప్రజానీకమంతటినీ పోరాటంలో సమీకరించకుండా త్రుణీకరించుటే గాక, కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలను అన్నివిధాల అరికట్టేందుకు పూనుకునేది. ప్రజాస్వామ్య సంస్కరణలను పూర్తిగా వ్యతిరేకించేది. యుద్ధరంగంలోనూ, శత్రు వెనుక

భాగంలోనూ కూడ అత్యంత తీవ్రమైన పోరాటాన్ని ఎనిమిదవ రూట్ సైన్యానికి, నవీన నాల్గవ రూట్ సైన్యానికి అప్పగించేది. తద్వారా కమ్యూనిస్టు నాయకత్వాన వున్న దేశభక్త శక్తులు జపాన్ సైన్యంచేత అణచివేయబడతాయని ఆశించేది.

కొమింటాంగ్ సైన్యంలోని సామాన్య సైనికులు, ఉద్యోగులలో చాలమంది జపాన్ దురాక్రమణను తీవ్రంగా ప్రతిఘటించాలని కోరేవారు. కాని పాక్షిక ప్రతిఘటన కొనసాగించాలనేదే కొమింటాంగ్ పాలసీ ఐనందున, దాని సైన్యాలు యుద్ధ రంగంలో అపజయాలను, పరాభవాలను పొందాయి. ఉత్తర చైనాలో, లుకొచియా సంఘటన జరిగిన నెల రోజుల్లోనే పెకింగ్, టీన్‌ట్సీన్ నగరాలనుంచి కొమింటాంగ్ తన సేనలను ఉపసంహరించుకుంది. తరువాత కొలది కాలానికే చాహార్, సుయువాన్‌లను కూడ కోల్పోయింది. 1937 సంవత్సరం ముగిసేనాటికి ఉత్తర చైనాను ఖాళీ చేసి, ఎల్లోనది సమీపానికి కొమింటాంగ్ సైన్యం చేరుకుంది. 1937 నవంబరులో షాంఘై నగరం, డిసెంబరు నెలలో నాంకింగ్ నగరం పతన మయ్యాయి. 1938 అక్టోబరులో కాంటన్, ఊహాన్ నగరాలను జపాన్ సేనలు ఆక్రమించాయి. ఈ విధంగా చైనా భూమిలో సగంభాగం శత్రువు చేతుల్లో వదలివేసి, కొమింటాంగ్ ప్రభుత్వం జిచివాన్ రాష్ట్రంలోని చుంగ్‌కింగ్ నగరానికి తిరోగమించింది.

ప్రతిఘటన యుద్ధం కొనసాగుతుండగా సోవియట్ యూనియన్ నిస్వార్థంగా చైనాకు సహాయం చేసింది. ప్రథమంలో విదేశాంగ వ్యవహారాల్లోనూ, అంతర్జాతీయ వేదికపైనా సోవియట్ యూనియన్ చైనాకు సహాయపడింది. 1937 సంవత్సరం ఆగస్టు 21 వ తేదీన చైనాతో నిరాక్రమణసంధి చేసుకుంది. అంతర్జాతీయ సమావేశాలలో సోవియట్ ప్రతినిధులు జపాన్ దురాక్రమణను నిరశించారు. చైనా ప్రతిఘటన యుద్ధాన్ని బలపరుస్తూ సోవియట్ పత్రికలు వ్యాసాలను ప్రకటించాయి. చైనాకు అప్పులు, మిలిటరీ సామగ్రి అందజేయడంద్వారా సోవియట్ ప్రభుత్వం సాయపడింది. సోవియట్ వైమానికులు వాలంటీర్లుగా చైనా సైన్యంలో చేరి, ఊహాన్, చుంగ్‌కింగ్, లాన్‌చౌ, తదితర నగరాలపై జపాన్ విమాన దాడులను వీరోచితంగా ప్రతిఘటించారు.

చైనా-జపాన్ యుద్ధంలో ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు ద్వంద్వ రాజనీతిని అవలంబించారు. జపాన్ దురాక్రమణను చైనా ప్రతిఘటించాలనే వారు కూడ అభిలషించారు. యుద్ధం ఫలితంగా చైనా ప్రజాశక్తుల బలం తరుగుతుంటుందనీ, చైనాదేశంలోకి మరింతగా జపాన్‌వాళ్ళు చొచ్చుకుపోతుండావుంటే, తమ స్వార్థ ప్రయోజనాలను రక్షించుకోవచ్చుననీ వారు ఆశించారు.

ఆ సమయంలో జర్మనీ దురాక్రమణవల్ల యూరపు ఖండంలో క్లిష్టపరిస్థితి ఏర్పడింది. అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వం, బ్రిటిష్ ప్రభుత్వం అచట పూర్తిగా నిమగ్నమై వున్నందున తూర్పున జపాన్‌తో పోటీ చేయలేకపోయాయి.

అందుచేత చైనాను త్యాగం చేయడం ద్వారా జపాన్‌తో రాజీపడి, సోవియట్ యూనియన్‌పై దాడి చేసేందుకు జపాన్‌ను ప్రోత్సహించాలని ఆశించాయి. అందువల్లనే అమెరికా, బ్రిటన్లు మెదలకుండా చూస్తూ వూరుకున్నాయి.

చైనాకు తోడ్పడేందుకు అమెరికా, బ్రిటన్లు కృషిచేయలేదు. పైగా యుద్ధ అవకాశాన్ని వినియోగించుకుని, ఆయుధ వర్తకాన్ని వృద్ధిచేసుకుని విపరీతలాభాలను గడించాయి. ముఖ్యంగా అమెరికా పెట్రోలు, ఇనుము, ఉక్కు, విమానాలు, మందుగుండు వగైరా యుద్ధ సామగ్రిని జపాన్‌కు అమ్మింది. 1938 లో జపాన్ తన కవసరమైన యుద్ధ సామగ్రిలో నూటికి 92 వంతులు అమెరికా నుంచి దిగుమతి చేసుకుంది. ఈ విధంగా ఆచరణలో బహిరంగంగా జపాన్ దురాక్రమణను ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రోత్సహించారు.

ఊహాన్ నగరం పడిపోయాక ఎనిమిదవ రూట్ సైన్యం, నవీన నాల్గవ రూట్ సైన్యం జపాన్ ఆక్రమితప్రాంతాల వెనుకభాగంలో వుండి, ప్రతిఘటన యుద్ధాన్ని సాగించాయి. ప్రధాన పోరాటం జపాన్ ఆక్రమిత ప్రాంతాలకు మారింది. చైనా జాతీయ ఐక్యసంఘటనను విచ్ఛిన్నం చేసేందుకు కొమింటాంగ్‌ను లొంగదీసికోవాలని జపాన్‌వాళ్ళు శాయశక్తులా కృషిచేశారు. కొమింటాంగ్ తమతో రాజీపడి, కమ్యూనిస్టుపార్టీని అణచివేసేందుకు సహకరించితే, ఆర్థిక సౌకర్యాలు కలుగజేస్తామని జపాన్ వాగ్దానం చేసింది. ఉత్తర చైనాలో నూటికి 49 వంతులు, మధ్య దక్షిణ చైనాలో నూటికి 51 వంతులు పెట్టుబడి పెట్టేందుకు అవకాశమిస్తామని ఎరచూపింది.

1938 డిసెంబరు 18 వ తేదీన కొమింటాంగ్ పార్టీలోని జపాన్ అనుకూలముఠా నాయకుడైన వాంగ్ చింగ్ వి చైనా తాత్కాలిక రాజధానియైన చుంకింగ్‌ను వదలి, జపాన్ సామ్రాజ్యవాదులతో చేరాడు. 1940 లో అతడి ఆధ్వర్యాన కీలుబొమ్మ ప్రభుత్వం నాంకింగ్‌లో ఏర్పడింది. "శాంతి, కమ్యూనిస్టు వ్యతిరేకత, జాతీయ పునర్నిర్మాణం"అనే నినాదంతో ఈ ముఠా సిగ్గువిడచి పనిచేసింది. పెద్ద భూస్వాములు, బడా పెట్టుబడిదారులలో అత్యంత అభివృద్ధి నిరోధకులు ఈవిధంగా దేశద్రోహులుగా తయారయ్యారు. సామ్రాజ్యవాద దురాక్రమణదారులతో బహిరంగంగా కలసిపోయారు.

300

66 వ అధ్యాయం

# కొమింటాంగ్ లొంగుబాటుకు వ్యతిరేకంగా కమ్యూనిస్టు పార్టీ పోరాటం

## కొమింటాంగ్ ద్రోహపాత్ర

వాంగ్ చింగ్ - వీ ముఠా విద్రోహంవల్ల చియాంగ్ కై - షేక్ పక్షంలోని లొంగుబాటు తత్వం మరింత స్పష్టంగా బయటపడింది. తన సైన్యంలో హెచ్చు భాగాన్ని సాధ్యమైనంతవరకు కాపాడుకోవాలనే దృష్టితో చియాంగ్ కై షేక్ తన బలాలను ప్రధానంగా పశ్చిమ చైనాలో చుంగ్‌కింగ్, సియాన్ కేంద్రాలచుట్టూ నిలవరించాడు. "ప్రతిఘటన యుద్ధం" లక్ష్యం కేవలం లుకొచియావ్ సంఘటనకు ముందున్న పరిస్థితులను యథాతథంగా నెలకొల్పడమే తన ఆశయమని తేటతెల్లం చేశాడు. దీని అర్థమేమంటే నాలుగు పెద్ద కుటుంబాల స్వార్థం, ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు నష్టం కలుగకపోతే, అదివరకే దురాక్రమణ పాలైన ప్రాంతాలను తిరిగి స్వాధీనం చేసుకునేందుకు పూనుకోమని హామీ యివ్వడమే అవుతుంది.

కాని ఈ లొంగుబాటు ధోరణిని జపాన్ వ్యతిరేక ప్రజాశక్తులన్నీ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన తీవ్రంగా ప్రతిఘటించాయి. లొంగుబాటుకు ఆటంకాలు లేకుండా తొలగించుకునేందుకు, కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలను అరికట్టేందుకు చియాంగ్ ప్రభుత్వం అనేక ఉత్తరువులను జారీచేసింది. పార్టీ సెంట్రల్ కమిటీ కేంద్ర కార్యాలయమున్న షెన్సీ - కంసూ - నింగ్‌షా సరిహద్దు ప్రాంతాన్ని చుట్టుముట్టేందుకు సైన్యాలను పంపింది. ఎనిమిదవ రూట్ సైన్యాన్ని, నాల్గవరూట్ సైన్యాన్ని, వారి సహాయక సేవాదళాలను ఎదుర్కొనేందుకు పూనుకుంది.

యూరపులో జర్మన్ ఫాసిస్టులు 1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించారు. తూర్పునుంచి జపాన్‌దాడి రాకుండా తప్పించుకునేందుకు లొంగిపోవలసిందిగా కొమింటాంగ్‌పైన అమెరికా, బ్రిటన్లు ఒత్తిడి

తెచ్చాయి. దాని ఫలితమేమంటే, ప్రతిఘటనయుద్ధం జరుగుతుండగానే మొదటిసారి చియాంగ్ కై-షేక్ ముఠా తన కమ్యూనిస్టు వ్యతిరేక వ్యూహాన్ని ప్రారంభించింది.

1939 వ సంవత్సరం చివరలో చియాంగ్ కై-షేక్ సైన్యాలు, అదివరకే చుట్టూ వలయం నిర్మించిన షెన్సీ-కంసు-నింగ్‌సా ప్రాంతంపై దాడిచేశాయి. పశ్చిమ షాన్సీలో కమ్యూనిస్టు నాయకత్వాన వున్న జపాన్ వ్యతిరేక సైన్యాలపై కూడ అదేవిధంగా దాడిచేశాయి.

"ప్రతిఘటన యుద్ధాన్ని కొనసాగించండి! లొంగుబాటును వ్యతిరేకించండి! విచ్ఛిన్నకులను ఎదిరించి ఐక్యతను కాపాడండి! ప్రతీఘాతకులను వ్యతిరేకించి, అభ్యుదయాన్ని సాధించండి" అనే నినాదాలతో కమ్యూనిస్టుపార్టీ తదేకదీక్షతో పోరాడింది. చియాంగ్ కై-షేక్ ముఠాదాడులను ఛిన్నాభిన్నం చేయుటద్వారా తాత్కాలికంగా లొంగుబాటు ప్రమాదాన్ని అరికట్టింది.

## మావో త్సే-టుంగ్ రూపొందించిన నూతన ప్రజాస్వామ్యం

కమ్యూనిస్టు వ్యతిరేకదాడిలో భాగంగానే చియాంగ్ కై-షేక్ ముఠా, చైనా అభ్యుదయ శక్తులకు వ్యతిరేకంగా సిద్ధాంత ప్రచారం ప్రారంభించింది. కమ్యూనిస్టుపార్టీ అస్తిత్వమే అవసరం లేదన్న వాదం లేవదీసింది. ప్రతిఘటన యుద్ధాన్ని, ప్రజాస్వామ్య విప్లవాన్ని దీక్షతో కొనసాగించడాన్ని వ్యతిరేకించింది. బూర్జువా (పెట్టుబడిదారీ) నియంతృత్వాన్ని స్థాపించాలని తాపత్రయపడింది. వీటన్నిటివల్లా చైనాదేశ భవిష్యత్తును గురించి కమ్యూనిస్టుపార్టీ దృక్పథ మేమిటో స్పష్టపరచవలసిన అవసరం కలిగింది.

1940 జనవరిలో మావో త్సే టుంగ్ వ్రాసిన "నూతన ప్రజాస్వామ్యం" అనే పుస్తకం ప్రచురించబడింది. చైనా సమాజంయొక్క చారిత్రక స్వభావాలను దృష్టిలో వుంచుకుని, మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలను వాటి కనుగుణంగా అన్వయించి, చైనా విప్లవం కార్మికవర్గ నాయకత్వాన జయప్రదమవుతుందని మావో త్సే-టుంగ్ నిరూపించాడు. చైనా విప్లవం రెండు దశలుగా వుంటుందనీ, మొదటిది నూతన ప్రజాస్వామ్య విప్లవ దశనీ, రెండోది సోషలిస్టు విప్లవదశనీ నిర్ధారణ చేశాడు. నూతన ప్రజాస్వామ్య విప్లవదశలో కమ్యూనిస్టుపార్టీ అనుసరించే రాజకీయ-ఆర్థిక-సాంస్కృతిక కార్యక్రమాలు ప్రత్యేక లక్ష్యాలు కలిగివుంటాయనీ, పెట్టుబడిదారీ విధానానికి-సోషలిజానికి కూడ విభిన్నంగా వుండి భవిష్యత్తులో సోషలిస్టు విప్లవాన్ని జయప్రదం చేసేందుకు అనుగుణ్యంగా వుంటాయనీ విశదపరచాడు. చైనావిప్లవాన్ని గురించి, నవచైనా నిర్మాణం గురించి కమ్యూనిస్టుపార్టీ దృక్పథాన్ని "నూతన ప్రజాస్వామ్యం" అనే ఈ పుస్తకం సాకల్యంగా వివరించుతుంది. అప్పటి చైనా దేశ పరిస్థితులను వాస్తవికంగా చిత్రించింది. కార్మిక వర్గానికి, విప్లవ జన సామాన్యానికి సిద్ధాంత ఆయుధాలను అందచేసి, వారిలో నూతనోత్సాహాన్ని ప్రేరేపించింది.

## వంద రెజిమెంట్ల వుద్యమం

1940 ఆగస్టు 20 వ తేదీ రాత్రి ఉత్తర చైనాలోని ప్రధాన రహదార్ల 5 వేల కిలోమీటర్ల పొడగునా ఫిరంగిమ్రోతలు ప్రతిధ్వనించాయి. మొత్తం 4 లక్షల ఎర్రసైన్యం, 115 రెజిమెంట్లు స్థానిక ప్రజాసైన్యాల తోడ్పాటుతో జపాన్ దురాక్రమణ సేనలపై పెద్ద పెట్టున దాడి ప్రారంభించాయి.

చెంగ్‌టింగ్-టా యువాన్ రైల్వేపై ఎనిమిదవ రూట్ ఆర్మీ తన దృష్టిని కేంద్రీకరించింది. దానితోపాటు టాటుంగ్-పూచౌ, పెకింగ్-హాంకౌ, పెకింగ్-లియోనింగ్, పెకింగ్-సుయివాన్ రైల్వేలపైన ఉత్తర చైనాలోని మోటార్ రహదార్ల పైనా కూడ దాడిచేసింది. మొట్టమొదట హోపీ-షాన్సీ సరిహద్దున సహజరక్షణగా వున్న నియాంగ్‌ట్సే కువాన్ కనుమను కాపలాకాస్తున్న శత్రుసైన్యంతో తీవ్రమైన యుద్ధంచేసి, జాతీయ జెండాను అచట ప్రతిష్ఠించింది. ఆ కనుమకు తూర్పుగా వున్న, శత్రువుకు సైనికంగా అత్యంత ప్రాముఖ్యమున్న చింగ్‌హ్సింగ్ బొగ్గుగనులను, కార్మికుల సహాయంతో పేల్చివేసింది. దానితోపాటు కనుమకు పశ్చిమంగావున్న చెంగ్‌టింగ్ టాయువాన్ రైల్వేపై పెద్దపెట్టున దాడిచేసి, అన్ని వంతెనలను స్టేషన్లను టన్నెల్స్‌ను జపాన్ స్థావరాలను ధ్వంసం చేసింది.

20 రోజుల తీవ్రపోరాటం తరువాత చెంగ్‌టింగ్ - టాయువాన్ రైల్వే, తదితర రైల్వేలు మోటార్ రోడ్లు పూర్తిగా చిన్నభిన్నమైపోయినందున ఉత్తర చైనాలో శత్రు రహదారీ మార్గాలన్నీ బందు అయ్యాయి.

రహదారి మార్గాలకు రెండువైపులా ఉత్తర చైనాలోవున్న శత్రుస్థావరాలపై ఎర్రసైన్యం దాడిచేసి చాల నష్టం కలిగించింది. జపాన్‌వాళ్ళు తమ సైన్యాలను ఎక్కువగా సమీకరించి, ఎర్రసైన్యంతో తలపడ్డారు. ఐనప్పటికీ ఎర్రసైన్యం అనేక గొప్ప విజయాలను సాధించింది.

వంద రెజిమెంట్లయుద్ధం ఆగస్టు 20 నుంచి డిసెంబరు 3 తేదీవరకు మూడున్నర నెలలు కొనసాగింది. మొత్తంమైన 40వేల జపాన్ సేనలను, కీలుబొమ్మసేనలను నష్ట పరచింది. 450 కిలోమీటర్ల రైల్వేలను, 1500 కిలోమీటర్ల రహదార్లను ధ్వంసం చేసింది. ఆ సమయంలో చియాంగ్ కై-షేక్ జపాన్‌తో పోరాడకుండా తిష్టవేసి, కమ్యూనిస్టుపార్టీపై దాడిచేస్తున్నాడు. కమ్యూనిస్టుల నాయకత్వాన చైనాసేనలు విస్తృతరంగంలో దురాక్రమణదారులపై దాడిచేసి పెద్ద దెబ్బ కొట్టగలిగినందున రాజీ బేరాలు సాగించాలనే లొంగుబాటు ధోరణికి ఆస్కారం లేకుండాపోయింది.

## దక్షిణ ఆన్‌హ్వాయి ఘటన

జపాన్ దురాక్రమణదారులపై కమ్యూనిస్టు పార్టీ తీవ్రమైన దెబ్బలను కొడుతున్న సమయంలో చియాంగ్ కై - షేక్ మూఠా కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా రెండో కుట్రను ప్రారంభించింది. ఎర్రసైన్యానికి సంబంధించిన దళాలన్నీ నెల

రోజులలోపల ఎల్లోనది ఉత్తరవైపుకు చేరాలని ఉత్తరువులు పంపాడు. ఎర్రసైన్యం మధ్య చైనాలో నిర్మించిన జపాన్ వ్యతిరేక కేంద్రాలన్నిటినీ రద్దుచేసి ఆ ప్రాంతమంతటినీ జపాన్‌కు ధారాదత్తంచేసి, తరువాత రాజీబేరాలు సాగించాలనేది కోమింటాంగ్ పన్నాగం. ఎనిమిదవ రూట్ సైన్యం, నాల్గవ రూట్ సైన్యం తరలిపోతున్న సమయంలో ఆకస్మికంగా దాడిచేయాలని కూడ కుట్రచేశారు.

చియాంగ్ కై-షేక్ పన్నాగాలను కమ్యూనిస్టుపార్టీ బట్టబయలు చేసింది. కాని జపాన్ వ్యతిరేక ఐక్య సంఘటనను కాపాడేందుకు కొన్ని సూచనలను ఆమోదించింది. ఉదాహరణకు దక్షిణ అన్‌హ్వీయిలో వున్న నాల్గవరూట్ సైన్యాన్ని ఎల్లోనది ఉత్తర గట్టుకు తరలించడానికి అంగీకరించింది.

1941 జనవరి 4 వ తేదీన ఏహ్ టింగ్, హ్సియాంగ్ ఇంగ్ నాయకత్వాన నాల్గవ రూట్ సైన్యం 9 వేల మంది దక్షిణ అన్‌హ్వీయిలో చింగ్‌షీన్ కౌంటీని వదలి దక్షిణ కియాంగ్సూగుండా ఎల్లోనది ఉత్తరానికి బయలుదేరింది. రెండో రోజున చింగ్‌షీన్‌కు నైరుతి దిశగా వున్న మావోలిన్ వద్దకు చేరింది. పర్వతాలమధ్యవున్న సన్నదారిగుండా వెళ్ళుతున్న సమయంలో ఆకస్మికంగా 80 వేల కోమింటాంగ్ సైన్యం దాడిచేసింది. నాల్గవ రూట్ సైన్యం పోరాటంలో అనేక ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చింది. ఆహారం నీరు కొరత ఏర్పడినప్పటికీ వీరోచితంగా పోరాడింది. సేనాని ఏహ్‌టింగ్ ఖైదీ అయ్యాడు. ఉపసేనాని హ్సియాంగ్ ఇంగ్ మరణించాడు. పది రోజుల యుద్ధం తరువాత నాల్గవ రూట్ సైన్యం వీరులు కేవలం వేయిమంది మాత్రం కోమింగ్‌టాంగ్ వలయాన్ని ఛేదించుకుని బయటపడ్డారు. చియాంగ్ కై - షేక్, కోమింటాంగ్ అభివృద్ధినిరోధకులు చేసిన నీచమైన ఈ నమ్మకద్రోహం "దక్షిణ అన్‌హ్వీయి సంఘటన" అని పిలువబడుతోంది.

దక్షిణ అన్‌హ్వీయి సంఘటన జరిగిన వెంటనే జపాన్ సైన్యాలు కీలుబొమ్మ ప్రభుత్వ సేనలు అన్‌హ్వీయి కియాంగ్సూ రాష్ట్రాలలోని నాల్గవ రూట్ సైన్యంపై దాడి ప్రారంభించాయి. అదే సమయంలో కోమింటాంగ్ సేనలుకూడ పెద్దయెత్తున దాడి ప్రారంభించాయి. నాల్గవ రూట్ సైన్యం క్లిష్టపరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చింది.

కమ్యూనిస్టుపార్టీ తక్షణమే నాల్గవరూట్ సైన్యాన్ని బలపర్చేందుకు చర్యలు తీసుకుంది. తద్వారా ప్రతిఘటన యుద్ధానికి విఘ్నం జరుగకుండా అరికట్టింది. కమ్యూనిస్టుపార్టీ సెంట్రల్ కమిటీ రివల్యూషనరీ మిలిటరీ కౌన్సిల్ నాల్గవరూట్ సైన్యానికి తాత్కాలిక సేనానిగా చెన్ ఈను, ఉపసేనానిగా చాంగ్ యున్-ఈను, రాజకీయ కమిసార్‌గా లియోషావ్-చీ ను నియమించింది. ఈవిధంగా పునర్నిర్మించాక నాల్గవరూట్ సైన్యం క్రమంగా బలపడింది.

నాల్గవ రూట్ సైన్యం నిర్మించిన జపాన్ వ్యతిరేక కేంద్రాలు యాంగ్‌ట్సీ నది మధ్య, దిగువ ప్రాంతాలలో, హుయినది ఇరువైపులా కూడ విస్తరించి

వున్నాయి. ఈ కేంద్రాలలో వున్న ప్రజాస్వామ్య ప్రభుత్వాలు జపాన్‌తో పోరాడటానికి సిద్ధంగావున్న ప్రజాస్వామ్య శక్తుల ప్రతినిధులందరినీ తమలో లీనం చేసుకున్నాయి. మక్తాలను, వడ్డీరేటును తగ్గించడానికి చర్యలు తీసుకుంది. వ్యవసాయోత్పత్తిని పెంచేందుకు, నీటి వనరులను నిర్మించేందుకు, సంస్కృతీ కలాపాలను వృద్ధి చేసేందుకు కృషి చేసింది. సంస్కృతీ, విద్యారంగాలలో ప్రసిద్ధి చెందినవా రనేక మంది, విద్యార్థులు చాలమంది కొమింటాంగ్ ప్రాంతాలనుంచి, జపాన్ ఆక్రమిత ప్రాంతాలనుంచి జపాన్ వ్యతిరేక కేంద్రాలకు చేరుకున్నారు.

1941 జూన్ 21 తేదీన సోవియట్ యూనియన్‌పై జర్మనీ దాడి చేసింది. డిసెంబరు 9 తేదీన పసిఫిక్ సముద్రంలో అమెరికారేవు పెరల్‌హార్బర్‌పై ఆకస్మికంగా దాడిచేసి జపాన్ పసిఫిక్‌యుద్ధాన్ని ప్రారంభించింది. చైనాపై యుద్ధం ముగించే ప్రయత్నంలో జపాన్ తన బలాలలో నూటికి 60 వంతులను, కీలుబొమ్మ సేనలలో నూటికి 90 వంతులను జపాన్ వ్యతిరేక కేంద్రాలపై ప్రయోగించింది. అన్నీ తగలపెట్టడం, అందరినీ చంపడం, అన్నీ దోచుకోవడం — "మూడు సర్వం సహాల" అనే విధానాన్ని అమలు జరిపింది. అదే సమయంలో కొమింటాంగ్‌పై ఒత్తిడిని జపాన్ ఎక్కువ చేసింది.

చియాంగ్ కై-షేక్ రహస్య ఉత్తరువులను అనుసరించి, కొమింటాంగ్ పక్షానికి చెందిన ఉన్నతోద్యోగులు అనేకమంది శత్రువుకు లొంగిపోయారు. 5 లక్షలకు పైగా కొమింటాంగ్ సేనలు జపాన్‌వైపుకు తిరిగిపోయాయి. జపాన్ సేనానుల ఆధిపత్యంక్రింద కీలుబొమ్మ సేనలుగా తయారై ప్రజలను హింసించసాగాయి.

జపాన్-కొమింటాంగ్ సేనలు కలసి ఐక్యంగా దాడి చేసినపుడు 1941-42 లో జపాన్ వ్యతిరేక సైన్యం ప్రతిఘటనా కేంద్రాలు విపరీతమైన చిక్కులను ఎదుర్కోవలసి వచ్చింది. 1940 లో 4 లక్షలవరకు వున్న ఎనిమిదవ రూట్ సైన్యం 3 లక్షల 3 వేలకు తగ్గిపోయింది. 1940 నాటికి 10 కోట్ల జనాభా నివసించుతున్న జపాన్ వ్యతిరేక కేంద్రాల విస్తీర్ణం తగ్గిపోయి, 1942 నాటికి 5 కోట్ల జనాభా మాత్రమే నివసించే విస్తీర్ణం మాత్రం మిగిలివుంది.

67 వ అధ్యాయం

# విముక్త ప్రాంతాలు : కొమింటాంగ్ అధీనప్రాంతాలు

## విముక్త ప్రాంతాలలో పునర్నిర్మాణం

ప్రతిఘటన యుద్ధం కొనసాగుతున్న అత్యంత గడ్డు సంవత్సరాలలో కమ్యూనిస్టుపార్టీ, షెన్సీ - కంసు - నింగ్ షా సరిహద్దులలోని విముక్త ప్రాంతాలలో పునర్నిర్మాణ కృషినిచేపట్టింది. జపాన్ ఆక్రమిత ప్రాంతాలకు వెనుకతట్టున వున్న జపాన్ వ్యతిరేక కేంద్రాలలో కూడ నిర్మాణ కార్యక్రమం తీసుకుంది.

విముక్తప్రాంతాలలో జపాన్ వ్యతిరేక ప్రజాస్వామ్య ప్రభుత్వాలను ఏర్పర చేందుకు "మూడు పార్టీల ఐక్య పద్ధతి" అనే నిర్మాణసూత్రాన్ని కమ్యూనిస్టుపార్టీ అమలుజరిపింది. దీని అర్థం ఏమంటే కార్మికవర్గానికి, బీదరైతులకు ప్రాతినిధ్యం వహించే కమ్యూనిస్టులు, మధ్యతరగతి (పెటీబూర్జువా) ప్రజలకు ప్రాతినిధ్యంవహించే పార్టీయేతర అభ్యుదయశక్తులు, మధ్యరకపు పెట్టుబడిదారులకు, దేశభక్తిపరులైన భూస్వాములకు ప్రాతినిధ్యం వహించే మధ్యంతర శక్తులకు, - ప్రభుత్వ సంస్థలన్నిటిలో మూడోవంతు స్థానాలను ప్రతి ఒక గ్రూపుకు యివ్వాలిసి వుంటుంది. 1941-42 సంవత్సరాలలో వివిధ విముక్త ప్రాంతాలలోనూ ఈ పద్ధతి ప్రకారం రాజకీయ సమితులు, స్థానిక ప్రభుత్వాలు ఎన్నుకోబడ్డాయి. తద్వారా జపాన్ వ్యతిరేకశక్తులన్నిటినీ కమ్యూనిస్టుపార్టీ ఐక్యపరచింది. విముక్త ప్రాంతాలలోని ప్రభుత్వాన్ని, జాతీయ ఐక్యసంఘటనకు చిహ్నంగా చేయగలిగింది.

విముక్త ప్రాంతాలలో మక్తాలను, వడ్డీరేటును తగ్గించే వ్యవసాయ విధానాన్ని కమ్యూనిస్టుపార్టీ అమలు జరిపింది. దీనిప్రకారం రైతులనుండి మక్తాలను, వడ్డీరేటును తగ్గించి భూస్వాములు వసూలు చేసుకోవాలి. ఇందువల్ల విముక్తప్రాంతాల ప్రజల్లో జపాన్ వ్యతిరేకత, పోరాటదీక్ష ఇనుమడించాయి.

విముక్త ప్రాంతాలలో సంస్కృతీ వుద్యమం, విద్యాబోధనకూడ పెంపొందింది. ఐతే దీని పునాది బలహీనంగా వుంది. ఉదాహరణకు షెన్సీ-కంసు-నింగ్ షా

సరిహద్దు ప్రాంతంలో ప్రాథమిక పాఠశాలలను, వయోజనులకు విశ్రాంతికాలంలో (ముఖ్యంగా చలికాలంలో) విద్యాబోధన, పత్రికాపఠన కేంద్రాలు బాగా వృద్ధి చెందాయి. కొన్ని ఉన్నత విద్యాసంస్థలు కూడ ప్రారంభించబడ్డాయి. ఉదాహరణకు చైనా ప్రజల జపాన్ వ్యతిరేక మిలిటరీ - రాజకీయ విశ్వవిద్యాలయం, లూ హ్సున్ కళల ఎకాడమీ, మార్క్స్-లెనిన్ సంస్థ, యెనాన్ విశ్వవిద్యాలయం స్థాపించబడ్డాయి. విమోచన అనే దినపత్రిక, అనేక వార, మాస పత్రికలు సరిహద్దు ప్రాంతాలలోను, దేశంలోని ఇతర ప్రాంతాలలోను కూడ విశేష ప్రచారం, పలుకుబడి కలిగి వుండేవి.

విముక్త ప్రాంతాలపై శత్రుదాడులవల్లనూ, దిగ్బంధనవల్లనూ అనేక తీవ్రమైన ఆర్థిక చిక్కులు కలిగాయి. 1942 లో పార్టీ పిలుపునందుకుని, ఆర్థిక విధానాన్ని అభివృద్ధి చేసేందుకు, ఉత్పత్తిని ఎక్కువ చేసేందుకు విముక్త ప్రాంతాలలోని సైన్య, ప్రజలు విస్తృతమైన వుద్యమాన్ని ప్రారంభించారు. రైతులు, సైనికులు, పార్టీ కార్యకర్తలు, ప్రభుత్వ నిర్వాహకులు అందరూ కలసి పారిశ్రామికోత్పత్తిని, వ్యవసాయోత్పత్తిని పెంపొందించేందుకు తీవ్రంగా కృషి చేశారు. పశు సంపదను పెంచేందుకు, రవాణా సౌకర్యాలను అభివృద్ధి చేసేందుకు కృషి చేశారు. పరస్పర సహాయక సంస్థలను నిర్మించుకోవడంలో రైతులకు కమ్యూనిస్టుపార్టీ తోడ్పడింది. డబ్బు, విత్తనాలు అప్పుగా యిప్పించి సహాయపడింది.

ఉత్పత్తి పెంచే వుద్యమం ఫలితంగా షెన్సీ - కంసు - నింగ్‌షా సరిహద్దు ప్రాంతంలో సాగవుతున్న భూమి, 1938 నాటికి 90 లక్షల మూలు వుంటే 1945 నాటికి 150 లక్షల మూలకు పెరిగింది. ధాన్యం, ప్రత్తి వుత్పత్తి బాగా పెరిగింది. ఇనుము కరిగించే పరిశ్రమను, నూనె పరిశ్రమను, యంత్ర కర్మాగారాలను, ఆయుధాలను యుద్ధ సామాగ్రిని తయారుచేసే పరిశ్రమను, కుండలు పింగాణీ పరిశ్రమను విముక్తి ప్రాంతాలలో ఏర్పరచుకున్నారు. 2 లక్షల రైతు స్త్రీలు నూలు వడకడం, బట్టలు నేత పరిశ్రమలలో పాల్గొన్నారు. వర్తకం అభివృద్ధి చెందింది. కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యాలయమున్న ఎనాన్‌లో 1936 నాటికి 120 మాత్రమేవున్న వ్యాపారసంస్థలు 1943 నాటికి 470 కి పెరిగాయి.

శత్రు ఆక్రమిత ప్రాంతాల వెనుకతట్టునవున్న జపాన్ వ్యతిరేక కేంద్రాలలో కూడ నిర్మాణకృషి పెద్దపెట్టున సాగింది. నిరంతర కృషిద్వారా విముక్తప్రాంతాలలో సైన్యం ప్రజలు విపరీతమైన ఆర్థిక చిక్కులను అధిగమించగలిగారు.

## కమ్యూనిస్టు పార్టీ : (Rectification) సుధారక వుద్యమం

కమ్యూనిస్టుపార్టీ పోరాటపటిమను బలపరచేందుకు ప్రతిఘటనా యుద్ధ కాలంలో - పరిస్థితులలో చాల కొలదిమార్పులు మాత్రమే వున్నదశలో - పార్టీ సభ్యులందరికీ మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాలను గురించిన పరిజ్ఞానం కలుగజేయడానికి కృషి జరిగింది.

కేంద్ర కమిటీ నాయకత్వంక్రింద పార్టీ సభ్యులందరూ విమర్శన-ఆత్మవిమర్శనా విధానాన్ని అమలు జరపుటద్వారా తమ ఆలోచనా ధోరణిలోనూ, పనిలోనూ వున్న లోటుపాటులను పరిశీలించుకునేవారు. పార్టీనాయకత్వాన్ని పరీక్షించేవారు. స్వీయమానసిక ధోరణి, వాంఛెక్కుపోకడ, అర్థరహితంగా పార్టీసూత్రాలను వల్లించడం వీటియెడల ప్రత్యేక జాగ్రత్త వహించారు. 'అధ్యయన విధానాన్ని సంస్కరించండి', 'పార్టీ పనివిధానాన్ని సరిచేయండి' వగైరా మావో సేటుంగ్ వ్యాసాలు, కళలు, సాహిత్యంపై ఎనాన్ వేదికనుంచి ఆయన ఇచ్చిన ఉపన్యాసాలు, మంచి కమ్యూనిస్టు ఎలా వుండాలి, పార్టీ అంతరంగిక పోరాటం అను విషయాలపై శ్రీ షావ్-చీ వుపన్యాసాలు పార్టీసభ్యుల అధ్యయనానికి బాగా వినియోగపడ్డాయి.

పార్టీ సుధారక వుద్యమంవల్ల కార్యకర్తలకు ప్రజాసామాన్యంతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. పరిశీలన పరిశోధనాశక్తి ఇనుమడించింది! వాస్తవికదృష్టి ఏర్పడింది. మార్క్సిస్టు-లెనినిస్టు అవగాహన కలిగించి, పార్టీసభ్యులమధ్య ఐకమత్యాన్ని పెంపొందిందింది.

## విముక్త ప్రాంతాలలో మిలిటరీ పోరాటాలు

1942 మే నెలలో మధ్య హోపీ మైదాన ప్రాంతంలో జపాన్‌వాళ్ళు క్రూర నిర్బంధ విధానాన్ని అమలుజరిపారు. 8 వేల గ్రామాలచుట్టూ 1500 బలమైన స్థావరాలను నిర్మించింది. మోటారు రోడ్లు వేసి 700 సాయుధ శకటాలతో గస్తీ దళాలను ఏర్పరచింది. ఖూనీలు, చిత్రవధలు వగైరా దారుణ హింసాకాండను మైదానప్రాంతమంతటా ప్రారంభించింది. మిలిటరీ చర్యలద్వారా ప్రజలలో భీతావహం కలిగించి లొంగదీసుకోవాలని ప్రయత్నించింది. కాని జపాన్ అంచనాలన్నీ తలక్రిందులయ్యాయి. ఎనిమిదవ రూట్ సైన్యం ప్రజాదళాల తోడ్పాటుతో శత్రు పన్నాగాన్ని పటాపంచలు చేసింది.

టాచింగ్ పర్వతాల అంచున వున్న పచ్చగడ్డి మైదానాల్లో ఎనిమిదవ సైన్యానికి చెందిన అశ్వికదళం పనిచేస్తుండేది. విమానాలు, సాయుధ శకటాల సహాయంతో జపాన్‌వాళ్ళు ఈ దళంపై వరసగా దాడులు చేశారు. ఎర్రసైన్య అశ్వికదళం అన్నిరుతువుల్లోనూ రాత్రింబవళ్ళు, కొన్నిసార్లు వారాలకొలదీ గుర్రాలపైనే వుండి నిరంతర పోరాటం సాగించింది. పెకింగ్ - సూయివాన్ రైల్వే పొడుగునా నిర్మించిన శత్రు స్థావరాలను ధ్వంసం చేసింది.

1943 అక్టోబరు నెలలో షాన్సీలోని టాయుహ్ పర్వతాలలో యుద్ధం జరిగింది 20 వేల జపాన్ సైన్యం కమ్యూనిస్టు స్థావరాలపై దాడి చేసింది. ఉత్తరాన్నుంచి. దక్షిణానికి, దక్షిణాన్నుంచి ఉత్తరానికి ఆప్రాంతమంతటినీ శత్రుసైన్యాలు గాలించివేశాయి. జపాన్ వ్యతిరేక స్థావరాలను ఎలా ధ్వంసం చేయాలో నేర్చుకునేందుకు 180 మంది జపాన్ అధికారుల పరిశీలక బృందాన్ని కూడ అచటికి జపాన్ పంపింది.

కాని కమ్యూనిస్టు స్థావరాలు ధ్వంసం కాలేదుగాని 'పరిశీలక బృందాన్ని' ఎర్ర సైన్యం తుడిచిపెట్టింది. వారిలో ముగ్గురు మాత్రమే ప్రాణాలతో బయటపడ్డారు.

ఉత్తర చైనా, మధ్య చైనా విముక్త ప్రాంతాలలో కూడ అనేక విజయాలను ఎర్రసైన్యం సాధించింది. 1941 నుంచి జపాన్‌వాళ్ళు కీలుబొమ్మ సేనల తోడ్పాటుతో కియాంగ్సూ, అన్‌హ్వాయి, హుపే వగైరా రాష్ట్రాల్లో గ్రామాలన్నిటినీ గాలించడం ప్రారంభించింది. ఎక్కువ సైన్యంతో ఒక ప్రాంతాన్ని ఆక్రమించడం, కొన్ని వందల చదరపు కిలోమీటర్ల చుట్టూ ముళ్ల కంచెను వేసి, అచటి గ్రామాలన్నిటినీ గాలించడం పనిగా పెట్టుకున్నారు. ప్రతి ఇల్లునూ నాల్గవ రూట్ సైన్యం మనుషులను పట్టుకునేందుకు సోదాచేసేవారు. ప్రజలందరినీ గుర్తు కార్డులను పూర్తిచేయమని బలవంతిపెట్టేవారు. "మంచి ప్రవర్తనతో వుంటామని హామీ పుచ్చుకునేవారు." క్రొత్త నాల్గవ రూట్ సైన్యం వెనుకనుంచి, ప్రక్కనుంచి శత్రువుపై దెబ్బతీసి అదే సమయాన ప్రజలను సమీకరించి జపాన్ వలయాన్ని బ్రద్దలుచేసేది. చుట్టుముట్టే తమ పన్నాగం జయప్రదమయిందనుకుంటున్న సమయంలోనే వాళ్ళు ఎన్నో నెలలు కష్టించి నిర్మించిన ముళ్ళకంచెను ఒకరాత్రి నిప్పంటించి తగులబెట్టేవారు. ఈ విధంగా ప్రజల తోడ్పాటుతో క్రొత్త నాల్గవ సైన్యం క్లిష్ట పరిస్థితులను అధిగమించి, మధ్య చైనాలో విముక్త ప్రాంతాలను రక్షించగలిగింది.

విముక్తప్రాంతాలలో స్థానిక ప్రజలనుంచి ప్రజాదళాలను నిర్మించడం కమ్యూనిస్టుపార్టీ ముఖ్య కర్తవ్యంగా ఎంచింది. సైన్యంలోనూ, గెరిల్లా దళాలలోను శరీరధారుఢ్యం గలవారు చేరగా మిగిలినవారందరూ ప్రజాదళాలలో చేరేవారు. తమ ఇళ్ళను ఆయుధాలతో రక్షించుకోవడం, ఉత్పత్తిని పెంచడంతోపాటు యివి అవసరమైనపుడల్లా సైన్యానికి, గెరిల్లా దళాలకు ఎంతో విలువైన తోడ్పాటును యిచ్చాయి. మక్తాలను వడ్డీరేటు తగ్గించే వుద్యమాలు పెంపొందేకొలదీ ప్రజాదళాలు బలపడేవి.

శత్రువుపై పోరాడే పద్ధతులను ప్రజాదళాలు ప్రత్యేకంగా రూపొందించుకున్నాయి. జపాన్‌వాళ్లను, కీలుబొమ్మసేనలను తరచుగా మందుపాతరలున్న దార్ల వెంట వచ్చేలా మభ్యపరచగలిగేవారు. మైదానాలలో అనేకచోట్ల కందకాలుత్రవ్వి, నదులకు అడ్డుకట్టలువేసి శత్రుశకటాలు, స్టీమర్ల ప్రయాణాన్ని అరికట్టేవారు. ఉత్తర చైనాలో ప్రజాదళాలు వివిధ గ్రామాలమధ్య, ఇరుగుపొరుగు కొంటీలమధ్య కందకాలు త్రవ్వేవారు. ఈ కందకాలలో రక్షణ తీసికొని అవసరమైనపుడు ఆకస్మికంగా శత్రువులపై దాడి చేసేవారు.

1940 లో వంద రెజిమెంట్ల ఉద్యమ సమయంలో శత్రు రహదారులను బంద్‌చేసే కృషిలో మధ్య హోపేలో 8 లక్షల 50 వేలమంది ప్రజలు పాల్గొన్నారు. 1943 లో తూర్పు షాంటుంగ్‌లో శత్రువులను తుడిచివేసే వుద్యమంలో 10 వేలమంది

ప్రజాదళ సభ్యులు పాల్గొన్నారు! రోడ్లను, టెలిగ్రాఫ్ తీగలను ధ్వంసంచేశారు; వంతెనలను, కాపలా గోపురాలను కూల్చివేశారు. 1943 లో వివిధ విముక్త ప్రాంతాలలో 50 వేల శత్రుసైన్యాలను ప్రజాదళాలు తుడిచిపెట్టాయి.

పైన ఉదహరించిన రాజకీయ, ఆర్థిక సంస్కరణలను అనులుజరుపడం వల్లనూ, సాయుధ పోరాటాన్ని తీవ్రతరం చేయడంవల్లనూ, సుధారక వుద్యమం ద్వారా పార్టీ సంస్థలను పునర్నిర్మించడం వల్లనూ విముక్త ప్రాంతాలు తామెదుర్కొన్న కష్టాలన్నిటినీ అధిగమించాయి. అంతకు ముందుకంటే 1943 తరువాత క్రమంగా మరింత బలపడ్డాయి. ప్రతిఘటన యుద్ధం యొక్క ప్రధాన పోరాటరంగాలు విముక్త ప్రాంతాల్లోనే వుండేవి. 1943 లో ఈ ప్రాంతాల్లోని ప్రజలు సైన్యం కలసి, పోరాటంలో జపాన్ సేనల్లో నూటికి 64 వంతులు కీలుబొమ్మ సేనల్లోను, నూటికి 95 వంతులతోనూ పోరాటంలో తలపడి నిలువరించాయి. ఈ విముక్త ప్రాంతాలను విస్తరించడం బలపరచడం వల్లనే, చైనా ప్రజల అంతిమ విజయానికి, భవిష్యత్తులో స్వతంత్రమైన నవచైనాను నిర్మించడానికి ప్రాతిపదిక, హామీ ఏర్పడింది

## నాలుగు పెద్ద కుటుంబాల పరిపాలన

కొమింటాంగ్ పరిపాలించే ప్రాంతాలు, ప్రతిఘటన యుద్ధంరోజుల్లో ఎలాంటి ఇబ్బందులను ఎదుర్కొన్నారో చూదాం. ఫాపీ కరెన్సీని బలవంతాన రుద్ది ప్రజలను మోసంచేసి, వారి ధనాన్ని, ఇతర ఆస్తులను నాలుగు పెద్ద కుటుంబాలు దోచుకున్నాయి. (ఉదాహరణకు ప్రతిఘటన యుద్ధకాలంలో 10,31,700 కోట్ల యువాన్ల కరెన్సీ నోట్లను - బహుశః ఇంతకంటే చాల ఎక్కువగానే - అచ్చువేసింది.)

తమ గుత్త వ్యాపార సంస్థలను బలపరచుకునేందుకు నాలుగు పెద్ద కుటుంబాలు నిరంతరం కృషిచేశాయి. దేశార్థికవనరులను తమ అధీనంలో వుంచుకుని తాము విపరీతంగా ధనం గడించారు. ముడిపట్టు, తేయాకు, టంగ్ ఆయిల్, కుంచీలు, వాల్ఫ్రామ్, ఆంటిమెనీ వగైరా కొనడం, ఎగుమతి చేయడం తమ చేతుల్లో వుంచుకున్నారు. దూది, నూలు, బట్ట, పంచదార, సిగరెట్లు, నిప్పెట్టెలు వగైరా అమ్మకాన్ని కూడ తమ గుత్తాధికారంలో వుంచుకున్నాయి. ముడిపదార్థాలకు తక్కువ ధర లిచ్చి ఉత్పత్తిదారులను దోచుకునేవారు. తాము అమ్మే సరుకులకు ఎక్కువ ధర వసూలుచేసి జనసామాన్యాన్ని దోచుకునేవారు. తమ భాగ్యాన్ని పెంచుకునేందుకు ఎంత నీచమైన పద్ధతులనైనా అవలంబించడానికి నాలుగు పెద్దకుటుంబాలు ఏమాత్రం సందేహించేవి కావు. జపాన్ సామ్రాజ్యవాదులతోను, జాతీయ ద్రోహులతోను చేతులు కలిపి దొంగవ్యాపారం కొనసాగించేవారు.

పల్లె ప్రాంతాలలో పన్నులను వస్తురూపేణా వసూలు చేసే విధానాన్ని నాలుగు పెద్ద కుటుంబాలు అమలుజరిపాయి. భూస్వాములు ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని ఈ పన్నుల భారాన్ని రైతుల భుజాలపైకి మార్చేవారు. 1942

నాటికి ఈ విధంగా రైతులు పండించే మొత్తం పంటలో హూనాన్‌లో నూటికి 52 వంతులు, జీచివాన్‌లో నూటికి 59 వంతులవరకు పన్నుల భారం పెరిగింది.

ప్రతిఘటన యుద్ధకాలంలో జాతీయ సంక్షోభాన్ని వినియోగించుకుని నాలుగు పెద్ద కుటుంబాలు తమ సంపదలను విపరీతంగా పెంచుకున్నాయి.

కొమింటాంగ్ ప్రభుత్వం ఈ నాలుగు పెద్ద కుటుంబాల అధీనంలో వుండటం, అవినీతిపై ఆధారపడి వుండటం వల్లనే వాస్తవానికి జపాన్ ప్రతిఘటన నామమాత్రంగానూ, కమ్యూనిస్టు వ్యతిరేక పోరాటాన్ని తీవ్రంగానూ సాగించాలన్న నిర్ణయానికి తప్పనిసరిగా వచ్చింది.

మొదటి రెండు కమ్యూనిస్టు వ్యతిరేక వుద్యమాలు విఫలమయ్యాక చియాంగ్‌కై షేక్ మళ్ళా 1943 జూన్‌లో షెన్సీ-కెంసు-నింగ్‌షా సరిహద్దు ప్రాంతంపై మెరుపు దాడి చేయాలనీ, చైనా విప్లవ శక్తుల కేంద్రమైన ఎనాన్‌ను ఆక్రమించుకోవాలనీ ప్రయత్నించింది. కాని ఈ పన్నాగాన్ని ముందుగానే కమ్యూనిస్టుపార్టీ బట్టబయలు చేసినందున, దేశమంతటా ప్రజలు తీవ్రంగా నిరసించినందున ఈ ప్రయత్నాన్ని వదులుకోక తప్పలేదు.

కొమింటాంగ్ ప్రాంతాలలో ప్రతిచోటా రహస్య ఏజెంట్లు వుండేవారు. లాంచౌ, సియాన్, చుంగ్‌కింగ్, పాంగ్‌జావ్ మరి చాలాచోట్ల చిత్రవధ క్యాంపులను పెట్టి ప్రజలలో భీతావహం కలిగించేందుకు ప్రయత్నించింది. అనేక మంది కమ్యూనిస్టులను, దేశభక్తులను, అభ్యుదయ భావాలుగల యువకులను హింసించింది. అభ్యుదయ సంస్కృతీ కార్యకలాపాలను అరికట్టేందుకు కొమింటాంగ్ అన్నివిధాల ప్రయత్నించింది. సంస్కృతీ వుద్యమంలో ప్రముఖుడైన ట్సోటావ్ - ఫెన్ స్థాపించిన 54 పుస్తకాలయాల్లో 53 టిని 1939-40 సంవత్సరాలలో కొమింటాంగ్ మూసివేసింది.

1944 లో కొమింగ్‌టాంగ్ ఆక్రమిత ప్రాంతాలపైన జపాన్‌వాళ్ళు కొత్త దాడిని ప్రారంభించారు. చైనా ప్రధాన భూభాగంతో రహదార్లను తెరచి వుంచేందుకు ఈ దాడికి పూనుకున్నారు. కొమింగ్‌టాంగ్ సైన్యాలు పోరాటపటిమ కోల్పోయి నిరుత్సాహంలో వున్నందున, ఎనిమిది మాసాల్లోనే దురాక్రమణదారులు హోనాన్, హునాన్, క్వాంగ్సీ, క్వాంగ్‌టుంగ్ రాష్ట్రాలలో హెచ్చు భాగాన్ని ఆక్రమించుకుని, ఆగ్నేయ క్వీచౌలోని టుషాన్ కౌంటీలోనికి చొచ్చుకుపోయారు.

## కొమింగ్‌టాంగ్ ప్రాంతాలలో ప్రజాస్వామ్య పోరాటం

ప్రజల ఒత్తిడివల్ల కొమింగ్‌టాంగ్ ప్రభుత్వం 1938 లో ప్రజల రాజకీయ సమితిని సమావేశ పరచింది. దీన్లో అధిక సంఖ్య స్థానాలను కొమింగ్‌టాంగ్ పక్షమే ఆక్రమించినందున ప్రభుత్వంపై దీని కెలాంటి కంట్రోల్ లేదు. ఐనప్పటికీ కొందరు కమ్యూనిస్టులు, పలుకుబడిగల దేశభక్తులు వున్నందున ప్రజాస్వామ్య ఆశయాలను వెల్లడించేందుకు వేదికగా రాజకీయసమితి రూపొందింది.

1944 సెప్టెంబరులో జరిగిన ప్రజల రాజకీయసమితి సమావేశంలో కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధియైన లిన్‌పో-చు కోమింగ్‌టాంగ్ నియంతృత్వాన్ని రద్దుచేసి, ప్రజాస్వామ్య సంయుక్త ప్రభుత్వ స్థాపననుగురించి చర్చించేందుకు అత్యవసర మహాసభను జరపాలని కోరాడు. అప్పటికే చియాంగ్ కై-షేక్ నియంతృత్వపాలన, కోమింగ్‌టాంగ్ సైన్యాల పరాజయాలవల్ల ప్రజలలో తీవ్ర అసంతృప్తి ఏర్పడింది. ప్రతిఘటన యుద్ధాన్ని జయప్రదంగా నిర్వహించేందుకు, సంపూర్ణమైన రాజకీయ సంస్కరణలను అమలుజరపాలని ఎలుగెత్తి చాటారు. ప్రజాస్వామిక సంయుక్త ప్రభుత్వాన్ని ఏర్పరచాలని కమ్యూనిస్టుపార్టీ ప్రతిపాదించగానే, అన్నివర్గాల ప్రజా ప్రతినిధులు, చుంగ్‌కింగ్‌లో సమావేశమై ఆ సూచనను బలపరచారు. చెంగ్టూలో రెండు వేలమంది విద్యార్థులు కాగడాల వూరేగింపు జరిపి, ప్రజాస్వామిక సంయుక్త ప్రభుత్వాన్ని స్థాపించాలని కోరారు. అన్ని ప్రజాస్వామ్య పార్టీలు, గ్రూపులు, దేశంలోని అన్ని తరగతుల ప్రజలు సముద్రాంతర చైనీయులు కమ్యూనిస్టుపార్టీ పిలుపును అందుకున్నారు. ప్రజాస్వామ్య సంస్కరణల కొరకు ఉద్యమం ప్రజావెల్లువగా విజృంభించింది.

68వ అధ్యాయం

# ప్రతిఘటన యుద్ధ విజయం

1944లో విముక్త ప్రాంతాల్లోని సాయుధసేనలు ప్రజల సహాయంతో కొన్ని యుద్ధ రంగాలలో ఎదురుదాడి ప్రారంభించాయి. మరుసటి సంవత్సరం వసంతకాలం నాటికే ఉత్తరాన జెహోలెగాంచి దక్షిణాన హైనాన్ దీవివరకు 19 విముక్త ప్రాంతాలు మొత్తం 9 కోట్ల 55 లక్షల జనాభాగల విస్తీర్ణంగా వ్యాప్తి చెందాయి. ఎనిమిదవ రూట్ సైన్యం, కొత్త నాల్గవ సైన్యం, దక్షిణచైనాలోని జపాన్ వ్యతిరేక గెరిల్లా దళాలు కలసి చైనా ప్రజా విమోచన సైన్యంగా రూపొందింది. దీని బలం 9 లక్షల 10 వేలకు పెరిగింది. ప్రజా వాలంటీరు దళాల సంఖ్య 22 లక్షలకు వృద్ధి చెందింది. చైనా ముఖ్యనగరాలలో అధిక సంఖ్యను, ప్రధాన రవాణా మార్గాలను, సముద్రతీరాన్ని ప్రజా విమోచన సైన్యం స్వాధీనం చేసుకుంది. ప్రతిఘటన యుద్ధం అంతిమ విజయం కనుచూపు మేరలో వుంది.

1945 వ సంవత్సరం ఏప్రిల్ 23 వ తేదీన కమ్యూనిస్టుపార్టీ సప్తమ జాతీయ మహాసభ ఎనాన్‌లో సమావేశమయింది. ఐక్య ప్రజా ప్రభుత్వ నిర్మాణావశ్యకతను గురించి మావో సేటుంగ్ నివేదిక యిచ్చాడు. ప్రతిఘటన యుద్ధాన్ని జయించేందుకు పార్టీ యావత్తూ, ప్రజలందరూ పూనుకోవాలని, యుద్ధానంతరం నూతన ప్రజా స్వామ్య చైనాను నిర్మించేందుకు కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమాన్ని వివరించాడు. నూతన ప్రజాస్వామ్య విప్లవ కార్యక్రమాన్ని అమలు జరిపేందుకు ఐక్య ప్రజా స్వామ్య ప్రభుత్వ స్థాపన అత్యంత కీలకమైనదని నిరూపించాడు. ఏడవ జాతీయ మహాసభ కమ్యూనిస్టుపార్టీ సంపూర్ణ ఐక్యతను, పోరాటంలోనూ, విజయంలోని పూర్తి విశ్వాసాన్ని వ్యక్తం చేసింది.

1945 మే నెల 2వ తేదీన సోవియట్ ఎర్రసైన్యం జర్మనీ రాజధాని బెర్లిన్ నగరాన్ని పట్టుకొంది. నాజీ జర్మనీ ఓడిపోయింది. ఆగస్టు 8వ తేదీన సోవియట్ యూనియన్ జపాన్‌పై యుద్ధం ప్రకటించింది. సోవియట్ ఎర్రసైన్యం ఈశాన్య చైనాలోనికి దిగ్విజయ యాత్ర చేశాయి. అదేసమయంలో సోవియట్ నావికా సేనలు సఖాలిన్ దీవిపైన, కొరియాపైన, లియోటుంగ్ ద్వీపకల్పంపైన దాడి చేశాయి.

మంగోలియన్ ప్రజారిపబ్లిక్ కూడ యుద్ధంలో ప్రవేశించింది. దాని ఆశ్విక సైన్యాలు జపాన్ దురాక్రమణ దారులపై పోరాటం ప్రారంభించాయి.

జపాన్ సామ్రాజ్యవాదులు తమ ముఖ్యబలాన్ని, పదిలక్షల క్వాంగ్ టుంగ్ సైన్యాన్ని ఈశాన్యచైనాలోనూ, కొరియాలోనూ కేంద్రీకరించారు. పర్వతశ్రేణులను, ఎడారులను వినియోగించుకొని రక్షణ దుర్గాలను నిర్మించారు. విపరీతమైన ఆయుధ సప్లయిలను వెనుకతట్టున అందుబాటులో వుంచుకొన్నారు. కాని ఈ యేర్పాటులన్నీ ఎర్రసైన్యం విజృంభణముందు నిరుపయోగమయ్యాయి. ఒక పక్షం రోజుల్లో ఎర్ర సైన్యం జపాన్ మిలటరీకి గర్వకారణమైన క్వాంగ్ టుంగ్ సైన్యాన్ని తుత్తునియలు చేసివేసింది. ఆగ్నేయ చైనా, కొరియాలోని విశాలప్రాంతాలను విముక్తి చేసింది.

ఆగస్టు 9 వ తేదీన మావో సే-టుంగ్ ఒక ప్రకటన చేశాడు. జపాన్ వ్యతిరేక యుద్ధంలో సోవియట్ యూనియన్ చేరడంవల్ల జపాన్ దురాక్రమణదారులను, వారి తాబేదార్లను తుదముట్టించే సమయం ఆసన్నమయిందన్నాడు. శత్రువును తుడిచివేసేందుకు, విముక్తప్రాంతాలను విస్తరించేందుకు చైనా ప్రజలంతా దేశ వ్యాపితంగా ఎదురుదాడులు ప్రారంభించాలని విజ్ఞప్తి చేశాడు.

మరుసటి రోజే చైనా ప్రజా విమోచన సైన్యాధ్యక్షుడు చూటే శత్రు ఆక్రమిత ప్రాంతాలపై దాడి చేయవలసిందిగా తమ సేనలకు ఉత్తరువులిచ్చాడు. ప్రజావిమోచన సైన్యం గొప్ప దిగ్విజయ యాత్ర ప్రారంభమయింది.

సోవియట్ ఎర్రసైన్యం, చైనా ప్రజావిమోచన సైన్యాలు కొడుతున్న దెబ్బలకు తట్టుకోలేక జపాన్ సామ్రాజ్యవాదులు ఆగస్టు 14 వ తేదీన బేషరతుగా లొంగిపోతూ ప్రకటన చేశారు. ఆ సమయంలో కొమింటాంగ్ సేనలు యింకా యుద్ధరంగానికి దూరంగానే వున్నాయి. జపాన్ సేనలు, తాబేదారీ సేనలు లొంగుబాటును స్వీకరించడానికి అపుడు ప్రజావిమోచన సైన్యం మాత్రమే యుద్ధరంగంలో వుంది. ఐనప్పటికీ కొమింటాంగ్ ప్రతీఘాతకులు, అమెరికా సామ్రాజ్యవాదులు, వుద్దేశ్యపూర్వకంగానే స్థానిక శాంతి భద్రతలను కాపాడమనీ, ప్రజా విమోచన సైన్యాలకు ఆయుధాలు అప్పగించరాదనీ, ప్రతిఘటించాలనీ, జపాన్ సేనలకు, తాబేదారీ సేనలకు ఉత్తరువులు పంపారు. తద్వారా ప్రజలు సాధించిన విజయ ఫలితాలను తాము కాజేయాలని ఆశించారు. ప్రజా విమోచన సైన్యం తన ఎదురు దాడిని కొనసాగించి, రెండు నెల్లలో 197 నగరాలను, 1 కోటి 80 లక్షల ప్రజలను విముక్తి చేసింది. జపాన్, తాబేదారీ సేనలగు మొత్తం 2 లక్షల 30 వేల మందిని తుడిచిపెట్టాయి.

1945 సెప్టెంబరు 2 వ తేదీన జపాన్ సామ్రాజ్యవాదులు లొంగుబాటు పత్రంపై సంతకాలు చేశారు. ఈ విధంగా ఎనిమిదేళ్ళ తీవ్ర పోరాటానంతరం చైనా ప్రజలు ప్రతిఘటనయుద్ధంలో అంతిమ విజయాన్ని సాధించారు. తమ మాతృభూమినుంచి జపాన్ దురాక్రమణదారులను తరిమిపారవేశారు.

# 69 వ అధ్యాయం

# ప్రతిఘటనా యుద్ధకాలంలో సాహిత్యం, కళలు

చైనా కళాకారులు, సాహిత్యవేత్తలు ప్రతిఘటన యుద్ధాన్ని అత్యంత ఉత్సాహంతో బలపరచారు. యుద్ధరంగాలకు, పల్లెటూళ్లకు వెళ్ళి, యుద్ధకాలపు ప్రజాసంస్థలలో చేరారు. జపాన్ దురాక్రమణను ప్రతిఘటించాలనీ, జాతీయ విమోచనకు కృషి చేయాలనీ, ప్రచారం చేశారు. షాంఘైనగరాన్ని యుద్ధజ్వాలలు అలముకొన్నపుడు స్థానిక నాట్యకారులు 13 దళాలుగా ఏర్పడి, జాతీయ విమోచన ఉద్యమాన్ని బలపరుస్తూ ప్రదర్శన లిచ్చారు. ఊహాన్ నగరం పతనానికిముందు నటులు, యువరచయితలు, పది నాట్యసంఘాలుగాను, ఐదు ప్రచారక దళాలుగాను సంఘటిత మయ్యారు. తీవ్రమైన చిక్కులు, ప్రమాదాలు ఎదుర్కొంటున్నప్పటికీ, వాటిని అధిగమించి, వివిధ యుద్ధరంగాలకు వెళ్ళి, సైన్యాలముందు, ప్రజలముందు ప్రదర్శన లిచ్చారు.

1938 వ సంవత్సరం మార్చి నెలలో కళాకారుల, సాహిత్యవేత్తల అఖిల చైనా ప్రతిఘటన సంఘం హాన్‌కౌ నగరంలో ఏర్పడింది. ఈ సంఘం కోమో-జో, మావోటున్‌లతో సహా 45 మంది సభ్యులు గల కార్యనిర్వాహకవర్గాన్ని ఎన్నుకొంది. ఇది ప్రతిఘటనయుద్ధాన్ని బలపరచే రచయితలందరినీ సమీకరించింది. "రైతులు, సైనికులవద్దకు సాహిత్యాన్ని తీసుకువెళ్ళండి" అన్న నినాదాలతో రచయితలను యుద్ధరంగానికి పంపింది. సైనికులతోనూ, ప్రజలతోనూ సాహిత్యకారులు సన్నిహితసంబంధాలను ఏర్పరచుకోవాలని కార్యక్రమం యిచ్చింది. "ప్రతిఘటనా సాహిత్యం" అనే పత్రికతో సహా చాలా సాహిత్య పత్రికలను ఈ సంఘం ప్రకటించింది. ప్రతిఘటన యుద్ధాన్ని కీర్తించుతూ, రాజీబేరాలను, లొంగుబాటును వ్యతిరేకించుతూ, అభివృద్ధి నిరోధకుల దుర్మార్గపాలనను ఏవగించుతూ అనేక పుస్తకాలను ప్రకటించింది. కోమింటాంగ్ ప్రభుత్వం అనేక ఆటంకాలను పెడుతున్నప్పటికీ, రచయితల సంఘం చైనా ప్రజా విప్లవం జయప్రద మయ్యేవరకు నిరంతర పోరాటం సాగించింది.

ప్రతిఘటన యుద్ధం మొదటి సంవత్సరాలలో చైనా కళాకారులు, సాహిత్య వేత్తలు అనేక కథానికలను, రిపోర్టులను, ప్రచార నాటకాలను, గేయాలను, జపాన్ వ్యతిరేక పాటలను తయారు చేశారు. ప్రజామోదకరమైన రచనలతో సైన్యాన్ని ప్రజలను ఉత్తేజపరచారు. యుద్ధం కొనసాగేకొలదీ చియాంగ్ కై-షేక్ ముఠా జపాన్ యెడల ఉపేక్షాభావాన్ని, కమ్యూనిస్టుపార్టీపై తీవ్ర వ్యతిరేకతను ప్రదర్శించ సాగింది. ఈ పరిస్థితులలో కొమింటాంగ్ పాలితప్రాంతాలలో అభివృద్ధి నిరోధకుల దేశద్రోహ పాత్రను బట్టబయలుచేయడమే ప్రధాన లక్ష్యంగా ప్రతిఘటన సాహిత్యం తీసుకుంది.

'బంగారు త్రవ్వకం', తదితర నవల్లో పాటింగ్ అనే రచయిత కొమింటాంగ్ పరిపాలనక్రింద వున్న పల్లెప్రాంతాల్లోని ఘోర పరిస్థితులను చిత్రించాడు. "శిథిలం" (corrosion) అనే నవల్లో మావొటున్ కొమింటాంగ్ ప్రభుత్వంలో పోలీసు హింసాకాండను బయటపెట్టి, యువకులను కశ్మలం చేయడాన్ని నిరసించాడు.

1942 ప్రాంతంలో కోమో-జో ఆరు చారిత్రక నాటకాలను వ్రాశాడు. అందులో ముఖ్యమైన "చు యువాన్", "పెద్దపులి ఆట" అను నాటకాలద్వారా లొంగుబాటు తత్వాన్ని, జాతి విచ్ఛిత్తిని తీవ్రంగా నిరసించి, జాతీయైక్యతను న్యాయంకొరకు పోరాటాన్ని కీర్తించాడు.

కమ్యూనిస్టుపార్టీయొక్క సర్వతోముఖ సహాయంతో విముక్తిప్రాంతాలలో ప్రతిఘటన సాహిత్యం చాల తయారయింది. ప్రజలను అద్భుతంగా ఉత్సాహపరచింది.

1942 మే నెలలో ఎనాన్ వేదికనుంచి కళలు సాహిత్యంపై మావో సేటుంగ్ ఉపన్యాసాలిచ్చాడు. కార్మికులను, రైతులను, సైనికులను ఉత్తేజపరచే విప్లవ సాహిత్యం ఏవిధంగా వుండాలో నిర్వచించాడు. విప్లవకారులైన కళానేత్తలు, సాహితీపరులు, మేధావులు నూతన దృక్పథాన్ని అలవరచుకోవాలనీ, కార్మికుల, రైతుల, సైనికుల సేవలో నిమగ్నులు కావాలనీ గుర్తుచేశాడు. చైనా కళలు, సాహిత్యం పెంపొందడంలో మావో ఉపన్యాసాల్లో చారిత్రక ప్రాముఖ్యంవుంది. నూతనదశలో సోషలిస్టు వాస్తవికతపై ఆధారపడిన సాహిత్యసృష్టికి ప్రాతిపదిక వేశాయి. ఈ గ్రంథ ప్రచురణవల్ల విముక్త ప్రాంతాలలో కళారూపాలు, సాహిత్య సృష్టి ఎంతో వికసించాయి.

1943-45 సంవత్సరాల మధ్య చావొషూలీ మూడు నవలలు వ్రాశాడు. "హ్సియావో ఎర్ హీయి వివాహం" అను నవల్లో రైతు దంపతుల ప్రేమను వర్ణించాడు. కమ్యూనిస్టుపార్టీ కృషి ఫలితంగా ఏర్పడిన సుఖప్రదమైన స్వతంత్ర జీవితాన్ని ప్రజలెంత అభిమానించాలో తెలియజేశాడు. లీయు-ట్స్యాయ్ వ్రాసిన గేయాలలోనూ, "లీ గ్రామంలో మార్పులు" అనే నవల్లోను భూస్వాములకు వ్యతిరేకంగా రైతుల పోరాటాలు చిత్రించబడ్డాయి. కళలు, సాహిత్యంపైన మావో

సిద్ధాంతాలను అమలు జరుపుటద్వారా సాధించిన ప్రథమ విజయాలను ఈ గ్రంథాలు సూచించుతాయి.

1945 వ సంవత్సరంలో హూచింగ్-చిహ్, టింగ్-ఈ అను రచయితలు వ్రాసిన "జుట్టు నెరసిన బాలిక" అనే గేయనాటకాన్ని మొదటిసారి ప్రదర్శించారు. బీద రైతు బాలిక విషాదగాధను చిత్రించి, ఆమెను కమ్యూనిస్టుపార్టీ ఎలా విముక్తి చేస్తుందో ఈనాటకం తెలియజేస్తుంది. "పాత సమాజం మనుష్యులను దెయ్యాలుగా చేస్తే, నూతన సమాజం దెయ్యాలను మనుష్యులుగా మారుస్తుంది" అన్న సత్యాన్ని ఈ నాటకం హృదయాన్ని కరిగించే దృశ్యాలతో నిరూపించుతుంది జాతీయ కళా రూపాన్ని ప్రతిభావంతంగా చిత్రించిన ఈ గేయనాటకం దేశమంతటా ప్రదర్శించబడి, ప్రజలందరిని ఉత్తేజపరిచింది.

70 వ అధ్యాయం

# శాంతి, ప్రజాస్వామ్యం కొరకు కమ్యూనిస్టు పార్టీ కృషి

## చుంకింగ్ రాయబారాలు

జపాన్ దురాక్రమణను వ్యతిరేకించుతూ జరిగిన ప్రతిఘటన యుద్ధం చివరి దశలో అమెరికా పలుకుబడి కొమింటాంగ్ పాలిత ప్రాంతంలో చాల ఎక్కువగా విస్తరించింది. అమెరికా చెప్పుచేతల్లో కొమింటాంగ్ ప్రభుత్వం వ్యవహరించ సాగింది. యుద్ధానంతరం చైనాపై తన ఆధిపత్యం స్థాపించుకోడానికి అమెరికన్ సామ్రాజ్యవాదులు తమ కృషిని తీవ్రతరం చేశారు.

కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా కొమింటాంగ్ ప్రభుత్వాన్ని బలపరచేందుకు, అమెరికా సైనికాధికారులను పంపి కొమింటాంగ్ సేనలకు తరిఫీదు ఇప్పించింది. ఆధునిక ఆయుధాలను సప్లయి చేసింది. దానితోపాటు ప్రత్యేకంగా తమ ఏజంట్లను చాలమందిని కొమింటాంగ్ ప్రభుత్వ యంత్రంలో ప్రవేశపెట్టింది. 1944 లో కమ్యూనిస్టు పార్టీ ఐక్య ప్రజాస్వామ్య ప్రభుత్వ స్థాపన నినాదం యిచ్చింది. అపుడు కొమింటాంగ్ - కమ్యూనిస్టు పార్టీ మధ్య రాజీకుదిర్చే "నిజాయితీగల బ్రోకర్" (మధ్య వర్తి)గా ముందుకొచ్చింది. దేశ "ఐక్యతను" సాధించడంలోను, ప్రజా విమోచన సైన్యాన్ని, విముక్త ప్రాంతాలను రద్దు చేయడంలోనూ కొమింటాంగ్ ప్రభుత్వానికి తోడ్పడేందుకు పన్నాగం వేసింది. కాని కమ్యూనిస్టు పార్టీ, ప్రజలందరూ తీవ్రంగా వ్యతిరేకించినందున ఈ కుట్ర భగ్నమైపోయింది.

జపాన్ లొంగుబాటు ప్రకటనానంతరం జపాన్ సైన్యాలు, తాబేదారీ సైన్యాలు తమ ఆయుధాలను ప్రజావిమోచన సైన్యాలకు అప్పగించరాదని అమెరికా-కొమింటాంగ్ ప్రభుత్వాలు హుకుంలు జారీ చేశాయి. అదే సమయంలో అమెరికన్లు తమ నావికా, విమాన బలాల సాయంతో కొమింటాంగ్ సేనలను వివిధ ప్రాంతాలకు పంపి, పెద్ద నగరాలను, ప్రధాన రహదార్లను జపాన్ చేతుల్లోనుంచి కొమింటాంగ్‌కు అప్పగించడానికి తోడ్పడింది. ఇంతేగాక అమెరికా బలాలు

టూంగ్ కూ, ట్సింగ్ టోవ్ తదితర స్థానాల్లో దిగి, పెకింగ్, టీన్ ట్సిన్, ట్సింగ్ టోవ్ లాంటి కీలక నగరాలను ఆక్రమించుకుంది.

"అప్పగింత" చేసుకునే రాయబారులుగా కుమింటాంగ్ ఉద్యోగులు, నాలుగు పెద్దకుటుంబాల సభ్యుల నాయకత్వాన వివిధప్రాంతాలకు తక్షణం విమానాల్లో వేంచేశారు. అచట స్థానికంగా వుండే రహస్య ఏజంట్లు, దేశద్రోహులు వారితో చేతులు కలిపారు ఇలా "అప్పగింత" ప్రారంభమయింది. జపాన్ వాళ్ళు స్వాధీనం చేసుకున్న అన్ని పెద్దబ్యాంకులు, పారిశ్రామిక సంస్థలు ఈసారి నాలుగు పెద్ద కుటుంబాలకు 'అప్పగించ' బడ్డాయి. శత్రువు దోచుకున్న భౌతిక వనరులన్నీ అదేవిధంగా నాలుగు పెద్దకుటుంబాలకు అప్పగించబడ్డాయి. ప్రజలను దోచుకునే అవకాశం ఏమాత్రం జారవిడువకుండా ఈ నాల్గుకుటుంబాలు తమ స్వార్థ ప్రయోజనాలకు వినియోగించుకున్నారు. శత్రువునుంచి స్వాధీనం చేసుకున్న, వాస్తవికంగా జాతికి చెందవలసిన సంపదలను ఈ నాలుగు కుటుంబాలు హక్కుభుక్తం చేసుకున్నాయి. జపాన్‌పై విజయం సాధించినందుకు అత్యంతోత్సాహం పొందిన చైనా ప్రజలు, ఎన్నో త్యాగాలుచేసి, ఎన్నో ప్రాణాలు బలియిచ్చి తాము తుడిచివేసిన కుళ్ళు పరిస్థితులను పునరుద్ధరించడానికి జరుగుతున్న ప్రయత్నాలను గమనించారు. అంతర్యుద్ధమేఘాలు తిరిగి వ్యాపించాయి.

జపాన్ వ్యతిరేక యుద్ధంలో విజయం సాధించుటతో తమ కష్టాలు తీరుతాయని ప్రజలు ఆశించారు. యుద్ధానంతర రోజుల్లో తమ గాయాలను మాన్పుకోవచ్చుననీ, జాతీయ స్వాతంత్ర్యాన్ని ప్రజాస్వామ్యాన్ని అమలు జరుపుకోవచ్చుననీ ఆశించారు. అంతర్యుద్ధం ముగిసిపోతుందని ఎదురు చూశారు. అంతర్యుద్ధ సంక్షోభాన్ని చాలకాలంగా కమ్యూనిస్టు పార్టీ గమనించుతూ వచ్చింది. ఐనప్పటికీ శాంతినీ, దేశైక్యతను కాపాడే దృష్టితో రాజీ ప్రయత్నాలను చేసేందుకు ఎన్నడూ వెనుకాడలేదు.

1945 ఆగస్టు 28 వ తేదీన కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ అధ్యక్షులైన మావో-టుంగ్ నాయకత్వాన రాయబారవర్గం కొమింటాంగ్‌తో సంప్రదింపుల నిమిత్తం చుకింగ్‌కు వెళ్ళింది. నలభై రోజుల సంప్రదింపులలో పార్టీ అనేక విషయాలలో ఒడంబడికకు సంసిద్ధతను తెలిపింది. ప్రజా విమోచన సైన్యం సంఖ్యను తగ్గించడానికి, పునర్నిర్మించడానికి అంగీకారం తెలిపింది. చెకియాంగ్, దక్షిణ కియాంగ్సూ, దక్షిణ ఆన్‌హ్వేయ్‌లతో సహా ఎనిమిది విముక్త ప్రాంతాలనుంచి తన సైన్యాలను ఉపసంహరించడానికి అంగీకరించింది. అక్టోబరు 10 వ తేదీన రాజీసంభాషణలను గురించి ఒక ప్రకటనపై ఉభయులు సంతకం చేశారు. దీనినే "అక్టోబరు 10 అగ్రిమెంటు" అని పిలుస్తారు. సర్వశక్తులూ ధారపోసి, అంతర్యుద్ధం రాకుండా అరికట్టాలని శాంతి, ప్రజాస్వామ్యంజాతీయైక్యతలపై ఆధారపడిన, స్వేచ్ఛాస్వాతంత్ర్యం, సౌభాగ్యంతో కూడిన బలమైన నవచైనాను నిర్మించాలనీ ప్రకటించారు. శాంతిని ప్రజాస్వామ్యాన్ని కాపాడేందుకు తీసుకోవలసిన చర్యలలో ఒకటిగా రాజకీయ

సలహా సమితిని సమావేశ పరచాలనీ, దానిలో వివిధ రాజకీయ పార్టీల ప్రతినిధులు, పార్టీలతో సంబంధంలేని ప్రముఖులుకూడ పాల్గొనాలనీ అంగీకరించబడింది.

"అక్టోబరు 10" తేదీ ఒడంబడికను అనుసరించి, ఒకవారం తరువాతనే కమ్యూనిస్టు పార్టీ ప్రజావిమోచన సైన్యాన్ని చెకియాంగ్, దక్షిణ కియాంగ్సూ, దక్షిణ అన్‌హ్వాయి తదితరప్రాంతాలనుంచి ఉపసంహారించడం ప్రారంభమయింది. కొమింటాంగ్ నిరంకుశత్వానికి ప్రజలు మరల పాల్పడుతారనే ఏవగింపుతో ప్రజా విమోచనసైన్యంలోని సైనికులు "మాతో రాజీ మీకిష్టం లేకపోయినా, కనీసం ప్రజలకు హాని కలిగించకండి" అన్నారు. తమ ఆదరాభిమానాలను పొందిన సైన్యాన్ని ప్రజలు కన్నీళ్ళతో సాగనంపారు.

ఒకవైపున కమ్యూనిస్టుపార్టీ నిజాయితీగా వ్యవహరించుతుంటే, రెండోవైపున అమెరికన్ సామ్రాజ్యవాదులు, కొమింటాంగ్ ప్రతీఘాతకులు రాజకీయ సంభాషణ లను తమ మోసపు కుట్రలను కప్పిపుచ్చుకోడానికి మాత్రమే వినియోగించుకున్నారు. రాజకీయ సంభాషణలు యింకా కొనసాగుతుండగానే చియాంగ్ కై-షేక్ తన అనుచరులకు రహస్యపు టుత్తరవు జారీచేశాడు. బందిపోటుదార్లను అణచివేయాలనే సాకుతో చాహార్ పానీ్సలలోని ప్రజావిమోచన సైన్యాలపై దాడి చేయమని కొమింటాంగ్ సేనలకు ఉత్తరువు లిచ్చాడు. "అక్టోబరు 10వ తేదీ" ఒడంబడిక ప్రకటించబడిన మరునాడే 17 లక్షల కొమింటాంగ్ తాబేదారీ సేనలకు వివిధ విముక్త ప్రాంతాలపై పెద్దపెట్టున దాడి చేయవలసిందిగా రహస్య ఉత్తరువు జారీచేశాడు. అమెరికన్ సామ్రాజ్యవాదులు విస్తృతరూపంలో ఆయుధాలను, సప్లయిలను అంద జేసి, అంతర్యుద్ధంలో కొమింటాంగ్‌ను బలపరచారు.

ప్రజా విమోచనసైన్యం సంసిద్ధంగా వుండటంవల్లనూ, కొమింటాంగ్ సేనలు యుద్ధంతో విసిగి వేసారి వున్నందువల్లనూ శత్రువాడు లన్నిటినీ ప్రజా విమోచన సైన్యం భగ్నంచేయ గలిగింది.

## అంతర్యుద్ధం ప్రారంభం

చియాంగ్ కై-షేక్ మళ్ళా తిరిగి అంతర్యుద్ధ జ్వాలలను రగుల్కొల్పడాన్ని ప్రజలంతా అసహ్యించుకున్నారు. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ప్రజాస్వామ్యం కొరకు ఆందోళన ప్రారంభమయింది.

1945 నవంబరులో అన్ని వృత్తులకు చెందిన ప్రతినిధులు చుంకింగ్‌లో సమావేశమై "అంతర్యుద్ధ వ్యతిరేక సంఘాన్ని" ఏర్పరచారు. కొమింటాంగ్ అనుస రించుకున్న అంతర్యుద్ధ విధానానికి వ్యతిరేకంగానూ, చైనా ఆంతరంగిక వ్యవహారాల్లో అమెరికా జోక్యానికి వ్యతిరేకంగానూ ఆందోళన చేయవలసిందిగా దేశప్రజలందరికీ విజ్ఞప్తి చేసింది. కొమింటాంగ్ పాలితప్రాంతంలోని తదితర పెద్దనగరాల్లోకూడ యిలాంటిఆందోళనే ప్రారంభమయింది. డిసెంబరు 1 దేశభక్తివుద్యమం కున్మింగ్‌లో బ్రద్దలై దేశాన్నంతనూ నివ్వెరపరచింది.

నవంబరు 25 వ తేదీ సాయంకాలం కున్మింగ్‌లోని విద్యార్థి సంస్థలన్నీ సంయుక్తంగా వర్తమాన విషయాలపై ఉపన్యాసాలను ఏర్పాటు చేశాయి. సమావేశాన్ని నిషేధించే ధైర్యంలేక, కొమింటాంగ్ తన ఏజెంట్లను భగ్నం చేసేందుకు పంపింది. సమావేశ స్థలానికి వెళ్ళేవారిని కాల్చుతామని బెదరించడానికి తన సేనలను పురికొల్పింది. ఈ పన్నాగాలను లెక్క చేయకుండా సమావేశంలో అర్థరాత్రివరకు శాంతియుతంగా ఉపన్యాసాలు కొనసాగాయి. ఆ సమావేశంలో పాల్గొన్న అధ్యాపకులను విద్యార్థులను కొమింటాంగ్ వార్తా సంస్థ బందిపోటు దొంగలని నామకరణం చేసింది. దీనితో కున్మింగ్ విద్యార్థులు మండిపోయారు. అసమ్మతిగా 80 వేలమంది విద్యార్థులు సమ్మె చేశారు. అంతర్యుద్ధాన్ని ఆపుచేయాలనీ, చైనాదేశం నుంచి అమెరికా సైన్యాలు వైదొలగాలనీ, ఐక్య ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పరచాలనీ, పౌరస్వత్వాలను రక్షించాలనీ ఎలుగెత్తిచాటారు.

దేశభక్తి పరులైన విద్యార్థులపై కొమింటాంగ్ ఏజంటు దాడి చేయడం, అరెస్టులు సాగించడం జరిగింది. డిశెంబరు 1 వ తేదీన అమెరికన్ ఆయుధాలను ధరించిన కొమింటాంగ్ సేనలు అమెరికన్ కార్లపైన వివిధ విద్యాసంస్థల మీద దాడిచేశాయి. స్కూలు గేట్లు, గోడలను రక్షణగా చేసుకుని, చేతికందిన బల్లలు కుర్చీలను ఆసరాగా తీసుకుని విద్యార్థులు పోరాడారు. కొమింటాంగ్ దుండగీడులు బాయినెట్లను, చేతి బాంబులను వినియోగించారు. చేతి బాంబు దెబ్బలకు గాయపడిన బాలికను కత్తితో పొడిచి చంపారు. గాయపడిన వారికి సేవచేస్తున్న ప్రథమచికిత్సా దళాలను కూడ వారు వదలలేదు. ఆరోజున కొమింటాంగ్ తాబేదార్లు నాలుగు ప్రాణాలను బలి గొన్నారు. అరవైమంది విద్యార్థి దేశభక్తులను గాయపరచారు.

ఐనప్పటికీ కున్మింగ్ విద్యార్థులు లొంగిపోలేదు. చనిపోయిన తమ సోదరుల యెదుట తమ పోరాటాన్ని చివరివరకు కొనసాగించుతామని శపథం చేశారు. ఈ సమ్మె నెల రోజులవరకు సాగింది. దేశమంతా విస్తృత ప్రచారం జరిగింది. "డిశెంబరు 1 వ తేదీన" జరిగిన రక్తపాతం ప్రజలందరికీ గుణపాఠం నేర్పింది. అంతర్యుద్ధానికి వ్యతిరేకంగానూ ప్రజాస్వామ్యం కొరకు, చైనా ఆంతరంగిక వ్యవహారాల్లో అమెరికా జోక్యానికి అసమ్మతిగానూ, జరిగే పోరాటంలో క్రమక్రమంగా ప్రజలందరూ పాల్గొనసాగారు.

కొమింటాంగ్ సైనికదాడి ఓడిపోవడం, ప్రజాస్వామ్యంకొరకు దేశభక్త వుద్యమం పెంపొందడంవల్ల అమెరికన్ సామ్రాజ్యవాదులు, కొమింటాంగ్ నాయకులు అంతర్యుద్ధానికి సంసిద్ధంగాలేరని గుర్తించారు. అందుచేత సర్దుబాటువిధానం అవలంభించారు. 1946 జనవరి 10 వ తేదీన కొమింటాంగ్ ప్రభుత్వం తాము ప్రజావాంఛను ఆమోదించుతున్నామంటూ ప్రకటనచేసింది. కమ్యూనిస్టుపార్టీతో యుద్ధవిరమణ ఒడంబడికపై సంతకం చేసింది. చైనాలో అంతర్యుద్ధం వుండబోదని అభినయించింది.

అదేరోజున చుంకింగ్‌లో ప్రారంభమయిన రాజకీయ సలహాసమితి సమావేశంలో కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులు, కొమింటాంగ్ తదితర పార్టీల గ్రూపుల ప్రతి

నిధులు, ఏపార్టీకి చెందని ప్రముఖులు పాల్గొన్నారు. అభివృద్ధి నిరోధకులే అత్యధిక స్థానాలను ఆక్రమించారు. ఐనప్పటికీ ప్రజావత్తిడివల్లనూ, చియాంగ్ మళ్లా తిరిగి అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టేందుకు తగువ్యవధి కావలసినందువల్లనూ, రాజకీయ సలహా సమితి ప్రజా వాంఛలకు అనుగుణ్యంగా కొన్ని తీర్మానాలను చేసింది. చైనా సైన్యాలను పునర్నిర్మించాలనీ, ప్రభుత్వాన్ని పునర్నిర్మించాలనీ, రాజ్యాంగాన్ని తయారుచేసేందుకు జాతీయ అసెంబ్లీని పిలవాలనీ, ఇదితర ప్రజాస్వామ్య ధోరణిని వ్యక్తంచేసే తీర్మానాలనుఆమోదించింది. ప్రారంభ ఉపన్యాసం చియాంగ్ కై-షేక్ మాటమాత్రంగా నాలుగు వాగ్దానాలు చేశాడు. పౌరహక్కులను గ్యారంటీ చేస్తామనీ, వివిధపార్టీలకు, గ్రూపులకు చట్టబద్ధమైనహోదా యిస్తామనీ, వయోజనఓటింగ్ ప్రవేశపెడతామనీ, రాజకీయఖైదీలందరినీ విడుదలచేస్తామనీ నామకః మాట యిచ్చాడు.

ఐనప్పటికీ ఒకవైపున యుద్ధవిరామ ప్రకటన చేసినప్పటికీ, అమెరికన్ సామ్రాజ్యవాదుల సహాయంతో కొమింటాంగ్ ప్రతీఘాతకులు పెద్దయెత్తున కొమింటాంగ్ సేనలను అంతర్యుద్ధరంగాలకు పంపసాగారు. ఈశాన్య చైనాలోవున్న ప్రజా విమోచన సైన్యంపై తమదాడిని కేంద్రీకరించారు. ఆ ప్రాంతానికి సంధి నియమాలను అనువర్తింపజేయడానికి, నిరాకరించారు. ఆఖరుకు మార్చి నెల నాటికి ఈశాన్య చైనాలోకూడ యుద్ధ చర్యలను ఆపుజేయడానికి అంగీకరించినప్పటికీ, తదనంతరం మూడు రోజులకే పెద్ద దాడిని ప్రారంభించారు.

రాజకీయ సలహాసమితిలో శాంతి ప్రజాస్వామ్యాలకు వినియోగపడే తీర్మానాలను ఆమోదించిన వెంటనే, రాజకీయ సలహా సమితి జయప్రదమైనందుకు హర్షం వెలిబుచ్చుతూ చుంకింగ్‌లోనూ, చాలా ఇతర నగరాల్లోనూ జరిగిన ప్రజా ప్రదర్శనలను కొమింటాంగ్ నిర్బంధవిధానంతో అణచివేసింది. సోవియట్ వ్యతిరేకంగాను, కమ్యూనిస్టులకు వ్యతిరేకంగానూ ఊరేగింపులు జరిపించింది. శాంతిని ప్రజాస్వామ్యాన్ని కోరే వారిని అరెస్టు చేయించింది.

మార్చి నెలారంభంలో జరిగిన కొమింటాంగ్ కేంద్ర కార్యనిర్వాహక కమిటీ సమావేశంలో చియాంగ్ కై-షేక్ బహిరంగంగా రాజకీయ సలహాసమితి తీర్మానాలను బుట్టదాఖలు చేయాలని చెప్పాడు.

ఆదేసమయంలో అమెరికా ప్రభుత్వం, మధ్యవర్తిత్వం ముసుగులో కొమింటాంగ్‌కు సహాయపడింది. సర్వవ్యాపిత అంతర్యుద్ధానికి జరుగుతున్న పన్నాగాలకు చివరిరూప మిచ్చింది.

1946 జూలైలో కొమింటాంగ్ పెద్దపెట్టున అంతర్యుద్ధాన్ని ప్రారంభించింది. యాంగ్‌ట్సీ నదికి ఉత్తరాన అన్‌హ్వాయి, కియాంగ్సూ ప్రాంతాలలోని ప్రజా విమోచన సైన్యాలపై విస్తృత రూపంలో దాడిచేసింది. శాంతి కొరకు తాముచేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనందున చైనా ప్రజలు కృతనిశ్చయంతో అంతర్యుద్ధంలో వురికారు. దీనినే ప్రజావిమోచన యుద్ధమనే మరో పేరుతోకూడ పిలుస్తుంటారు.

## 71 వ అధ్యాయం

# మూడవ విప్లవ అంతర్యుద్ధం

## విముక్త ప్రాంతాలలో భూసంస్కరణలు

జపాన్ దురాక్రమణకు వ్యతిరేకంగా జరిగిన ప్రతిఘటన యుద్ధం ముగిసిన తర్వాత విముక్త ప్రాంతాలలోని రైతులు తమకు భూమిహక్కు కావాలని ఆతుర పడసాగారు. కమ్యూనిస్టు పార్టీ సకాలంలో వారి అవసరాలను తీర్చేందుకు చర్యలు తీసికుంది. 1946 మే నెల 4 వ తేదీన సమావేశమయిన కేంద్రకమిటీ భూసంస్కరణలను గురించిన తీర్మానాన్ని ఆమోదించింది. దీని ప్రకారం అదివరకు అమలుజరుప బడిన మక్తాల తగ్గింపు, వడ్డీరేటు తగ్గింపు స్థానంలో భూస్వాముల భూములను స్వాధీనం చేసుకుని, రైతులకు పంచే విధానం అమలు జరుపబడింది. ఈ విధంగా భూస్వామ్య విధానాన్ని మార్చే పద్ధతి ఆచరణలోకి వచ్చింది. 1947 అక్టోబరులో కమ్యూనిస్టు పార్టీ వ్యవసాయ శాసనం ముసాయిదాను ప్రకటించింది. దీన్లో ఫ్యూడల్, అర్ధఫ్యూడల్ వ్యవసాయ సంబంధాలు రద్దుచేయబడతాయనీ, "దున్నేవారికి భూమి హక్కు" యివ్వబడుతుందనీ, ఈ సూత్రాన్ని అనుసరించి భూమి సమంగా వ్యవసాయ వృత్తిగావున్న జనాభాకంతటికీ పంచబడుతుందనీ వివరించారు. భూసంస్కరణలను జయప్రదం చేసేందుకు ఈ ముసాయిదాను రైతాంగ మహాసభ ఆమోదానికి పెట్టబడింది. బీదరైతులు వ్యవసాయకూలీలతో కూడిన బీదరైతు సంఘాలకు భూసంస్కరణలను అమలుజరిపే బాధ్యత వప్పగించబడింది.

ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా రైతులు సాగించిన పోరాటానికి వ్యవసాయ సంస్కరణల బిల్లు పెద్ద ఆయుధంగా వినియోగపడింది. దీనిని ప్రకటించినవెంటనే బ్రహ్మాండమైన ఉద్యమం బయలుదేరినందున, ఒక సంవత్సరంలోనే 10 కోట్లమంది రైతులకు భూమి పంచబడింది. బీదరైతులను, వ్యవసాయ కూలీలను ప్రాతిపదికగా చేసుకుని, అదేసమయంలో మధ్యతరగతి రైతుల ప్రయోజనాలకు నష్టం కలుగకుండా కలుపుకురావడమనే లక్ష్యంతో కమ్యూనిస్టుపార్టీ రైతాంగ పోరాటాన్ని నడిపింది.

విముక్త ప్రాంతాలలోని బ్రహ్మాండమైన భూసంస్కరణల ఉద్యమం గ్రామీణ సామాజిక సంబంధాలను పూర్తిగా మార్చివేసింది. అనేక శబ్దాలుగా కొనసాగిన

ఫ్యూడల్ భూసంబంధాలు విస్తృత ప్రాంతాలలో రద్దుచేయబడి భూమిలేని వ్యవసాయ కూలీలకు, బీదరైతులకు తమ స్వంతపొలాలలో పనిచేసుకునే అవకాశం లభ్యమయింది. ఫ్యూడల్ నిరంకుశత్వాన్నుంచి విముక్తిచెందిన రైతులు విమోచన యుద్ధంలో చైతన్యపూర్వకమైన పాత్రను నిర్వహించారు. ప్రజావిమోచన సైన్యం కనుఃభాగాన్ని బలపరచి, ప్రజాశక్తులకు అమూల్యమైన సహాయాన్ని చేకూర్చారు.

## ప్రజావిమోచన సైన్య విజయం

సర్వవ్యాపిత అంతర్యుద్ధాన్ని ప్రారంభించినపుడు కొమింటాంగ్ తనకు 43 లక్షల సైన్యముందనీ, 30 కోట్ల ప్రజలు నివశించుతున్న భూమి తమ అధీనంలో వుందనీ గర్వపడింది. అన్ని పెద్దనగరాలు, రైల్వే మార్గాలన్నీ తమ చేతుల్లోనే వున్నాయని చెప్పుకుంది. అంతేగాక అమెరికన్ సామ్రాజ్యవాదుల నుండి పెద్ద యెత్తున సహాయం పొందింది. ప్రజా విమోచన సైన్యంలో కేవలం 12 లక్షల మంది వుండేవారు. వారికైనా ఆధునిక ఆయుధాలు లేవు. విముక్త ప్రాంతాలలో 13 కోట్ల జనాభా వుంది. చియాంగ్ కై - షేక్ ముఠా తాము "ఐదు నెలలో మిలిటరీ చర్యల ద్వారా కమ్యూనిస్టు పార్టీపస తేల్చివేస్తా" మని డప్పాలు కొట్టారు.

కాని కమ్యూనిస్టుపార్టీకి, ప్రజా విమోచన సైన్యాలకు, విముక్తప్రాంతాల ప్రజలకు తమ విజయం ఎడల సంపూర్ణ విశ్వాసముంది. కొమింటాంగ్ సర్వవ్యాపిత దాడిని ప్రారంభించినపుడు ప్రజావిమోచనసైన్యం దెబ్బకాచుకునే రక్షణ ఎత్తుగడలను అవలంబించింది. చాలా నగరాలను, ప్రాంతాలను ఖాళీచేసి, శత్రు సప్లయి మార్గాలు చాలాదూరం విస్తరించేలా చూసేవారు. అవకాశం దొరకినపుడు శత్రువు బలహీనంగా వున్నచోట, తమ బలగాలను ఎక్కువగా కేంద్రీకరించి దెబ్బతీసేవారు. ఎనిమిది నెలలపోరాటంలో చెంగ్ టేహ్, చాంగ్ చియాకౌలతో సహా 105 నగరాలను ప్రజా విమోచన సైన్యం ఖాళీ చేసింది. కాని అదేసమయంలో 7 లక్షల 10 వేల మంది శత్రుబలగాలను నిరుపయోగమయ్యేలా దెబ్బతీసింది. చాలవిస్తృతప్రాంతంలో తన సైన్యాలను వెదజల్లడంవల్ల నష్టపడుతున్నామని కొమింటాంగ్ తన ఎత్తుగడలను మార్చుకుంది. కొన్నికీలకమైన కేంద్రాలపైన - ఉత్తర షెన్సీ, షాంటుంగ్ లలోని విముక్త ప్రాంతాలపైన - మాత్రమే దృష్టిని కేంద్రీకరించింది.

1947 మార్చి నెలలో కొమింటాంగ్ ప్రజా విమోచన సైన్యాలకు పదిరెట్లు బలగాలతో ఎనాన్ పై దాడిచేసింది. శత్రు సైన్యాలలో ఐదువేలమందిని నష్టపరచాక ప్రజాసైన్యం నగరాన్ని ఖాళీ చేసింది. నగరాన్ని, చుట్టుపట్ల ప్రాంతాలను కొమింటాంగ్ సేనలు పనిగట్టుకు ధ్వంసం చేశాయి. మావో సే-టుంగ్ నాయకత్వాన పార్టీ కేంద్రకమిటీ ఉత్తర షెన్సీలోనే వుండిపోయింది. కమ్యూనిస్టుపార్టీ ప్రత్యక్ష నాయకత్వాన ప్రజాసైన్యం శత్రువుయొక్క కేంద్రీకృతదాడిని పటాపంచలు చేసింది. షాంటుంగ్ రాష్ట్రంలోని ఎమెంగ్ పర్వతాలలోకూడ శత్రువుయొక్క కేంద్రీకృత దాడిని భగ్నంచేసింది.

ఈ సమయానికి ఈశాన్య చైనాలో వున్న ప్రజావిమోచన సైన్యం హోపే, హోనాన్, షాన్సీ రాష్ట్రాలలో కేవలం దెబ్బ కాచుకునే స్థితినుండి పాక్షికంగా ఎదురుదాడి చేసే దశకు వచ్చింది.

1946 జూన్ నుంచి 1947 జూన్ వరకు 11 లక్షల 20 వేల శత్రుసేనలను ధ్వంసంచేసి, ప్రజాసైన్యం తన బలగాలను వృద్ధిచేసుకుంది. తద్వారా యుద్ధపరిస్థితిని తన కనుకూలంగా మార్చుకోగలిగింది.

## కొమింటాంగ్ అధీన ప్రాంతాల్లో రాజకీయ ఆర్థిక సంక్షోభం

1946 నవంబరు 4 వ తేదీన కొమింటాంగ్ ప్రభుత్వం అమెరికాతో కలసి, "చైనా-అమెరికా మైత్రి, వర్తకం, నావికాయాన ఒడంబడికపై" సంతకం చేసింది. దీని ప్రకారం చైనా దేశంలో నివసించడానికి, అన్నిరకాల వర్తక వ్యాపారాలను కొనసాగించడానికి అమెరికాకు సంపూర్ణహక్కులు లభ్యమయ్యాయి. అంతర్యుద్ధంలో అమెరికా తమను బలపరచినందుకుగాను కొమింటాంగ్ పాలకవర్గ ముఠా చైనా దేశంయొక్క సర్వాంసహాధికారాన్ని, ఆర్థిక రాజకీయ సైనిక శాఖలను అమెరికాకు తాకట్టుపెట్టింది.

నాలుగు పెద్ద కుటుంబాల చేతుల్లోవున్న పరిశ్రమలపై పెత్తనం వహించుటే గాక అమెరికన్లు స్వయంగా చైనాలో ఫ్యాక్టరీలను స్థాపించారు. చైనా మార్కెటును అమెరికన్ వస్తువులతో ముంచెత్తి, జాతీయ పరిశ్రమలు దివాళా తీయడానికి కారకులయ్యారు. చైనా వ్యావసాయికదేశమైనప్పటికీ, అమెరికా పెద్దయెత్తున దూదిని, నారింజకాయలు, బఠాణీలను చైనాకు ఎగుమతిచేసి ప్రజలను దోచుకునేది. అమెరికా ట్రేడ్‌మార్కున్న వస్తువులు కొమింటాంగ్ పరిపాలన క్రిందవున్న దేశం నలుమూలలకు చేరేవి. కొమింటాంగ్ ప్రభుత్వ ప్రధాన విధానాలను రూపొందించడం అమెరికా పెత్తనం క్రిందనే జరిగేది. అమెరికన్ ప్రభుత్వ సలహాదార్లు దేశమంతటా స్వేచ్ఛగా తిరుగుతూ ప్రజలయెడ అహంకారంతో ప్రవర్తించేవారు. చైనా పౌరులను చంపినాసరే అమెరికన్లు శిక్షింపబడేవారు కాదు.

అమెరికా ఆర్థిక దురాక్రమణవల్ల, నాలుగు పెద్ద కుటుంబాల దోపిడీవల్ల చైనాదేశం తీవ్రమైన ఆర్థిక సంక్షోభం పాలయింది. జపాన్ వ్యతిరేకయుద్ధం ముందు కాలంనాటికి అచ్చుయ్యే కరెన్సీకంటే 1947 నాటికి 11,400 రెట్లు కరెన్సీ అచ్చు వేయబడుతోంది. వస్తువుల ధరలు 60 వేల రెట్లకు పెరిగాయి. ఫ్యాక్టరీలు మూతపడ్డాయి. పొలాలు బీళ్ళుగా వదిలివేయబడ్డాయి. క్లుప్తంగా చెప్పాలంటే నాలుగు పెద్దకుటుంబాలు వారి యుద్ధతుదార్ల అవినీతిచర్యలవల్ల జాతీయ ఆర్థిక జీవితం అనేక విధాలుగా విచ్ఛిన్నమైపోయింది. ధాన్యంపన్ను, తదితర పన్నులవల్లను, అనేకరకాల లంచగొండితనం వల్లను రైతుల, కార్మికుల, జనసామాన్య మందరిస్థితి అధ్వాన్నమై పోయింది. ధాన్యంపంటకు ప్రసిద్ధిచెందిన ఊసిహ్, ఊహు, చెంగ్టూ వగైరా

ప్రాంతాల్లో సైతం కరువుబాధితులైన ప్రజలు ధాన్యాగారాలను, బియ్యపు దుకాణాలను దోచుకోవడం ప్రారంభించారు.

అంతర్యుద్ధం ప్రారంభించాక కొన్ని తాత్కాలిక గ్రూపులతో మైత్రైక్యన కొమింటాంగ్ ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీ ప్రతిపాదించిన ఐక్య ప్రజాస్వామ్య ప్రభుత్వ నినాదాన్ని వ్యతిరేకించుటతో పాటు, జాతీయ అసెంబ్లీని పిలచి కుహనా రాజ్యాంగాన్ని రూపొందించాలనీ, తాను అనుసరించుతున్న నియంతృత్వ అంతర్యుద్ధ విధానానికి చట్టరూపం యివ్వాలనీ ప్రయత్నించింది. 1946 నవంబరులో కొమింటాంగ్ జాతీయ అసెంబ్లీ నాంకింగ్ నగరంలో సమావేశమయింది. కాని కమ్యూనిస్టు పార్టీ, డెమోక్రాటిక్ పార్టీలు, పార్టీయేతర ప్రముఖులు కూడ ఈ సమావేశాన్ని బహిష్కరించాయి. నామకః చైనా రిపబ్లిక్ రాజ్యాంగాన్ని జాతీయ అసెంబ్లీ ఆమోదించింది. ప్రజాస్వామ్య సూత్రాలకు విరుద్ధంగా ఈ రాజ్యాంగంలో సర్వాధికారాలు అధ్యక్షునికి వదలివేయబడ్డాయి. స్థానిక స్వపరిపాలనకు, అల్పసంఖ్యాక జాతుల హక్కులకు, పౌరహక్కులకు తిలోదకాలివ్వబడ్డాయి. ఈ రాజ్యాంగానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టుపార్టీ, ఇతర డెమోక్రాటిక్ పార్టీలు, ప్రజా సంస్థలు తీవ్ర అసమ్మతిని తెలిపాయి.

1948 మార్చి నెలలో మరల కొమింటాంగ్ జాతీయ అసెంబ్లీని పిలచి, రాజ్యాంగాన్ని అమలుజరిపింది. చియాంగ్ కై-షేక్‌ను అధ్యక్షునిగా ఎన్నుకుంది. మరో అమెరికన్ తాబేదారైన లి ట్సుంగ్-జెన్‌ను ఉపాధ్యక్షునుగా ఎన్నుకుంది. రాజ్యాంగాన్ని తయారుచేయుడం, అమలుజరుపడమనే "డెమాక్రటిక్ విధానాన్నంతటినీ" కొమింటాంగ్ అమలుజరిపింది! కాని ఈ రాజకీయ మోసాన్ని ప్రజలంతా ఏవగించుకున్నందున అభివృద్ధి నిరోధకులు ప్రజలకు మరింత దూరమైపోయారు.

ఈ విధంగా కొమింటాంగ్ రాజకీయ దివాళాకోరుతనం ఒకవైపున బట్టబయలౌతున్న సమయంలోనే రెండోవైపున కమ్యూనిస్టుపార్టీ ఐక్యసంఘటన విధానం గొప్ప విజయాన్ని సాధించింది. అంతర్యుద్ధం మొదటిరోజుల్లో కొమింటాంగ్ ప్రాంతంలో నివశించుతున్న అనేకమంది మధ్యతరగతి మేధావులకు నూతన ప్రజాస్వామ్య విప్లవం జయప్రదమౌతుందని, కమ్యూనిస్టుపార్టీ విధానం అమలు జరుగుతుందనే విశ్వాసం వుండేదికాదు. అమెరికన్లయెడల, కొమింటాంగ్ యెడల అనేక భ్రమలువుండేవి. విప్లవానికి - ప్రతిఘాతకులకు మధ్యగావుండే సంస్కరణ పంథాను - మూడో మార్గాన్ని - అనుసరించాలని ఆశించేవారు కాని యుద్ధపరిస్థితులు తారుమారయ్యేకొలదీ కొమింటాంగ్ నియంతృత్వపరిపాలన బిగుసుకుపోయి, డెమోక్రటిక్ పార్టీలు బహిరంగంగా మనగలడమే అసాధ్యమైపోయింది. 1947 అక్టోబరులో కొమింటాంగ్ ప్రభుత్వం చైనాడెమోక్రటిక్ లీగ్‌ను నిషేధించడంతో "మూడో మార్గాన్ని" గురించిన కలలన్నీ భగ్నమైపోయాయి.

1948 ప్రారంభంలో హాంకాంగ్‌లోని వివిధ డిమోక్రటిక్ గ్రూపులన్నీ కొమింటాంగ్ విప్లవ కమిటీతో కలిసిపోయాయి. చైనా డిమోక్రటిక్ లీగ్ నాయకత్వం పునరుద్ధరించబడింది. కమ్యూనిస్టుపార్టీతో చేతులు కలుపుతామనీ, అమెరికన్ సామ్రాజ్యవాదుల దురాక్రమణను, కొమింటాంగ్ పరిపాలనను వ్యతిరేకించుతామనీ ప్రకటించారు. ఇతర ప్రజాస్వామిక పార్టీలు మరింత సృజనాత్మక వైఖరిని అవలంబించాయి.

1948 మే నెల 1వ తేదీన కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీయిచ్చిన నినాదాలలో ప్రతీఘాతకులను మినహాయించి, నూతన ప్రజల రాజకీయ సలహా సమితిని పిలువాలనీ, ఐక్య ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పరచాలనీ పిలుపు యివ్వబడింది. డెమోక్రటిక్ పార్టీలు, ఏపార్టీకి చెందని ప్రముఖులుకూడ వెంటనే ఈ పిలుపును బలపరచారు. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ప్రజాస్వామ్య ఐక్యసంఘటన నిర్మించేందుకు పరిస్థితులు యిప్పటికి పరిపక్వమయ్యాయి.

## కొమింటాంగ్ అధీన ప్రాంతాలలో ప్రజాస్వామ్య దేశభక్తి వుద్యమం

కొమింటాంగ్ అధీన ప్రాంతాలలో రాజకీయ ఆర్థికసంక్షోభం తీవ్రతరమవడంవల్లనూ, వలసదోపిడి మరింత దారుణంగా సాగడంవల్లనూ వాటిని ప్రతిఘటించుతూ ప్రజాస్వామ్య దేశభక్తి వుద్యమం కూడ విజృంభించింది.

1946 సెప్టెంబరులో మొదటిసారి షాంఘై నగరంలో "అమెరికన్లంతా చైనాను వదలిపొండనే" నినాదంతో వారోత్సవం జరిగింది. తరువాత చాలా యితరనగరాల్లో కూడ యిలాంటి ప్రదర్శనలు జరిగాయి.

డిశంబరులో అమెరికన్ సైనికుడొకడు చైనా విశ్వవిద్యాలయ విద్యార్థినిని బలవంతాన మానభంగం చేశాడు. ఈ దుర్మంతచర్య పెకింగ్ విద్యార్థుల్లో కోపాన్ని, ద్వేషాగ్నిని రగుల్కొల్పింది. వారంతా వీధుల్లో అసమ్మతి ప్రదర్శనాలు చేశారు. ఈ వార్త తెలిసి టీన్‌ట్సిన్, నాంకింగ్, ఊహాన్, చుంగ్‌కింగ్, కాంటన్, టాయిపీ తదితర నగరాల్లోని విద్యార్థులు మొత్తం 5 లక్షలమంది ఈ ఘోరకృత్యాన్ని నిరశించుతూ ప్రదర్శనలు చేశారు.

1947 మే నెలలో అంతర్యుద్ధానికి వ్యతిరేకంగానూ, జీవించే హక్కుకొరకు షాంఘై విద్యార్థులు ప్రదర్శనం జరిపారు. ఈ వుద్యమం త్వరలోనే దేశమంతా వ్యాపించింది. మే 20వ తేదీన చియాంగ్ కై-షేక్ తాబేదార్లు, టీన్‌ట్సిన్, నాంకింగ్ నగరాల్లో సమ్మె చేస్తున్న విద్యార్థులపై దాడిచేశారు. దీని ఫలితంగా "మే 20వ తేదీ రక్తపాత ఘటన" జరిగింది. కాని ఈ దురంతాలవల్ల విద్యార్థులలో ప్రతిఘటనాశక్తి ఇనుమడించింది. అంతర్యుద్ధానికి వ్యతిరేకంగానూ, క్షామానికి నిర్బంధ

విధానానికి అసమ్మతిగాను విద్యార్థులు ప్రారంభించిన దేశభక్తి వుద్యమం జాతి యావత్తును ఉద్రూతలూగించే వెల్లువగా ఉప్పొంగింది.

1948 జనవరి 31వ తేదీన షాంఘైలోని సుంగ్‌సింగ్ బట్టలమిల్లు నెంబర్ తొమ్మిదిలోని వేతనాల పెంపుదలకొరకు సమ్మె చేశారు. ఫిబ్రవరి రెండో తేదీన ప్రతీఘాతకులు మూడువేలమంది సైనికులను, పోలీసులను పంపి, ఫ్యాక్టరీని చుట్టు ముట్టారు. ఫ్యాక్టరీగేటును కాపాడుతూ స్త్రీ-పురుష కార్మికులందరూ పోరాడారు. పోలీసుల టాంకులు, మరతుపాకులను, కార్మికులు చేతికందిన రాళ్ళు రప్పలతో ఎదుర్కొన్నారు. మరణాలను, అరెస్టులను లెక్క చేయకుండా రోజంతా కార్మికులు పోరాడారు. పోలీసుల దుండగాలకు షాంఘై నగరమంతా క్రోధాగ్ని అలముకొంది. ఉధృతమౌతున్న ప్రజాందోళనకు జంకి, కొమింగ్‌టాంగ్ తన క్రూరపద్ధతులను ఆపు చేయక తప్పలేదు.

1948 మే నెలలో కార్మికులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు, తదితరులు దేశవ్యాపితంగా, జపాన్‌లోని దురాక్రమణశక్తులను అమెరికా ప్రోత్సహించు తున్నందులకు, అసమ్మతి వుద్యమాన్ని ప్రారంభించారు. ప్రజాస్వామ్య దేశభక్తి వుద్యమం సాగుతున్నదశలో రక్తపాతం హింసాకాండ జరుగని రోజు ఒకటైనా లేదు.

ఏభై సంవత్సరాలుగా తాయ్‌వాన్ ప్రజలు, జపాన్ సామ్రాజ్యవాదుల వలస దోపిడికి వ్యతిరేకంగా పోరాడుతూ వచ్చారు. జపాన్ వ్యతిరేక యుద్ధంలో విజయం సాధించినందుకు సంతోషభరితులయ్యారు. చైనా మాతృభూమితో తమ దీవి కలసి పోవాలని కోరుతూ ఉత్సవాలు జరిపారు. కాని జపాన్‌వాళ్ళు వెళ్ళిపోయినవెంటనే తిరిగి అలాంటి నిరంకుశ ప్రభుత్వ యంత్రమే దీవిలో స్థాపించబడింది. జపాన్ సామ్రాజ్యవాదుల స్థానంలో నాలుగు పెద్దకుటుంబాలు తాయివాన్ దీవిలోని భూమిలో నూటికి 73 వంతులను, బ్యాంకులను, రైల్వేలను, రేవులను, ఫ్యాక్టరీలను, గనులను యితర సంస్థలను స్వాధీనం చేసుకున్నాయి. నాలుగు పెద్ద కుటుంబాల దోపిడి ఫలితంగా, ఒకపుడు ధాన్యోత్పత్తికి ప్రఖ్యాతివహించిన తాయ్‌వాన్ దీవిలో, బియ్యం కొరత యిపుడొచ్చింది. విజయోత్సవం తరువాత 16 నెల్లలో బియ్యంధర 250 రెట్లు పెరిగింది. జపాన్‌వాళ్ళు విధించిన పన్నులకంటే నాలుగు పెద్దకుటుంబాల హయాములో 59 రెట్లు పెరిగాయి. జపాన్‌వాళ్ళు నేరస్తులని పేరిడిన చైనా దేశ భక్తుల కిస్తూనే, చియాంగ్ కై-షేక్ అరెస్టులు సాగించేందుకు వినియోగించు కున్నాడు.

తాయ్‌వాన్ దీవిలో తమకు ప్రత్యేకస్థానముందని చియాంగ్ ప్రభుత్వ ఆమోదాన్ని పొందినతరువాత అమెరికను సైనిక కేంద్రాలను నిర్మించడానికి పూను కున్నారు. ఆసియాఖండంలో తమ దురాక్రమణ చర్యలను కొనసాగించేందుకు "ముంచడం సాధ్యంకాని విమానకేంద్రం" నిర్మించుతున్నామని చెప్పుకున్నారు.

1947 ఫిబ్రవరి 27వ తేదీన తాయ్‌వాన్ స్టేట్ మనోపలీ బ్యూరోకు చెందిన ఉద్యోగి ఒకడు రాష్ట్ర రాజధాని తైపేలో సి[illegible]కాణ యజమానురాలైన

వృద్ధస్త్రీని కొట్టి, మరొక ప్రేక్షకుణ్ణి చంపివేశాడు. తైపే ప్రజానీకం వెంటనే అసమ్మతి ప్రదర్శనలు చేశారు. రాత్రివేళ ప్రజలు వీధుల్లో బాకాలను, నగారాలను వాయించారు. మరునాడు తెల్లవారేసరికి సాయుధ సైనికులకు, పోలీసులకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ప్రజాసమీకరణ జరిగింది. ఫిబ్రవరి 28వ తేదీన తిరుగుబాటు ప్రారంభమయింది.

తైపే నగరవీధుల్లో యుద్ధాలు జరిగాయి. రేడియో ప్రసార కేంద్రాన్ని ప్రజలు స్వాధీనం చేసుకున్నారు. తాయ్‌వాన్ దీవి ప్రజలందరికీ తమ పోరాట సమాచారాన్ని అందజేశారు. ఈ వార్త తెలియగానే ఉత్తర తాయ్‌వాన్ పట్టణాలు, నగరాల్లోని ప్రజలు తిరుగుబాటుచేసి, కొమింటాంగ్ సేనలనుంచి ఆయుధాలు గుంజుకొన్నారు. రైల్వేలను, రేవులను స్వాధీనంచేసుకుని, కొమింటాంగ్ ఉద్యోగులను అణచివేశారు. తాయ్‌వాన్ మధ్యప్రాంతంలో సాయుధ పోరాటాలు జరిగాయి. కార్మికులు, విద్యార్థులు తిరుగుబాటులో కీలకపాత్ర వహించి, తాయ్‌వాన్ మధ్య భాగంలోను, చుట్టుపట్ల ప్రాంతాలలోనూ, కొమింటాంగ్ అధికారాన్ని పటాపంచలు చేశారు. నాలుగైదు రోజుల్లో పోరాటం దీవి నలుమూలలకూ వ్యాపించింది. ఉత్తరాన కీలుంగ్‌నుంచి దక్షిణాన కోవ్‌హ్సియుంగ్ వరకూ, పశ్చిమ తీరంలోవున్న పెంఘూ దీవులనుంచి తూర్పునవున్న హువాలీన్‌వరకు వ్యాప్తి చెందింది. తాయ్‌వాన్ ప్రజలలో అల్పసంఖ్యాక జాతివారైన కావుషాన్ ప్రజలుకూడ తిరుగుబాటులో పాల్గొన్నారు.

ఐకమత్యం లోపించినందున, బలమైన నాయకత్వం లేనందున, తిరుగుబాటు ప్రారంభంలో విజయాలు సాధించినప్పటికీ, చివరకు తిరుగుబాటు విఫలమయింది. కొమింగ్‌టాంగ్ ప్రభుత్వం తిరుగుబాటును అణచివేసింది.

72 వ అధ్యాయం

# నూతన ప్రజాస్వామ్య విప్లవ మహత్తర విజయం

## మూడవ విప్లవ అంతర్యుద్ధం ముగింపు

1947 జూన్, జూలై నెలల్లో లి యు పో-చెంగ్, టెంగ్ హ్సియావో-పింగ్‌ల సేనాధిపత్యం క్రింద ప్రజా విమోచనసైన్యం షాంటుంగ్ రాష్ట్రంలో ఎల్లో నదిని దాటి, నైరుతి షాంటుంగ్‌లోని కొమింగ్‌టాంగ్ సైన్యాలను ఓడించింది. ఈ సైన్యం వెన్వెంటనే లుంఘాయ్ రైల్వేను దాటి, టైపే పర్వత ప్రాంతానికి చేరింది. అచటి నుంచి కొమింటాంగ్ ప్రాంతానికంతటికీ హృదయంగా వున్న నాంకింగ్, ఊహాన్ నగరాల మధ్యకు చొచ్చుకుపోయింది. ఈ విధంగా ఉత్తరాన, తూర్పున, పశ్చిమోత్తరాన, ఈశాన్య చైనాలోనూ సర్వతోముఖదాడిని ప్రజా విమోచన సైన్యం ప్రారంభించింది. ఈ ధాటికి తట్టుకోలేక కొమింటాంగ్ సేనలు తిరోగమించ సాగాయి. దానితో రోజురోజుకు ప్రజా సైన్యాలదాడి మరింత వుధృతమయింది. 1948 ఏప్రిల్ నెలలో చైనా విప్లవానికి శైశవ కేంద్రమైన ఎనాన్‌ను ప్రజా సైన్యాలు తిరిగి స్వాధీనం చేసుకున్నాయి.

1948 సెప్టెంబరు నెలలో ఈశాన్యచైనాలోవున్న ప్రజావిమోచన సైన్యం పెద్దెత్తున లియోషి-షెన్యాంగ్ దాడిని ప్రారంభించింది. కొలదిరోజుల్లోనే చాంగ్ చున్‌ను విముక్తి చేసింది. షెన్యాంగ్‌లోవున్న శత్రుసైన్యాలు పశ్చిమంగా పారిపోవాలని నవంబరులో ప్రయత్నించాయి. కాని చనిపోవడమో, ఖైదీలుగా పట్టుబడటమో జరిగింది. ఈశాన్య చైనా అంతా విమోచన పొందింది.

ఐదురోజుల అనంతరం కియాంగ్సూ రాష్ట్రంలోని హ్యూసాచౌ ప్రాంతంలో మరొక పెద్దయుద్ధం జరిగింది. కొమింగ్‌టాంగ్ హూచౌలో పెద్దెత్తున తన సేనలను కేంద్రీకరించి, ప్రజాసైన్యాల పురోగమనాన్ని అరికట్టేందుకు విఫలయత్నం చేసింది. హ్యూచౌకు తూర్పుగానూ, సూహ్సిన్ కౌంటీకి నైరుతిదిశగానూ 8 లక్షల శత్రు సైన్యాలపైన ప్రజాసైన్యం దెబ్బతీసింది. హ్యూచౌనుంచి హోనాన్ రాష్ట్రంలోని యుంగ్‌చెంగ్ సరిహద్దుకు పారిపోతున్న కొమింటాంగ్ సేనలను తుడిచిపెట్టింది.

1948 నవంబరు నుంచి 1949 జనవరి వరకు "హువాయ్-హైదాడి" అని పిలువబడుతున్న సైనికచర్యలు జరిగాయి. ఈదాడిలో మొత్తం 5 లక్షల 50 వేల శత్రుబలగాలను ప్రజావిమోచనసైన్యం తుడిచిపెట్టింది. ఈ యుద్ధం ముగిశాక యాంగ్‌ట్సీనది ఉత్తరపుగట్టుకు ప్రజాసైన్యం చేరింది. అచటినుంచి నాంకింగ్, షాంఘై నగరాలపైకి పురోగమించింది.

హువాయ్ - హై దాడి కొనసాగుతున్న సమయంలోనే ప్రజా విమోచన సైన్యం పెకింగ్ - టీన్‌ట్సిన్ - చాంగ్‌చియాకౌ ప్రాంతంపైకి మరోదాడికి ఉపక్రమించింది. చాంగ్‌చియాకౌను ప్రజాసైన్యం స్వాధీనం చేసుకున్నాక, కొమింటాంగ్

సేనలకు ఆయుధాలనుదించి లొంగిపొమ్మని ప్రజా సైన్యం సలహాయిచ్చింది. టీన్‌ట్సీన్‌లోని కొమింటాంగ్ సైన్యం ఈ సలహాలను వినిపించుకోనందున, ప్రజా సైన్యం తీవ్రంగా పోరాడి 48 గంటల్లో నగరాన్ని విముక్తిచేసింది. 1949 జనవరి 31 వ తేదీన పెకింగ్ నగరం శాంతియుతంగా విముక్తి పొందింది. ఈ విధంగా ప్రజా సైన్యాలదాడి జయప్రదమయింది. ఫిబ్రవరి 3 వ తేదీన ప్రజానీకం అఖండ స్వాగతాల మధ్య ప్రజావిమోచన సైన్యం రాజధాని నగరం పెకింగ్‌లో ప్రవేశించాయి.

ప్రజా సైన్యాల దాడి ఉధృతంగా సాగడంవల్ల, అమెరికన్ సామ్రాజ్య వాదుల ప్రోత్సాహంతో చియాంగ్‌కై-షేక్ 1949 జనవరిలో తాను కమ్యూనిస్టు లతో ఒడంబడిక చేసుకోడానికి సిద్ధంగా వున్నానని ప్రకటన చేశాడు. మహానా రాజ్యాంగాన్ని, ప్రతీఘాతుక సైన్యాలను రక్షించడానికి ముందుగా అంగీకరించాలని షరతు పెట్టాడు. కమ్యూనిస్టుపార్టీ సెంట్రల్ కమిటీతరఫున మావో సేటుంగు, ఘోర పరాజయాలను తప్పించుకునేందుకు కొంత వ్యవధి సంపాదించాలనే దృష్టితోనే చియాంగ్ కై-షేక్ ఈ ప్రతిపాదలను చేశాడని ఆక్షేపించాడు. ఐనప్పటికీ నిజ మైన శాంతిని చైనాలో స్థాపించేందుకు కొమింటాంగ్‌తో సంప్రదింపులు జరప డానికి కమ్యూనిస్టుపార్టీ సిద్ధంగా వుందని ప్రకటించాడు. శాంతిని, ప్రజా స్వామ్యాన్ని, చైనా జాతీయ స్వాతంత్ర్యాన్ని రక్షించడమే సంప్రదింపులకు ప్రాతిపదికగా వుండాలని స్పష్టపరచాడు.

చియాంగ్ కై-షేక్ తన అధ్యక్షపదవినుంచి విరమించుకొన్ని, తన స్థానంలో లీ ట్సుంగ్-జెన్‌ను తాత్కాలికంగా నియమించాడు. ఏప్రిల్ 1 వ తేదీన లీ తన ప్రతి నిధులను కమ్యూనిస్టుపార్టీతో సంప్రదింపులు జరిపేందుకు పెకింగ్ పంపించాడు. కాని శాంతి సంభాషణలు ఒకవైపున సాగుతుండగానే చియాంగ్ కై-షేక్ తెర వెనుక యుద్ధ సన్నాహాలను చేస్తున్నాడు. తనకు మిగిలివున్న 10 లక్షల సైన్యాన్ని 50 లక్షలకు పెంచాలని ప్రయత్నించుతున్నాడు. 15 రోజుల సంప్రదింపుల తర్వాత కమ్యూనిస్టుపార్టీ ప్రతిపాదించిన శాంతి ఒడంబడికను కొమింటాంగ్ తిరస్క రించిందంటే, చియాంగ్ నిజాయితీ ఏమిటో దానంతటదే బట్టబయలయింది.

1949 ఏప్రిల్ 21వ తేదీన మావో సే-టుంగ్, చూటేలు కలిసి ప్రజావిమోచన సైన్యానికి దిగువవుత్తరువును జారీచేశారు.

"ధైర్యంగా ముందుకు సాగిపోవాలనీ, కృతనిశ్చయంతో శత్రువులను తుడిచి వేయాలనీ, చైనా దేశ సరిహద్దులలో యింకా ప్రతిఘటించుతున్న కొమింటాంగ్ ప్రతీఘాతకులందరినీ సమూలంగా నాశనంచేయాలనీ ఉత్తరువుచేస్తున్నాం. ప్రజ లందరినీ విముక్తిచేసి, చైనాదేశంయొక్క స్వాతంత్ర్యాన్ని సర్వం సహాధికారాన్ని కాపాడాలని విజ్ఞప్తి చేస్తున్నాం."

యాంగ్‌ట్సీ నది ఉత్తరగట్టునవున్న పది లక్షల ప్రజాసైన్యానికి ఈ ఉత్తరువు చేరింది. వెంటనే నదినిదాటి రెండు రోజుల పోరాటంలోనే నదివెంట కొమింటాంగ్ నిర్మించిన రక్షణలన్నిటినీ ప్రజాసైన్యం తుత్తునియలు చేసింది. ఏప్రిల్ 23 వ తేదీన



చైనా ప్రజారిపబ్లిక్‌ను ప్రారంభిస్తున్న అధ్యక్షులు మావోత్సే-టుంగ్

విమోచన చిహ్నమైన ఎర్రజెండాను నాంకింగ్ నగరంలోని అధ్యక్ష భవనంపై ప్రజావిమోచన సైన్యం ప్రతిష్ఠించింది. కొమింటాంగ్ అభివృద్ధినిరోధకుల పరిపాలన అంతమయింది.

అదే సమయంలో ఈ ఉత్తరువు ఉత్తర చైనాలోనూ, పశ్చిమోత్తర చైనాలోనూ వున్న ప్రజా సైన్యాలకు కూడ చేరింది. అనేక వేల కిలోమీటర్ల విస్తీర్ణం [illegible] ప్రజా సైన్యాలు పురోగమించాయి. 1949 చివరకు టిబెట్ మినహా చైనా ప్రధాన భూభాగమంతా విమోచన పొందింది. మూడవ విప్లవఅంతర్యుద్ధాన్ని చైనా ప్రజలు జయించారు.

## చైనా ప్రజారిపబ్లిక్ స్థాపన

ప్రజా విమోచనసైన్యం కొమింటాంగ్ సేనలను ధ్వంసంచేసి, విప్లవానికి దిగ్విజయం చేకూర్చిన తరువాత 1949 జూలై ఒకటవతేదీన మావో సే-టుంగ్ "ప్రజల యొక్క ప్రజాస్వామ్య నియంతృత్వం" (పీపుల్స్ డెమోక్రటిక్ డిక్టేటర్‌షిప్) అను వ్యాసాన్ని ప్రకటించాడు. దీనిలో నూతన చైనా పునర్నిర్మాణానికి అనుసరించవలసిన ప్రధాన సూత్రాలను మావో సే-టుంగ్ ఉల్లేఖించారు.

చైనా ప్రజలు తమ దేశంలో ప్రజారిపబ్లిక్‌ను స్థాపించుకోవాలని మావో ఈ వ్యాసంలో స్పష్టపరచాడు. కార్మికుల-రైతుల ఐక్యతపై ఆధారపడిన కార్మిక వర్గము కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన, ప్రజలయొక్క ప్రజాస్వామ్య నియంతృత్వ స్వభావాన్ని చైనా రిపబ్లిక్ కలిగివుంటుందని విశదీకరించాడు. ప్రజా రిపబ్లిక్‌లో కార్మికవర్గం, రైతాంగం, మధ్యతరగతులు జాతీయపెట్టుబడిదారీవర్గం ప్రజాస్వామ్య [illegible]కులు కలిగివుంటారు. కార్మికవర్గం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ప్రజలంతా [illegible]స్వామ్య[illegible]మైన బ్యూరాక్రటిక్ పెట్టుబడిదారులపైన నియంతృత్వం వహించుతారు. [illegible]అంతర్జాతీయంగా ప్రజారిపబ్లిక్ సోవియట్ యూనియన్‌తోనూ, నూతన ప్రజాస్వామ్యదేశాలతోనూ, స్నేహసంబంధాలను కలిగివుంటుంది. అన్ని దేశాల శ్రామికులు ఇతర భాగాల ప్రజలతో కలసి అంతర్జాతీయ ఐక్యసంఘటన ఏర్పరచుకుంటారు. చైనా [illegible]యైన మార్గం ఏమంటే ప్రజా రిపబ్లిక్‌ద్వారా

[illegible] [illegible]లోనూ,

యించింది. ఆర్థిక, సాంస్కృతిక, జాతీయ, విదేశాంగ వ్యవహారాలలో అనుసరించవలసిన ప్రధాన సూత్రాలను నిర్వచించింది. ప్రభుత్వ స్వభావాన్ని అనుసరించి, కేంద్ర ప్రజాప్రభుత్వ రాజ్యాంగంలో 'నూతన చైనా ప్రభుత్వం కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రంపై ఆధారపడిన ప్రజా ప్రభుత్వంగా' వుంటుందని స్పష్టపరచబడింది. ఈ సమావేశం కేంద్ర ప్రజా ప్రభుత్వ అధ్యక్షునిగా మావో సే-టుంగ్‌ను ఎన్నుకుంది. ప్రజారిపబ్లిక్ రాజధానిగా పెకింగ్ నగరాన్ని ఎంచుకుంది. వాలంటీర్ల గేయాన్ని జాతీయ గీతంగా - మరొకటి వ్రాయబడేవరకు - ఆమోదించింది. చైనా ప్రజలందరి విప్లవయుత ఐక్యమత్యానికి చిహ్నమైన ఐదు నక్షత్రాల జెండాను జాతీయ జెండాగా నిర్ణయించింది.

## ప్రజా రిపబ్లిక్ సంస్థాపన

అక్టోబరు ఒకటవ తేదీ చైనా ప్రజలకు జాతీయ మహోత్సవం. 1949 అక్టోబరు 1 వ తేదీన మధ్యాహ్నం రెండు గంటలకు పెకింగ్ నగరంలో కేంద్ర ప్రజా ప్రభుత్వం అధికారం స్వీకరించింది. మొదటి సమావేశంలోనే చైనా ప్రజల రాజకీయ సలహాసమితి తయారుచేసిన ఉమ్మడి కార్యక్రమాన్ని అమలు జరుపడమే కేంద్ర ప్రజా ప్రభుత్వ విధానంగా వుండాలని తీర్మానించింది. కేంద్ర ప్రజా ప్రభుత్వ మొక్కటే చట్టబద్ధమైన చైనా ప్రభుత్వమని ప్రపంచానికి ఎలుగెత్తి చాటింది. సమానత్వం పరస్పర గౌరవం క్షేమంపై ఆధారపడి, ఏ విదేశ ప్రభుత్వంతో నైనా రాజకీయ సంబంధాలను ఏర్పరచుకోడానికి సంసిద్ధతను ప్రకటించింది.

సాయంత్రం మూడు గంటలకు పెకింగ్ నగరంలోని టియెన్ ఆన్ మెన్ భవనముందు మూడు లక్షల ప్రజలయెదుట చైనా కేంద్ర ప్రజా ప్రభుత్వం అధికారం స్వీకరించింది. చైనా ప్రజా రిపబ్లిక్ యొక్క కేంద్ర ప్రజా ప్రభుత్వ ప్రకటనను మావో సే-టుంగ్ చదివాడు. ఐదు నక్షత్రాలు ఎర్ర జెండాను, చైనా ప్రజా రిపబ్లిక్ జాతీయ జెండాగా ప్రతిష్టించాడు.

చైనా ప్రజా రిపబ్లిక్ సంస్థాపనతో నూతన ప్రజాస్వామిక విప్లవం అంతమయింది. చైనాలో సోషలిస్టు విప్లవం ప్రారంభ[illegible] ...టం వల్ల మానవాళిలో నాల్గవ వంతు[illegible] ...జ సంఘ[illegible] ...ం



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 108 B 119 |
| పుస్తకం పేరు | చైనా ప్రజల సంస్కృతి చరిత్ర |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 359 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 38A, 56B, 88B, 144B, 238B, 330B, 282B |
| లేని పేజీలు | 1 TO 4 |
| తయారు చేసినది | SOWMYA |
| పేజీలు విడదీసినది | SOWMYA |
| స్కాన్ చేసినది | KDAVEED |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |